# వడ్డేర చండీదాస్

# హిమజ్వాల - 2




నవజ్యోతి పబ్లికేషన్స్
ఏలూరు రోడ్ విజయవాడ-2



# HIMAJWAALA-2

(Serialised in Andhra Jyothi Weekly 1972-73)

By
VADDERA CHANDIDAS.

First Edition :
JANUARY 1974.

Second Edition :
NOVEMBER 1984.

894 : 8133.

Printers :
Progressive Printers,
Vijayawada-2.

Cover Design :
BAPU.

Publishers :
**NAVAJYOTHI PUBLICATIONS**
ELURU ROAD. VIJAYAWADA-2.

Price :

# జనన సమాధి

యీశ్వర కార్తీక కవోష్ణం లోంచి పుట్టుకొచ్చి, క్రిష్ణా వరిపైరుల్లో నాలుగేళ్ళు సుషుప్తించి, నిజామాబాద్ ప్రాంతపు పచ్చిక మైదానాల్లోంచి యెదిగి, హైదరాబాద్ వెన్నెల్లో తడిసి, తిరుపతి వేడిలో కాగుతూ—

సంస్పందనాకాశంలో యెగిరి, మూర్ఖత్వపు పంజరంలో పడి, నిర్లిప్త నిరీక్షణావధిలోకి విముక్తమై; అనురాగ రసరాగ సౌందర్యంలో పునర్జన్మించాను.

కానీ అంతలోనే ఆ సౌందర్యానుగాగపు నా వూపిరి, శిలావల్మీకమైపోతే అందులో సమాధి ఐ, యేకాంతిస్తున్నాను

[రక్తాక్ష, కార్తీక బహుళ త్రయోదశి]

# హిమజ్వాల-2

## 4

చివరి గంట పాఠం చెప్పి, అలసటగా హాస్టలు గదికి వొచ్చి, స్నానించింది గీతాదేవి.

కుడిపక్క పాపిట తీసి, ఒగుతుగా దువ్వి, బాదంకాయ ఆకారంలో ముడిచుట్టింది. తోటమాలి తెచ్చియిచ్చిన మూడు యెర్రగులాబీలను దారంతో మధ్యలో బిగించి, కుడివైపుగా చెవి కింద అమర్చింది. నుదుట, నయాపైసకంటే కొంచెం పెద్దసైజులో అప్పుడే పురుగురంగు కుంకుమ బొట్టు పెట్టుకుంది. చెవులకు రింగుల్లా కళ్ళకి కాటుక—సన్నటి నల్లపూసల దారంలా దిద్దింది. వొంటిరంగు ఆమాత్రం దొరకనివ్వని సన్నటి చిక్కటి తెల్లబ్లౌజు వేసుకుంది. పొడవు పవిట తీసి, ఆరుంపావు గజాల తెల్ల ఫుల్ వాయిల్ చీర కట్టుకుంది తెల్లటి సాటిన్ లోపావడా ఆ చీరకి ఒక్కదనాన్ని ఆపాదించింది.

నల్లతోలు తాడితో చక్కంలా తయారు చేసిన చెప్పులు తొడుక్కుని స్టీలు చట్రపుతోలు చేసంచీ పుచ్చుకుని గుమ్మం బయటికి వొచ్చి తాళం వేస్తూండగా వొక వుత్తరం తెచ్చి యిచ్చారు. తాళం చెవితోపాటు అది కూడా చేసంచిలో వేసుకుని భోజనాల హాలుకు వెళ్ళింది. టీ కావాలని చెప్పి, వుత్తరం తీసింది. చాలా బరువుగా అనిపించి మళ్ళీ చేసంచిలో పెట్టేసింది.

ఐదున్నరకి, బీచికి వొచ్చి, నీళ్ళ అంచున యిసుక తిన్నెమీద కూచుంది.

జనం అంతగా లేరు. ఐదారుగురు విశ్వవిద్యాలయం విద్యార్థులు. వొకరిమీద వొకరు చెణుకులు విసురుకుంటూ, పిచ్చిగవ్వలు యేరి నీళ్ళలోకి విసురుతూ ఆమె ప్రక్కగా నడిచి వెళ్ళారు. వొకతను సన్నగా చిన్నగా యీల వేశాడు—మరొకతను "గుమ్మ" అన్నాడు ఆమెకు వినిపించీ విని పించకుండా. అవతలగా వొకాయన ఐదారేళ్ళ ఆడపిల్ల లిద్దరికి యిసకలో పరుగు తియ్యటం నేర్పుతున్నాడు.

యెండ పొడన సముద్రం, ఆకాశపు టోనులో కోడినిద్ర తీస్తోంది.

కవరు తీసి చించింది.

"మీరు విశాఖ చేరాక వొక వుత్తరం రాశారు. ఆ తరవాత నెల కొకటి చొప్పున నేను మూడుత్తరాలు రాశాను. మౌనం మాట్లాడుతుం దన్నారుకదా అని కొన్నాళ్ళు ఆగి చూశాను. మౌనవీణ మీటగలగటానికి నేనేమైనా వివేకానందుణ్ణా! మా వృద్ధకేసరి, వ్యర్థకేసరి అన్నట్లు, చెవి నిల్లు కట్టుకుని చెప్పినా సరిగా వినిపించుకోని వాణ్ణికదా నేను, మీరు యేకంగా మౌనం వహిస్తే యెలా చెప్పండి! ఆధునిక ప్రబంధ లేక పరబంధ సరళిలో—మీ హృదయం వొక వీణ. మీ చేతి వ్రేళ్ళు తీగలు—అవి మోగనిదే అనగా రాయనిదే; మంత్రుల జాతకాలు చదివేవాణ్ణి, నాకెలా తెలుస్తుంది చెప్పండి;

మూణ్నెల్ల క్రితం జరిగిన మూడు వింతల తరవాత—మూడు వింత లేమిటని అడుగుతారేమో—వొకటి, తోకచుక్క. రెండు, పిడుగు. మూడు, మెరుపుతీగ. టెలిగ్రాం, వుత్తరం కంటే ముందుచేరటం తోకచుక్క రాలటం లాంటిది. వేళకి బెజవాడ స్టేషన్లోకి హైదరాబాద్ నుంచి హౌరా యెక్స్‌ప్రెస్ రావటం, పిడుగు పడటం లాంటిది మీరు వుత్తరంరాయటం మబ్బుల్లేని ఫిబ్రవరి మాసపు ఆకాశంలో మెరుపుతీగ తళుక్కుమనటం లాంటిది.

నాలుగో వింత—మౌనం పలకటం సంభవించకపోతుందా అని చూశాను కానీ, అబ్బే, యేదీ! వుహూ.

అక్కడి వాతావరణం, వుద్యోగ విషయాలు యేమీ రాశారు కాదు. అరేబియా సీటిగాలి పోయి, బంగ్లా సాంద్రాఖాతపు గాలి మీకు యెలా అని

పిస్తున్నదో తెలియదు. విశాఖపట్నం జీవన వ్యయం దృష్ట్యా చూడనప్పుడ బాగానే వుండొచ్చు వో తుఁగ వొచ్చి మిమ్మల్ని చూడాలని వుంది. కాలం అంతా హాస్టల్లోనే గడుపుతారా? అలా బజారుకీ, షికారుకీ బీచికీ వెడుతుంటారా? యింకా వొంటగేనా? యెవరైనా స్నేహం అయ్యారా? మీహాస్టల్లో మీతోపాటు యెవరన్నా వుపన్యాసికలు కూడా వున్నారా? చదువు చెప్పటం యిదే మొదలేమో; యెలా వుంటోంది? నాక్రితం వుత్తరాలలోని కొన్ని ప్రశ్నలకు మీరు జవాబులు రాయాల్సి వున్నారు స్మోండీ? గతవారంలో మీ విశాఖరావాల్సిన పనిపడినట్లే పడి అంతలోనే మాయమైంది. యిక్కడ, మా వృద్ధకేసరి గురించి మీకు తెలియదనుకుంటాను మహాజ్ఞాని, ప్రజ్ఞాశాలి. మెదడు, నరాలతోసహా అన్నీ పట్టుతప్పి—మగతనిద్ర తీస్తూవుంటాడెప్పుడూ. యీ వృద్ధకేసరి నిజంగా వ్యర్థకేసరి అని మా పత్రికాధి నేతకి తెలిస్తే యేం చేసి వుండునా అని ఆశ్చర్యపోతూ వుంటాను అప్పుడప్పుడూ.

వుండబట్టలేక రుతువుకి వో నిజం రాస్తూ వుంటాను పత్రికలో—అప్పుడు చూడాలి యిక్కడి కలకలం—పత్రికలలో పనిచెయ్యటం సరదాగానే వుంటుందిలెండి! అన్నట్లు, మీకూ అనుభవం వుందికదూ! ఆ వృద్ధ జంబుకం యిప్పటికీ బాగా నరాలపట్టువున్నవాడు. మంచినేర్పు తెలివివున్న యువకులను చూస్తే పిడిచిపెట్టకుండా రాపిడిపెట్టి నిగ్గుతేలేలా చెయ్యగల మనిషి. ఆ కారణంగానే అప్పుడు మీ గురించి చెప్పినప్పుడు—వుద్యోగ నియామకం మాట తరవాత. ముందుచేరి తర్ఫీదు కమ్మను. అర్హతవుంటే వారం తిరక్కుండా దానంతటదే ఖాయపడిపోతుంది. వెధవ్వుద్యోగం (damn)—అన్నాడు యీమధ్య నాకు వుత్తరం రాస్తూ అందులో మీ గురించి ముచ్చటించాడు. మీరు తన పత్రిక నుంచి వెళ్ళిపోవాలని తను కోరుకోలేదట గానీ వెళ్ళటం మంచిదేనట పాత్రికేయంకంటే వున్నతమైన దానికోసం వుద్దేశింపబడిన వారట మీరు. చూశారూ, వృద్ధ జంబుకం బుర్ర, చురుగ్గా పనిచేస్తోంది; యిట్టే నిజాన్ని పసికట్టెయ్యగలడు కాకపోతే, వేరే కొన్ని విషయాలలో జిత్తులమారి అనే కాని—యెడిటర్‌గా యింకా వుండతగిన వాడే.

<u>అనుభూతిని దెరుగదట</u>

మిత్రుడు క్రిష్ణ, రెండేళ్ళపాటు యేదో ఆశ్రమంలో వుండి, అక్కడినుంచి—సరిగా తెలీదు. యెక్కడెక్కడో—జీవమూలికల పరిశోధన కాబోలు చేస్తున్నాడట. తిరుగుడులో యేదీ కుదురుకోదనుకుంటాను. నఫీస్ మంజిల్‌లో ప్రస్తుతం అతగాని తండ్రిగారు—అనగా నాకు డాడీ, మాత్రమే వుంటున్నారు. వాళ్ళమేనత్త ప్రస్తుతం యీ వూళ్ళోనే వుంటోంది.

తూర్పు గాలితోపాటు తూర్పు మాటయేమైనా సోకి వొచ్చిందా? మీకూ నాకూ ప్రాంతాలంటూ లేవు కాబోలు. పాదరసంలా అన్నిటిలోంచీ పారగలం. దేంట్లోనూ మనని మనం వొదులుకుని మునిగిపోయి కలిసిపోలేం. యిందులో కొన్ని పత్రిక కత్తిరింపులు పంపిస్తున్నాను; సాహిత్య దృష్ట్యా మీకు ఆసక్తిగానూ వుపయోగంగానూ వుండొచ్చునని. మీరిసెర్చి విషయం యేమైంది? బొంబాయిలోనే చెయ్యాలనుకుంటున్నారా? వొకవేళ స్కాలర్‌షిప్ ఆలోగా వొస్తే వుద్యోగం వొదిలేసి వెళ్ళిపోవటం—యిష్ట; యీ మాట నేను అనాల్సిన పనిలేదు రిసెర్చికోసం దేన్నైనా వొదులుకోగల సాహసం, హృదయం మీకున్నాయని నాకు తెలుసు. మీరు అనుకున్న అంశం నాకెంతో నచ్చింది. రెండు ప్రపంచ సంగ్రామాల మధ్య ఆంగ్ల సాహిత్యంలో ట్రడిషన్ అండ్ యెక్స్‌పెరిమెంట్ (దీనికి సంప్రదాయమూ—ప్రయోగమూ అని నేను తెలుగిస్తున్నాను!) అన్న అంశం స్ఫురించటమే వొక విశిష్టత. కానీ యిలాంటి అంశంపైన రిసెర్చి చెయ్యటం—ఐరోపాకో, అమెరికాకో వెళ్ళి చేస్తే బావుంటుందేమోనని నాకనిపించింది. ఆలోచించండి. మీకు అలాంటి అవకాశాలు అతిసులభం అని కూడా అనుకుంటున్నాను.

ముందు మీనుంచి వివరాలతో వుత్తరం వొచ్చేవరకూ, నేను వూరుకుని వుండాల్సింది కాబట్టి; యింతలో ఐనా ముగిస్తున్నాను—శశాంక.

ఆ కత్తిరింపుల కాగితాలు అన్నీ టూకీగా చూసి మడత పెట్టి వేళ్ళ మధ్య కదుపుతూ—

—అవును, తను యిక్కడికి వొచ్చి మూడు నెలలు. కొత్త వాతావరణం—యీ మనుషులు, కళాశాలలో తన తోటి వాళ్ళు—తనలాగే హాస్టల్లో

వుంటున్నది యిద్దరు—వొకావిడ వృద్ధపడుచు; మరొకావిడ యెన్నటికీ బాల్య దశనుంచీ యెదగని మనిషి. కళాశాలలో వొక్కొక్కరికి వొక్కో గదిలేక పోవటం ఘోరం——పెద్ద హాల్లోపడి యేంచెయ్యాలని, వొకరి మొహం వొకరు చూసుకోను! అసూయలు, అపహాస్యాలూ, పొగడ్తలు, వెకిలి వేషాలు——వీటన్నిటినీ సినిమాతీసి ప్రతి యేడాది చివరికీ విద్యార్థినులకి వీలైతే విద్యార్థులకి చూపెడితే—— తొమ్మిది నెలలలో వాళ్ళు సముపార్జించే విజ్ఞానంకంటే గొప్పజ్ఞానం అబ్బవొచ్చు. అందుకే యివి కళాశాలలు_పిల్లలకి చదువుచెప్పి పట్టాలిచ్చి పంపే కర్మాగారాలు. వొక్కరికి నిజమైన విజ్ఞానకాంక్ష వున్నట్లు కనపడదు. పుస్తకాలు చదవరేం! పాఠాలు చెప్పటానికి అవసరం ఐనంతవరకే. నిరంతరం, అధ్యయనాన్ని వొక సాధనలా భావించి, కష్టించి అవసరమైతే శోధనకి సంబంధించి వివిధ ప్రదేశాలు తిరిగి——యెక్కడ, ఆశ్రమాలా—క్రిష్ణ—చేస్తున్నది పరిశోధనా లేక పరమార్థమా, పరిమార్జితమా—ఆవాళ వొచ్చేరోజు—తను అనుకోలేదసలు,

గా ఫోను చెయ్యాలని—కానీ మళ్ళీ బండికి చాలా సమయం వుండి యేం

చేయటమా అనిపించి- మూడో తరగతిలో ప్రయాణంచేసి మొదటి తరగతి గదిలో స్నానం చెయ్యటాని కెందుకో మనస్కరించలేదు. సామాన్లరక్షణగదిలో ఆ రెండూ పడేసి—మారెడ్‌పల్లి స్నేహితురాలి యింటికి వెళ్ళి స్నానించి మళ్ళీ రావటం తలుచుకుంటే వింతగానే అనిపిస్తోంది—— తను వింతపనులే చేస్తుందా? శాలిని, లోనికి వెళ్ళి యెంతకీ రాకపోతే; తను అనవసరంగా ఫోనుచేసి తెలిసిన నలుగుర్ని పరామర్శ చెయ్యటమూ—కానీ తను నఫీస్ మంజిల్‌కి దేనికి ఫోను చేసినట్లు-భలే, తను యేమని అడిగింది! క్రిష్ణచైతన్యగా రున్నారా అని! రెండేళ్ళుగా వూళ్ళోలేని మనిషిని గురించి అడిగితే యేమనుకుని వుంటారో!——ఆ జవాబుచెప్పిన మనిషి తండ్రి ఐ వుండకపోవొచ్చు. నేరుగా ఆయన దగ్గిరికి వెళ్ళి, అయ్యా మీ అబ్బాయిని పిలిపించి తక్షణం పెళ్ళి చెయ్యండి అని వుండాల్సింది తను! తమాషాగా వుండునేమో. ఆచూకీలేని మనిషిని ఆయన మాత్రం యేం పిలిపించగలడు? యేమని వుండునో; తనుగానీ వెళ్ళి, అలా అనివుంటే! వెనక విన్న మాటలనబట్టి వొక దృక్కులో నన్ను పరీక్షగా చూసి, కన్ప్ర

వాడి ఆచూకీ తెలియదు. పోనీ, చూడమ్మాయ్ నువ్వుగానీ వెతికి పట్టి తెచ్చుకున్నావో సికిచ్చి చేసేస్తాను. యేమంటావు—అని పగలబడి నవ్వి—పోనీ, కాఫీ తాగేసి వెళ్ళు" అని—యేవిటీ అసంతగపు టాలోచనలు—యివి అసలు ఆలోచనలేనా—తను ఆ విషయం ఆలోచించాల్సి వుందా అసలు—దేనికోసం ఆలోచించాలి—నవీన్ మంజిల్‌కి తనకీ సంబంధం యేవిటి! వ్యాసుడి బుర్రలో మాత్రమే క్రిష్ణుడికి గీతకీ సంబంధం—గీత అంటే వొకటో తరగతి పిల్లాడు పలకమీద గీసిన గీత—యింత వుమ్మేసి చేత్తో పామేస్తే చెరిగిపోతుంది. శ్రీక్రిష్ణుడు కోర్టులో కేసెడితే—తన పేలాది వెన్నబొమ్మలూ బ్రతికి వుండగానే —మీకు తెలియదు నేనసలి కస్థలిత బ్రహ్మచారిని అని దబాయించగల దిట్ట—పాపం. శ్రీరాముడలా కాదు—పాపం అనెందుకనుకోవాలిలే—యెవడో చాకలి వెధవ తప్పుడుకూత కూశాడని, మహాసాధ్విని అడవుల్లోకి నిప్పుల్లోకి నెట్టెస్తాడా—రామరాజ్యమట—యిప్పుడు కూడా రామరాజ్యం నెలకొల్పుతామంటున్నారు, దేశంలో టోపీలన్నీ— అదిగాసీ వొస్తే తను చెయ్యని తప్పుకి మనిషి శిక్ష అనుభవించాలనా! ఆ పని సీరోకూడా చేసి వుండక పోవాలి — సీరో — రోసి — పాపం, పద్మ — ఆ రోని వల్లనే వచ్చిందా పద్మకి కడుపు! భలే తమాషా జంటలే ఆ భార్యాభర్తల—వొకరి కొకరు తగినవాళ్ళు—పాపం కంట తడి పెట్టుకుని యెంతగా బ్రతిమలాడింది, తనని వాళ్ళింట్లోనే వుండి రిసెర్చి పూర్తిచెయ్యమని! తను యిలా యిలా వూరు వొస్తున్నట్లు చెబితే—నవ్వింది, అలిగింది, కోప్పడింది, బాధపడింది. ఆఖరికి, తను—యీ వుద్యోగం పది నెలలు మాత్రమే, అనుభవం కింద వుపయోగపడుతుంది. రిసెర్చికి ప్రవేశం దగ్గిరా వొచ్చాక వొచ్చేస్తానని చెబితేగాని వొప్పుకోలేదు! వేళకి ప్రొఫెసర్ మోరియా సేట్స్‌కివెళ్ళాలా, తన దురదృష్టం కాకపోతే—ఆయన తిరిగి రావాలి. ఆ తరవాత—యేడాది పడుతుందేమో స్కాలర్‌షిప్ రానటానికి— లేకపోతే వేసవికి మళ్ళీ అక్కడ యే పత్రికలో ఐనా చేరాలో—యీతూరి తనకి యే శశాంకా లేదు యిప్పించేందుకు—వాడు, ఆ తుచ్ఛుడు నళినీమోహన్ లాంటివాడు యేదైనా వుద్యోగం యిప్పించినా తనకి అక్కరలేదు—ప్రతాప్‌రాజ్ మంచి అనుభూతిని గ్గెరుగడట

వాడిలా అనిపించాడు. బహుశా నీలూ పుణ్యమూ అని కావొచ్చు—యింక పద్మ—పద్మ, తనని యేదైనా పని చెయ్యనిస్తుందా నో పట్టాన! పిల్లలిద్దరూ తను వొచ్చేస్తూంటే యెంత యిదైపోయారు—పద్మ రాసిన వుత్తరానికి కూడా జవాబివ్వలేదింకా తను—శశాంక గారికి రాయలేదు—యింత కాలంగా తను రాయకపోవటం క్షమించదగ్గ విషయంకాదు—కానీ శశాంక! తనని చాలా వాటికి క్షమిస్తాడు—శశాంక పురుషులలో తనకి వొక నేస్తం వున్నట్లు చెప్పుకోగలగటం కోసం పరిచయం ఐవుండాలి—కాని-శశాంక—కొన్ని కొన్ని సందర్భాలలో—ముఖ్యం—అలాంటప్పుడు—అతని ముఖంలో నిగూఢమైన మార్పులు, రంగులు—సరిగ్గా అందుకే శశాంక వున్నత వ్యక్తి—నఫీస్ మంజిల్‌లో ఆ రోజున—నఫీస్ మంజిల్—

యేదో చప్పుడైనట్లయి ఉలిక్కిపడినట్లుగా కదిలి చుట్టూ చూసింది.

బీచిలో అక్కడక్కడా జనం చుట్టూ చప్పుడు. యెప్పటినుంచో వున్న ఆ చప్పుడు కాదు. అంతర్లీనంగా అలికిడి ఐన చప్పుడు; నిశ్శబ్దంగా ఆమె మీద కురుస్తున్న వెన్నెలలో కలిసిపోయిన చప్పుడు.

ఆకాశమంతటి నీలం గొడుగు కింద, వెన్నెల కౌగిలికి వొళ్ళు మరిచి పుక్కిలింత లౌతోంది సముద్రం.

గుండెలోని నెత్తురు వెన్నెలగా మారి, స్వేత స్రోతస్వినిలా పొర్లి, పొర్లి—నీలపు నిశ్చల సుడిగుండంలా నిలిచింది. గాలి తాకిడికి వొళ్ళు, వొంపులలోంచి శతసహస్ర కంపనలై స్వీయానుబంధం లేని యిసుకరేణువుల కంబళి మీద కాంతిముద్దలా ప్రజ్వరిల్లి, ప్రజ్వరిల్లి—వెన్నెల దుప్పటిని మీదకి లాక్కున్న నీలపు నీటి దూది పరుపులా నిలిచింది. సప్తసాగరాలూ కుదించుకుని, కుదించుకుని, ఘనీభవించి, నీటిపెళ్ళలా ఐ—కోటి పొరల రస భావాలన్నీ అద్వైత తాదాత్మ్య సిద్ధిపొంది, కాటుక తీరాన కనుచూపులలో అమరమైపోయి కను కొసంలోని చెమ్మగా మారిపోతున్నాయి. అనుభూతి వొత్తిడికి తట్టుకోలేక యెర్రని పెదవులమీద చిరునవ్వులా చింది—సాంద్రతకి వుక్కిరిబిక్కిరై అలల పెదవులమీద పాలదొంతర నవ్వులైపోతోంది.

సముద్రం యింక పట్టలేక, హోరెత్తి ఆమె గుండెలోని సుడుల

అనుభూతిసి గ్గెరుగదట

ముడికో మూగవోతోంది.

ఆమె హృదయం, రసప్రపాతమై యేకాంతపు చట్టాతి మీద పతికి వెన్నెలగా చెదిరి—నీలపుముద్దలా ఘనీభవించిన సముద్రాన్ని తడుపుతోంది.

సముద్రపు టట్టడుగున యెక్కడో తళుక్కుమన్న కోటిదివ్వెల వెలుగురేఖలా; ఆమె మనసులో, ఆంతర్యపులోతుల్లో మిగడ తరకలాంటి కత్తికోత—తెల్లటి నెత్తురు స్రవించి నీలంగా పేరుకుపోతోంది

—అనుభూతికి తనకి సామరస్యం కుదరటంలేదు. అహ్మదాబాదులో పుల్లిపొరలా సాగదీసుకున్న తెల్లచీరకీ, తన అవయవాలకీ పొత్తు కుదరటంలేదు. దుగ్గిరాలలో పండించిన పసుపుకీ తన చర్మానికీ సమ్మేళన సాధ్యమవటంలేదు. కొచ్చిన్‌లో పండిన టెంకాయ నూనెకీ, తన జుట్టుకీ సంలీనం వీలవటంలేదు. యెక్కడెక్కడో ప్రదేశాల్లో తయారైన యీ పదార్థాలకీ తన దేహానికీ మధ్య యే అనుబంధం వుంటుంది! ముందు, శరీరానికీ, మనసుకీ పొసగటంలేదు మనసుమీద శరీరం గుడ్డి నిషా వేస్తుంది; శరీరం మీద మనసు వ్యర్థ విప్లవం సాగిస్తుంది. తను-యీ రెండూ కాని తను—వాటిలో యిమడలేక వాటిలోంచి పరిపూర్ణత పొందలేక వెర్రిచూపులు చూస్తే-చివరికి ఆ రెండూ వొక దానితో వొకటి కలియబడి, పడిపడి పేనుకుని, తనని చుట్టేసి, వుక్కిరిబిక్కిరి చేస్తే బిక్కమొహం వేసి, నలుదిక్కులకి చూసి-అనుభవంలేని అనుభూతి—అనుభూతి—అనుభూతిలో—వూటీలో దహించివేసిన యేకాంత రసైకజ్వాల-నిశ్శబ్దం బరువుకి క్రుంగిపోయిన లోయలో, చీరని పచ్చగడ్డి రంగులో మెత్తదనంలో కలిపేసి వెల్లకిలా పడుకుని—వెన్నెల సెగలో; మొహం, పండిన తమలపాకులా యిన్స్టెంటీకి మెత్తబడితే; గుండె చితికి కళ్ళలోకి స్రవిస్తే; గిర్రున తిరిగి మొహాన్ని గడ్డితో కప్పుకుని, స్తనాలను పాషాణంలా అనిపించిన గడ్డిలోకి గుచ్చి, సముద్రగర్భంలో కదిలిన మంచుకొండలా శరీరాన్ని అణిచి, అణిచి—అవయవాల మలుపుల్లో, సందుల్లో చీరా గడ్డీ యిరుక్కుని కలిగించిన వింత స్పర్శ—దాన్ని మండించలేక, దాన్ని పండించలేక; విషాదంతో నవ్విన రాణిలా వొత్తిగిలిన శరీరంలోని సెగ, మంచుముద్ద నిప్పు రవ్వలా అనుభూతిసిగ్గెరుగదట

జ్వలించి బొగ్గయిపోయిన ఆ అనుభూతి—అనుభూతితో జీవితాన్ని పరిపక్వంచేసి, యేకాంతపు శిలా ఫలకం సిపద సమర్పింపజేసి......

• • •

రాత్రి హోంసీల్ పుస్తకంతో నిద్రచాలక పగటి భోజనం చేశాక పడుకుంటే; ఆరు గంటలకి మెలుకువ వొచ్చింది గీతాదేవికి.

లేచి త్వరత్వరగా స్నానంచేసి తెమిలే సరికి ఆరున్నర అయింది. కబురుపెడితే; హాస్టల్లో వుండే యిద్దరు వుపన్యాసికలు ఆమెకోసం యెదురు చూసి చూసి, విసుక్కుని వెళ్లిపోయారని తెలిసి—గేటు బయటికి వొచ్చి రిక్షా యెక్కింది.

—తన నెందుకసలు పిలవటం యీ విందుకు? వాళ్ల యిల్లూ, వస్తువులూ, బట్టలూ చూపెట్టుకోటానికా! పుట్టినరోజు ఐతే యేవిటి? అంతకే పుట్టి మునిగినట్లు యింటికి జనాన్ని రప్పించి, గుమిగూర్చి— యేవిటో అర్థంలేని విందులు—సుజాత పుట్టినరోజు. యెన్నిసార్లు రాలేదీ పుట్టిన రోజు? యిరవై ఆరుసార్లు వొచ్చి వుండాలి. యీ యిరవై ఆరో పుట్టిన రోజు తన పాలబడింది — యిరవై రెండేళ్లనే చెప్పుకుంటుంది సుజాత—రికార్డులో తను చూడటం జరగలేదనా— వుద్యోగం చెయ్యటం మొదలయ్యే ఆరేళ్లు. ఆడవాళ్ల కిదో జబ్బు-అసలు వయసు చెప్పుకుంటే నామోషీ, సిగ్గు-అంత పెండవాళ్ళ బుద్ధిలే. పుట్టి యిప్పుడు సిగ్గుపడితే యేం లాభం-యెప్పటికీ పదహారేళ్ళ బాలాకుమారీల్లా వుండిపోవాలనా! యీ శారద-నలభయ్ యేళ్లదాకా వుంటాయి. తనని అందరూ పడుచుపిల్ల అని అనుకోవాలన్నట్టుగా యేం అవస్థపడుతుంది? ఆ క్రీములూ, పౌడర్లూ, లోషన్లూ, పునాది లోషనూ, పైపూత లోషనూ, దాని బూతరా బుసే-యెంత అవస్థపడితే మాత్రం వొచ్చిన వొంటి ముడతలు పోతాయా? వయసుతోపాటు వొంటికి ముసలి రావటం నిండుతనం అని తెలుసుకోలేరెందుకో! అందరూ తలోరకం. యీ కమల—యింకా చిన్నతనపు చేష్టలుమానక-యిదింకా కొంత నయం-కావాలని కాదు-మానసికంగా యెదగలేకపోయి వుండాలి. యేదో మానసికాటకాయింపు కారణం ఐ వుండొచ్చు తమలో లేనివాటిని యితరులలో చూసి బాధపడతారు-యీ

అనుభూతిని గ్గరుగదలు

లక్షణం ఆడవాళ్ల సొత్తేమో! ఐతే మరి తనూ? వ్ప—పోనీ తను మగ— కానీ మగవాళ్ళలోనూ యీ లక్షణం యెంతో కొంత లేకపోలేదు—అన్నీ వొక్క వ్యక్తిలోనే వుండటానికి; రంగూ రుచీ వాసనా రూపు లేని పనికి రాని పదార్ధమా వ్యక్తి అంటే! యింకొకరు అందమైన చీ కట్టుకుంటే వోర్వలేదు. సుజాత—వో మోస్తర చీరకూడా అందంగా కట్టుకుంటే వోర్వలేదు పాపం, తనూ యెంతో శ్రమపడి శ్రద్ధతో యెంచక్కానో కట్టుకుంటుంది కానీ ఆ ఆకారం అలాంటిది. బద్దలా పొడవుగా పట్టీలా వుంటుందేమో; వొంటికి యే చీర చుట్టినా వొకటేనేమో అనిపిస్తుంది. పోలికలు అన్నీ, పరీక్షగా చూస్తే లోపం వుండదుగానీ—మొత్తంమీద యేదో లోపం యీ—యేడుగంటలు కావొస్తోందేమో, అందరూ వొచ్చి వెళ్ళిపోయి వుంటారు పాడునిద్ర, మెలుకువ వొచ్చిందికాదు వెళ్ళదలిచి నప్పుడు వేళకి వెళ్ళటం భావ్యం. తండ్రి కమ్మర్షియల్టేక్సాఫీసరుగా రిటైరయ్యాడేమో—మంచి యిల్లు కట్టుకున్నారట—తనూ తన తమ్ముడు సంతానం.

రిక్షా డాబా గార్డెన్సు సమీపించింది. యే వీధి అని ఆతను అడిగిన ప్రశ్నకి చుట్టున చుట్టూ గమనించి, యేమీ తెలియక వీధిపేరు చెప్పి ఊరుకుంది.

రిక్షా అతను గునుస్తూ దిగి, వెనక్కి తిప్పుకుని తొక్కటం ప్రారంభించాడు

రిక్షా ఆ వీధిలోకి వెళ్ళాక, వో యింటి ముందు తన సహోద్యోగిని కనిపించి—యిల్లు ఫలానా అని నిర్ధారించుకుంది. రిక్షా ఆ యింటిముందుకు చేరేసరికి ఆమె అక్కడినుంచి ముందుకు కదిలిపోయింది.

రిక్షాలోంచి దిగుతూ వుండగా, నలుగు రైదుగురు ఆడవాళ్ళూ, మగవాళ్లూ గేటులోంచి బయటికి వొచ్చారు.

ఆడా మగా అందరూ, గీతాదేవిని పరీక్షగా చూసి ప్రక్కకి మరలి వెళ్ళిపోయారు.

—ఆడవాళ్లని మగవాళ్ళు చూడటానికి కారణాలున్నాయిగానీ, ఆడవాళ్ళని ఆడవాళ్ళు శల్య పరీక్షగా చూడటం దేనికి? అసలు చూసేదే అనుభూతిని గెరుగదట

ఆడవాళ్లు. మగవాళ్లు—వాళ్ళ దృష్టి నాకర్షించితే వో చూపు విసురుతారు కొందరు. మరికొందరు ఆ స్త్రీ చూపుగానీ ఒక్కితే, తమ చూపును వొక కంటిలోంచి, నీళ్ళలో బెండు మునిగి తేలినట్లుగా కదుల్చుతారు. కన్నుగీటటం అనేది మరీ కావరమెక్కితేనో, ఆకతాయి తనం ముదిరితేనో— ఆడవాళ్లు ఆడవాళ్లను యెందుకు చూడాలంతిదిగా—స్త్రీ—తన చూపు, వొక్క చూపుతో, కనీసం కనుకొనలోంచి చిన్న దృష్టిరేఖ చాలు, అవతలి స్త్రీ వొంట పిడా లోనా యింక యేమీ మిగిలివుండటానికి వీల్లేదు. ఆ నేర్పు, చాకచక్యం, మహద్విత్వ, పాపం, మగవాళ్ళ కెక్కడేక్కింది! కాకపోతే దుష్టపు వెధవలనేగానీ...

"అట్లా చూస్తున్నావేంటి, యిది యిల్లేనోయ్ గీతా!" అంది మెట్ల మీద నిలబడివున్న సుజాత.

ప్రక్కింటిమీంచి దృష్టిమరల్చి, మరి నాలుగు అడుగులు ముందుకు వేసి మెట్లెక్కుతూ, "మీ యిల్లు యెలాగూ చూడబోతున్నానుకదా, ఆలోగా మీ పక్కింటినికూడా గమనించేద్దామని—" అని నవ్వింది గీతాదేవి.

"అంత ఆసక్తిగావుంటే తీసుకెళ్తానులే ఆనికి, చూద్దువుగాని. ముందుగానే సారీ చెపుతున్నాను, తీరా తీసికెళ్ళినాక ఆ ముసిలాయన్ని. ముగ్గురాడపిల్లల్ని చూసి నువ్వు సీరుకారిపోవుకదా అని"

"నేను చూసేది యిల్లే. ఆ రెండోది—యేదీ, నీ అంత వయసురానీ ము!"

"ఆమాట అంటావనే నాకు కోపం నీమీద. నిజానికి నేను నీకంటే రెణ్నెల్లు చిన్న.

"అవును కదూ, మర్చిపోయానోయ్ సుజాతా!"

"అదుగో ఆ వంకర మాటలంటేనే."

"వొంకర్ల ఆకారాన్నిబట్టే వొంకర మాటలున్నా."

"మాటలు కాదు వంకర; మాటల్లోని ధ్వనిలో వంకర."

"ఆంగ్లభాషా శాస్త్రం చదివినందుకు ఫోనెటిక్స్ మీదకూడా అభిరుచా!"

"మాదేముంది? నువ్వన్నావుగా ఆరని కొవ్వొత్తిలా ఆంగ్లసాహిత్య పరిశోధనలో!"

వరండా దాటి హాలులోకి వొచ్చారు.

నాలుగు సోఫాలు వాటి ప్రక్కల నాలుగు పేముకుర్చీలూ యింకా ప్రక్కలకి నాలుగైదు రేకు కుర్చీలూ వున్నాయి.

యిద్దరు మగవాళ్లు, యిద్దరు ఆడవాళ్లు కూచుని వున్నారు.

"మా గీత వొచ్చింది అందరూ వొచ్చి వెళ్లిపోయినాక!" అంది సుజాత వాళ్లతో స్వగతంలా.

ఆలస్యంగా వొచ్చినందుకు క్షమాపణలు చెప్పుకోవటం మర్చిపోయింది గీతాదేవి. యిప్పుడు సమయం కాదని ఆ పని విరమించుకుంది.

"నాకు ఆశ మెండుకదా, అందరితో వొస్తే ఆతిథ్యం చాలదని!" అని నవ్వింది గీతాదేవి.

"అది కాకపోయినా యేదో కారణం వుండి వుండాలి!" అన్నాడు పైజామా జుబ్బా వేసుకుని బొచ్చుటోపీ పెట్టుకున్నతను. వయసు పాతిక లోపు.

ఆ వ్యక్తిని పరిచయం చేసింది సుజాత. తన తమ్ముడు. మెరైన్ యింజనీరింగూ పూర్తిచేసి హిందూస్తాన్ నౌకా నిర్మాణంలో చేరాడు. పేరు రమాపతి

"చెప్పమంటారా, అసలు కారణం—రాత్రి సరిగా నిద్రలేక; పగలు మొద్దునిద్రపోయాను. అందుకని" అంది అతనితో.

సుజాత, మిగతా వ్యక్తులను పరిచయం చేస్తోంది, తమ్ముడి మాటల్ని లక్ష్యపెట్టకండా. మరోవ్యక్తి ఆమె మేనత్తకొడుకు. పేరు శివరాం. కాల్టెక్స్‌లో వుద్యోగి. వయసు పాతికకీ, ముప్ఫయ్‌కీ మధ్యలో. యిద్దరిలో వొకామె ఆమెకి పింతల్లి కూతురు. పేరు లక్ష్మీరాజ్యం. ముప్ఫయ్యేళ్లలోపు. భర్తకి రెవిన్యూ శాఖలో వుద్యోగం. రెండో ఆమె, తనతో బియ్యే కలిసి చదువుకుంది. భర్త, యీ వూళ్లో వో పెద్ద వ్యాపారసంస్థకి మేనేజర్.

పరిచయాలు పూర్తికాకముందే "నిక్కచ్చిగా నిజం చెప్పినందుకు

మీపై నాకు అభిమానం కలిగేసింది సుమా! నిద్రయెందుకు పట్టలేదని అడగటం సభ్యతకాదు కాబట్టి అడగటం లేదనుకోండి" అన్నాడు రమాపతి.

ప్రతి నమస్కారాలుచేసి; ఆమె పింతల్లి కూతురి ప్రక్కగా సోఫామీద కూర్చుంటూ నవ్వి, "నిద్రపట్టక అని అనలేడండీ, నేను నిద్ర లేక అన్నాను. వో సీల్ పుస్తకం చదువుతూ వుండిపోయాను." అంది గీతాదేవి!

"చంపేశారు. మీరు ఆంగ్లంలో నిధులని తెలుగులో మాట్లాడాను. కానీ మీకు లాజిక్ వొచ్చునని తెలిసి భయవేస్తాం దిప్పుడు. నేను వృత్త పడవల తయారీ యింజనీర్ని, వో సీల్ అనేసరికి నా ప్రాణం లేచొచ్చినట్లయ్యింది——

ముగించకముందే అందుకుని, "నీకు యే పుస్తకం చూసినా పేరు విన్నా ప్రాణం లేచీవొస్తుంది. యెగిరీ పోతుందిగానీ, అతిధికి ఆతిధ్యం వగైరా చూడు" అంది సుజాత.

"నీ అజ్ఞానాన్ని నలుగరి ముందూ యెందుకు ప్రదర్శిస్తావు చెప్పు! నే చెయ్యాల్సిన ఆతిధ్యం చేస్తూనేవున్నాను కదా —— నీ ఆతిధ్యమేదో కానివ్——మాటమధ్యలో పుడకలు వేస్తూ కూచోక." అని నవ్వాడు రమాపతి.

సుజాత పింతల్లి కూతురు నవ్వి. "అట్లాగే మళ్లా మాకో వరస" అంది.

"మాకు——అన్నదాంట్లో నన్ను కూడా చేర్చినట్లు భావిస్తున్నాను." అన్నాడు రమాపతి.

పనిమనిషి, హాల్లోకి వొచ్చి, యేదో చెప్పబోయి కొత్తగా మరో వ్యక్తివొచ్చి వుండటం గమనించి లోనకి వెళ్ళింది.

బయట యెవరో పిలిచిన ధ్వని.

సుజాత లేచి బయటికి వెళ్ళి హాల్లోకి తిరిగివొస్తూ,

"యెవోయ్ సరోజినీ మీ కారు డ్రైవరు వొచ్చి రెండు నిమిషాలైందట. కారాలు మిరియాలు నూరుతున్నాడు నీ ఆలిస్యానికి——" అంటోంది.

చివరిలో అందుకుని, "భర్తల వుద్యోగం కారు డ్రైవర్లు పుచ్చుకున్నారన్న మాట—రేపొద్దున నేను వో భర్తనైతే యింట్లో ఆ వుద్యోగం కూడా లేని ఒకారివాణ్నవుతా నన్నమాట!" అని నవ్వాడు రమాపతి.

"ముందు భర్తవి కావయ్యా త్వరగా—తరవాత వుద్యోగం మాట—" అంటూ లేచింది సరోజిని.

"అది అంత సులభమా! నువ్వు పెద్ద దానివైపోయావు గానీ లేకపోతే మీఆయనకి నచ్చచెప్పి నిన్ను చేసికుని వుందును" అని పకపకా నవ్వాడు రమాపతి.

"నీ ధోరణింక ఆపు. చూడగా యిప్పటికైనా పరవాలేదనేట్టుగా వున్నావు నువ్వు" అంది సుజాత, కసురుకున్నట్టుగానూ, చమత్కరించినట్టుగానూ.

"రమ మా యింటి కొచ్చినప్పుడల్లా ఆయన్ని చూసి మూడో తరగతి పిల్లాడికిమల్లే భయపడిపోతాడు, పాపం, యీ ఆకతాయి కబుర్లన్నీ మనదగ్గిరే" అంది సరోజిని.

పనిమనిషి ఫలహారాల పళ్లాలు తీసుకొచ్చింది.

"లక్ష్మి నువ్వూ రాకూడదూ కార్లో—మీ యింటిదగ్గిర దింపేస్తాను" అంది సరోజిని.

"అట్లాగే" అని లేచింది లక్ష్మిరాజ్యం.

"మరోసారి" అన్నారు, ఆ యిద్దరూ వొకే తూరిగా.

"వొస్తాం శివరాంగారూ—" అంటూ చేతులు జోడించింది సరోజిని.

లేవబోయినట్టుగా వొంగి, "మంచిది" అన్నాడు చేతులు జోడించి నవ్వుముఖంతో.

"వ్రతభంగం చేసినందుకు సరోజినమ్మగారు క్షమార్హులు కాదు. అప్పటినుంచీ గమనిస్తున్నాను, బావగారి మౌనముద్ర" అని పకపకా నవ్వాడు రమాపతి.

వాళ్ళిద్దరినీ మెట్లవరకూ సాగనంపి తిరిగివొచ్చింది, సుజాత.

"మీరు యీ మధ్యనే చేరినట్టున్నారు కాలేజీలో—" అన్నాడు రమాపతి గీతాదేవివైపు తిరిగి.

"అవును. ఐదు నెలలైంది"

"కాలేజీకి పనిచేసే పడుచు లెక్చరరిణులందరూ—కాలేజికి కూడా, బయట రెండు జడలు లేక తోకలాగా వొక్క జడా వేస్తారు. స్టాండింగ్ యెగ్జాంపులు మా అక్కా. మీరేమో ముచ్చటగా ముచ్చ[illegible] నుంచి డిప్పటోపీలా ముడివలిచారు!" అన్నాడు రమాపతి.

గీతాదేవి సమాధానంగా పల్చగా నవ్వి వూరుకుంది.

"మీరు యే వూళ్ళో చదివారు?" అడిగాడు రమాపతి.

"యీ విలేకరి వుద్యోగంకూడా ప్రారంభించావా తమ్ముడూ!" అని నవ్వింది, అప్పటివరకూ వాళ్ళవంక చూస్తూ నిలబడిన సుమిత్ర వో పేము కుర్చీలో కూర్చుంటూ.

"బొంబాయిలో." అంది గీతాదేవి.

"మీది అసలు యే వూరు?"

"అసలు వూరు, కొసరు వూరు—అంటూలేవు. యెక్కడుంటే ఆ వూరు" అని నిశ్శబ్దంగా నవ్వింది గీతాదేవి.

"గూడ్—అన్ని వూళ్ళూ మీవేనన్నమాట అందుకే మిమ్మల్ని చూస్తే యే ప్రాంతంవారో పోల్చుకోలేకపోయాను."

"ఆంధ్రప్రదేశ్‌లో వ్యక్తుల్ని చూసి యే ప్రాంతంవాళ్ళో పోల్చుకోగలరన్నమాట!" అంది గీతాదేవి.

"అది కొంచెం కష్టమేననుకోండి. ముఖ్యంగా చదువుకున్నవాళ్ళ విషయంలో—కానీ తెలుగువాళ్లా కాదా అనేది తెలుస్తుంది."

"నేను మాటాడేది తెలుగు కాదని తెలియదే నాకింతవరకూ!" అని నిశ్శబ్దంగా నవ్వింది.

"అపరాధం వుప—శమించుగాక. మీరు మాట్లాడుతోంటే ఆంగ్లంతో పాటు తెలుగుకూడా మధించారనిపిస్తోంది. కానీ మీది యేప్రాంతపు మాటో—అంటే స్లాంగ్—తెలవలేదు."

"అన్ని ప్రాంతాలూ—అనుకుంటే పోదూ!"

కుర్చీలోంచి లేచి, "ఆ మాటల పోగుతో దేనికిగానీ ముందు నువ్వు కానివ్వోయ్ గీతా" అంటూ ఫలహారాల పళ్ళాలు ఆమె ముందుకు జరిపింది

అనుభూతిని గ్గెయగదట

సుజాత.

"బావగారిక్కూడా వో ప్లేటు కారబ్బూంది యిప్పించు." అన్నాడు రమాపతి, నవ్వుతూ—సుజాతతో.

"బావగారి కేం కావాలో ఆయనకి తెలవదని చెప్తున్నావా తమ్ముడూ!" అని నవ్వి, శివరాంవంక చూసింది సుజాత.

పల్చగా నవ్వి, "నాక్కావాల్సినవాటిలో మొదటిది — అక్కా తమ్ముడూ వొకరితో వొకరు రోజుకి నూరు మాటలకంటే యెక్కువ మాట్లాడకపోవటం. రెండోది, వొక హల్వాప్లేటు, గుప్పెడు కారబ్బూంది" అన్నాడు శివరాం.

"నూరు మాటలంటే, అక్షరాలా, పదాలా-అనేది స్పష్టంచెయ్యాలి, ముందు. ఆ తరవాత, అంతకంటే యెక్కువ మాట్లాడకుండా వున్నారో లేదో లెక్కపెట్టటానికి మీరు మా యింట్లోనే వుండాల్సి వుంటుంది. అట్లా గాని వుండే పక్షంలో వొక ప్రమాదం సంభవించే అవకాశం వుంది. బావా మరదళ్ళ చిన్ననాటి పేచీలను పునరుద్ధరిస్తే; నేను, తయారవుతూన్న వోడలోకే మకాం మార్చాల్సి వుంటుంది."

యింటి మగబిడ్డవి—నీ మకాం ఫాలాక్షుడు కూడా మార్చలేడోయ్, నీకా భయం అక్కర్లేదు. నీ పెళ్ళయినాక మీ అక్కయ్య హాస్టలికెళ్ళి వుంటుంది" అన్నాడు శివరాం.

"హాస్టల్లో వుండాల్సిన ఖర్మేం లేదు నాకు."

"చూడండి అక్కయ్యగారూ. యితరులను నొప్పించే మాటలు అనటం భావ్యంకాదు. అందునా యీ సందర్భంలో."

"పెళ్ళికానివాళ్ళు మరి హాస్టళ్ళలోనే వుండాల్సి వుంటుంది. ఆమాట నిజమేకదా!" రమాపతితో అని నవ్వింది గీతాదేవి.

"మా అక్కయ్య పెళ్ళి అవ్వాలంటే ప్రళయం లాంటిదేదో సంభవించాలి. యెప్పటికైనా బావగారే జాలి తలచాలి."

"ముయ్‌నోర్" అంది సుజాత తమ్ముణ్ణి.

అనుభూతిసిగ్గెరుగదట

"నీ కోపమొస్తే ఆంగ్లంలో అరుస్తావని నాకు తెలుసుగానీ కాస్త తమాయించు— నేనేం తప్పుమాట అన్నాననీ?" అన్నాడు రమాపతి.

"యింకా వాగుతానే వున్నావంటే—" అని—కోపంతో మాట ఆగి పోయింది

"రమా యెందుకోయ్ ఆ ప్రసక్తిప్పుడు?" అని సున్నితంగా మందలించాడు శివరాం.

"ఇల్లు బావుంది" అంది గీతాదేవి ఆ అంశం మార్చాలన్నట్లు.

"బాగుండకెట్లా పోతుందండీ. నా ప్లాను ప్రకారం కదూ కట్టింది!" అన్నాడు రమాపతి నవ్వుతూ.

"అలాగా! మీరు పడవలకి ప్లానులే గీస్తారనుకున్నాను లెండి" అని నవ్వింది గీతాదేవి.

"వొక్క పడవలకే యిళ్ళకే కాదు—మనుషులకి కూడా ప్లాను గీస్తానండోయ్ గీతాదేవిగారూ, మీకు తెలవదేమో."

"మీరు చిత్రకారులా?" అంది గీతాదేవి.

"మీ తెలివికిదే జోహార్లర్పిస్తున్నాను" అని గట్టిగా నవ్వి, "వొక్క మనుషుల మీదనేకాదు—యితర ప్రాణులూ అప్రాణులమీదకూడా కుంచతో బురద చిమ్ముతుంటాను మీరుగానీ వొకసారి తీరికగా వొస్తే, మీకు ఆ మరకలు చూపుకునే భాగ్యం కలుగుతుంది నాకు" అన్నాడు రమాపతి.

"వో. తప్పక. అలాగే" అంది గీతాదేవి.

తినటం ముగించి, చేతి కొనవేళ్ళమీద నీటబొట్లు చిలకరించి చేరు మాలతో వొత్తుకుంటూన్న గీతాదేవికేసి చూసి, "భలే దానివే. అప్పుడే ఐపోయిందా?" అంది సుజాత.

"ఫలహారాల భోజనంతో సరిపెట్టాలనా? యింకా అసలు భోజనం యేర్పాట్లు వున్నాయనుకున్నానే!" అని నవ్వింది గీతాదేవి; సుజాత కట్టు కున్న ఆకుపచ్చ ధర్మవరం చీరకి వున్న దళసరి సరిగంచుకేసి చూస్తూ.

సరిగంచు ప్రక్కగా రాళ్ళకంఠహారం మెరిసి—ఆ వెలుగులు గీతా దేవి ముఖాన పడుతున్నాయి.

అనుభూతిసి గ్గెరుగదట

పత్రిక చాటుచేసుకుని శివరాం, తదేకంగా గీతాదేవికేసి చూస్తూ వుండటం, చాలా సేపటినుంచి క్రీగంట గమనిస్తోంది సుజాత.

అతని మౌనానికి అర్థం తెలిసిపోయినట్లుగా తల పంకించింది, అతని ముఖంలోకి చూసి, యేం, బావా. మా గీత నచ్చిందా?" అంది సుజాత

గట్టిగా నవ్వి "నచ్చటానికి యిది పెళ్ళి చూపులవిందు—అని నాకు తెలవదే:" అన్నాడు శివరాం.

"అప్పుడే వ్యవహారం పెళ్ళి చూపుల దాకా రావటానికి వీల్లేదు, ముందు కట్నం మాట తేలకుండా" అని నవ్వాడు రమాపతి.

"అందరూ నీలాంటివాళ్లు కాదుగా!" అన్నాడు శివరాం.

"అందులో నామోషీ పడాల్సింది యేమీలేదు. అరలక్షపైన పలికితే తన యిష్టమొచ్చిన పిల్లని తీసుకొస్తే కళ్లమూసుకుని ఠకీమని మూడు ముళ్లు వేసేస్తానని మా నాన్నకి చెప్పలేదనటం లేదు" అని గీతాదేవి వైపు తిరిగి, హాస్యానికి కాదు. నిజంగానే అన్నాను. మా బావగారిలాంటి వాళ్ళు కట్నం కావాలని అనకపోవచ్చుగానీ" అన్నాడు రమాపతి.

"నాకు అవ్వా కావాలి బువ్వా కావాలని లక్షరూపాయల రొఖ్ఖం కట్నం; ఊర్వశి లాంటి వధువు" అని అందరి ముఖాలమీంచీ వొక చూపు చుట్టాడు శివరాం.

"రంభా తిలోత్తమా యెట్‌సెట్రా" అని చేర్చాడు రమాపతి,

సుజాత ముఖంలోకి చూసి, "ఆ పేర్లకి గీతాదేవిగారు తీసిపోరు కదూ సుజాతా?" అన్నాడు శివరాం,

"అని తెలుస్తానే వుంది. నిన్ను చూస్తోంటే" అంది సుజాత.

"నన్ను చూసి, నువ్వు యేదైనా అర్థం చేసుకోటం యిదే మొదటి సారి" అన్నాడు శివరాం

"నాకు మీ బొమ్మలు చూపెట్టగూడదూ. యిప్పుడు?" అంది గీతాదేవి రమాపతితో.

"వో; సంతోషంగా" అంటూ లేవబోతున్నాడు రమాపతి.

చటుక్కున ఆమెవైపు చూశారు; సుజాతా, శివరాంలు

"సారీ" అన్నాడు శివరాం, గీతాదేవికేసి చూసి, యింత సేపటికి

అన్నుభూతిసిగ్గెరుగదట

అదే మొదటిసారి అతను గీతాదేవితో మాట్లాడటం.

"సారీ, దేనికి?" అంది గీతాదేవి. అతనికేసి పరిశీలనగా చూసింది. తెల్లలాగూ చొక్కా, నల్లబెల్టు, మామిడి చిగురు రంగు నెక్టై.

వెనక్కి నొక్కిన వుంగరాలజుట్టు. వెడల్పాటి ముఖం. మిలమిల మెరిసే చిన్న కళ్ళు. సన్నమీసం. లేత చామనఛాయ, పొడవుగా నిండైన విగ్రహం.

"దేనికంటే—" అని క్షణకాలం ఆగి, "దేనికో మీకు తెలుసని నాకు తెలుసు" అన్నాడు శివరాం.

"పదండి రమాపతిగారూ మీ బొమ్మలు చూపెడుదురు" అంటూ లేచి సుజాతవైపు చూసి "సుజాతా నువ్వూ రాకూడదూ?" అంది గీతాదేవి.

"వాడి బొమ్మలకంటే చెత్తకుండీలో రంగుల కాగితాలు చూడటం మేలు. నువ్వు చూసిరా. నాకు తలనొప్పి వొస్తుంది వాటిని చూస్తే" అంది సుజాత.

రమాపతి వెనక అడుగులు వేసింది గీతాదేవి.

"యేవోయ్, రమూ, నీ బొమ్మలన్నీ నేనూ చూడలేదు. నేనూ చూస్తాను" అంటూ లేచాడు శివరాం. సుజాతకేసి చూడబోయి—చూడకుండా ప్రక్కకి అడుగులు వేశాడు

వొక్కొక్కటే తీసిచూపెడుతూ వాటిని గురించి చెప్పుకుపోతు న్నాడు రమాపతి. కొన్ని నీటిరంగులు. కొన్ని తైలవర్ణాలు. గీతాదేవికి శిల్పంలోనూ, సంగీతంలోనూ వున్న ఆసక్తి చిత్రలేఖనంలో లేదేమో; క్షుణ్ణంగా తెలియదు. శివరాంకి బొత్తిగా తెలియదేమో ననిపించింది గీతాదేవికి.

"మీకూ యిష్టమా చిత్రలేఖనం?" అంది గీతాదేవి శివరాంతో.

నవ్వి! "నాకా, నాకు అందమైనవీ అందంగా లేనివీ - అనే విభజన మాత్రమే తెలుసు" అన్నాడు శివరాం.

ఆకాశం అంచున నల్లని మబ్బులలోంచి నెత్తురు జీరలా కాంతి వెదజల్లుతున్న తైలవర్ణం వొకటి చూపెట్టి, తనకు బాగా నచ్చిందని అంది

గీతాదేవి.

"అదా, అది కిందటేడు అరకులోయ వెళ్ళినప్పుడు వేశాను. తీసి కెళ్ళండి" అన్నాడు రమాపతి.

"నేను చిత్రలేఖనాలు కొనగలననే!" అని నవ్వింది.

"ఆ గిరాకీ పడమటి దేశాల్లోనే. మన దేశంలో వాటిని చిత్తుకాగితాలకున్న గిరాకీ కూడా లేదు" అన్నాడు రమాపతి.

"అవును మరి, చిత్తుకాగితాలు పొట్లాలు కట్టటానికి పనికొస్తాయ్ కదటోయ్!" అన్నాడు. శివరాం నవ్వుతూ.

తెల్లకాగితం వేసి గుండ్రంగా చుట్టి దారంతో మధ్యలో కట్టి, "వుండండి మీ దగ్గిర" అని ఆమె చేతికి అందించాడు రమాపతి.

"నువ్వన్నట్లు మనదేశంలో వీటికున్న గిరాకినిబట్టి బొమ్మవేశావు కాబట్టి పటంకూడా నువ్వే కట్టించి యివ్వాల్సి వుంటుందోయ్" అని నవ్వాడు శివరాం.

"అవును బావగారూ, వొప్పుకుంటున్నాను" అన్నాడు రమాపతి

"కృతజ్ఞతలు" అంది.

"అప్పుడే! మా బావగా రన్నట్లు తరవాత పటం కట్టించుతాను. అప్పుడు చెప్పుదురు" అని నవ్వాడు రమాపతి.

నవ్వింది, రమాపతికేసి చూసి.

తిరిగి డ్రాయింగ్ గూంలోకి వొచ్చారు ముగ్గురూ. సుజాత లేదు.

"మీ అమ్మగారు నాన్నగారూ లేరు?" అంది గీతాదేవి.

"మా నాన్న వూళ్లో లేదు. అమ్మ మీరొచ్చేముందే చుట్టాల యింట్లో యేదో వ్రతసంకల్పం జరుగుతూంటే వెళ్ళింది. మీరు నిలబడే వున్నారు?" అన్నాడు రమాపతి.

కూచుంటూ, "సుజాత యేమైంది. లేదు?" అంది స్వగతంలా.

"యేడోసారి బట్టలు మార్చుకోటానికి తనగదిలోకి వెళ్ళివుంటుంది" అని నవ్వాడు రమాపతి.

"మా వూళ్ళో పక్కింట్లో వొకావిడ వుండేది. రోజుకి పదహారు సార్లు స్నానం చేసేది." అని నవ్వాడు శివరాం,

"చన్నీళ్ళ స్నానం ఐవుంటే ఫరవాలేదు. వొళ్లు బిగిసవుంటుంది."
అన్నాడు రమాపతి.

"సుజాత——" అని ఆగిపోయింది గీతాదేవి.

"వెతికి, జుట్టు-అబ్బే అది మొగుడి కొదిలేసి-చెయ్యిపట్టుకుని లాక్కు- రమ్మంటారు" అని నవ్వుకుంటూ లోనకివెళ్లాడు రమాపతి.

ఆమెకేసి చూస్తూ—ఆమె తనని గమనిస్తున్నప్పుడు దృష్టి మరల్చు తున్నాడు శివరాం.

శివరాం ఏదో అనబోయాడు. అంతలో రమాపతి నవ్వుకుంటూ వొచ్చి, "అక్కగారు కోపగృహాన్నలంకరించినట్లున్నారు, తలుపు బిడాయిం చివుంది, తట్టి చూశాను. లోపలనుంచి అతీ గతీ లేదు. పోలీసు బందో బస్తు లేసిదే ఇతరుల తలుపులు పగలగొట్టకూడదు కాబట్టి వొదిలేసి రాక తప్పలేదు గీతాదేవిగారూ" అన్నాడు.

"సారీ, ఆమె మనసు నొప్పించినట్టున్నాను" అంది గీతాదేవి నొచ్చుకుంటున్నట్లుగా.

"సారీ యెందుకండోయి! ఆవిడగారి మనసు దూలగొండాకు రాసు కున్నట్లుగా ఎప్పుడూ అవస్థ పడుతూనే వుంటుంది! యీ ఆదివారం సాయంత్రపువేళ పిలిచి మిమ్మల్ని చికాకుపరిచినందుకు రేపు మీకు తానే క్షమాపణలు చెప్పుకోవాల్సి వుంటుంది" అన్నాడు రమాపతి.

"నేను పిలిచి చూస్తాను, ఆగండి!" అంటూ లేవబోయింది.

"మీరు శ్రమపడటం అనవసరం. ఒక్క యముడు తప్ప ఎవ రొచ్చి పిలిచినా జవాబివ్వదు. నా మాటమీద నమ్మకం లేకపోతే మా బావ గార్ని అడగండి."

"వెనక, ఊళ్లో తనకి సొంతగది లేని కాలంలో, కోపమొచ్చి నప్పుడు అలిగి పిడకల గుడిశలో పడుకునేది. అప్పటికి నువ్వు చిన్నవాడి వోయ్ రమా, నారింజచెట్టు పక్కగా నిలబడి గుడిశలోకి మట్టిగెడ్డ విసిరే వాడిని. ఊడిపోయిన జడలతో పరిగెత్తుకొచ్చి, దోసడు దుమ్మెత్తి నా మొహాన పోసేది. అప్పుడు మీ అమ్మ పెట్టిన చివాట్లు తిని నిద్రపోయేది" అని పకపకా నవ్వాడు శివరాం.

అనుభూతిసిగ్గెరుగదట

రమాపతివైపు చూసి. "వెళ్లొస్తాను, మరి" అంటూ లేచింది గీతాదేవి, నొచ్చుకున్నట్లుగా ముఖం పెట్టి,

"మీరట్లా బాధపడటం అన్యాయం" అని నవ్వాడు రమాపతి.

"మరి నేనూ పోతానోయ్" అంటూ లేచాడు శివరాం.

ముగ్గురూ, ముందు వరండాలోకి వొచ్చారు

"మీరూ—" అని ఆగి, శివరాంకేసి చూసి, "బావగారూ, దారిలో రిక్షా కనిపిస్తే పంపించండి" అన్నాడు రమాపతి.

గీతాదేవివైపు తిరిగి, చేతులు జోడించి, "నమస్తే" అని త్వర త్వరగా మెట్లు దిగి స్కూటర్ మీద వెళ్లిపోయాడు శివరాం.

"యీ వూళ్లో స్కూటర్లెక్కువనుకుంటాను" అంది.

"అలాగా! మా బావగారు, కారు కొనటం డబ్బు దండగని స్కూటర్ కొన్నారు. మా నాన్న ఆ దండగ మాత్రం దేనికని అదీ కొనలేదు" అని నవ్వాడు రమాపతి.

"సుజాత—" అని ఆగిపోయింది గీతాదేవి.

"సారీ. మా అక్కకి కొంచెం తిక్కవుంది. యేమీ అనుకోకండి"

"నేను ఆమె మనసు నొప్పించి వుండాలి. లేకపోతే—"

"మీరు కాదు మా బావగారు. చాలా యేళ్లబట్టి నొప్పిస్తున్నారు లెండి."

"వో, అదా" అంది నిదానంగా.

రిక్షా వొచ్చింది.

"అనురసంధ్య" తైలవర్ణచిత్రం యిచ్చినందుకు అతనికి కృతజ్ఞతలు చెప్పి—మెట్లు దిగింది.

*

"నమస్తే"

దూరాన, నిప్పుముద్ద, సముద్రం అంచున జారి మునిగిపోతూంటే చూస్తూ యిసక మీద అడుగులు వేస్తున్న గీతాదేవి, ప్రక్కకి తిరిగి చూసింది.

ఆమెకి వెనకగా శివరాం.

"నమస్తే" అంటూ తల కొంచెం కదిపి.

"యివ్వాళ సముద్రం చాలా అందంగా వుంది" అన్నాడు.

"సముద్రం యెప్పుడూ అందంగా వుంటుంది."

అతను, ఆమె ప్రక్కకి అడుగులువేసి యేకంగా నడుస్తున్నాడు,

"మొన్న వొకరోజున మిమ్మల్ని చూశానొకక్షణం. పలకరించుదా మనుకున్నాను గానీ—"

"సూర్యాస్తమయాన్ని చూసినట్లుగా చూశారనండి"

"యెన్నిసార్లు పలకరించినా పలకని ఆ సూర్యాస్తమయానికి మల్లే మీరూ పలకరేమో అని—"

"సంధ్య యెప్పుడూ ప్రతిపిలుపునిస్తుంది ఆ భాష అర్థం అవ్వాలి. మనుషులే పలకనిది"

"మీరు చిత్రంగా మాట్లాడతారు."

"అలాగా!"

మీ రిక్కడ ప్రొబేషన్‌మీద వున్నారా?"

"లేదు యిసక మీద. వుద్యోగం ఏప్రిల్ ఆఖరికి ముగిసిపోతుంది" అని సన్నగా నవ్వింది.

"మీ గురించి సుజాత చెప్పింది, విన్నాను."

"ఏమని, ప్రొబేషన్‌మీద వున్నాననా?"

"కాదు—కాదు—" అని, యేమనాలో తట్టనట్లుగా ఆగిపోయాడు.

మౌనం. గీతాదేవి నడకకి తన నడక సరితూచుకుంటూ, అడుగులు వేస్తున్నాడు.

"అదుగో, అటుకేసి మా కాల్టెక్స్ క్వార్టర్లు. అందులో వుంటాను నేను"

"అలాగా, కాల్టెక్స్‌లో యేం చేస్తుంటారు?"

"డిస్ట్రిబ్యూషన్ మేనేజర్ని."

వొడ్డున తెల్లగా నురగ కక్కేసి, మళ్ళీ లోనకి వెళ్ళిపోతున్న నీలం నీళ్ళకేసి చూస్తోంది.

అతనుకూడా ఆగి, ఆమెకేసి, నీళ్ళలోకి చూస్తున్నాడు.

అనుభూతిసిగ్గెరుగదట

కూచుంది.—యెడమకాలు యిసకమీద ప్రక్కవాటుగా ఆన్చి, రెండోకాలు వారగా వొంచి పాదం యిసకమీద ఆన్చి, కుడిచెయ్యి వారగా వొంచిన మోకాటిమీద ఆన్చి వేళ్ళలో నీలం ఫుల్‌వాయిల్ చీర నీడలను జరుపుతూ-నీళ్ళలోకి చూస్తోంది.

అతను యెడం కాలిమీద నిలబడి, కుడికాలి బూటు కొనతోచుట్టూ యిసక కదుపుతూ ఆమెకేసి చూస్తున్నాడు.

"మిమ్మల్ని చూసినప్పుడు సముద్రం, సముద్రాన్ని చూసినప్పుడు మీరూ గుర్తుకొస్తారు నాకు" అన్నాడు

"మా అమ్మ నన్ను ఆస్పత్రిలో కన్నది. సముద్రపు టొడ్డున కాదే."

"దానికీ, దీనికి సంబంధం యేంటి? పుట్టినప్పుడు బట్టలు లేకుండా వుంటాం. అట్లా అని బట్టలేసుకోకుండా వుంటావా?"

తల కొంచెం యెత్తి అతనికేసి పరీక్షగా చూసింది—

మడత నలగని శుభ్రమైన తెల్లలాగూ, పొట్టిచేతుల గళ్ళచొక్కా, నల్లబెల్టు—గుత్తగా వున్నాయి. గాలికి చెదిరిన నల్లని వుంగరాల జుట్టు వెడల్పుగా విస్తరించుకుని గడ్డందగ్గిర కొసదేలిన ముఖం. సన్నగా పెదవి పొడవుగా మీసం. నీలం నెక్‌టై. చివర్ల ములుకుదేలిన నల్లబూట్లు-డాలర్ నోటులాగే వున్నాడు.

అతని కళ్ళలోకి చూసింది—

చీకట్లో గలగలమని చప్పుడైన సముద్రపు నీళ్ళలా తళతళ మంటు న్నాయి. ఆ తళతళలో మెత్తదనం కంటే పెళుసుదనం యెక్కువ. జాలిగా చూసినప్పుడు మాత్రం నీళ్ళలో తడిసిన కొత్తనోటులా అనిపిస్తాయి.

"యీ బట్ట లేసుకోటానికి తొలి కారణాలు యేమిటో యింకా రూఢిగా చెప్పలేకపోతున్నారు శాస్త్రజ్ఞులు" అంది.

"బట్టలేసుకోటం నాగరికతకి చిహ్నం."

కోర్కె మరిమరి వృద్ధిప్తికాదని బట్టలేసుకుంటూ వుండిపో యారు."

"మీరు చిత్రంగా మాట్లాడతారు."

అనుభూతిసి గెరుగదట

నవ్వింది సన్నగా.

నీలం బ్లౌజుమీద నీలం పవిట అంటుకుని — అతని కళ్ళలో మరింత నీలంగా కదులుతున్నాయి, ఆమె స్తనాల నీడలు.

ఆమెకి యెదురుగా నాలుగడుగుల అవతల కూర్చున్నాడు.

"దగ్గిరేకదా అని రోజూ వొస్తుంటారా యిక్కడికి?" అంది.

"అది వరకు అప్పుడప్పుడూ వొచ్చేవాణ్ని. యీ మధ్యరోజూ వొస్తున్నాను."

"యేవోఁ, యీ మధ్య సముద్రం అందంగా తయారయిందేవిటీ?"

"సముద్రానికి అందంవొచ్చింది, మీరిలా యిసకమీద కూర్చుంటే."

మౌనం.

"రోజూ వొస్తున్నాను మీరు కనిపిస్తారేమోనని."

"నేను అడ్రసు లేనిదాన్ని కాదే. మీ సుజాత నడిగితే చెప్పేదిగా, నేనెక్కడ వుండేదీ తెలియకపోతే."

"తెలుసుగానీ, రావటం భావ్యం అవునో కాదో అని—"

"యెవరినైనా వెళ్ళి కలుసుకోవటం భావ్యం కాదనేది కూడా వుందా!"

"అని కాదూ—" అని ఆగిపోయి, యేదో అనాలని ఆలోచిస్తున్నట్లుగా చూపు బిగించాడు.

"సముద్రానికి మనుషులవల్ల అందం తెచ్చుకోవాల్సిన ఖర్మలేదు. మనుషులకే ఆ అవస్థ" అంది.

"సముద్రం కంటే అందంగా వుండే మనుషులుంటారు."

"అలాగా!"

"యీ మధ్యనే తెలుసుకున్నాను ఆ విషయం."

నవ్వింది నిశ్శబ్దంగా.

ఆమె పవిట గాలికి యెగిరి, వూగి, మళ్ళీ యిసకమీద వాలి, మళ్ళీ యెగురుతూ—

గాలి చల్లదనాన్ని కలుపుకుని చిక్కగా ఐ, బలంగా వీస్తోంది. చుక్కల మిలమిలకి సముద్రం వులికులికి పడుతోంది. హోరున రొద

చెయ్యాలని ప్రయత్నిస్తోంది కానీ, గొంతు పెకలలేదు.

"మీ హాస్టలికొచ్చి మిమ్మల్ని కలుసుకోవాలని చాలాసార్లు అనుకున్నాను గానీ మీరేమైనా అనుకుంటారేమోనని రాలేదు" అన్నాడు స్వగతంలా.

"వొస్తే యేమీ అనుకోకండా యెలా వుంటాను చెప్పండి. నన్ను కలవటానికి మీరు వొచ్చారని అనుకోకండా వుండటం యెలా సాధ్యపడుతుంది!" అని నవ్వింది, వొడ్డున కదిలిన నీళ్ళలా.

"అట్లా అనుకుంటారనుకుంటే వొచ్చేవాణ్ని" అని నవ్వాడు.

"మరింకెలా అనుకుంటా ననుకున్నారు?"

"చెడ్డగా."

"ఐతే మీరు మంచివారన్నమాట!" అని నవ్వింది.

"నొప్పి తెలవకండా చురకవెయ్యటం వొచ్చును మీకు."

"యిదొకటా కొత్తగా! యింతకాలం కళాశాలల్లో నా తోటివాళ్ళు కొందరు, పొగరు మాటలు మెత్తగా మాట్లాడతానని నిరసించేవారు. నాకు మాటలతో చురకలు అంటించటం వొచ్చుననుకుని జడుసుకుంటున్నారన్న మాట ఐతే!" అంది.

"కానీ ఆ చురకలలో అందం ఆనందం వున్నయ్. గర్వంతో అన్నవి కాదు– లాలిత్యపు చురకలు."

"మీకు మాటలు వొచ్చునన్న మాట!" అని నవ్వింది.

"యిప్పుడిప్పుడే వొస్తున్నట్లున్నై, మీ ప్రభావానికి" అని నవ్వాడు.

"నా ప్రభావం శీతగాలి లాంటిదిట. జ్వరం వచ్చే ప్రమాదం వుంటుంది."

"జ్వరం యెప్పుడో సోకింది."

"ఐతే, న్యూయింగ్లండ్ యిచ్చిన క్వార్టర్లో కొత్తరగ్గు తీసి కప్పుకుని పడుకోండి; పొద్దుటికి తగ్గిపోతుంది" అని లేచింది.

అతనూ లేచాడు. నడుస్తున్నారు.

ఆమెకు ప్రక్కగా కొంచెం దగ్గరిగా అడుగులు వేస్తున్నాడు. పవిట, గాలికియెగిరి అప్పుడప్పుడూ అతని భుజం ప్రక్కగా చేతిమీద అనుభూతిని గెరుగడట

అనుతోంది.

"మా క్వార్టరు చూ. కూడదూ, వొచ్చి? వొంటరిగా వుండటం లేదులెండి. నాతో పాటు మా అమ్మా, చెల్లెలూ వున్నారు. చెల్లెలంటే మా పింతండ్రి కూతురు" అన్నాడు,

"అలాగే; మీరూ యే పుట్టిన రోజుకో విందు యేర్పాటుచేసి పిలవండి వస్తాను."

"సర్టిపికెట్లో తప్ప, నా అసలు పుట్టినరోజు తెలియదే"

"గొప్పవాళ్ళైపోయిన అనామకుల్లా మీరూ, మీకు నచ్చిందీ, అచ్చి వొస్తుందనుకునే తేది చూసి ఖాయపరుచుకుంటే సరి!"

"నలుగుర్నీ నా యింటికి పిలవాలనుకున్నప్పుడు ఆ పని చేస్తాలెండి"

"యేటి వొడ్డున మీ యిల్లు. పడవలో నిత్యం నా షికార్లు, యింటి వసారాలో నిలబడి పిలుస్తూ వుండండి. యెప్పుడో పడవలో కాలు తీసి వొడ్డున పెట్టేస్తాను" అని నవ్వి, "మరి వస్తానండీ" అంది, అతనివైపు తిరిగి.

"ఆ తరవాత నా పిలుపు వినపడలేదనకూడదూ!" అని నవ్వాడు.

"చెప్పడు లేదనకుంటాను. యెలుగెత్తి పిలవండి" అని నవ్వి, ప్రక్కకి తిరిగి వడివడిగా అడుగులు వేసింది.

రోడ్డుమీదకి వెళ్ళి ప్రక్కకి తిరిగి చూసింది-దూరాన, అతని తెల్లని బట్టలు అక్కడే నిడుపుగా మెరుస్తున్నాయి.

* * *

నెల రోజులు గడిచాయి.

కళాశాల నుంచి వొచ్చి, చిన్న కునుకుతీసి లేచి, త్వరత్వరగా ముస్తాబవుతోంది గీతాదేవి.

కితం నెలలో, కొత్తగా విశ్వవిద్యాలయం వృక్షశాస్త్రశాఖలో పని చేస్తున్న వొకావిడ పరిచయం ఐంది. ఆమెద్వారా ఆ గ్రంథాలయం లోంచి పుస్తకాలు తెచ్చుకుని చదువుకుంటూ గడిపింది. పాశ్చాత్య పౌరాణిక గాథలు, సంస్కృతికి సంబంధించిన పుస్తకాలు. కళాశాల భవనం

అనుభూతిని గ్గెరుగదట

లోకి వెళ్ళి పాఠాలుచెప్పేసి మళ్ళీ వొచ్చి హాస్టలు గది తలుపులు మూసు కుని చదవటం. యీ కొద్ది నెలలలో మిగిలిన డబ్బు అంతా పెట్టి మంచి జర్మను ట్రాన్సిస్టరొకటికొన్నది. అలసటగానూ, వుషారుగానూ అనిపించి నప్పుడు సంగీతం వొస్తే, వినటం.

పదిరోజుల తరవాత శివరాం వొచ్చాడు. రోజూ బీచికి వెళ్ళి చూశాడట. పదిరోజులుగా కనిపించకపోతే హాస్టలికే రావాలనిపించిందట. కాసేపు మాట్లాడి, మర్నాడు సాయంత్రం బీచికి రావాలని ప్రాధేయపడి నట్లుగా చెప్పి వెళ్ళాడు. వెళ్ళింది. ఆ తరవాత యెడెనిమిదిసార్లు కలుసు కోటం జరిగింది. అతని బలవంతంమీద వొకసారి సినిమాకి. గీతాదేవి రిక్షాలో, అతను స్కూటర్ మీద, ఆమె రిక్షాకి వెనకగానో ముందుగానో నిదానంగా నడపటం, వొకటి రెండుసార్ల తరవాత—అలావెళ్ళటం బాగని పించక కాబోలు, స్కూటర్ వొదిలేసి బాడుక్కారుమీద వొచ్చేవాడు. లేదూ, యిద్దరూ కలిసి నడిచి వెళ్ళటం.

గదికి తాళంవేసి, రోడ్డుమీదకి వొచ్చి రిక్షాలో కూచుంది.

మనసులో యేదో కదలిక, వేగం, తికమక పవరణ.

—తన జీవితం యెన్నాళ్ళిలా సాగిపోవాలో— యెండమావికోసం పరుగులిడుతున్నట్లుగా వుంది—యేదో, దేనికో, యెందుకో—గాఢానుభూతి కలచివేస్తే స్వప్న జగత్తులోకి, వూహాలోకంలోకి మళ్ళీ పోవటం తప్ప యెన్నాళ్ళిలా—జీవితంకేసి చూస్తూ, గాలిలో వూహల పూతీవల కుటీరాలు అల్లుకుంటూ కూచుంటే—చివరికి జీవితం అంతా కళ్ళముందుగా నడిచి వెళ్ళిపోతుంది. తన తపనకి యెవరూ బాధ్యులుకారు. అకారణంగా యేదో, దేనికో; యేమిటో స్పష్టంగా తెలియకండా గాలి కదలికలోకి వెన్నెల ధార లోకి చూస్తూ కూచుంటే తన జీవితం చివరికి యెడారిలో పుష్పించి రాలి పోయిన పుష్పపు అస్పష్ట పరిమళంలా ఐపోతుంది. యేదైనా యెందుకు చెయ్యకూడదు? యేం, యీ శివరాం తనంటే యెంతో ఇదిగా వున్న ట్టుంది—కానీ శివరాంలో—వెలుగుల పొరలకదలికని తాచగలడా—యేమిటీ వెర్రి వూహలు—యెంతకాలం—జీవితాన్ని అందలం యెక్కించుకు కూచుంటే—చూస్తూ వుండగా ప్రపంచం తన ముందునుంచి కదిలి, సాగి, అనుభూతిని గ్గెరుగగదట

వెళ్ళిపోతుంది. యేదో సామరస్యానికి రావటం సమాధాన పడటం అవసరం—వొడ్డున కూచుని వున్నంతకాలమే, నీళ్ళు రకరకాలుగా గిలిగింతలు పెట్టేది. దిగితే, నీటిలోతు సాంద్రత తెలుస్తుంది పెళ్ళి చేసుకుంటానని మాటలలో అనలేదు కాని ఆ భావం తెలియజేశాడు మొదటినుంచీ అలాంటి భావంతోటే ప్రవర్తించినట్లుగా అనిపిస్తోంది. అప్పుడు అతనికేం తక్కువ—ఆ తుచ్ఛుడు నళినీమోహన్ లాంటివాడు కాదు—ఆ హుందిక, నిండుతనం, సగర్వం—మళ్ళీ యెంతో కోర్కె, యిష్టం. తన కరుణకోసం ప్రాధేయపడుతున్నట్లుగా ప్రవర్తించాల్సిన అవసరం అతనికే మొచ్చింది—కేవలం అవసరం తీర్చుకునే దృష్టి ఐతే; యిన్నాళ్ళు నిగ్రహించటం జరగదు-అందుకే ఐతే యెన్ని అవకాశాలను వుపేక్షించి...

హైకో ఫేబ్రిక్స్ దుకాణం దగ్గిర రిక్షా దిగింది. ప్రక్క అంగడి మెట్లమీదినుంచి కిందకి గెంతి వొచ్చాడు శివరాం. కళ్ళతోపాటు ముఖం కూడా మెరుస్తోంది.

"యింత తొందరగా వొస్తారనుకోలేదు" అన్నాడు.

"అనుకోకపోతే మరి నిలువుజీతంమీద ఆసక్తి!"

సమాధానంగా నవ్వి, "అట్లా వెళ్దాం. మా చెల్లెలికీ వాళ్ళకీ యేమన్నా నగలు చూడాలి" అన్నాడు

"వాళ్ళెవరినీ తీసుకురాకండా వొచ్చారేం; మీకు నగల నాణ్యతకూడా తెలుసునన్న మాట."

"అబ్బే, నాకా! గిల్టువిచ్చినా, పదహారు వన్నెలనే తీసుకుపోగలవాణ్ని."

"మరి!"

"అందుకేగా మిమ్మల్ని వెంట తీసుకు వెళ్ళటం."

నవ్వి, "బావుంది. ఆ పనికి దొరక్క దొరక్క నేనే దొరికానూ! యెన్నడూ వొంటిమీద చిన్నమెత్తు బంగారం పెట్టుకుని యెరగనిదాన్ని!"

రెండు ఫర్లాంగులు నడిచి వో దుకాణంలోకి వెళ్ళారు.

ఐదు నిమిషాలు గాజు అరలలో పెట్టిన నగలు చూశాయి.

వో గొలుసు తీయించి, "యిదెట్లా వుంది?" అన్నాడు ఆమెతో

 అనుభూతిసిగ్గెరుగదట

"చెప్పానుగా, బంగారం వొస్తువులు నా బుర్రలోకి యెక్కలేదు. ముత్యాలు, పగడాలు, రవ్వలు, వజ్రాలు—అన్నారూ, కంటితో చూసి చెప్పగలను అవి యెలాంటివో, నాకు మొదటినుంచీ అదో సరదా. నా నేస్తం వొకామె అంటూ వుండేది—నిన్ను చూస్తే కొంతకాలం రవ్వల వ్యాపారం కొట్లో పనిచేసి వుంటావనుకోవాల్సి వొస్తుంది. వాళ్లు పొరబడి వొకదాని ధర యింకొక దానికి చెప్పినా నువ్వు ఠకీమని అసలు కిమ్మతు చెప్పగలుగుతావు కదటే—అని."

శివరాం వొక అడుగు అవతలకి వేసి, మంచి ముత్యాలహారం తీయించి ఆమె దగ్గిరకి పట్టుకొచ్చాడు.

చూసి, "మంచివే కానీ మామ్మూలు రకం. మూడు వందలకు మించదు హారం వెల. బంగారం ధర మినహాయించి" అంది.

"యింతకంటే మంచివి యింకే రకంగా వుంటాయ్?"

"అవీ యిలాగే వుంటాయి. రోజూ సూర్యుడు వొక్కలాగే వుద యిస్తున్నట్లు చూస్తాం. కానీ యే రెండు ఉషస్సంధ్యలు వొకటి కాదు. ఆ తేడా తెలుసుకొగల హృదయం వున్న వాళ్ళకి తెలుస్తుంది ఆవిషయం. అలాగే, యీ నేర్పువున్న వాళ్ళకి తెలుస్తుంది యేవి యెంత కిమ్మత్తు చేసేదీ. ఐతే రూపాయలలో ధర చెప్పాల్సినప్పుడు ప్రస్తుత ధరవరలు తెలిసి వుండాలి."

దుకాణదారుణ్ని అంతకంటే మంచివి వున్నాయా అని అడిగాడు శివరాం. ఐ పోయాయనీ వొచ్చేనెలలో మళ్ళీ వొస్తాయనీ, యివి కూడా మేలు రకమేననీ చెప్పాడు, గల్లాదగ్గర కూర్చున్న వ్యక్తి.

"యింతకీ యెట్లావుందో చెప్పండి. నచ్చిందా!" అన్నాడు శివ రాం, ఆమె వైపు తిరిగి దగ్గిరగా వొచ్చి.

"నాణ్యత కిమ్మత్తు చెప్పాను. నచ్చటం అనేది పెట్టుకునే వాళ్ళ మీద ఆధారపడి వుంటుంది."

"పోనీ—మీకు నచ్చిందా లేదా—చెప్పండి."

"నాకు నచ్చినంత మాత్రాన యితరులకు నచ్చాలని లేదు."

"మీకు నచ్చితే నేనివ్వదలచిన వాళ్ళకి నచ్చుతుందన్న నమ్మకం

నుభూతిని గ్గెయగదట

నాకుంది. చెప్పండి."

"బావుంది, మీ వరస! నాకు నచ్చలేదు" అని నవ్వింది.

"నచ్చ్వతాలకి కాదు చెప్పండి, నచ్చిందా?"

"చెప్పానుగా, నాకు నచ్చిందని. కాని తీరా తీసికెళ్ళాక వాళ్ళకి నచ్చకపోవచ్చు."

"అవన్నీ మీ కెందుకు చెప్పండి."

దుకాణంలో యింకా చర్చ పొడిగించటం బాగోదనిపించి, "బంగారపు తీగ కట్టు కనిపించకుండా తయారుచేసిన యీ కూర్పు చాలాబావుంది" అంది.

డబ్బు చెల్లించి—రంగు కాగితంతో చుట్టి యిచ్చిన అట్టపెట్టె లాగూ జేబులో వేసుకున్నాడు. ఆమెకేసి చూసి యింక వెడదామన్నట్లు తల వూపాడు

కాలి బాట మీద నడుస్తున్నారు.

"బీచికి వెళ్దామా!" అన్నాడు.

"వూఁ" అంది.

రోడ్డు మలుపు దగ్గిర టాక్సీలో కూచుని బీచికి చేరుకున్నారు.

యిసకలో నడుస్తున్నారు.

"మీరు మౌనంగా వున్నారు, అప్పటినుంచీ?" అన్నాడు.

"అదే నేనూ అనొచ్చుకదా మిమ్మల్ని?" అని పల్చగా నవ్వింది.

"అట్లా కూర్చుందామా?" అన్నాడు.

"వూఁ" అని నాలుగడుగులువేసి కూర్చుంది.

ఆమెకు రెండడుగుల యెడంలో కూర్చున్నాడు.

దూరాన విద్యుద్దీపాల కాంతికి చీకటి, నల్లి మస్లిన్ బట్టలా కదులాడుతోంది గాలిలో.

"రోజంతా యిట్లా మీముందు కూర్చుని వుండిపోగలిగితే యెంత బాగుండునో!" అన్నాడు.

"యేమో!"

"యేమో అంటే యేం చెప్పగలను! నా హృదయంలో యేదో అనుభూతిని గైరుగదట

ఆరాటం—ఆవేదనల్లే యెట్లాగో వుంటుంది."

"అలాగా? పోనీ డాక్టరికెవరికైనా చూపెట్టకపోయారూ; యేమైనా గుండె జబ్బేమో!" అని నవ్వింది.

"మీకు నవ్వులాటగానే వుండొచ్చుగానీ—నాకు—నా స్థితి-యెట్లా చెప్పాలో తెలవటంలేదు."

"యెలా చెప్పేదే వుంది, మాటల్లో."

"అదే, మాటల్లో చెప్పగలిగితే—"

"చెప్పలేకపోవటానికి మూగవారైతే కదా?"

"హృదయపు భాష వేరు. అదంతా చెప్పాలంటే—గీతా, నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నాను" వుద్వేగంగా అంటూ ముందుకు వొంగి ఆమె చేతులమీద తన చేతులు వేశాడు.

"మంచిదే. నన్నెవరూ ద్వేషించటం నాకిష్టం వుండదు."

"ద్వేషమూ, ప్రేమా విషయం కాదు. నేను మిమ్మల్ని వేరేలాగా ప్రేమిస్తున్నాను—"

"వేరేలాగా అంటే?"

"హాస్యంకాదు. మిమ్మల్ని చూసిన క్షణంనుంచీ మీరు నా హృదయంలో నిలిచిపోయారు. మీరంటే నాకెంతో ప్రేమ, కోర్కె."

ఆమె మౌనంగా వూరుకుంది

"మీరు మాట్లాడటంలేదు?" అన్నాడు.

"మీ మాట అబద్ధం అనలేదు నేను."

"ఐతే నా హృదయం అర్థమైందన్న మాట నేను మిమ్మల్ని యెంతగా ప్రేమిస్తున్నానో మీకు తెలిసిందన్నమాట!"

"తెలిసిందనుకోండి. మంచిదే."

"మిమ్మల్ని వొక విషయం అడుగుతాను చెప్పరూ?"

"ముందు అడిగితేనే కదా చెప్పేదీ చెప్పనిదీ చెప్పటానికి వీలయ్యేది!"

"మీరు నన్ను ప్రేమిస్తున్నారా?"

"తెలియదే!"

"నన్ను ప్రేమిస్తున్నదీ లేనిదీ మీకు తెలవదా?"

"అదికాదు—ఆ ప్రేమ అనే పదార్థం నేనెప్పుడూ చూడలేదు."

"పరిహాసం కాదు చెప్పండీ"

"చెప్పానుగా. ఆ ప్రేమ అనే వస్తువును నేనెరగను."

"ఐతే మీరు నన్ను ప్రేమించటం లేదనా!"

"యెలా చెప్పేది, అదేమిటో తెలియని దాన్ని!"

"పోనీ, నేనంటే మీ కిష్టమేనా చెప్పండి?" అన్నాడు.

"యిష్టమే. మగవాళ్ళు, అందంగా వున్నంతగా, హుందాగా, రస స్పందకంగావుంటే నాకిష్టం."

"అట్లా యిష్టం మాటకాదు. ప్రత్యేకం నేనంటే మీకు యిష్టంలేదా? నాతో కలిసి యెప్పటికీ వుండాలనిపించలేదా మీకు!"

"అలా కొన్నిసార్లు కొందరి విషయంలో అనిపించింది."

"మీకు నేనంటే కోర్కెలేదా?"

"యింతకాలం, జీవితంలో అలాంటి కోర్కె తీర్చుకోలేదు. వున్నంత మాత్రాన యేమిటి?"

"మీకు తెలుసు నామనసులోని భావం. చెప్పండి. నన్ను పెళ్ళి చేసుకుంటారా!"

"మనదేశంలో మగవాళ్ళను ఆడవాళ్ళు చేసుకోవటం కూడా జరుగు తోందా?" అని నవ్వింది.

"నవ్వులాట కాదు గీతా, యిది నా జీవిత సమస్య. మిమ్మల్ని మనసారా ప్రేమిస్తున్నాను. నా జీవితం మీతో ముడిపడి పోయింది. మిమ్మల్ని పెళ్ళిచేసుకొంటాను."

—తనలో స్మృతులై ధ్వనిస్తున్నాయి యీ మాటలు. యెన్ని సార్లో యిలాంటి మాటలు విన్నా లక్ష్యపెట్టలేదు. యిప్పుడు లక్ష్యపెట్టాల్సి నంత విశేషమూ కనిపించటంలేదు. కానీ యెంతకాలం యిలా? యెందుకు లక్ష్యపెట్టకూడదు? దీనికి సమాధానం దొరకటంలేదు. కానీ, తను చిన్నగా వూఁ అంటే చాలు జీవితం కొత్తబాటన నడుస్తుంది. అనుభూతి అనుభవంలో విముక్తి పొందుతుంది.

"నన్నా, పెళ్ళా, చేసుకుంటారా?" అంది.

"అవును. మిమ్మల్నే, మీ కోసమే యిన్నాళ్ళూ నిరీక్షిస్తూ వుండి పోయాననిపిస్తోంది నాకు రిసెర్చి చెయ్యండి, వుద్యోగం చెయ్యండి, వూరికే యింట్లో కూర్చోండి మీ యిష్టం."

"యేం చూసి!"

"జగదేక సుందరివని."

"బావుంది!" అని నవ్వి, "నేను అందమైన వాళ్ళలో వొకతెనని నాకు తెలుసుగానీ అపురూప సౌందర్యరాశినని నేనెప్పుడూ భ్రమపడలేదు"

"భ్రమకాదు వాస్తవం మీరు జగన్మోహిని! రంభా ఊర్వసులకు తీసిపోరు మీరు."

"నాకింతవరకూ కనిపించలేదే వాళ్ళంతా. మీరెప్పుడు చూశారు!" అని నవ్వింది.

"పరిహాసం కాదు గీతా, దేవకన్యవి, అప్సరసవి."

"రతీదేవిని కూడా నండోయ్!"

"అవును అన్నీ. వొంపులేనివాళ్లు మీరు" వుద్వేగంగా అన్నాడు ఆమె చేతి వేళ్ళలోకి తన చేతి వేళ్ళు దూర్చి.

అతని చేతివేళ్ళ స్పర్శ, ఆమె శరీరాన్ని తియ్యగా కోస్తూ, మన సును పిండుతోంది

తన వేళ్ళు అతని వేళ్ళకి బిగించి, "లక్షణమైన పిల్లనిచ్చి, పళ్ళెంలో మీ కాళ్లు కడిగి, మీ దోసిట్లో కాసులుపోసి—మిమ్మల్ని నెత్తి నెత్తుకునే ఆడపిల్లల తండ్రులెందరో వుండగా, నాలో యేం చూసి అంటు న్నారు?" అంది.

"మీరు కొన్ని లక్షల విలువ. మీ విలువ అమూల్యం. దేవుడు కరుణించి యిచ్చేవర్షం, మీరు యిష్టపడటం."

"చెప్పానుగా. యిదివరకే నన్ను గురించి కొద్దిగా—యెవ్వరూలేని యేకాకిని అలా అని అనాథనీ కాదు నా బతుకు నేను బ్రతకగల గుండె దిటవు వుంది. నన్ను చేసుకోటానికి మీ వాళ్లు వొప్పుకుంటారనుకోను."

"మాఅమ్మ నామాట కాదనదు. అన్నా, భయపడటానికి పసివాణ్ని

కాదు నేను. అసలు మీలో యేం లోటు చూసి కాదంటారు యెవరైనా! చెప్పండి, యిష్టమేనా మీకు? వూఁ అనండి. నా కోసం వూఁ అనండి. నా హృదయంలో శాశ్వతంగా దాచుకుంటాను, చెప్పండి" అంటూ ముందుకు జరిగి, ఆమె జబ్బలు పట్టుకుని వూపాడు.

"సరే" అన్నట్లుగా తల వూపింది.

"నేనెంతో అదృష్టవంతుణ్ని గీతా. మళ్లీ అనండి సరే అని— నోటితో అనండి వినాలని వుంది."

"సరే" అంది.

ఆమెను దగ్గరగా లాక్కుంటూ, "వెంటనే మంచి ముహూర్తం చూసి చేసేసుకుందాం" అన్నాడు.

"చేసుకోవటం యేమిటి? యిప్పుడు చేసుకోలేదూ?"

"నేనెంతో అదృష్టవంతుణ్ని. బ్రహ్మాండంగా వివాహం యేర్పాటు జరుగుతుంది."

"టాం టాం వెయ్యాలంటారా?"

"యిదేం తప్పుపనా, చెప్పకపోవటానికి? ఐదువేలు ఖర్చుపెట్టి ఘనంగా విందు యేర్పాటు చేయించుతాను."

"కట్నం యేమీ యివ్వకపోగా, మీచేత పెళ్లి ఖర్చులుకూడా భారీ యెత్తున పెట్టించ మంటారా నన్ను!"

"నీ కోసం యెంతైనా ఖర్చుపెడతాను సంతోషంగా."

"నా కోసం యేమీ ఖర్చుపెట్టాల్సిన అవసరం వుండదు ఆ తంతు అంతా అనవసరం మన యిద్దరిమధ్యా బంధం తెగిన నాడు పెద్దలంతా యేమీచెయ్యలేరు. నాలో, నలుగురికీ భయపడే లక్షణంలేదు. వివాహం అంటే వో స్త్రీ పురుషుడి మధ్య దీర్ఘానుబంధం. అది వ్యక్తిగత విషయం. టాం టాం వెయ్యనక్కరలేదు. అలా అని రహస్యమూఁ కాదు. మనం తెలిసిన వాళ్లకి అదే తెలుస్తుంది నెమ్మదిమీద."

"పోనీ రిజిష్టర్ పెళ్లి."

"లైసెన్సు తీసుకోకండా పెళ్లాన్ని స్కూటర్‌మీద కూర్చోబెట్టుకు వెడుతున్నావని ప్రజలో, ప్రభుత్వమో ఫలానా చెయ్యబోతే, అప్పుడు

లై సెన్సుకి డబ్బుకట్టి రసీదు తీసుకుని స్కూటర్‌కి అతికించవచ్చులెండి. యిప్పుడు దేనికి? మనమధ్య అనుబంధం తెగిననాడు రిజిష్ట్రాఫీసు కాగితం యెందుకు పనికొస్తుందంటారు?"

"అదికాదు నా వుద్దేశం. యిష్టంలేకుండా దంపతులు కాపరం చెయ్యటాన్ని నేనూ మెచ్చుకోను. మీరు ఆ విధంగా వూహిస్తే—"

"నా వుద్దేశవూ అది కాదు. అవన్నీ అనవసరమని."

"అవుననుకో. కానీ నలుగురూ——"

"నలుగురూ మనని నిలేసి మొలవెయ్యరు. పోనీ నలుగుంకి రిజిష్ట్రాఫీసులో పెళ్లి చేసుకున్నామని చెప్పండి. చెప్పగానే యేదీ కాగితం చూపెట్టమని అడుగుతారని నేననుకోను!" అని నవ్వింది.

"కానీ మీకు అభ్యంతరం వుండాల్సిన అవసరం మాత్రం యేమిటి?"

"అలా కాగితాలతో, క్రతువులతో కట్టిపడేసుకున్నాం అనుకోవటం నాకు నీచంగా అనిపిస్తుంది. వివాహం అంతర్ బంధం మన మీద మనకు విశ్వాసం వుండాలి అది లేనినాడు యేదీ అడ్డుపడదు"

"అవుననుకో—కానీ నలుగురూ ఆచరిస్తున్న పద్ధతివుంది కదా!"

"నలుగురూ కట్నాలు తీసుకోకుండా చేసుకుంటున్నారా?"

"చెదురుగా వుంటారు."

"చెదురుగా నలుగురూ ఆచరించే పద్ధతిని అవలంబించని వాళ్లు వుండొచ్చుకదా."

"కాదనను. కానీ మీరెందుకు ప్రత్యేకం అభ్యంతరం చెప్పాలో నాకు బోధపడటం లేదు."

"మరేంలేదు. అలా చేస్తే నన్ను నేను కించపరచుకున్నట్లు ఫీలవుతాను. వ్యక్తిగత బంధంమీద విశ్వాసం, గౌరవం వున్నప్పుడు దానిని బాహ్యబంధనాలతో కలుషితం చెయ్యటం నాకిష్టం వుండదు. మీకేమైనా అభ్యంతరమా?"

"ప్రత్యేకం యేమీలేదు. మీకట్లా అనిపిస్తే సరే. మీరు నన్ను చేసుకోటానికి యిష్టపడటం కంటే మించి నాకీ ప్రపంచంలో యేమీలేదు."

అనుభూతిని గెరుగదట

"ఐతే యీ క్షణంనుంచి మనిద్దరం——"

"భార్యాభర్తలం" అందించాడు.

లాగూజేబులో చెయ్యి పెడుతూ ప్రక్కకి వొరిగాడు. అతని భుజాలకి చెయ్యిచుట్టి నుదుటిమీద పెదవులు అద్దింది.

జేబులోంచి అట్టపెట్టె తీసి, ఆమెకు ప్రక్కగా ఆనుకుని కూర్చుని, అట్టపెట్టెతెరిచి "యిది బావుందన్నారు కదూ?" అన్నాడు.

"అవును బావుంది."

"మీకూ—బహువచనం, దగ్గిరితనాన్నీ, ఆత్మీయతనీ స్ఫురింపజెయ్యదు. నా జీవనరాణిని ముద్దుగా గీతా అని పిలుచుకుంటాను" అంటూ ఆమె నడుం చుట్టూ చెయ్యి వేశాడు.

"అలాగే పిలవండి."

"నువ్వూ నన్ను నువ్వు అనే అనాలి"

"యేమో!"

"నీకంటే నా అధిక్యత యేవిఁటి?"

"భర్తను మీరు అని పిలవటవేఁ నా కిష్టం. అలా అని, నువ్వు అని సంబోధించకూడదని కాదు. అలా పిలవాలనిపించిన సందర్భాలలో అలా అంటాను."

ముత్యాలహారం రెండు చేతులతో పట్టుకుని ఆమె మెడకి పెట్టబోయాడు.

"యిదేవిఁటి! యెవరి కోసవోఁ కొని, నాకిచ్చి వాళ్ళకి అన్యాయం

"యెవరి కోసవోఁ కొంటే నిన్నెందుకు యెన్నిక చెయ్యమంటాను గీతా!"

"అప్పుడసగా కొని జేబులో దాచుకోకపోతే—యేమో, యెందుకో!"

"నా జీవనరాణివి అవటానికి వొప్పుకుంటావో లేదో——అని" ఆమె మెడకి తగిలించాడు హారం.

"మంగళసూత్రం కడతారా, యిలా పూసల హారం తగిలిస్తారా!"

"బంగారపు తాళిబొట్టు కట్టి పొంగి పోదామనుకుంటే, నువ్వేగా——

 అనుభూతిసిగ్గెరుగదట

మ్మా, వొద్దన్నావ్!"

"సూత్రం వొద్దన్నానా నేను!"

"అట్లాంటి తంతు వొద్దనలే!"

"ప్రదర్శనశాల యేర్పాటుచేసి—మేమిద్దరం గొప్ప ఘనకార్యం చేస్తున్నాం, లోకాన్ని ఉద్ధరించబోతున్నాం, మీరంతా చూసి తప్పెట్లు చర చండి అని అరవటం, అనవసరం అన్నాను. అంతే. నా కెందుకో కుంకుమబొట్టు, పసుపుతాడు అంటే సెంటిమెంటు—యెందుకోగాని."

"గీతా—"

"వూఁ."

"నీ మాటలేకదు మనసు కూడా చిత్రమైంది. పద—వెళ్ళి సూత్రం కొందాం."

"యిప్పుడా! యేం తొందర!"

"యేడున్నరే కదా యిప్పుడు. పద. బజారు వెళ్ళి కొందాం యిప్పుడే" అంటూ లేచాడు.

ఆమె చెయ్యి అందుకుని పైకి లేపాడు, నడుంచుట్టూ చెయ్యివేసి దగ్గిరికి జరిగి, "గీతా!" అన్నాడు.

అతని కళ్ళ తళతళలో ఆమె ముఖం మెరిసింది. రెండు చేతులతో అతని ముఖం తడిమి, అరిచేతులు మెడకి పైగా తలమీద బిగించి అతని తల వొంచి, అతని పెదవులను తన పెదవులతో అద్ది, తడిపి—గట్టిగ ముద్దు పెట్టుకుంది.

దూరంనుంచి అటుకేసి యెవరో వొస్తున్నట్లు నీడగా అలికిడిగ అనిపించి విడిపోయారు.

"గీతా, నేనెంత అదృష్టవంతుణ్ణి!"

"అదృష్టాన్ని చెరికాస్త పంచకూడదూ!" అంది అతని ముఖంలో చూస్తూ.

ఆమె చేతిని తనచేతిలోకి తీసుకుంటూ, "గీతా; నా అదృష్ట అంతా నీదే. నువ్వు నా జీవిత సర్వస్వానివి. నా జీవనరాణివి!"

"వూఁ" అంది, ధ్వనిని మూడు వొంపులు తిప్పి.

అను:భూతిని గ్గెరుగదట

నాలుగు ఫర్లాంగులు నడిచి ఖాళీ బాడుగ్గాను కనిపించగానే పిలిచి కూర్చున్నారు.

మౌనంగా వుండిపోయారు.

టాక్సీ మహారాణీ పేట దాటుతోంది.

"పది తులాల మంగళసూత్రం తీసుకుందాం. నీకు నులకతాడు యిష్టమా, వేరే బిళ్లల గొలుసు యిష్టమా?" అంటూ ఆమె చేతివేళ్లను నిమురుతున్నాడు.

"వెడల్పాటి దళసరి సూత్రం బిళ్ళలు రెండు. వొక పసుపుతాడు."

"అదేవిటి, పసుపుతాడు వేసుకుంటే లేని వాళ్ళలా పేదగా వుంటుంది."

"పసుపు తాడునీ మల్లెపూవ్వునీ ఆణాపైసలతో విలువ కడతానా!"

"అని కాదు. పేదగా వుంటుంది"

"పేదతనం నేరంకాదు. కాగా పసుపుతాడు కళగా వుంటుంది. కానీ, వున్నవాళ్ళు ఆధిక్యతకోసం బంగారపు తాడు వేసుకుంటారు లేని వాళ్ళకి ఆ తాళ్ళు సాధ్యం కాదు. కాబట్టి పసుపు తాడు వేసుకుంటారు. యే కొందరో తప్పించి జనం అంతా ఇతరుల కళ్ళలోంచి జీవిస్తారనిపిస్తుంది నాకు"

"నువ్వు నిజంగానే చిత్రమైన దానివి గీతా! కానీ వున్నవాళ్ళు వున్నట్లుగా ఉండటం తప్పా!"

"అని కాదు. అందుకు వేరేనగలు వేసుకోవొచ్చు. రవ్వలు, పచ్చలు, కెంపులు—యెన్నో హారాలు, వేరే బంగారం నగలూ చేయించు కోవచ్చు ననుకోండి. వొక చిన్నరాయి కొన్ని కోట్ల రూపాయల కిమ్మత్తు చెయ్యొచ్చు యెన్నిలేవు!"

"గుడ్. అట్లా అయితే సూత్రాలతో పాటు పచ్చలహారం తీసుకుందాం"

"పచ్చలహారం యే పదివేలో అవుతుంది. దండగ"

"అని నేననుకోవటంలేదు. నువ్వు అలాంటి హారాలు యెన్నిటి కంటేనో విలువైన దానివి"

"అంత విలువైన మనిషికి ఇలాంటి హారాలటండీ. నెమ్మదిమీద యే కోహినూరు లాంటిదో తెప్పించి పెట్టాలిగానీ!" అని నవ్వింది.

వాళ్ళ సంభాషణ ఆలకిస్తున్న డ్రైవరు యెక్కడికని అడగకండా నేరుగా వో పెద్ద నగలదుకాణం ముందు ఆపాడు

"అప్పుడే వొచ్చేశాం" అంది

"కారుగదా. వేగంగా ప్రయాణం చేస్తుంది"

"మనసున్నా" అంది.

దిగి, పది నోటు తీసి, డ్రైవరికిచ్చాడు శివరాం. జేబులోంచి రూపాయి కాగితాలు తీసి లెక్కపెడుతున్న డ్రైవరితో "వుంచేసుకో" అన్నాడు.

రెండు చక్కని సూత్రం బిళ్లలు యెన్నికచేసుకుని, "చాలు" అని గబ గబా దుకాణం బయటికి వొచ్చేసింది గీతాదేవి

డబ్బుచెల్లించి బయటికి వొచ్చి, "గీతా యేంటిది? పోనీ వో సన్నటి అందమైన బంగారపు నెక్లెస్, లేదూ, వో మంచి వుంగరం——"

"అవన్నీ తరవాత,"

రెండు ఫర్లాంగులు నడిచారు.

"వొక్క నిమిషం. యిప్పుడే వొస్తా" అంటూ వో దుకాణంలోకి వెళ్ళింది.

అర్థంకానట్లుగా చూస్తూ నిలబడ్డాడు శివరాం.

మెట్లు దిగి వొచ్చి "యిదీ" అని చూపించింది. పసుపురంగు అల్లిక దారం.

మరో రెండు ఫర్లాంగులు నడిచి వో హోటల్లోకి వెళ్ళి అట్టగదిలో కూర్చున్నారు. యేమీ తినాలని లేదంది. రెండు కాఫీ చెప్పాడు. అతను తనతో బిగ్గరగా మాట్లాడుతూంటే "నెమ్మది" అంది

"యేం. యిందులో, యితరులు వినకూడని తప్పుమాటలేంలేవుగా!" అన్నాడు.

"వ్యక్తిగత విషయాలు ప్రత్యేకం యితరులకి వినిపించాల్సిన అవసరమూ లేదు" అంది.

అనుభూతిసిగ్గెరుగదట

దారం విప్పి—భుజాన వేళ్ళాడుతున్న స్టీలు చట్రపు చేసంచి తెరిచి ఆ రెండు సూత్రాలు తీసి నాలుగు పోగుల దారానికి గుచ్చి జముల్నా మూడు బెత్తల పొడవుకి ముడివేసింది.

ఆమె గుక్కవేసిన కప్పు అందుకుని తన కప్పులో కొద్దిగా వొంచుకున్నాడు ఆ పని యిదివరలో రెండు మూడు తూర్లు చేశాడు.

"పెదవుల తడి కలిశాక కూడా యీ పని విరమించలేదా మీరు" అని సన్నగా నవ్వింది.

మిగిలిన చిల్లర డబ్బులు పళ్ళెంలో వేసి పట్టుకుని వొస్తే తీసేసుకోమని పంపించి—లేచి నిలబడి, ఆమె చెయ్యి పట్టుకుని పైకి లేవదీశాడు.

లేచి, వొక అడుగు ప్రక్కగావేసి అతనికి దగ్గిరిగా వొచ్చి 'యిదో సిద్ధంగా వుంది. సూత్రం వేసెయ్యండి మెడలో'' అంది.

"మంగళసూత్రం మెడలో వెయ్యరు. కడతారు—మూడుముళ్ళు వేసి."

దూముడి లాగి, "యిదో అలాగే ముళ్ళు వెయ్యండి" అంది అతని చేతికి యివ్వబోతూ.

ఆమెకేసి వింతగా చూశాడు

"ఇన్నాళ్ళూ అదేదో ప్రేమ అంటూ కడవలకొద్దీ దిమ్మరించారు నామీద—తీరా, తాళికట్టండీ అని మంగళసూత్రం చేతికివ్వబోతే తటపటాయిస్తున్నారూ!" అని నవ్వింది.

నిశ్శబ్దంగా నవ్వుతూ, సూత్రం అందుకుని "నువ్వు నిజంగానే చిత్రమైన దానివి. కథల్లో మనిషిలాగా వున్నావు. తెలుగువాళ్ళల్లో నీలాంటి మనిషి వున్నట్లు ఎవరన్నా చెప్తే నమ్మకపోయి వుందును" అన్నాడు.

"నేను తెలుగుదాన్ననెవరు చెప్పారు! అనగా అనగా వో రచయిత రాసిన పుస్తకంలోంచి పారిపోయి వొచ్చినదాన్ని, ఆ పైన నా మాట నమ్మండి, నమ్మకపోండి" అని నవ్వింది.

తన గడ్డం ఆమె చెవి ప్రక్కగా ఆన్చి, తలవొంచి చూస్తూ, మూడుముళ్ళు వేస్తున్నాడు.

ఆనుభూతిసిగ్గేట

"ఆత్మసాక్షిగా" అంది.

"గీతా సాక్షిగా" అన్నాడు.

నవ్వింది; అతనూ నవ్వాడు.

బయటికి వొచ్చి కాలిబాటమీద నడుస్తున్నారు.

ఆ', "యింక మీరటూ, నేనిటూ" అంది.

"నన్ను విడిచి వొక్కడినే వెళ్ళిపోలేననిపిస్తోంది గీతా!" అన్నాడు ఆమెకి యెదురుగా నిలబడి.

"తప్పదు."

"యేం?"

"నాకూ మాత్రం యీ రాత్రి వొంటరిగా గడపాలని వుందనా! కానీ—కానీ—వెళ్ళొస్తాను మరి" అంది.

"గీతా!"

"ముందు యింట్లో చెప్పి "

"యెప్పుడైనా ఆ మాటే చెప్పాలిగా! యిప్పుడే చెప్పేస్తే పోదూ!" అన్నాడు.

"ముందుగా తెలియజేసి, ఆ తరవాత—"

"రెండూ వొకటే."

తలయెత్తి "పదండి" అని కనుబొమలెగరేస్తూ, అతని చేతిని తన చేతులోకి తీసుకుని నాలుగడుగులు వేసి—చెయ్యి వొదిలేసి వడివడిగా నడవ సాగింది

మనసులో యేదో సంచలనం వేగం కాళ్ళలోకి ప్రవహిస్తే—అడుగులు వేగంగా పడుతున్నాయి. తలవొంచి కుడిచేతి చూపుడు వేలితో, పొట్టకి పై భాగంలో సూత్రాలమీద నొక్కుతూ, తనకూడా మరొక వ్యక్తి లేనట్టుగా నడిచిపోతోంది.

ఖాళీ టాక్సీ యెదురైతే పిలిచాడు.

క్వార్టర్స్ దగ్గిరికి చేరేసరికి యెనిమిదిన్నర దాటింది.

"అదే యిల్లు. యెన్నిసార్లు రమ్మన్నా వొక్కసారికూడా వొచ్చావు కాదు!" అన్నాడు అడుగువేస్తూ.

అతని వెనక నిమ్మదిగా అడుగులు వేస్తోంది.

—యింకా కొద్ది క్షణాలలో చిన్న సైజు తుపాను చెలరేగుతుంది. అతను సాహసికుడిలా నిలబడాలి ఆ హోరులో. లేకపోతే- లేకపోతే—తను పూతీగలా అతనిని ఆధారం చేసుగుని—డాడీ, నీకూతురు యేం కాబో తోందో చెప్పు, డాడీ చెప్పండి—మీరే, యీనాడు నా చెంతనవుంటే...

కళ్ళలోకి వుబికిన తడి పవిట కొంగుతో అద్దుకుంది.

అతను మెట్లు యెక్కి లోనకివెళ్ళబోయి వెనక్కి తిరిగి చూశాడు. ఆ చూపులో యేదో వుద్వేగం.

మెట్లమీద కాళ్ళు తడబడి నిలుచుని పోయింది.

"అదేంటి గీతా, అట్లా నిలబడిపోయావు! రా" అన్నాడు, ప్రేమగా. ఆ గొంతు గుండెలోని సంచలనానికో, వుద్వేగానికో తొణికింది

సోఫాలమధ్య నిలుచుని "అమ్మా" అని పిలిచాడు.

తలుపు ప్రక్కగా చెప్పులు విడిచి, నిలుచుంది.

తల ప్రక్కకి తిప్పి, తన వెనకగా నిలుచున్న ఆమెకేసి వొక్క క్షణం చూశాడు.

లోని గదిలోకి ఆతురతగా చూశాడు. రెండు నిముషాల్లో యెదురుగా వున్న గదిలోంచి వొస్తూ, "రోజూ యింత పొద్దాయి వొస్తే నీ ఆరోగ్యం—"

అతని వెనకగా యెవరో స్త్రీ వుండటం గమనించి ఆగిపోయింది. మందంగా, నునుపుగా సన్నటి యెర్రంచు తెల్లచీర. తెలుపూ నలుపుజుట్టు. మొఖాన బొట్టులేదు. ముఖంలో వోపిక సడలినట్లు అనిపిస్తుంది

కనుబొమలు ముడిచి తేరిపార చూసింది

"అమ్మా యెవరొచ్చారో చూశావా? నీకు కోడల్ని తీసుకొచ్చానమ్మా." అని వొక అడుగు ప్రక్కకి వేశాడు.

గుమ్మందాటి ముందుకి రెండడుగులువేసి "నీ మాటల కేమొచ్చిలేరా. యెప్పుడూ వినేవేగా—మీ కంపినీలో పనిచేసే అమ్మాయెవరన్నా- అట్లా నుంచోబెట్టుకిపోతే కూర్చోమనలేవూ? నీకెన్నేళ్ళొచ్చినా మర్యాద చెయ్యటం రాదు". అని మందలింపుగా అంది.

"కాదమ్మా, నిజంగానే నీ కోడలు."

"నీ వేళాకోళాలు నా ముందేనా? సరే గానీ——"

ఆమె ముగించకుండానే, "వేళాకోళం కాదమ్మా, నేను చెప్పింది నిజమే. నామాట నమ్మవెందుకని?"

"యిన్నేళ్లొచ్చి నమ్మేమాటా నమ్మని మాటా తెలవదంటరా నాకు? రాధ పక్కింటికెళ్ళి యింకా రాకపోతే దొడ్లోకెళ్ళి పిలుద్దామనెళ్ళబోతుండగా నీ పిలుపు వినిపించి——"

"నా మాట నమ్మవెందుకమ్మా? మధ్యాహ్నం రిజిష్ట్రాఫీసులో పెళ్ళి చేసుకున్నాం. స్నేహితులు విందు యేర్పాటుచేసి బలవంతంగా కూచోబెడితే ఆలస్యమయింది. నిజంగానే నమ్మా, వొట్టు వెయ్యనా?"

"హోరి నేను నీ తల్లిని కాదంటరా—నీ టోకరాలో పడతానా! పోనీ వొట్టువెయ్యి చూస్తాను."

"నిజంగానే పెళ్లిచేసుకున్నాం. అమ్మా, నీ మీద వొట్టు."

యేదో అనాలన్నట్లుగా నోరు తెరచి——అలాగే మాటరాక, శివరాం ముఖంలోకి చూసి కోపంతో ఆమె కందిపోయింది.

"నీ పింతండ్రులూ. మేనమామలు, బోలెడు బలగం—కన్నతల్లిని నేనూ చచ్చాననుకున్నావురా——ఛీ——" ఆపైనమాటలు రానట్లుగా ఆగిపోయింది.

రెండు క్షణాలు యెవరూ మాట్లాడలేదు.

అతను గొంతు పెకలించుకుని యేదో అనాలనుకున్నట్లుగా ప్రయత్నిస్తున్నాడు.

"ఆయనే బతికుంటే——" ఆమెగొంతు దుఃఖపు తడితో నిలిచిపోయింది. కళ్ళలో తిరిగిన నీళ్ళు, పవిట కొంగుతో వొత్తుకుంది.

——డాడీ? యేమిటీ ఘట్టం—కులాసాగా గడవాల్సిన జీవితం—యిది యెలాంటి అధ్యాయపు ప్రారంభం డాడీ—కాళ్లు వొణకకపోతే వెనక్కి తిరిగి పరుగెత్తుకుని వెళ్ళిపోవాలనిపిస్తోంది...

రెండు నిమిషాలు గడిచాయి.

"నేనేమీ కానిపని చెయ్యలేదు. బజారు ముండని వెంటేసుకొచ్చా అనుభూతిసిగ్గెరుగదట

ననుకున్నావా? మంచి సంప్రదాయంతో, పరువు మర్యాదలతో బ్రతికిన వాళ్లు—మనకేం తీసిపోరు–యింతకంటె లక్షణమైన పిల్లలు నువ్వు దివిటీలేసి వెతికినా దొరకదు– అని; ఆయాసం వొచ్చినట్లుగా శ్వాస పీల్చుకున్నాడు.

"నువ్వేంచేశావో నీకేతెలవక కానిపనీ ఐనిపనీ అని నాకే చెప్తొ స్తున్నావూ, బుద్ధి లేక–ఛీ–" అని–కంటతడి పెట్టింది.

నేలమీదకి చూపువాల్చిన అతను, భయంలోంచి కోపంలోకి జారి, శ్వాసబలంగా పీల్చి, "ఐతే పొమ్మంటావు అంతేగా!" అని తల పైకె త్తాడు.

తల్లికేసి చూడకండా ప్రక్కకి తిరిగి వొకడుగు వెనక్కి వేసి–

మాట్లాడకండా గీతాదేవి కేసి రెండు క్షణాలు చూసింది.

ఢాకా నూలు చీర. నుదుట పెద్ద కుంకుమ బొట్టు. కళ్ళకి కాటుక. మెడలో నవరత్నాలహారం, ప్రక్కగా పసుపుదారం. వక్షం కిందగా చీర పొరలోంచి మెరుస్తున్న మంగళసూత్రాలు—

"పార్వతీదేవి కంట తడిపెడుతూ నిలబడటంయేవిటి" అన్న ట్లుగా తెప్పరిల్లి, "నువ్వు బుద్ధిలేక అవకతవక పెద్దరికం వెలిగించావని, యింటికి కోడలై వొచ్చిన సుమంగళిని పొమ్మనే అంత బుద్ధిలేని పని నేను చెయ్యనురా–" అని గీతాదేవి కేసిచూసి "అట్టాగే నిలబడి వుంటమ్మా" అనేసి లోనకి వెళ్ళిపోయింది.

మూడు నిమిషాల్లో యెవరో చిన్నపిల్ల హారతి పళ్ళెంతో డ్రాయిం గ్రూంలోకి వొచ్చింది.

గీతాదేవి అలాగే తల రవ్వంత కిందకి వొంచి నిలుచుని వుంది. అతను సోఫాకి అవతల, కిటికీలోంచి బయటికి చూస్తూ నిలుచుని వున్నాడు.

"అట్టా కిటికీలో మొకం పెట్టి యేం అఘోరిస్తున్నావు? అన్నీ అవలక్షణాలే. యిట్టా రా." అని పెద్దగా అంది, గుమ్మం అవతల తలుపు ప్రక్కగా నిలుచుని.

తల ప్రక్కకి తిప్పి చూసి– ఆశ్చర్యపోయి నవ్వు ముఖంతో చకచకా వొచ్చి గీతాదేవి ప్రక్కన నిలుచున్నాడు.

హారతి యివ్వటం అయ్యాక, ఆమె గుమ్మందాటి ముందుకు వొచ్చింది. ఆ చిన్న పిల్ల లోనకి వెళ్ళిపోయింది.

తల్లివైపు చూస్తున్న అతని చేతిమీద వేలితో నొక్కి—వొంగి నమస్కరించింది, గీతాదేవి

"అట్టా కూచోమ్మా, యిప్పుడే వొస్తా" అని చేత్తో సోఫాకేసి చూపి, వెనక్కి తిరిగి, గుమ్మం దాటి తలుపు ప్రక్కగా వెళ్ళి, వొక సారెట్టారా. శివా." అంది.

గీతాదేవి చెయ్యిపట్టుకుని సోఫా దగ్గిరికి నడిపించి—భుజాల మీద చేతులు వేసి నొక్కి కూర్చోబెట్టాడు.

వొంగి. "సారీ గీతా, నిన్ను బాధపెట్టాల్సొచ్చింది. యీ గాలి దుమారం పొద్దుటితో సిర్చిపోతుంది నాకుమల్లేనే మా అమ్మకి కోపం, తొందరా యెక్కువ. కానీ చాలా మంచిది." అన్నాడు హీనస్వరంలో రహస్యం చెప్పినట్లుగా.

ముఖం పైకెత్తి అతని ముఖంలోకి చూసి నిశ్శబ్దంగా నవ్వింది. నల్లరాతి మీద ఆరేసిన తెల్లమల్లు బట్టలా, బాధ చుట్టూ సంతోషం పొర కమ్మినట్లుగా వుంది, ఆ నవ్వు

"ఇప్పుడే వొస్తా" అన్నట్లుగా చూసి త్వరత్వరగా లోనకి అడుగులు వేశాడు.

గీతాదేవి గోడలకేసి వొకసారి నిర్లిప్తంగా చూసి, తలవొంచి చూపుడు వేలితో సోఫా బట్టలమీద రాస్తోంది. లోన గదిలోంచి మాటలు వినిపిస్తున్నాయి—

"అని నేననలేదు."

"నువ్వనేదేంటి, అనని దేంటి? నీ మొఖమే చెపుతాంది. అఖరికి యింత దిక్కులేని పెళ్ళి గంతైందా నీకు! అవు! హారతిచ్చే దిక్కుకూడా లేకుండా. ఆ ప్రక్కవాళ్ళ పసిదాన్ని పిలవాల్సొచ్చింది. నా చింతమ్మాడు కిష్టుడు, మనమెంత అడిగితే అంతా పోసి దాన్నిస్తానని తిరిగినా నీ తల కెక్కలేదు. సుజాత కేం తక్కువ? నీకంటే పెద్దచదువే చదివింది—పోనీ అది కాకపోతే యింకొకరు; ఎందరడగలేదు! వొక్కసారన్నా బుర్రతో అనుభూతిసి గ్గెయగదట

ఆలోచించావూ? సీ మొఖానికి చదువెట్టా అబ్బిందో! మొన్నటికి మొన్న కిష్టన్నడొచ్చి కదిపాడు. అసలు నేనూ—"

"సుజాతని చేసుకోదలిస్తే పదేళ్ళనాడే అయ్యుండేదిగా? అవన్నీ యిప్పుడు దేనికి?"

"ఇంతకీ వాళ్ళ దేవూరు."

"యేవోఁ తెలవదు."

"సీ మొఖానికి సిగ్గెట్టాలేదురా? యే వూరో యేంటో తెలవకుండా— హవ్వ! ఇంతకీ మన కులమేనా—లేక యే కిరస్తానీ దాన్నో వెంటేసు కొచ్చావా?"

"చూశావుగా, కిరస్తానీ దానికి మల్లే కనిపించిందా? నీ చిదిమి దీపం పెట్టొచ్చు నన్నట్టుగా వుండాలనే దానివని యెన్నిక చేసి చేసుకున్నాను. లక్ష్మీదేవికి మల్లే లేదూ? చెప్పు."

"మొఖాన పార్వతీదేవి కళ వున్నంతమాత్రాన వూరూ పేరూ లేని— ఇంతకీ మన కులమేనా?"

"తెలవదు."

"హవ్వ! నీ కియ్యేం నాశనం బుద్ధులురా—నువ్వింత చేసినాక నే నింకా యెట్టా ప్రాణాలతో బతికివున్నానో నాకే తెలవటంలేదు"

"యేం కులవోఁ అడగలేదు, కులాలు అడగటం సభ్యతకాదు."

"వోరి నీ సభ్యశోమండా. పెళ్ళిచేసుకోవాలన్నప్పుడన్నా అడగరం టూరా?"

"అవేమీ, అడగలేదు. అడగాలనిపించలేదు. తెలుగువాళ్లు. తల్లి చిన్నప్పుడే పోయింది తండ్రి మూడేళ్లనాడో యేవోఁకారు ప్రమాదంలో చనిపోయాడు"

"ఐతే వొక దిక్కూలేనిదాన్ని వెంటేసుకొచ్చావన్నమాట! సిగ్గె య్యటం లేదురా నీకు నా ముందు నిలబడి అట్టా చెప్పటానికి?"

"నిమ్మదిగా మాట్లాడు. వింటే బాధపడుతుంది."

"యెవరూ బాధపడొద్దనుకునే వాడివి యిట్టాంటి పనేనా చేసేది? అసలు నీకేం ఖర్మొచ్చిందిరా? యింటిల్లపాదినీ బాధపెట్టటానికొక పోతే

అనుభూతిసిగ్గెరుగదట

యిట్టాంటిపని ఎవడు చేస్తాడంట! హవ్వ! నా కొడుకు దిక్కులేనిదాన్ని వెంటవేసుకొస్తాడని, కల్లోకూడా అనుకోలేదు."

"దిక్కులేనిదేంకాదు. చదువూ సంస్కారం వుంది. సుజాత పనిచేసే కాలేజీలోనే పనిచేస్తోంది వాళ్ళనాన్న వుద్యోగరీత్యా చాలా యేళ్ళ నాడు అటు బొంబాయి, ఢిల్లీ వైపు వెళ్ళిపోయారు మన జిల్లాల్లో యెవరికీ తెలవరు వాళ్ళు. కానీ గొప్పగా బ్రతికినవాళ్ళే. నీ ఆస్తినీ కొడుకునీ చూసి వలలు పన్ని యిక్కడికి చేరుకోలేదు. నేనే కావాలని అడిగి చేసుకున్నాను. బికారిదనుకున్నావా?"

"అది సర్లే. చేసుకోదలిచిన వాడివి దొంగల్లే యిట్టా చేసుకోకపోతే తిన్నగా చెపితే లక్షణంగానే జరిగేదిగా వొక్కగానొక్క బిడ్డవి తండ్రి లేని లోటు రాలేదనిపించుకునేటట్టుగా వైభవంగా నీ పెళ్ళి జరపాలని నేననుకుంటే, ఓవరికి నా భాగ్యం యిట్టా మండిందన్నమాట."

"ముందుగా చెప్తే పెద్ద రాద్ధాంతాలు మొదలెడతావని—రిజిష్ట్రాఫీసులో—"

"ఛీ. సిగ్గులేకుండా వాగుతున్నావా యింకా. నువ్వు నా ముందు నోరెత్తటానికి లేదింకా. ఛండాలప్పని చేసి యింకా యెదురు జవాబులు చెపుతున్నావా?"

"సరే అట్లాగే. మాట్లాడకుండా కూర్చుంటాలే."

రెండు నిమిషాల నిశ్శబ్దం.

"సరే అయిపోయిందేదో ఐపోయింది గానీ యింతటితోనన్నా సిగ్గు చేటు పనులు కట్టిపెట్టి నేచెప్పినట్లు విను—మన కులంపిల్ల అనే చెప్పు అందరితో. యేకాలంనాడో దేశాలెంట పోయారన్నావుగా, ఫరవాలేదు."

"యిప్పుడు తనది మన కులంకాదని మాత్రం యెట్లా తెలుసు?"

"వాగమాక. మొఖం చూస్తే తెలవదురా! నీ మొఖానికి యేవీ తెలవొకపోగా, అడిగి తెలుసుకునే జ్ఞానంకూడా లేదు, నీ కసలు ఆ వుద్యోగం యెట్టా యిచ్చారో గానీ-"

"రేపు మా ఆఫీసుకొచ్చి అడుగు యెందుకిచ్చారో చెప్తారు. నీకు లోకువని, అందరికీ విలువతక్కువవాణ్ని కాదు."

అనుభూతిసిగ్గరుగదట

"సిగ్గుచేటు పనులు చేశావని తెలిస్తే నాకే కాదురా లోకమంతటికీ లోకువే అవుతావు—సరేగానీ—యీమధ్య కొత్తఫేషన్లు మొదలెట్టారుగా—నామాట చెవిని పెట్టకుండా పురోహితుళ్లు తలంబ్రాలూ యేంటని రిజిష్టారాఫీసులో చేసుకొచ్చాడు, అని యేదోచెపుతాను నలుగురికీ. నువ్వు యిక నుంచీ ఐనా సిగ్గుచేటు పన్లుచేయ్యమాక. మన వంశమేంటీ నువ్వుచేసిన పనేంటీ—అప్పు యెంత సిగ్గుచేటురా."

"మన డ్రాయింగు రూంలో యెవరో వొకావిడ కూర్చునుంది, యెవరు పెద్దమ్మా?"

"యింతసేపంటే యిళ్ళెంట తిరిగి రావటం? గాలి తిప్పట్లు సేప్పుకున్నావంటే పీపు చిట్లగొడతాను వేళకి, యింత హారతిప్పించుదామంటే డిక్కులేకుండా అయ్యాను——"

"కాదుపెద్దమ్మా, యివ్వాళ రేడియోలో మంచి నాటిక వొస్తోంది. కామేశ్వరీ వాళ్ల యింట్లో కూర్చుని వింటున్నా. శివన్నయ్యేంవో రేడియో ముట్టుకుంటే చేతులు విరగొడతానన్నాడు. నేనసలు రేడియో పాడుచేస్తానాయేంటి! నాకు రేడియో పెట్టటం రాదా! నేను పసిపిల్లనా యేంటి?"

ఫక్కున నవ్వి, "కాదమ్మా; నువ్వు పెద్దదానివే. శివన్నయ్య కేపీ తెలవదులేవే. లంగాలమీద పమిటలు కూడా యిక వేస్తావుగా."

"పో పెద్దమ్మా, నువ్వెప్పుడూ శివన్నయ్య పక్షే"

"వోసి నీ సిగ్గు బంగారంగానూ, యిట్టా రావే."

"మరి డ్రాయింగు రూంలో కూచునున్న దెవరు పెద్దమ్మా?"

"అవిడగారూ—"

"రాధీ, నే చెప్తా రావే—నీకు వొదినవ్వుతుంది"

"నాకు నా వొదినలందరూ తెలుసులే అయ్యా; పెద్ద చెప్పొచ్చావ్, చెప్పు, పెద్దమ్మా, యెవరు? భలే చీర కట్టుకుంది."

"చెప్పానుకదే రాధీ—నా భార్య నీకు వొదిన అవక యేమౌతుందే."

నవ్వి, "పెళ్ళికాకుండా భార్యయెట్లా అవుతుందయ్యా. నాకేం తెలవదనుకున్నావా?"

అనుభూతిసిగ్గెరుగదు

"ఔరే శివా, నీకు ఆ చిన్నపిల్లకున్నంత జ్ఞానంకూడా లేకపో యిందిరా."

"కాదే రాధీ, రిజిస్ట్రాఫీసులో పెళ్ళిచేసు కొచ్చాం."

"ఆఫీసులో పెళ్ళిళ్ళు చేసుకుంటారేంటెక్కడన్నా?"

"ఆఫీసంటే పెళ్ళిళ్ళ ఆఫీసు. అప్పుడూ, పోయిన యెండాకాలం ఒక మావయ్యని తీసుకొచ్చాను గుర్తుందా. అట్లాగే పెళ్ళిళ్ళ ఆఫీసులోనే చేసుకున్నాడు. నేను అతనినీ, ఆ అమ్మాయినీ యింటికి పిలుచుకొచ్చాను చూడు—నువ్వు ఫలహారం కాఫీ యిచ్చావు అట్లా అన్నమాట."

"యేం పెద్దమ్మా నిజమా?"

"నిజమేనమ్మా."

"ఓహో హో"

"పాట పాడేదానివి తిన్నగా పాడు. మన వూళ్లో రేడియో స్టేషను పెట్టబోతున్నారు నిన్ను తీసుకెళ్ళి అందులో పాడిస్తాను. రా, వొదినని సరిగా చూద్దువుగాని."

చిన్నపిల్ల చెయ్యిపట్టుకుని వొచ్చాడు శివరాం

తొందరపాటుగా పవిటతో కళ్ళతడి వొత్తుకంది, గీతాదేవి.

"వొదిన యేడుస్తోంది మరి?"

"మరి, వాళ్ళ అమ్మానాన్నలను విడిచిపెట్టి మన యింటికి వొచ్చేసిందిగా—అందుకని. నిన్ను మీ యింటినుంచి యీ వూరు తీసుకొచ్చినప్పుడు, నువ్వు రెండు రోజులు యేడుస్తూ కూర్చోలేదూ——"

"యెక్కడమ్మా, వొక్క రోజేగా?

గీతాదేవి దగ్గరగా తీసుకుని వెళ్లి, "చెప్పానే, మాపింతండ్రి కూతురని—" అన్నాడు.

"రా అమ్మా; కూర్చోయిబ." అని భుజం దగ్గిర చెయ్యివేసి ప్రక్కన కూర్చోబెట్టుకుంది గీతాదేవి.

అతను కిటికీ దగ్గిరికి వెళ్లి బయటికి చూస్తూ నిలుచున్నాడు.

"నీ పేరు యేమిటమ్మా?" అడిగింది ఆప్యాయంగా.

"అనురాధ."

"అనూరాధ యెంతో చక్కని పేరు. నువ్వే పెట్టుకున్నావా పేరు?"

"వూఁహూ, మా రవణన్నయ్య పెట్టాడంట."

"రవణన్నయ్య యెవరు?"

"రవణన్నయ్యే తెలవదా నీకు? రంగ బాబాయిగారబ్బాయి. నువ్వు మా చీరాలెప్పుడూ రాలేదు కదూ. యీసారి వొస్తే అందరినీ చూపిస్తాను. మాకు భలే మామిడి తోటుందిలే."

"మామిడి కాయలు పచ్చివి తిన్నావా యెప్పుడైనా?"

"బోలెడు తినేదాన్ని వూళ్ళో. శారదా, నేనూ వెళ్ళేవాళ్ళం, గోపి వెధవ కోసిచ్చేవాడు. వాణీ కొంగులో కారం వుప్పు కట్టుకుని తెచ్చేది శారద..."

"యేం చదువుతున్నావు?"

"మూడో తరగతి."

"నీకు చదువు బాగా వొస్తుందటగా?"

"యెవరన్నారు?"

"మీ—శివన్నయ్య చెప్పారులే"

"మా—శివన్నయ్య భలే దొంగ. నాదగ్గిరేవో వుత్త చదువురాని మొద్దు నంటాడు, వేరే వాళ్ళతో నేవో అట్లా చెపుతాడు." అని గీతాదేవి కేస్సి పరీక్షగా చూసి "ఆ పగడాల దండ భలే బాగుంది" అంది.

"పగడాలది కాదమ్మా—యిది ముత్యాలహారం. నీకు బాగుందా, పెట్టుకుంటావా?" అని తియ్యబోయింది.

"వొద్దు శివన్నయ్య కోప్పడతాడు."

"మీ శివన్నయ్య కొన్నదేలే. సాయంత్రం, మా చెల్లాయి అనూరాధకి మంచిహారం కొనాలంటే నేనే చూశాను. నీకు బావుంటుందని చెబితే తీసుకున్నారు." అంటూ, అనూరాధ మెడలో వేసింది.

గబుక్కున లేచి ఛెంగున గెంతి శివరాం దగ్గిరికి వెళ్ళి, "చూడు శివన్నయ్యా. నాకు బాగుందలా యిది?" అంది సంతోషంతో.

తల ప్రక్కకి తిప్పి చూసి, "వూఁ బాగుందిలే పో" అని గదమా

యించాడు. "నువ్వేగా అయ్యా నాకని కొన్నదీ—యిప్పుడేవోఁ పేద్ద—" అనుకుంటూ తల వొంచి, చేత్తో పట్టుకుని హారంతేసి చూసుకుంటూ వొచ్చి కూర్చుని, "నువ్వు మంచి వొదినవు. మా కౌసల్యొదిన కూడా యెప్పుఁ తిడతంది నన్ను." అంది, సిదానంగా.

గీతాదేవి చేసంచి మీద వేళ్ళువేసి తడుముతోంది అనూరాధ.

"బావుందా అనూ?"

"వో అందులో యేముంటాయ్?"

"అందులోనా—కాగితాలూ, కలం, డబ్బులూ."

"దేనికవన్నీ?"

"దేనికా- అవీ—కాలేజీలో చదువుచెబుతానుగా అందుకు"

"అవును మా సుజాతొదినకి కూడా వుంది. హేండ్బేగ్. అది యిట్లాంటిదికాదు. రంగురంగుల పూసలది."

"అవును నేనూ, మీ సుజాత వొదిన చెప్పే కాలేజీలోనే చెబుతాను."

"అట్లాగా! మరి సుజాతొదిన వొక్కసారీ చెప్పలేదూ?"

"నువ్వు అడగలేదుగా—అందుకని."

"మరి అడగటానికి; నువ్వూ అక్కడేనని నాకు తెలవదుగా—మా సుజాతొదిన లెక్చరర్." అంది కళ్ళు పెద్దవి చేసి.

"నేనూ లెక్చరర్నేనమ్మా, అనూ."

"నిజం?" ఆశ్చర్యంతో. సంతోషంతో అడిగింది—లెక్చరర్ అంటే యెంతో గొప్ప అన్నట్లుగా ఆ ముఖంలో అమాయకత్వం.

"నిజమేనమ్మా—అబద్ధం దేనికి చెబుతాను!"

"మా శివన్నయ్య అబద్దాలు చెపుతాడు నాతో."

"మరి, అబద్ధాలాడొచ్చునా?"

"ఉఁహూఁ. అబద్దాలంటే—అబద్దాల కోరు అనికాదు. నన్ను వుడికిలించటానికి ఆట పట్టించటానికి చెపుతాడు. అంతే."

"శివన్నయ్య అంటే నీ కిష్టమా?"

"యిష్టమేగానీ—తిట్టినప్పుడు కచ్చి పుడతంది నాకు" అంది కసిగా అనుభూతిని గుర్తుగదట

నవ్వి "నువ్వు చాలామంచి పిల్లవమ్మా అనూ" అంది.

"మా మాస్టారుకూడా అట్లాగే అంటారు నన్ను. వొకసారి యేమైందంటే–" అని బళ్లో విషయాలు చెప్పుకుపోసాగింది

"అబ్బాయ్, శివా, వొకసారి యిట్రారా?"

శివరాం, వినిపించుకోలేదు తల్లి పిలుపు.

"శివన్నయ్యా, పెద్దమ్మ పిలుస్తోంది నిన్ను" అని గట్టిగా అంది అనూరాధ.

దీర్ఘంగా శ్వాస విడిచి, బరువుగా అడుగులు వేస్తూ తాపీగా లోనకి వెళ్లాడు శివరాం.

"తొమ్మిదైంది, తిండీ తిప్పలూ లేవా?"

మౌనం.

"యేంటా చూపు, వెంకడి మల్లే–వొడ్డించొద్దంటావుగా. బల్లమీద అన్నీ పెట్టాను"

డ్రాయింగ్రూంలోకి తిరిగివొచ్చి, "గీతా" అని యేదో అనబోయాడు.

"గీతంటే?" అడిగింది, అనూరాధ.

నవ్వి, "మా వొదిన పేరు గీతాదేవి" అన్నాడు.

"మా మాస్టారు చెప్పారు, గీతంటే లెక్కల పుస్తకంలో గీత కాదంటా–భగవద్గీతంట. పెద్దవాళ్లు చదివే పుస్తకం అంట."

"గీతా. లే భోంచేద్దాం."

"యింకా అన్నం తినలేదా మీరు, పడుకునే టైం ఐతే!" అంది అనూరాధ.

"నువ్వు భోంచేశావా, అనూ?" అంది గీతాదేవి.

"వో, యేడింటికే తిన్నాను."

"వూఁ, గీతా–" అసలు లేవమన్నట్లు కళ్ళతో సూచించాడు. "ఆకలిగా లేదండీ" అంది.

"అట్లాగే వుంటుందిలే. రా, నాలుగు మెతుకులు నంజుదువుగాని–"

గీతాదేవి లేవకండా అతనికేసి చూస్తూ వుండిపోయింది.

వొకక్షణం ఆమె కళ్ళలోకి చూసి, చూపు కిందకి వాల్చి, "పోనీ నాకు తోడు కూర్చుందువుగాని, రా" అన్నాడు

"ఆకలెయ్యకపోయినా తినకపోతే నన్ను వూరుకోదు పెద్దమ్మ" అంది అనూరాధ.

అనూరాధ చెయ్యి పట్టుకుని లేచింది, గీతాదేవి.

ముగ్గురూ భోజనాల గదిలోకి వెళ్లారు.

రంగా సీడలు తేలుతూన్న లేమినేటెడ్ బల్ల, తెల్లప్లాస్టిక్ పట్టీ అల్లిన కొయ్యకుర్చీలు, తెలివుక్కు పాత్రలు.

కూర్చున్నారు. యిద్దరి పళ్లాలలో, తనే అన్నం వొడ్డిస్తున్నాడు. వొకసారి వెయ్యగానే వేళ్లు పొడవుగా చాపి పళ్ళెనికి అడ్డంగా పెట్టింది చెయ్యి.

అనూరాధ, గీతాదేవి ప్రక్కగాకుర్చీకి ఆమెకి ఆనుకుని నిలుచుంది.

అన్నం కలపి, వొక ముద్ద నోట్లో పెట్టుకుని, యిసకలో వేలితో గీచినట్లు, పళ్ళెంలో వేళ్లు కదుపుతోంది గీతాదేవి.

అనూరాధ, తన పుస్తకాలు, వాటిలోని పాఠాలూ, బొమ్మలగురించి చెబుతూ చెబుతూ, "ఆ బొమ్మ భలే బాగుంటుంది, చూపిస్తానుండు" అని కుర్చీ అవతలికి గెంతింది.

"అన్నం తినేటప్పుడు నీ వెధవ పుస్తకాలు తీసుకురాకు" అన్నాడు గట్టిగా.

వినిపించుకోకండా, గది బయటికి వెళ్ళిపోయింది.

"గీతా, నిన్ను బాధపెట్టాల్సి వస్తోంది తప్పదు. నేనేమీ చెయ్య లేని స్థితి. పొద్దుటికి అంతా ప్రశాంతంగా ఐపోతుంది."

"మీరు చెయ్యాల్సినదంతా చేశారు మీకు నా కృతజ్ఞతలు తెలుపు కోవాల్సి వుంది. నేనేమీ బాధపడటంలేదు."

"నువ్వెంతో దిగులుగా కనిపిస్తున్నావు."

"కొత్త. మరికొన్ని సంచలనాలు. యింతకే దిగులు పడిపోతే జీవి తాన్నేం యెదుర్కోగలను?"

పుస్తకం తీసుకు రాకండా వొచ్చి, గీతాదేవి పక్కగా నిలబడి, వొక అనుభూతిసిగ్గెరుగదట

నిమిషం యిద్దరివైపూ చూసి, గంటె తీసుకుని వొడ్డిస్తోంది అనూరాధ.

"వొద్దు" అన్నట్లుగా యెడమ చేత్తో అనూరాధ చేతిని మణికట్టు దగ్గిర పట్టుకుని, "పుస్తకం తీసుకురాలేదేం, అనూ?" అంది గీతాదేవి.

అనూరాధ మాటాడలేదు.

"యేం, మీ శివన్నయ్య వొద్దన్నారనా?"

"కాదు—మరీ—"

"చెప్పమ్మా, నేను కోప్పడనుగా నిన్ను" అంది, గీతాదేవి, ఆనున యిస్తున్నట్లుగా!

"మరీ, నేనేవో పుస్తకం తీసుకొస్తున్నాను—వంట గది అవతలగా పెద్దమ్మ నుంచుంది, నన్ను చూసి పిలిచి పుస్తకం తీసేసుకుని—మీ వొదినకి అన్నీ సరిగా వొడ్డించు వెళ్ళి అంది" అని రహస్యం చెప్పినట్లుగా హీన స్వరంతో అంది, అనూరాధ.

అతని కళ్ళు మిలమిల మెరిశాయి.

ముక్కు తుడుచుకుంటున్నట్లుగా పవిట కొంగు అడ్డం చేసుగుని కళ్ళ తడి వొత్తుకుంది గీతాదేవి.

"గీతా నీకు నచ్చవేమో యీ రుచులు" అన్నాడు.

"నాకు నచ్చని రుచులు అంటూ లేవు. అయ్యరు నుంచి యిరానీ వరకూ అన్నీ చెల్లుతాయి" అంది.

"మరి అప్పుడే ముగించేశావ్?"

"తిన్నాను, చాలు, మీరు కానివ్వండి" అని లేచి యెడమ చేత్తో అనూరాధ చెయ్యి పట్టుగుని "పళ్ళాలు యెక్కడ కడిగేదీ చూపెడతావా, అనూ"—అంటూ కుడిచేత్తో పళ్ళెం తీసింది.

"వొద్దు పళ్ళెం యిక్కడే వుంచేసెయ్యి దాంట్లోనే చెయ్యి కడిగేసుకో" అంది అనూరాధ.

"నీకు తెలియదమ్మా, చిన్నదానివి. పద. చూపించుదువు" అని కదలబోయింది.

"పెద్దమ్మ కోప్పడుతుంది నన్ను."

"దేనికమ్మా—కోప్పడదులే. నీకు తెలియదులే అనూ—"

అనుభూతిసి గైరుగదట

"కాదూ యిందాకే చెప్పింది, అన్నీ వొడ్డించి, చెయ్యి కడుక్కోటానికి నీళ్ళిమ్మని"

"యిద్దరమే కదా అని వూరినుంచి పని పిల్లని తెచ్చుకోలేదు కాగా, అమ్మకి యిష్టంలేదు తనేచేస్తుంది అన్నీ పనులూ. పొద్దుటా సాయంత్రం పనిమనిషి వొచ్చి అంట్లూ పాచీ చేసివెళ్తుంది. పళ్ళెంలో కడిగేసుకుని అక్కడే వుంచేసెయ్" అన్నాడు శివరాం.

"నేను రాణివాసంలోంచి రాలేదులెండి. వంటా వార్పూ చేసిన దాన్నే" అని అడుగులు వేసింది.

అనూరాధ ప్రక్కగా నడుస్తూ, వంటగది ప్రక్క వరండాలో కొళాయి దగ్గిరికి నడిచింది, గీతాదేవి.

వంటగది గుమ్మంలో నిలబడి, యేమనటానికీ యేంచెయ్యటానికీ తోచనట్లుగా చూసి—కొళాయి దగ్గిరికి వొచ్చి "చదువుకున్న పిల్లలు—మీకేం వొస్తుందమ్మా కంచాలూ అవీ కడగటం, యిట్లాతే" అని గీతాదేవి చేతిలోని పళ్లెం తీసుకుంది

యివ్వకపోతే బాగోదనిపించి—చెయ్యి కడుక్కుని నిటారుగా నిలుచుని, "చిన్నప్పటినుంచీ వంటా వార్పూ నేర్చుకుని చేశాన త్తయ్యగారూ—యెటొచ్చీ యీ మూడేళ్ళనుంచీ హాస్టళ్ళలోవుండి—" అని ఆగిపోయింది గీతాదేవి.

ఆమె పళ్లెంకడిగి నిటారుగా నిలుచుని ప్రక్కకి తిరుగుతోంది.

అనూరాధ, తువ్వాలు తీసుకొచ్చి గీతాదేవి కిచ్చింది.

తువ్వాలు అందుకుని, వేళ్ళతో గడ్డం పుణికి. "చాలా చురుకైన పిల్ల." అంది గీతాదేవి ఆమెవైపు తిరిగి.

"యీ కాన మా మూడోమరిదికి లేక లేక యెన్నాళ్ళకో కలిగింది. అబ్బాయికి యిదంటే తగని ప్రేమ. అందుకని గోలచేసి తీసుకొచ్చాడు కిందటేడు" అంది ఆమె.

"అమ్మా," భోజనాల గదిలోంచి శివరాం పిలుపు.

"అబ్బాయి పిలుస్తున్నాడు. వస్తానమ్మా" అంటూ వెళ్ళిపోయింది ఆమె.

ఆనుభూతిసిగ్గరుగదట

దీర్ఘంగా. యేదో బరువు దిగిపోయినట్లుగా శ్వాస విడిచి—డ్రాయింగ్రూంలోకి నడిచింది గీతాదేవి. ఆమె ప్రక్కనే అడుగులువేస్తూ, పవిట కొంగునవున్న జరీని వేళ్ళమధ్య కదుపుతూ, కూడా వెళ్ళింది అనూరాధ.

గీతాదేవికి ప్రక్కగా ఆమెను ఆనుకుని కూర్చుని కబుర్లు చెబుతోంది అనూరాధ.

పది నిమిషాలకి శివరాం వొచ్చాడు, రాత్రి డిరీసు వేసుకుని, రంగు చారల పైజామా చొక్కా- వాళ్ళిద్దరికి యెదురుగా సోఫాలో కూర్చుని వింటున్నాడు.

మరో పది నిమిషాలకి తను చెప్పటం మాని వాళ్ళిద్దరి సంభాషణ వింటూ, జోగుతూ చూస్తూ కూర్చుంది.

మరో ఐదు నిమిషాలకి ఆమె కుడి రొమ్ముకు చెక్కిలి ఆన్చి నిద్రపోయింది అనూరాధ. పట్టుకుని లేచి సోఫాలో పడుకోబెట్టి-అంచు మీద కూర్చుంది గీతాదేవి.

"రాధా, యింకా నిద్రరావటం లేదంటే. పడుకోవా, యిట్టా. రా." అంది అతని తల్లి, లోని గదిలోంచి.

లేవబోయినట్లుగా కదిలి, "యిక్కడ సోఫామీద నిద్రపోయిందమ్మా." బిగ్గరగా అన్నాడు శివరాం

"నేను దాన్ని మొయ్యలేనుగానీ, కాస్త యెత్తుకొచ్చి దాని పక్కమీద పడుకోబెట్టు శివా."

"వూఁ" అని గట్టిగా దీర్ఘంతీసి, లేచి, అనూరాధను చేతులలోకి తీసుకుని వెళ్లాడు.

డ్రాయింగ్రూంకేసి పరిశీలనగా చూసింది గీతాదేవి. నాలుగు కొయ్యసోఫాలు ముదురు ఆకుపచ్చమీద గజిబిజిగా నేతలో వొచ్చిన పువ్వులలాంటి గుండటి ముదురు నీలం చారికలవి.

వొక గోడమీద కాల్టెక్సు కేలండరు. మరో గోడమీద నీటిరంగుల ప్రకృతి దృశ్యం పటం.

లోన వంటగది ప్రాంతంలో మాటల అస్పష్టపు గజిబిజి.

మనసులో మంగళంపల్లి బాలమురళీక్రిష్ణగానం వినిపిస్తోంది.

అనుభూతిసిగ్గెరుగదట

కనురెప్పలు వాల్చింది.

"గీతా నిద్రొస్తొందా?"

కనురెప్పలు విప్పి పావురం రెక్కలల్లాడినట్లు అదిల్చి అతని ముఖంలోకి చూసి, దరహాసంతో "లేదు" అన్నట్లు తల తిప్పింది.

దగ్గరికి నడిచి భుజం మీద చెయ్యివేసి, "రా. వెళ్దాం" అన్నాడు. మౌనంగా అతని వెంట నడిచింది.

పడక గది.

పెద్దమంచం. ఫోం పరుపు, దిళ్ళు. లేత ఆకుపచ్చ రంగు దుప్పట్లు. తెల్లని దోమతెర.

వొక ప్రక్కగా యినప బల్ల—వొకవైపు నేలవరకూ సొరుగులు, అడుగునా వెనకా పేము అల్లిన యినప కుర్చీ—కాళ్ళులేకండా తీగవొంచి తయారించినది. యేవో కాగితాలు, రెండు మూడు పుస్తకాలు. వో తెలుగు వారపత్రిక. కలం, పెన్సిళ్ళు, తదితర సరంజామా. చే గడియారం, నల్ల ద్దాల కళ్ళజోడు.

కిటికీ దగ్గర చిన్న ముస్తాబు బల్ల— కొయ్యది. మూడడుగుల యెత్తు అద్దం లేత ఆకుపచ్చరంగు ప్లాస్టిక్ బుట్ట, ఆయ బాండుల రేడియో. తల బ్రష్షు, దువ్వెనలు స్నో, పౌడరు. రెండు రకాల తలనూనె సీసాలు. తదితర ముస్తాబు సామగ్రి

వొక గోడకి కిర్లోస్కర్ కేలండరు. మరో గోడకి స్నానపు దుస్తుల్లో పాశ్చాత్య స్త్రీ బొమ్మ వున్న యూనివర్సల్ ఆటోమొబైల్స్ కేలండర్ మరో గోడకి బేలూరు యక్షిణి శిల్పానికి ఛాయాచిత్ర పటం మరో గోడకి బీకాం, బీయెం డిగ్రీల పటాలు.

వొకప్రక్కగా వో పేముకుర్చీ. మరో ప్రక్కన యినప బీరువా.

ఆమెకేసి చూసి, "వంటరిగాణ్ని మో, అలక్ష్యంగా వుంది గది. నీ అభిరుచి ననుసరించి అలంకరణ చేద్దువుగాని నిమ్మదిమీద" అన్నాడు.

"లేదు. బాగానే వుంది" అంది.

గీతా, కూర్చో—సాయివాళ్ళ గదిని చూసినట్లు చూస్తున్నావ్" అంటూ ఆమె దగ్గిరికి వొచ్చి వీపుచుట్టూ చెయ్యివేసి- మంచం వెపు అనుకూలిసి గ్గెరుగదట

నడిపించబోయాడు.

"కాసేపు అలా కుర్చీలో కూర్చుంటాను" అంటూ రెండడుగులు వేసి పేముకుర్చీ ముందుకు లాక్కొని కూచుంది.

ఆమెకుర్చీ వెనక్కి వెళ్ళి వొంగి భుజాలమీద చేతులు ఆన్చి, కుడి చేతి మణికట్టు వొంచి, చూపుడువేలు ఆమె గడ్డంకేసి వొత్తి, ఆమె ముఖంపైకి జరిపాడు.

ఆమె ముఖంమీదకి వొంగిన అతని ముఖంలోకి చూసి, అతని నుదిటిమీద పెదవులు అద్ది—కుర్చీ పై అంచుమీద తల అన్చి రెప్పలు వాల్చింది.

"వోల్టిన్ తాగుతావా?" అన్నాడు,

"యిప్పుడేమీ వొద్దు"

నాలుగడుగులు వేసి యినపకుర్చీ ముందుకు లాక్కొని ఆమెకి యెదురుగా కూర్చున్నాడు.

"యెట్లాగో వున్నావు గీతా—వొక రోజు ముందుగా విషయం మా అమ్మకు చెప్పి గాలిదుమారం తగ్గినాక నిన్ను తీసుకొచ్చి వుంటే నీకు యీ బాధ వుండకపోయేది. తొందరపడ్డాను"

"నాకు బాధేమీలేదు. అలసట- అంతే—పొద్దుటికి తేరుకుంటాను"

"పోసి పడుకో అలసట తీరుతుంది"

"నాకు నిద్రరాదు పెందరాళ"

"గీతా నీతో వొక విషయం మాట్లాడాలి"

"చెప్పండి—'

"నువ్వు అలిసిపోయి వున్నావు"

"యేదో సంచలనంవల్ల కలిగిన అలసట. అంతే సాధారణంగా ప్రొద్దుపోయేవరకూ నాకు అలసటకలగదు. చెప్పండి"

మౌనంగా వుండిపోయాడు, యెలా ప్రారంభించాలో చాతకా ప్లుగా.

"చెప్పండి!"

"మన యిద్దరికీ పట్టింపులు లేకపోయినా కొన్ని పనులు యితరుల

అనుభూతిని గైరుగదట

కోసం చెయ్యాల్సి రావొచ్చు" అని వొకక్షణం ఆగి; "మా అమ్మ అంది నీది మా కులమేనని చెప్పమని" అని ఆమెకేసి చూశాడు.

"మంచిదే, అలాగే చెప్పండి" అంది, అతని పాదాలకేసి చూస్తూ.

"అసలు నీది—" ఆగిపోయాడు.

"యే కులం అనేగా—ఆ మాట అడగటానికే వెనకాడటం దేనికి?"

"నా కట్లాటి పట్టింపులు లేవుగాని—అమ్మ చుట్టాలూ—"

"నాది మీ కులం అనే చెబుతాను, ప్రత్యేకించి చెప్పాల్సిన అవసరం కలిగితే. మీకా భయం అక్కర్లేదు"

"అసలు నీది—"

నిశ్శబ్దంగా నవ్వి, "కులం లేనిదాన్ని" అంది

"నువ్వు కావాలని అట్లా చిత్రంగా మాట్లాడతావేమో ననుకున్నాను. అసలు తీరు అంతేకాబోలు ననిపిస్తొందిప్పుడు. కులం లేనిది బోగంవాళ్లు" అని లేచి వెళ్లి తలుపుదగ్గిరగా నొక్కి వొచ్చాడు.

"పోనీ అదే అనుకోండి" అని నవ్వి, "బోగం వాళ్ళకి కులం వుందండి—కళావంతు లంటారు. ఇప్పుడు ఆ వృత్తిలో వున్నది వాళ్ళు తప్ప మిగతా అన్ని కులాలవాళ్ళూ నటగా!" అంది.

"అన్ని కులాలవాళ్ళూ వున్నారు బెదురుగా వాళ్ళూ వున్నారు."

ఆమె మౌనంగా వుండిపోయింది.

"నా మాటకి జవాబు చెప్పనేలేదు?"

"చెప్పానుగా-యే కులమో తెలియనప్పుడు కులం లేనట్లేగా!"

"భలే, నువ్వు అనామకురాలివా? యే కులమో తెలియకపోవటానికి?"

"చెబితే అర్థం కాకపోవచ్చు. మా అమ్మను నే నెరగను. నన్ను కని తాను కన్నుమూసింది. తెలుగు దేశంలో ఒక పెద్ద జమీందారి పెద్ద కూతురని మాత్రమే తెలుసు. మా నాన్నగారు తను యే కులం మనిషో నా కెప్పుడూ చెప్పలేదు. అసలు వాళ్లిద్దరిదీ వొకే కులం అవునో కాదో నాకు తెలియదు. వాళ్ళ పెళ్లికి మా అమ్మ తరఫువాళ్ళు యిష్టపడకపోతే ఇద్దరూ కలిసి వుత్తర దేశ ప్రాంతాలకి వెళ్లిపోయారు. దానినే, లేచిపో

అను: భూతిసిగ్గెర. గదట

యారు, లేవదీసుకుపోవటం అంటారు. ఆస్తిపాస్తులు సిల్వ చెయ్యకండా నాకోసం బాగా ఖర్చు చేసేవారు. గొప్పగా వున్నతంగా పెంచారు నన్ను. ఆయనే వంట చేసేవారు నేనూ నేర్చుకున్నాను. నేను కాస్త పెద్దదాన్న య్యాక ఆయనచేత వంట చెయ్యనివ్వలేదు. వంట పనిలో నాకు తోడుగా వుండేవారు. ఆయనొక అపూర్వ మనిషి. సాహిత్యం, శిల్పం, సంగీతం, నాట్యం—యిలాంటివి ఆయనకి ఆసక్తి, ఆయన చదివినన్ని పుస్తకాలు నాకు నూరేళ్ళాయుసిచ్చినా చదవలేనేమో. మహత్తర వ్యక్తి. బడికి వెళ్ళటం మొదలయ్యాక బాగా వూహ తెలిసి, నలుగురి పిల్లల మాటలు వింటే—వొకసారి మా నాన్నగారిని అడిగాను. దేవతలకి కులం వుండదమ్మా, నువ్వు కులానికి అతీతురాలివి అన్నారు. అంతే, మళ్ళీ ఆ విషయం ప్రస్తావించలేదు. బాగా పెద్దదాన్నయ్యాక ఆ మాటలకి అర్థం తెలిసింది. వుద్యోగరీత్యా దేశం అంతటా తిరగటం జరిగింది. నాకు తెలుగు ఆయనే నేర్పారు. తెలుగు సాహిత్యం మీద అభిలాష కలిగించారు రెండుమూడేళ్ళ కొకసారి సెలవు వుంటే రెండు మూడు నెలలు నన్ను ఆంధ్రదేశం తీసుకొచ్చి, వుండేవారు. పల్లెటూళ్ళు అంతలోతుగా తెలియదుగానీ పట్టణాలు తెలుసు. కాకినాడ, రాజమండ్రి, విజయవాడ, నెల్లూర్ల జ్ఞాపకాలు యిప్పటికీ నాకు స్పష్టంగా తెలుసు."

కనురెప్పలు మూసి, విప్పి, శ్వాస దీర్ఘంగా విడిచింది.

"ఐతే—"

"యింతకాలం నేను కులంలేని దాన్నే, అవసరం అయినంత వరకూ యికనుంచీ మీ కులమే నా కులం" అని పల్చగా నవ్వింది.

"నీ జీవితం ముందు నేనొక గుడ్డి దీపాన్ని"

గబుక్కున ముందుకు వొంగి, చేతులను తనచేతుల్లోకి తీసుకుని, "యేం మాటలండీ అర్థం లేకండా?" అంది.

"అవును అర్థంలేదు నా హృదయంలో కోటి వెలుగులు నింపావు. యింక నేను గుడ్డిదీపాన్ని కాదు." వుద్వేగంగా అని ఆమె చేతుల్ని పైకి వొంచి వేళ్ళ మీద పెదవులతో అద్ది "నిజంగా నేనెంతో అదృష్టవంతుణ్ని గీతా" అన్నాడు.

"నేను మాత్రం!"

"అప్రను, మనం అదృష్టవంతులం కాకపోతే నాలుగు రోజుల పాటు స్వల్పమైన చికాకులు"

ఆమె మౌనంగా వుండిపోయింది.

తలయెత్తి క్షణకాలం ఆమె కళ్ళలోకి చూసి, చూపు కిందకి వాల్చి "నిజానికి మా అమ్మ—చూస్తే నీకెట్లా అనిపించిందో చెప్పు గీతా" అన్నాడు.

"మంచివారే ఐవుండా అనిపించింది. అత్తయ్యగారి పేరు తెలియదు నాకు"

చిన్నగా నవ్వి "అడిగి తెలుసుకోక పోయావూ?" అన్నాడు.

"యేదీ ఆ అవసరం కలగటానికి మీరు మూగవారు కాదుగా!"

"కోపమొచ్చినపుడు అరవటంతప్ప నాకు మాట్లాట్టమే రాదంటుంది మా అమ్మ. అంటే నువ్వు యీ నాలుగురోజులలోనే మాటలు నేర్పేశావన్నమాట!"

నవ్వింది.

"గీతా!" అని ఆమె కళ్ళలోకి చూశాడు.

అతని కళ్ళ తళతళమీద తన చూపు నిశ్చలంగా అన్చటానికి ప్రయత్నిస్తూ "వూఁ" అంది సంగీత స్వరబాణిలో.

"నీకు సంగీతంకూడా వొచ్చునా?" అన్నాడు.

"మా నాన్నగారు నాకు సంగీతం నేర్పించలేదే!"

"మీ నాన్నగారు నీకు సకల విద్యలూ నేర్పినట్లున్నారు!" అని తటాలున బుర్రలో యేదో తట్టినట్లు ముఖంపైకెత్తి "మరి నీ స్కూలు సర్టిఫికెట్ మీద రాసిలేదూ యే కులమో?" అన్నాడు,

అతని కేసి చూసి "నేను చదువుకున్న బళ్ళల్లో ఆ వివరాలు అవసరం లేకపోయింది. మతం వొక్కటే రాయాల"

"యస్సెల్సీ పుస్తకంలో యే కులమో రాసివుంటుం దిక్కడ. మరి నువ్వు హైస్కూలు చదువు యేవూళ్ళో చదివావు?"

"రెండు మూడు చోట్ల, జూనియర్ సీనియర్ కేంబ్రిడ్జి బెంగుళూరు

అనుభూతిసిగ్గెుగదట

లోనూ, బియ్యే హైదరాబాదులోనూ—యెమ్మే చేస్తానుగా—బొంబాయిలో."

"ఐతే నాకూ—డా దేశం అన్ని ప్రదేశాలూ చూపించగలవన్న మాట!"

"బావుంది మీ యాంకీ పెట్రోలు సంస్థ మీకు ప్రపంచం అంతా చూపించగలదు"

"ఐతే నీకు చాలా భాషలొచ్చి వుండాలే!"

"వొచ్చు"

"యేయే భాషలో చెప్పు. తెలుసుకోవాలనుంది."

"తెలుగు, ఆంగ్లం"

"పోన్సీ యివందరికీ వొచ్చు. మరి నువ్వో—"

"నాకూ అవి రెండే వొచ్చు. కాస్త ఫ్రెంచి, వేరేవీ మామ్మూలు అవసరాల వరకూ వొచ్చు"

"పోనీ అదే—యేవేమొచ్చు"

"హిందీ బాగా మాటాడటం వొచ్చు రాయటం, చదవటంకూడా. కన్నడం, మరాఠీ, బెంగాలీ—యెచ్చీపచ్చీగా మాట్లాడగలను" అని కుర్చీ లోంచి లేచి నిలుచుంది.

"బాధతో, అలసటతో యివ్వాళంతా నిన్ను నానా అవస్థా పెట్టాను" అన్నాడు, నొచ్చుకుంటున్నట్లుగా.

"నాకేవీ అవస్థలేదే!"

"నిన్ను చూసి వోపికా వోర్పూవున్న దానివనుకోలేదు" అన్నాడు.

"యిప్పు డనుకుంటున్నారా!"

కుర్చీలోంచి లేస్తూ, "వోపికమాట యేవోగానీ వోర్పు వుందని మాత్రం తెలిసింది" అన్నాడు.

"ఆమె దగ్గిరికి అడుగులువేసి, నడుంచుట్టూ చెయ్యివేసి, మంచం దగ్గిరికి నడిపించి—రెండుజబ్బలూ పట్టుకుని మంచంమీద కూర్చోబెట్టి, "యికనుంచీ యీ మంచం నీది" అన్నాడు.

"అవును మంచపు యీ అంచు నాది" అని నవ్వింది.

తృప్తిగా సంతోషంగా క్షణకాలం ఆమె ముఖంలోకి చూసి వొక

అనుభూతిసిగ్గెరుగదట

చెయ్యి ఆమె వీపుచుట్టూ, మరోచెయ్యి మోకాళ్ళ కిందుగానూ చుట్టి రవ్వంత పైకిలేపినట్లుగా కదిపి మంచం మధ్యలోకి పడేసి—ఆమె ప్రక్కన పడుకున్నాడు.

ఆమె అవతలి అంచుమీదకి జరిగింది.

వీపు దిగువ భాగంలో చెయ్యి చుట్టి దగ్గిరికి లాక్కున్నాడు.

అతని వీపుమీద వేళ్ళతో వొక నిమిషం నిమిరి, పెదవులమీద పెదవులతో అద్ది-ముఖం పైకి వొంచి అతని కళ్లలోకి చూసింది.

"గీతా—"

"వూఁ" సంగీత స్వర బాణీలో.

"గీతా!" అతని కళ్ళలో వుద్వేగ తృష్ణ.

కనురెప్పలు వాల్చి, అతని వీపుమీద వేళ్ళతో నిమురుతూ, "రామ్—" అంది.

"మరోసారి అట్లాగే పిలువు గీతా" అన్నాడు వుద్వేగంగా.

కనురెప్పలు విప్పి, అతని కళ్లలోకి చూసింది. ఆ చూపులో—అనురాగం, ఆప్యాయత, తన్మయత, లాలిత్యం, మోహం, మమత, తృష్ణ—నిర్వచనంలోకి యిమడని చూపు; అతని హృదయంలో యిమిడిపోయిన చూపు.

"యింత ఆనందం యేం చేసుకోవాలో తెలవటం లేదు నాకు" పలవరింపుగా అన్నాడు.

"దోసిళ్లతో తాగటానికి" అంది కోటిపొరల ప్రగాఢతలోంచి పలికినట్లుగా ధ్వనించింది.

ఆమెను యింకా దగ్గిరికి లాక్కుని—అతని కళ్లలో, యెటుకేసీ చూడనివ్వని ఆకలి చూపు.

అతని పెదవులకు పెదవులు అతికించి—

అలిసిపోయిన వొళ్లు, వేడికి తేమకుంటోంది, మగతగా పడున్న మనసు, తాచులా బుసకొట్టి లేవబోతోంది.

• • •

వుదయం ఆరుగంటలకి మెలుకువ వొచ్చింది గీతాదేవికి.

అనుభూతిసిగ్గెరుగదట

వొళ్ళంతా నొప్పులు; రాత్రంతా పక్కమీద నలిగిన మల్లెపూల పరిమళం లాంటి నొప్పి.

కళ్ళు తెరిచి, చుట్టూ గమనించింది. నిశ్శబ్దంగా నవ్వుకుంది.

—యేవిఁటో యెవరనుకున్నారు యీ క్షణంలో యిక్కడ యిలా వుంటానని! లోన యింట్లో గిన్నెల చప్పుడు. అంతా కొత్త—యేదో బిడియం—కావాలిసిన పెద్దవాళ్ళ పట్ల వుండే గౌరవంలోంచి జనించే బిడియం కావొచ్చు. యీయన లేస్తే బావుండును—అనూరాధ మాటలుకూడా వినిపించటంలేదు— యింకా లేవలేదేవో—ముచ్చటైన పిల్ల—అబ్బా, యింకా గంట సేపు యిలాగే పడుకుంటే బావుండును—కాని కొత్తలోనే ప్రొద్దెక్కేవరకూ పడుకుంటే యేం బావుంటుంది!

నాజూగ్గా వొళ్లు విరుచుకుని —లేచి—కుచ్చిళ్లు దోపుకుని, బ్లౌజు కొక్కేలూ అవీ సరిచేసి పెట్టుకుని కాలకృత్యాలు ముగించుకుంది.

అద్దంలో ముఖం చూసుకుంది.

—అదే మొహం; మారలేదు కాని యేదో ఛాయ, ముందు యీ జుట్టుదువ్వి ముడిచుట్టి...కాటుక—అనూరాధకి కాటుకబరిణవుండి వుంటుందే—యీ బల్లమీద వుండి వుంటే బావుండేది—

మళ్ళీ చూసుకుంది, తన ముఖంలోకి, పరిశీలనగా — నిన్నకోసి తడి బట్టలోచుట్టి—అప్పుడే బయటికి తీసిన గులాబీలా అనిపించింది

గంజిపెట్టి యిస్త్రీచేసిన నూలుచీర బాగా నలిగిపోయింది. విప్పి చప్పుడవకుండా విదిలించి చేత్తో సవరించి, మళ్ళీ కట్టుకుంది.

రేడియో మీట తిప్పింది తిప్పగానే, లోపలినుంచి ఆవిడెవరో యింతటితో తెలుగులో వార్తలు సమాప్తం—అనేసి వెళ్ళిపోయింది.

శ్రీ వేంకటేశ్వర సుప్రభాతం.

ఆ పఠనంలోని వొడుపు, లయ, శ్రావ్యత ఆమె కిష్టం.

ప్రక్కకి తిరిగిచూసింది—యింకా నిద్రపోతూనే వున్నాడు. గొంతు వరకూ దుప్పటి కప్పుగుని. లేస్తేబావుండుననిపించి యింకా ధ్వనిస్థాయి పెంచింది.

సుప్రభాతం ముగిసింది అతను యింకా నిద్రపోతూనేవున్నాడు.

<u>అనుభూతిసి గెరుగడట</u>

మంచం దగ్గిరికి వెళ్ళింది. అతనికేసి పరీక్షగా చూసింది.

వెడల్పాటి చామన ఛాయ ముఖం—పరిశీలనగా చూస్తే తెలిసే కాంతి, కళ. రెప్పలుకూడా సూచిస్తున్నాయి, వాటికింది చిన్ని చిన్ని కళ్ళను, శ్వాసకి కొద్దిగా చలిస్తూన్న ముఖంతో నిండుతనం, మమతనిండిన కాఠిన్యం. కదిపితే వింతగా కేక పెడుతుందేమో ననిపించే అమాయకత. సగర్వపు స్వాభిమానం. శ్వాసవేడికి చర్మం కరిగిందేమోనన్నట్లుగా, యెత్తుగా పొడవుగా సాగిన ముక్కు నూనెతో మెరుస్తోంది. గుబురుగా వొత్తుగా పెదవిపొడవునా సాగిన మీసం.

ఆ మీసం తన వొంటిని సున్నితంగా స్పర్శిస్తే యేదో లలిత లలిత సంచలనం.

వొంగి, అతని మీసంమీద చూపుడు వేలు ఆన్చి ఆన్చనట్లుగా అంటించింది. అతను రవ్వంత కదిలాడు.

అరిచేతులు, అతని చెంపలకి అద్ది "మీ రేడియో వాళ్ళు మేలుకొల్పు పాడి యెప్పుడో వెళ్ళిపోయారు" అంది

కొంచెం కదిలి తన అరిచెయ్యి ఆమె చేతిమీద ఆన్చి, "యిక నుంచీ హృదయంలోనే మేలుకొల్పు వినిపిస్తుంది, మేం మేలుకొల్పు పాడం అని చెప్పేసి రాత్రే వెళ్ళిపోయారు వాళ్ళు" అంటూ రెప్పలు విప్పాడు.

"గీతా నువ్వు అప్పుడే లేచావా ! అబ్బా వొళ్ళంతా పట్టేసింది" అంటూ చేతులు పైకెత్తి వొళ్ళు విరుచుకుని ఆమె వీపుమీద బిగించాడు

"యిలాకాదు, లేచి వేన్నీళ్ళ స్నానంచేస్తే పోతాయి నొప్పులు."

"యిది హోమియోపతీ మందు విధానం. పడుకో యిట్లా యింకో గంటాగి లేద్దాం" అని చేతులతో కిందకి నొక్కాడు.

"అలాగే కానీ మీకు కార్యాలయానికీ నాకు కళాశాలకీ ఆలస్యం అవుతుంది. అత్తగారికి ఆగ్రహం వొస్తుంది."

"వోస్, అవి రెండూ మానేద్దాం యివాల్టికి. అమ్మ అప్పుడే యెందుకు లేచింది ?"

"ఆవిడ అప్పుడే లేవకపోతేనే మీరు రోజూ వేళకి కార్యాలయానికి

వెళ్ళగలగుతున్నారా! లెండి, లెండి—యిప్పటికే రెండుసార్లు అడిగివెళ్లారు అబ్బాయి యింకా లేవలేదా—అని."

"నిజం !" అని చేతులు పట్టు తప్పించాడు.

"రెండు రోజులపాటు అమ్మ మాటకి అలవాటు చొప్పున మెరా యించటం మానుకోటం మంచిది." అని—గడియవేసి వున్న తలుపు చూసి, "తలుపు గొళ్ళెమైనా తీసిలేదే—కోడలిగార్ని తన యేకైక పుత్రరత్నాన్ని గురించి వాకబుచేసి వెళ్లటం జరగలేదనేది నిజం" అన్నాడు

మధ్య గదిలోనో, నడవాలోనో అనూరాధ మాటలువినిపిస్తున్నాయి.

తలుపు తెరిచి వొచ్చి కుర్చీలో కూర్చుంటూ "త్వరగా తెమలండి" అంది.

లేవబోయి; "వొరి, వొరి, యిదేమై పోయిందీ !" అని స్వగతం పలుకుతూ, దుప్పటి కిందకి చెయ్యి దూర్చి, పైజమా వెతికి కాళ్లు వొంచి తొడుక్కుని, అటూ యిటూ ప్రకలకి వొత్తిగిలి బిగించుకుని—దుప్పటి నెట్టేసి లేచాడు నవ్వుకుంటూ.

బల్లకేసి చూసి, "వొసే రాధీ. కాఫీ యెక్కడే?" అన్నాడు గట్టిగా.

"బెడ్ కాఫీయా ?" అంది; సన్నగా దీర్ఘం తీసినట్లుగా.

"అవును, అది పడనిదే యేపనీ తెమలదు."

"పడమటి దేశపు సంస్థలో పనిచేస్తున్నందుకు పడక కాఫీ లేకపోతే వూరుకోరన్నమాట !"

"వాళ్ళెవరు, నన్ను వూరుకోమనటానికీ, అనకపోటానికీ - కానీ ముందు అది గొంతులో పడితేగానీ—"

"రాత్రి పడుకోబోయే ముందు పళ్ళు తోవుకునే అలవాటు వున్న వాళ్ళకే గానీ, బెనారస్ సుగంధ ద్రవ్యాలతో కట్టిన కిళ్లీనమిలి పడుకునే వాళ్లకి కాదు."

గుమ్మం దగ్గిరికి వొచ్చి, తొంగి చూసింది అనూరాధ.

"వొసే రాధీ, కాఫీ యేదే ?"

"మరేమో—కాఫీ—" నట్లుకొడుతోంది, గుమ్మంలో నిలబడే.

ఫక్కున నవ్వింది గీతాదేవి.

అనుభూతిసిగ్గెరుగదట

"నువ్వు ముందిట్లా రా," అన్నాడు కోపంగా.

లోనకి నాలుగడుగులు వేసి, యేదో చెప్పబోయి—గీతాదేవి, తన దగ్గిరికి రమ్మని చేసిన సైగ గ్రహించి, నవ్వుకుంటూ ఛెంగున గెంతింది, ఆమె దగ్గిరికి.

"తలుపు లోన గడియ బిడాయించి—కాఫీ తీసుకురాలేదేం అని గదమాయిస్తే యేం చెప్పగల దనుకున్నారు" అంది గీతాదేవి.

మూతి బిగించి, కనుగుడ్లు మిటకరించి, "వాసే రాధీ, పెద్దమ్మ యేం చేస్తోంది ?" అన్నాడు.

"యెప్పుడు ? నేనిక్కడికి వొచ్చే ముందా—పమిటకొంగుకి చెయ్యి తుడుచు కుంటూంది" అంది అనూరాధ.

గీతాదేవి, ఫక్కున నవ్వి, అనూరాధ తలమీద చెయ్యివేసి నిమిరింది.

"యిప్పటికైనా పోయి తీసుకురావేం ?"

"అమ్మా అనూ! నువ్వు పొద్దుట లేచి చదువుకోవాలా ? వాళ్ళకీ వీళ్ళకీ కాఫీలు చేరవెయ్యాలా ?" అంది గీతాదేవి అతనివంక చూస్తూ.

అనూరాధ యేదో చెప్పబోయింది.

"నీకు చదువురాదు కాబట్టి కాఫీలు తెచ్చి యిస్తావు కదే రాధీ" అన్నాడు గీతాదేవి వంక చూసి.

"అమ్మ ! నేనేం చదువు రానిదాన్ని కాదు. మాష్టారైతే నన్ను భలేగా మెచ్చుకుంటారు" అంది.

సెలయేటి గలగలలా నవ్వింది, గీతాదేవి.

"మీమాస్టరికి చదువొచ్చేడిస్తేగా నీకు రావటానికి—ఫో, పోయి కాఫీ పట్రా."

అనూరాధ, గీతాదేవి దగ్గిరినుంచి గెంతి బయటికి వెడుతోంది.

"వొసే రాధీ, యిట్రా. పెద్దమ్మ దగ్గిరికెళ్ళి, శివన్నయ్యలేచాడు పెద్దమ్మా—అను. నేనేమన్నానని అనకు," అన్నాడు.

గుమ్మంలో నిలుచుని "మరి కాఫీ!" అంది.

"అదంతా నీ కెందుకు?"

"ఐతే అట్లా అని వొచ్చెయ్యనా!"

"మొద్దూ-యిట్రావే, అసలు నువ్వూ-" అని గద్దించాడు.

ప్రక్కగా కంటికొసలోంచి గమనించి "అదుగో పెద్దమ్మొస్తాంది" అంది.

తీరగా గుమ్మంలోకి వెళ్ళి చూసి—అవతలికి నడిచాడు.

అనూరాధను దగ్గరికి రమ్మని తల వూపింది గీతాదేవి. మూడు గెంతులలో దగ్గరికి చేరింది అనూరాధ.

ఐదు నిమిషాలకి రెండుచేతులతో రెండు కాఫీ కప్పులతో గుమ్మంలోకి వొచ్చి, "నీకు కాలేజి లేదు. నాకు ఆఫీసు లేదు" అని ప్రకటించాడు శివరాం.

"యెవరైనా మంత్రి చనిపోయినట్లు పత్రికలో చూసివొస్తున్నారా యేవిఁటి!" అంది.

"మంత్రి కాదుకదా రాష్ట్రపతి చచ్చిపోయినా మా ఆఫీసుకి సెలవియ్యరు. శ్రీశ్రీ, ఛా, శ్రీమతి సుభద్రమ్మగారు మనిద్దరికి సెలవు మంజూరు చేయించారు" అంటూ వొచ్చాడు లోనకి.

గీతాదేవి లేచి, కప్పు అందుకుని, బొట్లు కిందపడకండా సాసరు అడ్డం పెట్టుకుని తాగుతూ నిలుచుంది.

గబగబా నాలుగు గుక్కల్లో తాగేసి, "అధమం మనం నెల రోజులైనా సెలవు పెట్టాలంది అమ్మ పెట్టేస. యింట్లో—యిష్టంఐతే యీ గదిలోనే కూర్చోవాలన్నమాట. హనీమూన్ ముచ్చట ఆమె బుర్రలోకివొచ్చే అవకాశం లేదనుకో. కానీ, హనీమూన్‌కి వెళ్లాలన్నా, లేదూ అసలు మూన్‌కే అనగా చంద్రగ్రహానికే వెళ్లాలన్నా, మా కార్యాలయంలో పది రోజులకి మించి సెలవు యివ్వం పొమ్మంటారు" అని అనూరాధకి ఖాళీ కప్పు అందించాడు, తీసుకు వెళ్లమని చేతి విసురుతో సూచిస్తూ.

"మన్నీ సెలవు పెట్టమన్నారా అత్తయ్యగారు!"

"సెలవు పెట్టమనటమేంటి. సెలవు మంజూరుకూడా చేయించింది తనే."

"ఊఁ మీరేవన్నారు?"

"యేమైనా అందును గానీ అనలేదు. అదీ ప్రస్తుత పరిస్థితి. నోరు మెదిపానో దీవెనలు తప్పవు—యిక్కడికి చేసిన అవలక్షణప్పనులు చాలకనా అని ప్రారంభించి అక్షింతలు వేస్తే, నాలుగు గింజలు యెగిరి యీ పార్వతీదేవిమీద కూడా పడగలవు"

నవ్వి, "నేను పార్వతీదేవిని కూడానా?" అంది.

నవ్వుకుని, "రాత్రి, నువ్వు లక్ష్మీదేవిలా కళకళ్ళాడుతున్నావంటే అంత వుగ్రంలోనూ, పార్వతీదేవిలాగా వున్నావని సవరణ చేసింది. మనం కొన్ని రోజులపాటు యింట్లోనే వుండాలట. అది, తీర్పు. కాదనటానికి వీల్లేదు. చుట్టాలందరికీ వుత్తరాలు రాసి మహాబలగాన్ని రప్పించబోతోంది."

"అంటే?"

"మన్ని వేదికమీద కూర్చోబెట్టబోతున్నారేమోనని కోపగించుకోకు. వరసగా, అప్పుడు కొందరు— అప్పుడు కొందరు—వాళ్ల వీలునుబట్టి వొచ్చి చూసిపోతారు. పెళ్ళయి పోయిందని తెలిశాక యింత దూరం యెవరూరాలేరులే. మా పింతండ్రులూ వాళ్ళూ వో పదిమంది వొచ్చిపోతారు. అంతే" అని ఆమె ముఖంలోకి చూసి "నామీద కోపంవొస్తోంది కదూ గీతా నీకు?" అన్నాడు

"దేనికి?" అని పల్చగా నవ్వింది.

"అదే ప్రదర్శనకి."

"ఆ మాత్రం కూడా కాదంటే—"

"అదే నేనూ అనుకున్నాను. యిక్కడికి, రంగ రంగ వైభవంగా జరగాల్సిన పెళ్ళి యిట్లా కుప్ప కూలిపోయిందే—అని. యిప్పుడైనా కొంత కన్సెషన్ యివ్వకపోతే మర్యాద దక్కదనిపించి వూరుకున్నాను."

"ఐతే మనం, యెన్నాళ్ళు పెట్టాలి సెలవు?"

"నాకు పది రోజులకంటే మించి వీలుకాదు. నీకూ?"

"నాకు అసలు సెలవే లేదు."

"పోనీ యేదోక సెలవు యిస్తారుగా—వారం రోజులు పెడదామా?"

"మీ యిష్టం."

అనుభూతిసిగ్గుగదట

"నువ్ చెప్పు—"

"మీరెలా అంటే అలా."

లేచి, తను తాగిన ఖాళీ కప్పు తీసుకుని వెళ్లబోయింది

"కూర్చో. రాధ తీసుకెళ్తుందిలే."

"అనూరాధ మీ యింట్లో పనిపిల్ల అని నాకు తెలియదే!"

"హో, అదా—రేపే వూరినుంచి పనిపిల్ల నొకదాన్ని తెప్పించుతాను."

"అది కాదు నా వుద్దేశం. చదువుకునే పిల్లగికి యింట్లో యిలాంటి చిల్లర పనులన్నీ చెప్పగూడదని. కాస్త యెదిగాక వంటా అదీ నేర్చొచ్చు. మన పనులు మనమే చేసుకోవాలి."

"మరి మన పనులు మనం చేసుకోలేనప్పుడు?"

"పని మనిషిని పెట్టుకోవాలి నా పనులు నేను చేసుకోగలను."

"ఐతే నా పనుల కోసం ఐనా కావాలిగా పనిపిల్ల?"

"యింతకాలం?"

"అమ్మ చేసింది."

"అదా! మీ పనులూ చెయ్యగలను నేను."

"గుడ్. నా పనులూ, నీ పనులూ, యింకేవన్నా అంటే అత్తగారి పనులూ—అన్ని పనులూ చూసుకుని వుద్యోగాని కెళ్లగలవన్నమాట. నీకు వోర్పు మాత్రమే వుందనుకున్నాను. వోపిక కూడా వుంది కాబోలు ననిపిస్తాందిప్పుడు" అని నవ్వాడు.

వెళ్లబోతున్న ఆమెను చేత్తో అటకాయించి, "గీతా, చూడు, యీ కప్పులూ కంచాలూ కడగటం వగైరా బిజినెస్ పెట్టుకోకు—నువ్వేమన్నా చదువుకోని దానివా! రేపోమాపో పి. హెచ్. డి. డిగ్రీ కూడా తీసుకుంటావు. నా మాట విను—నాలుగు రోజుల్లో వో పనిపిల్లని తెప్పించేస్తాను" అన్నాడు.

"బావుంది, యింకేవన్నా అంటే-పనిపిల్ల దేనికి అమ్మే చేస్తుంది అని అనగలరు."

"నిజానికి అమ్మ అన్ని పనులూ తనే చేస్తుంది నువ్వుగానీ పూర్తిగా నచ్చావో, నిన్ను పూచికపుల్ల కూడా కదప నివ్వదనుకో—చూస్తా

అనుభూతిసిగ్గెరుగదట

వుగా—"

"అత్తగార్ల చేత చేయించుకునే వుద్దేశం లేదు నాకు."

"నీకా వుద్దేశం వుందనలేదు నేను."

"వుద్దేశవూ లేదు, యిష్టవూ లేదు."

"ప్లీజ్—" అని చేత్తో అటకాయించాడు, వెళ్లబోతున్న ఆమెను.

"మీకు తెలియదు వూరుకోండి—"

"బహువచనంలో కాకుండా యీమాట అని వుంటే సరిగ్గా మాఅమ్మ అన్నట్లుండేది. పది గంటల కోడరికంలో మహా అనుభవం వొచ్చిన పెద్ద దానిలాగా ఐ పోయావు—" అని నవ్వాడు.

"మరి కాలేదా!" అని నవ్వి, కుడి చేత్తో అతని చేతిని తప్పించింది

అతను, మూతి బిగించి, కనుగుడ్లు యెగరేసి, "తమరు దయ చెయ్యండి యింక" అని అన్నట్లు తలవాల్చి చెయ్యి కదిపి సూచించి ప్రక్కకి తప్పుకున్నట్లుగా జరిగి నవ్వాడు.

లోనకి వెళ్లి కొళాయి దగ్గిర కప్పూ, సాసరూ కడిగి, పవిట కొంగుతో తుడిచి ప్రక్కకి తిరిగింది.

వంటగదిలో తోటకూర తరుగుతున్న సుభద్రమ్మ చూసి, ఆకు అలాగే చేత్తో పట్టుకుని గుమ్మంలోకి వొచ్చి, "అయ్యో నువ్వు కడగటం యెందుకమ్మా—" నొచ్చుకుంటున్నట్లుగా అని, కప్పు అందుకుని ప్రక్కకి తిరిగి—

గీతాదేవి అలాగే గుమ్మం బయట నిలుచుని—

"రామ్మా యిట్టా కూర్చో."

లోనకి వెళ్లింది.

పెద్ద పీట వొకటి—తీసి వెయ్యబోతోంది సుభద్రమ్మ.

తొందరగా ముందుకు అడుగులు వేసి పీట చేత్తో అందుకుని—

సుభద్రమ్మ, కత్తిపీటమీద కూర్చుని, ఆకు కోదువుతోంది, తరగటానికి.

గోడ వారగా పీట ఆన్చి, కూర్చోబోతోంది గీతాదేవి.

ఆనుభూతిని గెరుగదట

"అయ్యో, కింద కూర్చోకమ్మా, గచ్చు సుబ్రంగాలేదు. చీర పాడౌతుంది" అని, నలిగిన చీరను గమనించింది సుభద్రమ్మ.

"ఫరవాలేదు లెండి." అంటూ గొంతుకూచుని—మోకాళ్ళ వొక దానికొకటి దగ్గిరిగా నొక్కి—గడ్డం ఆన్చి—నేలమీదకి, ఆమెకేసీ చూస్తోంది గీతాదేవి.

సుభద్రమ్మ ఆకు తరుగుతూ, మధ్యలో ఆమెకేసి వారగా చూస్తోంది.

కళ్ళకేసి చూసి, "అయ్యో కళ్ళకి కాటుక—" అని క్షణకాలం యేదో స్ఫురించినట్లుగా ఆగి; "వొసే, రాధా, నీ కాటుకదీ అదీ శివన్నయ్య గదిలో పెట్టిరావే" కొంచెం బిగ్గరగా అంది సుభద్రమ్మ.

గీతాదేవి మౌనంగా నేలకేసి చూస్తూ వుండిపోయింది.

తరగటం పూర్తిచేసి—కిందపడిన ఆకులూ, కాండం తుంపులూ యేరి దాకలో వేస్తూ, "యేంటో, అబ్బాయి తీరే అంత—చిన్నప్పటి నుంచీ అంతే. వొట్టి మొకురు తనం. యెట్టా జరిగాల్సిన పెళ్ళి యెట్టా జరిగిందీ! నీ మాటైనా వినగూడదూ వాడు! వుహూ—వొట్టి పెంకిగటం—" అని స్వగతంగా అంది.

—ఐతే. తనే అలా జరగాలని పట్టుపట్టి చేసుకున్నట్లు చెప్పారన్నమాట—నా మీద తల్లికి యింకోలాగా అభిప్రాయం కలగకండా వుండేందుకు!

గీతాదేవి కళ్ళు చెమ్మగిల్లినాయి.

"యీ కాలం పిల్లలు సూదిబొట్లూ, పెసరబద్ద బొట్లూ, మరీ బరితెగించినవాళ్ళు అసలు బొట్టే లేకుండానూ—యేంటో—మా కాలంలో—" అని గతాన్ని నెమరువేసుకుంటున్నట్లుగా క్షణకాలం, "నువ్వా పెద్ద చదివే చదివినా లక్షణంగా—కుంకుంబొట్టు నిండుగా పెట్టుకుంటే కళకళ లాడుతోంది మొహం—రాధ చెప్పింది. పొద్దున్న—నువ్వా మాసుజాత పని చేస్తున్న దగ్గిరేనని, అది పుట్టిం దగ్గిరినుంచీ అనుకుంటా వుండేవాళ్ళం రొండు పక్కల వాళ్ళం—రొండు పక్కలే వుందిలే, నా తమ్ముడి కూతురేగా అది—" అని ఆగి తల పంకించి "లిఖితం యెట్టావుంటే అట్టా. మన

అనుభూతిని గ్గెరుగదట

వను కున్నట్లు జరుగుతయ్యా! యేవో(లే, దేవుడు వూరికే చెయ్యడు—యే కిరస్తాసిదాన్నో యెంచేసుకొస్తే మ్మాత్రం యేంచెయ్యగలిగేదాన్నిలే కుమిలి కుమిలి చావటంకన్న..." తనలోతను మాట్లాడుకుంటున్నట్లుగా సాగిపోతోంది.

గీతాదేవి నిశ్శబ్దంగా చూస్తూ కూచుంది.

"యేవో(లే—యిదీ మంచికేనేవో( వాడి కిష్టంలేకుండా బలవంతంగా కట్టించినా తిన్నగా కాపరం చేసేవాడే కాదేవో( పెంకి గటం—మీరిద్దరూ చిలకా గోరింకలమల్లే వుండిపోతే అంతేచాలు. అదేపదివేలు" చెప్పుకుపోతూ, దాక చేత్తోపట్టుకుని లేచింది.

గీతాదేవి లేచి నిలుచుంది.

"కూర్చో—మ్మా" అని దాక పొయిగట్టుమీద పెట్టి స్టీలు లోటాతో నీళ్ళు పోస్తోంది.

వొంగి, కత్తిపీట చేత్తో అందుకుని, కొళాయిదగ్గిర కడిగి తీసుకొచ్చింది, గీతాదేవి

"అయ్యో నా మతిమరుపు మండా. కత్తి పీటక్కడే వొదిలేశానా—నీకెందుకమ్మా యీ పనులు—" అని నొచ్చుకుంటున్నట్టుగా అంది సుభద్రమ్మ.

"మరే గీతొదినా—" అంటూ యేదో చెప్పేందుకు గుమ్మం లోపలికి వొచ్చింది అనూరాధ.

"అదేం వాగుడే!" అని గదమాయించింది, సుభద్రమ్మ అనూరాధ కేసి చూసి.

"నే నిప్పుడేమన్నానమ్మా! వొదిన పేరు గీతాదేవి కాదా!" అంది అనూరాధ.

నవ్వుకుని, "యేంటోనమ్మా—యీ కాలంలో పేర్లుకూడా చిత్రవే( మా పింతండ్రి బావమరిది మనవ(రాలికి గీతాంజలి అని పెట్టారు పేరు" అని అంది గీతాదేవి నుద్దేశించి.

"నీకేం తెలవదులే పెద్దమ్మా, మాబళ్ళో పిల్లలపేర్లుకూడా అట్లాగే వుంటయ్" అంది అనూరాధ

అనుభూతిని స్నేరుగదట

నవ్వి "మరి నీకుమల్లే నేనేవన్నా చదువుకున్నానా యేవన్నా తెలవటానికి?" అంది, సుభద్రమ్మ.

"అమ్మ! అన్నీ దొంగమాటలు. మజ్యానమప్పుడు ఆ పొగచూరిన కాగితాల పుస్తకం పుచ్చుకుని కూనిరాగాలు తీస్తా చదువుకుంటా వుంటావె! చదువుకోపోతే యెట్లా చదవగలవు మరి"

ఫక్కున నవ్వింది గీతాదేవి.

"ఓడవకాన!" అని నవ్వుకుంది సుభద్రమ్మ.

"మరి గీతాదినా నీ హేండ్బేగ్‌లో పెన్నూ—"

మధ్యలోనే అటకాయించి, "వాడిన పర్సుతియ్యొచ్చే?" అని గద్దించింది, సుభద్రమ్మ—

"పరవాలేదు లెండత్తయ్యగారూ, ముద్దొచ్చే పిల్ల."

"నీకు తెలవదమ్మా దీని సంగతింకా—అది యింకా అంతుంది. వూరుకుంటే నెత్తినెక్కి తొక్కుతుంది."

"అనూ! ఆ పెన్ను బావుందా నీకు?" అంది గీతాదేవి.

"దానికి పాళీ వుండదు చివర ములుకులా వుంటుంది. పైన నొక్కితే కింపకి వొస్తుంది ములుకు దాంతో నొక్కి రాయాలి. మరి పెన్ను పాళీకి మల్లే నొక్కి రాసినా విరిగిపోదా? చూట్టానికి భలే బాగుంది"

"బావుందా—తీసి రాసుకో"

"వాళ్ళ పెన్నులూ అవీ నువ్వు తియ్యకూడదు రాధా" అని గీతాదేవి వైపు చూసి "దాని చేతులో అన్నీ పుటుక్కుమని విరిగిపోతయ్. అందుకే అబ్బాయికూడా వాడి పెన్నులూ అవీ దీనికివ్వడు" అంది.

"పరవాలేదు అత్తయ్యగారూ. అది చిన్న పిల్లలు రాసినా పాడు ు రకం పెన్ను" అని అనూరాధతో. "తీసుకు రాసుకోలే అనూ" ంది.

గెంతుకుంటూ వెళ్ళిపోయింది అనూరాధ.

నీళ్ళలోంచి ఆకు దేవటం పూర్తిచేసి, ప్రక్కకి తిరిగి—"అట్టా మునికాళ్ళమీద యెంతసేపని గొంతుకూర్చుంటావు, కాళ్ళు నొప్పి పడతయ్యి—ఆ పీట వాల్చుకూర్చో—మ్మా" అని కాల్‌గాస్ స్టౌవెలిగించింది.

అనుభూతసిగ్గెరుగదట

"ఈ గొట్టాలు అవీ నాకు తిప్పటం తెలవదన్నా వినకుండ తెచ్చాడు, యీ స్టవ్వు".

"పాత్రలు మసి బారకండా వీలుగానూ సుఖంగానూ వుంటాయి యివి." అంది గీతాదేవి.

"యిప్పుడందరూ యిట్టాంటివేలే. యీ క్వార్టర్స్‌లో కట్టెపుల్లలు వాడనివ్వరని అన్నాడు అబ్బాయి."

వొకచేత్తో కలం, మరోచేత్తో పుస్తకమూ పుచ్చుకొనివొచ్చి "చూడొదినా. నేను రాశాను. భలేబాగా రాస్తోందిలే—యెటు పక్కకి తిప్పినా రాస్తుందీ" అంది అనూరాధ.

"అనూ, నువ్వెప్పుడూ చూడలేదా ఇలాంటి కలం?"

"మా మాష్టారి దగ్గిరుండి. ఆయన రాస్తొంటే చూశాను. వొకరోజు మాక్లాసులో మంజుల తెచ్చింది గానీ అది చుప్పనాతి చూరు, రాసిచూసి యిప్పుడే యిచ్చేస్తానోయ్ అని అన్నా యివ్వలేదు,"

"మరి మీ శివన్నయ్యని అడిగితే తెచ్చిపెట్టేవారుగా"

"అడిగా నొకసారి. అప్పుడే అరడజను పెన్నులు పారేశావు. నీ మొఖానికి బోల్‌పాయింట్ పెన్ను కావాలేం" అని కోప్పడ్డాడు.

"బోల్ పాయింట్‌కాదు, బాల్‌పాయింట్ అనాలి. ఐతే నువ్వు యెప్పుడూ కలాలు పారేసుకొస్తొంటే యెలాకొంటారు మరి!"

"నేనసలు పారెయ్యనొదినా—మొదట కొనిచ్చిన పెన్ను—వుం హూం అది కొన్నా, తనదగ్గిరున్న పాతపెన్ను యిచ్చాడు. అది కక్కేడి. వేళ్ళకీ గౌనుకీ సిరామరకలైతేచూసి మా మేష్టారు తీసేసుకుని లీకయ్యే పెన్నుతో రాయకూడదు. ఇంట్లో చెప్పి మంచిపెన్ను తెప్పించుకో అడి తెచ్చుకున్నాక యిది యిచ్చేస్తాను అని అంటే అశోకాపెన్ను తెచ్చిపెట్టాడు శివన్నయ్య. మా యెండాకాలం సెలవల్లో వొకసారి తన పెన్ను కవపడక ఆ పెన్ను అడిగి పట్టుకెళ్ళి తనే పారేసుకొచ్చి వేరే పచ్చరంగుది కొని తెచ్చిచ్చాడు. పాళీ బాగా రాయటం లేదుగానీ యేం పాడవ్వలేదసలు, ఆసెకి చూపిస్తానుండు..." చెప్పుకు పోతోంది అనూరాధ.

తెల్లకాగితాల పుస్తకంమీద అనూరాధ రాసిన పదాలుచూపి "నీ అనుభూతిపిగ్గెంగదట

దస్తూరి కూడా చక్కగా వుంది, యీ కలం యిస్తాను తీసేసుకో" అంది గీతాదేవి.

"శివన్నయ్య కోప్పడతాడు చూస్తే" అంది అనూరాధ.

"ఆయనకి నే చెబుతానులే! వెళ్ళి రాసుకోమ్మా. అనూ" అంది గీతాదేవి.

అనూరాధ పరుగుతీసింది

ఆకుకూర స్టౌమీద పెట్టి చాటలో బియ్యంపోసి కిటికీలో పెట్టి గది బయటికి వెళ్ళింది సుభద్రమ్మ.

గీతాదేవి లేచి బియ్యంచేట తీసుకుని వరండాలోకి వొచ్చి, యెడమ చేతిమీద రొమ్ముకి ఆన్చి పట్టుకుని కుడిచేతి వేళ్ళతో బియ్యం కదుపుతూ మట్టిగడ్డలు, రాళ్ళు యేరుతోంది—నిలుచునే.

బంగారం రంగు చట్రపు గుండ్రటి—అద్దాల కళ్ళజోడు ముక్కు మీద సరినొక్కు కుంటూ వొచ్చి, "నీ కెందుకమ్మా యీ పనులన్నీ—" అంటూ నొచ్చుకుంటోంది.

"బియ్యం యేరటం కూడా పనేనా అత్తయ్యగారూ!" అంది గీతాదేవి.

"ఇంకా నయం, యీ పనులన్నీ నువ్వు చేస్తే నేనేం చెయ్యాలి మరి."

"పనులన్నీ యేవున్నాయండీ! అన్నీ మీరే చేసుకుంటున్నారుగా—వూరికే నాలుగు రాళ్ళు యేరదామనీ—"

"పని లేకపోతే నా కసలు తోచిచావదు. యింకా వొంట్లో వోపిక వుందిలే. అది పోయినాక ఎట్టాగూ నీ చేత చేయించుకోక తప్పదుగా—యింత గంజి పోయించుకున్నా చేయించుకున్నా నువ్వేగా నాకు దిక్కు—నలుగురిచేతా మంచనిపించుకు వెళ్ళిపోతే అంతే చాలు యీ బతుక్కి—"

"యేం మాటలత్తయ్యగారూ—"

"బియ్యం బాగున్నయ్యని రెండు తూమ్ములు ఒక్కసారే తెప్పించాడు. యిక చాల్లే, యిట్టా యివ్వు యెసట్లో పోస్తాను" అని చేత్తో ఆమె చేతిమీది చాట తీసుకుంటూ, నలిగిన ఆమె చీరకేసి ముఖంవంకా చూసి,

"చిన్నపిల్లవి, చక్కగా జడేసుకోపోయావూ—యీ రోజుల్లో ముప్పయ్యో వ ప్పయ్యొ ఐదేళ్లు దాటినా జడలే వేస్తున్నారు. నా మూడో తోటికోడలి చెల్లెలు ముప్పయ్యారేళ్ళది—యింకా కీలుజడొకటి చేసుకుని తిరుగుతుంది. వాళ్ళంతా వేసుకుంటూవుండగాలేంది ఉన్నదానివి నువ్వెందుకేసుకోగూడదు. జడేసుకుని పూలెట్టుకుంటేనేగా పెళ్ళి కళ కనపడేది!"

"కాలేజీలో వుద్యోగం కదా, యిది చుట్టుకుంటే నిండుగా వుంటుంది కదా అని—" ఆగిపోయింది

"అదీ నిజమేలే. మా సుజాతని రవి అట్లాగే అంటాడు జడేసుకునే ఉద్యోగాని కెళ్తుందని, బయటి కెళ్లినప్పుడు ముడివేసుకున్నా—" అని ఆగిపోయి చీరకేసి మరోసారి చూసి, "ఐపోయిందిలే వూరికే చూస్తున్నా, యిక యెసట్లో పోస్తా" అని వొకడుగు కదిలి "అబ్బాయి నొకసారి యిటొచ్చెళ్లమన్నానని చెప్పమ్మా వెళ్ళి" అంది.

డ్రాయింగ్ రూంలో చేత్తో కలంపట్టుకుని రెండో చేత్తో తలగోక్కుంటున్న అనూరాధ, గీతాదేవి మధ్యగదిలోంచి వెళ్లటం గమనించి పరిగెత్తుకుంటూ వొచ్చి పవిటకొంగు పట్టుకుంది

యెడమచెయ్యి ఆమె చుట్టూ తిప్పి, "యేం చేస్తున్నావూ?" అంది గీతాదేవి పడకగది గుమ్మంలో అడుగు పెడుతూ.

నిలబడి లాగూ పై అంచు దగ్గిర చొక్కా సరిచేసి నల్ల తోలుబెల్టు బిగించుకుంటూవున్న శివరాం, "ఎంగిలి కాఫీకప్పుతో పోయిన దానివి అట్టే వుండిపోతే ఫలహారప్పళ్ళెంతో రాటోతున్నావనుకున్నాను?" అన్నాడు నవ్వుతూ చూసి.

నిశ్శబ్దంగా నవ్వింది అతని ముఖంలోకి చూసి.

"రాధీ నువ్వింకా యిక్కడే వున్నావేం బడికి తగలడక?" అని గద్దించాడు.

"మీ కార్యాలయం లాగానే తన బడిన్నూ" అంది గీతాదేవి.

"వోహో—కాఫీలూ అవీ అందించకుండా చదువుకోవాల్సిన పిల్ల బడి మానెయ్యొచ్చు కాబోలు!" అన్నాడు.

నవ్వింది, నిశ్శబ్దంగా.

అనుభూతిసిగ్గేగదట

"అన్నట్లు నేను కార్యాలయానికే బయల్దేరాను సెలవు విషయం చెప్పి వొద్దామని. మరి నీ సెలవూ రాసివ్వు. యిచ్చేసి వొస్తాను" అన్నాడు.

"మీరు వొద్దులెండి. పోస్టులో పంపిస్తాను."

"వోహో, లెక్చరమ్మగారి భర్తని కదా—నీకు నా హోదా-గౌరవం తగ్గిపోతుంది కాబోలు నేను వెళ్ళి యిస్తే!" అని నవ్వాడు.

నవ్వి, "అంతటి అవసరంలేదు. ఐనా, నా సెలవు కాగితాలు మోసుకెళ్ళటం కాదు మీ వుద్యోగం!"

"ఆ మాట వొప్పుకుంటాను కానీ నేనివ్వాళ వుద్యోగంలో లేను. సెలవులో వున్నాను. కాబట్టి—" అని ఆగిపోయాడు, మెడ పైకి యెత్తి నెక్‌టై ముడిబిగిస్తూ.

"అన్నట్లు మర్చేపోయాను అత్తయ్యగారు మిమ్మల్ని వోసారి వొచ్చి వెళ్ళమన్నారు."

"యేమంటున్నారు మీ అత్తయ్యగారు."

"చెప్పానుగా, మిమ్మల్ని రమ్మంటున్నారు." అని నవ్వింది.

నవ్వుకుంటూ వెళ్ళాడు.

చేసంచి తెరిచి, కలం పెట్టేస్తున్న అనూరాధను చూసి, "తీసుకో అనూ, నీకు నచ్చిందిగా—" అంది గీతాదేవి.

అనూరాధ తల అడ్డంగా వూపింది.

"యెందుకని?"

"శివన్నయ్య కోప్పడతాడు."

"నిన్నేమీ అనకుండా మీ శివన్నయ్యకి నేను చెబుతానన్నానుగా—"

మళ్ళీ బయటికి తీసి, కలాన్ని నిమురుతున్నట్లుగా సవరిస్తూ, "దీంతో రాస్తే కాపీ రాయటం కూడా చక్కగా వొచ్చింది" అంది.

"అందుకేగా—తీసుకో."

తీసుకుని, మౌనంగా, తల వొంచుకుని నిదానంగా నడుస్తూ గది బయటికి వెడుతోంది అనూరాధ.

"యెక్కడికి వెడుతున్నావు అనూ?"

"బడికి టైం ఐపోతాంది."

"రోజూ బడికి వెళ్ళటం అంటే యిష్టవాఁ నీకు?"

అవునన్నట్లు తలవూపింది అనూరాధ.

"మరి యివ్వాళ నాదగ్గిర వుండిపోవాలని లేదా?". మళ్లీ అలాగే తలవూపింది.

"మరి వెడుతున్నావేం?"

"శివన్నయ్య కోప్పడి కొట్టబోతాడు వెళ్లకపోతే"

"నే చెబుతాలే యివాల్టికి బడికి వెళ్లొద్దులే."

సంతోషంతో పొంగిపోయినట్లుగా యెగిరి, "పెద్దమ్మకి చెప్పొస్తాను వెళ్లనని" అని పరిగెత్తింది

మూడు నిమిషాల్లో ఫలహారం పళ్లెం చేతపట్టుకుని తిరిగివొచ్చింది, అనూరాధ.

"నీకిమ్మని యిచ్చింది పెద్దమ్మ."

చిటీపళ్లెం అందుకుంటూ, "బడికి వెళ్లటంలేదని చెప్పావా?" అంది గీతాదేవి.

"నువ్వెళ్లొద్దన్నావని చెప్పాను పెద్దమ్మకి. సరే—అంది. శివన్నయ్య తిట్టాడు—తిట్టటం అంటే నవ్వుతూనే తిట్టటం" అని "మంచినీళ్ల గ్లాసు అక్కడే మర్చిపోయి వొచ్చా-తెస్తాను" అంటూ వెళ్లింది.

నిలుచునే—చెంచాతో ఫలహారంతీసి నోట్లో వేసుకుంటూ, అనూరాధ వెళ్లిన వైపుకే ముచ్చటగా చూసింది గీతాదేవి.

మంచినీళ్ళగ్లాసుతో గదిలో అడుగుపెడుతూ "పరవాలేదు; యేంటో అనుకున్నాను నిన్న" అన్నాడు శివరాం.

"అమ్మయ్య! అప్పటినుంచీ గుండె దడదడలాడి పోతోంది నాకు—వొక్కదాన్నీ చాటుగా గదిలో చేరి తింటూవుంటే చూసి కళ్ళెర్రచేస్తారో, గుడ్లు మిటకరిస్తారోనని" అని గలగలా నవ్వింది.

ముచ్చటగా, తృప్తిగాచూస్తూ "గలగలా కాదు నవ్వాల్సింది, పకపకా" అన్నాడు.

"అది మిమ్మల్ని చూసి నేర్చుకుంటాలెండి."

"వొక ధర్మవరం, వొక కంచి, కామాక్షీ, లోలాక్షీ—క్షీ—" అని అనుభూతిని గెలుగదట

గట్టిగా నవ్వాడు.

"నేను కాబట్టి లక్ష్యపెట్టలేదు గానీ సరోజ ఐతే మిమ్మల్ని, పక్షి అని మెచ్చుకుంటూ వుండేది!" అంది.

"నేనేమన్నా యెవరూ మెచ్చరులే. కన్నతల్లే మెచ్చదు. ఆ బదులు నువ్వున్నావుగా అన్ని మెప్పులూ పొందటానికి — ఆఫీసు నుంచి తిన్నగా బజారెళ్లి అధమం నాలుగు పట్టు చీరలూ నాలుగు జరీ నూలు చీరలూ తీసుకురమ్మని అల్టిమేటం. తప్పదు. రెండు నెలల అడ్వాన్సు జీతం కొట్టువాడికి సమర్పించిరాక."

"అత్తయ్యగారు అన్నారా?"

"అత్తయ్యగారెందుకంటారు? యిట్టే పావుగంటలో మెప్పించావు. యేమైతేనేం, నా రెండు నెలల జీతానికి — అందునా అడ్వాన్సు జీతానికి కాళ్లొచ్చినయ్?"

"బావుంది! నా కిప్పుడు చీరలెందుకు?"

"యేమో, నాకేం తెలుస్తుంది? స్నానాల గదిలో వొంటిమీద చీర విప్పి వుతికి పిండుకుని ఆరేదాకా నా డ్రాయరెక్కించు కూచున్నా అభ్యంతరం లేదు—" అని నవ్వి, "పెద్ద ప్రయోజకుడిలా చెప్పా పెట్టకుండా పెళ్లి చేసుకు రావటం తెలిసిందిగానీ పెళ్ళానికి కట్టుకోటానికి బట్ట అవసరం అని తెలవలా? నలిగిపోయిన చీర కట్టుకుని వుంటం చూస్తే నాకే ప్రాణం చచ్చిపోయినట్లుంది. పోయి బట్టలతోపాటు పువ్వులు కూడా కొని పటుకురా—అని కొరడాతో అదిలించింది. యింతకీ యిదంతా తమరి చలవ" అన్నాడు.

"యిదంతా వో పెద్ద తంతు కింద మారగలదు. అవేమీ వొద్దు పోడి విస్త్రీ వాళ్ళకి కొన్ని బట్టలు వేశాను. రసీదు నా హేండ్బేగ్‌లో వుంది అవి తెప్పించండి చాలు" అంది.

"ఆ మాట అమ్మకి చెప్తే—"

ఆమె మౌనంగా వుండిపోయింది.

దగ్గరగా వొచ్చి, "గీతా. నేను చాలా అదృష్టవంతుణ్ని: అట్లా తీసుకురావటానికి-నువ్వు కాక యింకెవరైనా ఐ వుంటే యీ యిల్లు

అనుభూతిని గ్గెరుగదట

వొక్క పూటలో ప్రశాంతం కాలేక పోయేది!" అన్నాడు.

ఆమె మౌనంగా నేలమీదకి చూస్తూ వుండిపోయింది.

అనూరాధ కాఫీ తీసుకొచ్చింది యిద్దరికీ.

కప్పు అందుకుంటూ, ఆమెకేసి చూసి, "మరి త్వరగా వెళ్ళి వొక గంటలో తిరిగొస్తాను, సెలవు చీటీ రాశావా—అదుగో ఆ బల్లమీద సొరుగులో కవర్లు వుంటయ్, చూడు" అని— కాఫీ సాసర్లోకి వొంపుకుంటూ తాగుతున్నాడు.

సెలవ్వుత్తరం రాసి కవర్లో పెట్టి అంటించి బట్టల రసీదు జోడించి యిచ్చింది హడావిడిగా వెళ్ళిపోయాడు.

అనూరాధ తన బడి కబుర్లు చెప్పసాగింది వింటూ—లేచి, దుప్పటి దులిపి మడత వేసె, దిళ్ళు సవరించి సరిచేసింది. ముస్తాబు బల్లమీది రేడియో తుడిచి—సామగ్రి అంతా వొక క్రమంలో అమర్చింది.

అనూరాధను రమ్మని, మధ్యగదిలోంచి సుభద్రమ్మ పిలుపు వెళ్ళింది.

కొయ్య బీరువా ప్రక్కగావున్న రేకు గొట్టాల చట్రపు పడకకుర్చీ తీసి వాల్చుకుంది.

రెండు నిముషాలు యింటి కప్పుకేసి చూసి—కనురెప్పలు వాల్చింది.

—తను గడపలో కాలు పెట్టిన క్షణంలోవున్న తీరునుబట్టి యింత త్వరగా యిలా తయారౌతుందనిపించలేదు. చూడగా ఆవిడ మంచి మనిషి లాగానే వుంది పూర్వకాలపు మనిషి—ఐనా కూడా—అవును, నిజమే ఆ దృష్టితో చూసినప్పుడు దీన్ని పెళ్ళి అనే పేరుతో పిలవగలరా—అందులో అర్థంలేదని గ్రహించలేని స్థితి—వాళ్ళమీద దుగ్ధ పనికిరాదు. వాళ్ళను కసిగా చూడటం అజ్ఞానమే అవుతుంది. ఆవిడ అక్కడికి యెంత యిదిగానో—తను ఆవిడకి నచ్చకపోతే వుండేది వరస-నచ్చటం తన అదృష్టం. లేక పోతే యేం చెయ్యాల్సి వొచ్చేదో-రచ్చకి తట్టుకోలేక హాస్టల్‌కి వుడాయించాల్సి వొచ్చేదో ? అంతదాకా రాకుండానే — పాపం కోడలిని నవవధువు కళతో చూడాలని వున్నట్టుంది — సహజం. పోనీ ఆవిడ ముచ్చటైనా తీరుతుంది. కాస్త ఆ తోక గిరా పెట్టుకుని—తనకి నచ్చదుగానీ, అందరూ, అనుభూతిని గ్గెరుగదట

ముఖ్యం తెలుగు దేశంలో అవేగా.........

మగత నిద్ర పట్టేసింది. కొంచెం ప్రక్కకి వొత్తిగిలింది పాళం కుదుర్చుకున్నట్లుగా.

ముప్పావుగంట గడిచింది.

అనూరాధ గెంతుకుంటూ వొచ్చిన అలికిడికి, మెలుకువ వొచ్చి రెప్పలు విప్పింది.

"అనూ, యేం చేస్తున్నావు లోన ?" అంది.

"సీళ్ళు పోసింది. అన్నంపెడితే తినేసి" అని ఆగిపోయి-చెప్పాలా వొద్దా అన్నట్లు సందేహంగా చూపింది.

"చెప్పమ్మా, యేం చేశావు ఆ తరవాత ?"

"మరే పెద్దమ్మ, కోమలి వాళ్ళమ్మకీ, రవీ వాళ్ళమ్మకీ యింకా అవతల వున్న తాతగారింట్లోనూ చెప్పి రమ్మంటే వెళ్లొచ్చాను."

అదేదో చెప్పగూడని విషయం అని భావిస్తున్నట్లు గ్రహించి నవ్వు కుని, యేమని చెప్పావూ ?" అంది.

"మరే, వెళ్ళి—"

"మరే—అనకూడదు. చదువుకుంటున్న పిల్లవి కదా నువ్వు-మరేమో అనాలి. లేపోతే మరీ—అని కూడా అనొచ్చు. గుర్తుంచుకుంటావా ?"

తల వూపి; "మరే— మరేమో——నువ్వొచ్చావని చెప్పమంది పెద్దమ్మ" అంది.

"వాళ్ళతో కూడా నువ్వొచ్చావనే చెప్పావా-వేరేలా చెప్పావా ?"

"పెద్దమ్మ చెప్పి పంపింది యెట్లా చెప్పాలో—వూరికే ఆడుకోటాని కెళ్లినట్లుగా వెళ్లి తను చెప్పమన్నట్లు కాకుండా చెప్పమంది. మా శివ న్నయ్య మాకు చెప్పకుండానే పెళ్లి చేసుకుని వొదిన్ని తీసుకొచ్చాడు -అనీ."

కనుబొమలు యెగరేసి. కుర్చీలోంచిలేచి, "నీ పుస్తకాలు చూపిస్తా నన్నావుగా, తీసుకురా, చూస్తాను" అంది.

పరిగెత్తుకు వెళ్లి చంకలో కొన్ని పెట్టుకుని, చేతులతో కొన్ని పట్టుకుని వొచ్చింది అనూరాధ.

అనుభూతిసిగ్గెరుగదట

అందుకని యినప ఒల్ల మీద పెట్టి—పేము అల్లిన యినప కుర్చీ బల్ల దగ్గిరికి జరుపుకుని కూచుంది గీతాదేవి.

ఆమెను ఆనుకుని నిలుచుని తన పుస్తకాలలోని పాఠాల గురించి చెబుతోంది అనూరాధ. మధ్య మధ్యలో ప్రశ్నిస్తోంది గీతాదేవి.

పది నిమిషాలు గడిచాయి.

పెద్ద ప్లాస్టిక్ బుట్టతో చుట్టిన పలకల మూట చేతిమీద పెట్టుకుని గుమ్మంలోకి వొచ్చి, వాళ్లిద్దరినీ చూసి, 'యింటి బయట కాలేజీ, యింట్లో ప్రైమరీ స్కూలూ నన్నమాట—' అని నవ్వి 'యింద' అన్నాడు.

గీతాదేవి లేచి మూట తీసుకుని మంచంమీద పెట్టింది. అనూరాధ విప్పింది.

తన బట్టల కాగితపు సంచి తీసి, అడుగున వున్న పొట్లాల చుట్టూ ప్లాస్టిక్ బట్ట చుట్టేసి, 'ముందు అత్తయ్యగారికి చూపిరండి' అంది.

"యింకా నయం అత్తయ్యగారినే కట్టుకోమనలేదు" అని నవ్వాడు.

"మీకు అనే మాటా అనగూడని మాటా తెలియనట్టుందే!"

"అమ్మ పనిలో వుంది నీకు చూపెట్టమంది. వొచ్చి చూస్తుందిలే తరవాత."

అరవైమైళ్ళ వేగంతో ప్రయాణిస్తే గానీ యీ వేళకి రాగలిగాను కాను" అంటూ పడక కుర్చీలో కూచున్నాడు.

"యేం చేస్తున్నట్లు? తీసి చూడు" అన్నాడు.

"చూటొచ్చులెండి."

"ఆఫీసులో చుట్టూ మూగిన వెధనల్ని నెట్టేసుకుని మరీ పోయి తీసుకొచ్చానుపడుతూ లేస్తూ!"

"నేనేం చెప్పలేదు యివన్నీ కొనుక్కురమ్మని!"

"చెప్పకపోయినా తెచ్చింది నీకేగా, అది విప్పి యిట్లా పట్టుకురా."

"అత్తయ్యగార్ని ముందు చూడనివ్వండి."

"వాసి రాధీ, పెద్దమ్మని తక్షణం రమ్మంటున్నానని చెప్పు వెళ్లి అన్నాడు.

"అనూ, వొద్దమ్మా" అని అతనివంక చూసి. 'మీరే పిలవండి అనుభూతిని గ్గెరు గడట

వెళ్ళి" అంది.

వెళ్ళబోతున్న అనూరాధ నిలబడి పోయింది.

'వొాసీ రాధీ నీకే చెప్తోంది. అసలు నువ్వు యెవరిమాట వింటావ్? నా మాటా, మీ వొదిన మాటా?'

వొకక్షణం ఆలోచించినట్లుగా చూసి, 'యెవరిమాటా వినను. నాకు డ్రాయింగ్రూంలో పనుంది. పోతున్నాను' అంటూ పరుగుతీసింది.

'యీ యింట్లో ఆఖరికి యీ పసిదికూడా నాపట్టు కాదన్నమాట!' అని నవ్వుతూ లేచి వెళ్లాడు.

రెండు నిమిషాలలో తిరిగివొచ్చాడు. అతని వెనక పవిటకొంగుకి తడిచెయ్యి అద్దుకుంటూ వొచ్చింది సుభద్రమ్మ.

మంచం అంచుమీద కూచుని కిందకి చూస్తున్న గీతాదేవి లేచి నిలబడింది.

'కూర్చో—మ్మా. లేవటం దేనికి? నాకేం తెలుస్తయమ్మా యీ కాలం బట్టలు—'

'యిప్పటి బట్టలన్నీ పిచ్చిపిచ్చివే లెండి. మీ కాలం వాళ్ళకే తెలుస్తాయి లక్షణంగా వుండేబట్టలు' అంది గీతాదేవి.

మూటవిప్పి వొక్కటొక్కటే మంచంమీద పరిచింది గీతాదేవి.

"అట్టా కుర్చీలో పడుకుంటే యేవున్నట్టు కొనుక్కొచ్చిన వాడివి యేదెంతో యేంటో చెప్పకుండా?" అంది సుభద్రమ్మ వొ చీరతీసి చూస్తూ.

"అవేం తెలవదునాకు. కొట్టతనికి నువ్వు చెప్పిన పేర్లు చెప్తే యీ మూటకట్టి యిచ్చాడు. యేవున్నాయో చూడు" అన్నాడు, కుర్చీలోంచి లేవకండా.

'దూదేకులాళ్ళ గళ్ళబట్టలు తొడుక్కునే నీకేం తెలుస్తయ్లే—'

'అది నైట్ డ్రస్ తెల్లదొరలు వేసుకునేవి, దూదేకులాళ్లకాదు.'

రెండు ధర్మవరం, వొక మైసూరు, వొక కంచి-పట్టుచీరలు; వొకటి గద్వాల, రెండు వెంకటగిరి నేత చీరలు.

వాటికి పోలిన రంగుల్లో బ్లౌజు బట్టలు.

గద్వాల చీర పట్టుకుని పరిశీలనగా చూసి, వేళ్ళతో తడిమి,

"యిదేం నేతో యెప్పుడూ చూడనేలేదు" అంది స్వగతంలా.

"గద్వాల చీరలని హైదరాబాదులోనూ అటూ విరివిగా వుంటాయి" అంది గీతాదేవి.

"అదాటున చూస్తే పట్టు చీరేవోననిపించేటట్టుంది."

చీర చూసి "నూట పది" అంది గీతాదేవి.

"శివా, వూళ్ళో పెద్ద పెద్దకొట్లు అన్ని వున్నయ్ కదా మంచి మావిడి చిగురు రంగు పట్టుచీర కనపడనేలేదా నీకు?" అంది.

"ఆ మావిడి చిగుళ్ళూ దేవుడి చిగుళ్ళూ చూసి కొందువుగా రమ్మంటే రాకుండా నన్నడిగితే నాకేం తెలుస్తుంది? వాళ్ళిచ్చినవి తీసి కొచ్చాను. నచ్చనివి వేరే పెట్టే వాపసు యిచ్చేస్తాను" అన్నాడు.

"బాగానేవుంది నీ వాలకం! వాపసవ్వటానికా కొని తెచ్చుకునేది! తొలిసారిగా కొని తెచ్చినవి. వాపసూ వొద్దు గీపసూ వొద్దులే నీ పుణ్యం" అని ప్రక్కకి తిరిగి, "నీళ్ళు కాగినయ్యేవో—" స్వగతంలా అని "యిప్పుడే నీళ్ళు పోసుకుంటానంటే తోడతానమ్మా" అంది.

"నాకు చన్నీళ్ల స్నానమే అలవాటు ప్రొద్దుటే చేసేశాను" అంది గీతాదేవి.

"యింత చలిరోజుల్లో—పొద్దున్నే చన్నీళ్ళోసుకున్నావా—జలుబు చేస్తుంది. యీ వూరికి పాడు సముద్రపు గాలొకటి—" అని గీతాదేవి వంక చూసి, "కాస్త తలారా పోసుకుంటే—" అంది.

"తల స్నానంకూడా చన్నీళ్ళతోటేచేస్తాను. వేన్నీళ్ళు మీ అబ్బాయి గారికి తోడండి."

"వేన్నీళ్లు చాలవనా? వాటికేం భాగ్యం, చేస్తే నలుగురికి సరిపడా వున్నయ్యి."

"లేవని కాదత్తయ్యగారూ—నేనెప్పుడూ చన్నీళ్ల స్నానమే" అంది.

"యేంటోనమ్మా యీ కాలం పిల్లవే ఐనా సివన్నీ చిత్రంగా వున్నయి. మా సుజాత మసిలిపోయే నీళ్లు పెడితేనే చేస్తుంది. వాడసా రెప్పుడోగానీ వేడినీళ్లు లేకపోతే వారం రోజులు నీళ్ళోసుకోకుండా వుందట. అదీ వీడికి మళ్లేనే పెంకిదిలే" అని యింకా యేవిటో వినిపించి

వినిపించనట్లుగా అనుకుంటూ గది బయటికి వెళ్ళిపోయింది.

అనూరాధ వొచ్చింది. దారపు వుండ, రెండు చిన్న డబ్బాలూ చేతో పట్టుకుని.

"ఓసే రాధీ తప్పుడు దానా నా గదిలోకి రావొద్దింక నువ్వు"

"నేను మా వొదిన గదిలోకొచ్చాను."

"ఓసే, యేవంన్నావే?"

మంచంమీది చీరలు కదిపి చూసి, "యివన్నీ దేనికి?" అంది అనూరాధ.

"చీరలు దేనికో తెలియదా అనూ!"

"కట్టుకోటానికని తెలుసుగానీ యెవరి కోసం-అని."

"నువ్వు పెద్దదానివై పెళ్లి చేసుకున్నప్పుడు యిద్దామని తెచ్చారు మీ శివన్నయ్య"

"నే నసలు చీరలే కట్టుకోను. నాకు తెలుసులే—నీకే."

"నీకు యేవి నచ్చాయో చెప్పు అనూ."

"అతగారి సెలక్షనేంది. యిక ఆడబిడ్డ సెలక్షను—యీ పొట్టి ముండ ఆడబిడ్డ నీకు!" అని నవ్వాడు.

"నన్ను ముండ-అంటే పెద్దమ్మకి చెపుతాను."

"నీకు కూత పెరిగినట్లుంది-అసలు నువ్విట్రా. నీ పని చెప్తా" అని గదమాయించాడు.

మూడు చీరలు చూపెట్టి—అవి తనకి నచ్చాయని చెప్పింది అనూరాధ.

"వాటిలో యేది యెక్కువ బాగా నచ్చిందో చెప్పు. చెబితే, ఆ చీరే కట్టుకుంటాను యీ పూట"

ఆకుపచ్చ ధర్మవరం చూపెట్టి, "అది అన్నిటికన్నా బాగుంది" అంది అనూరాధ.

"ఓసే రాధీ, పువ్వులపొట్లం స్కూటర్ సొరుగులోనే మర్చిపోయి వొచ్చాను. పోయి పట్రా త్వరగా" అన్నాడు.

అనుభూతిసిగ్గెరుగదట

పరుగు తీసింది బయటికి.

తువ్వాలు తీసుకుని గదిలో కుడి ప్రక్కకి నడిచి స్నానాలగది తలుపు తెరుస్తోంది గీతాదేవి

"వేణ్ణీళ్లకి నీ వొళ్లు పొక్కుతుందా?" అన్నాడు నవ్వుతూ.

"అవును· చన్నీళ్లకి కొందరి వొళ్లు పుళ్లుపడినట్లు" అని నవ్వింది.

"అన్నట్టు సబ్బు అరిగిపోయింది. టేబిలు కబోర్డులో వుంటయ్— తీసిస్తాన్నే."

"సబ్బు అవసరం లేదు."

"సబ్బంటే మామూలిదికాదు. అమెరికా ట్వైలైట్ సోప్."

"వుద్యోగంతోపాటు సబ్బులూ తల నూనెలూ కూడా అమెరికా వేనా!"

"మా బాస్ ఆ మధ్య అమెరికా వెళ్లొచ్చినప్పుడు తెచ్చాడు. యేదో పనిమీద యింటికి వెళ్తే వొక అరడజను యిచ్చాడు నాకు. యేం, సబ్బు వాడవా? ముందుగా చెప్తే గోదావరి నుంచి వొండుమన్ను తెప్పించి పెట్టే వాణ్నిగా! యీ వూళ్ళో సముద్రపు యిసక మాత్రమే దొరుకుతుంది" అని నవ్వాడు.

"అన్నట్లు మర్చేపోయాను. ప్రొద్దుట స్నానం చేసినప్పుడు అను కుని కూడా—" అని స్వగతంలా అంటూ, తువ్వాలు కుర్చీమీద వేసి వంటగదిలోకి వెళ్లింది.

వేణ్ణీళ్లు తొలుపుతూ వున్న సుభద్రమ్మ, ఆ నీళ్ల చప్పుడులో; గీతాదేవి రావటం గమనించలేదు.

"అత్తయ్యగారూ; కొంచెం చాయ పసుపు వుంటే కావాలి స్నానా నికి" అంది నిదానంగా.

"వుందమ్మా, ఆ మధ్యనే వూరినుంచీ పీశడు కొమ్ములు కొట్టించి తెప్పించాను" అని తెలి ముక్క పళ్లెంలో కాస్తపోసి యిచ్చింది. అందు కుని ప్రక్కకి తిరిగి గుమ్మం దాటుతోంది గీతాదేవి.

"యేవోలే, తమ్ముడు కూతురని యిదవటవేంగానీ—" అని సుభ ద్రమ్మ తనతో కాసు మాటాడుకోవటం వినిపించింది.

తనుకూ కిపిగ్గ గుగుక్కు

గదిలోకి వొచ్చి, అతని ముందు నుంచే స్నానాల గదిలోకి వెడు తోంది గీతాదేవి.

కుర్చీలో పడుకుని, చేత్తో కాగితం విప్పుని సబ్బుబిళ్ళ పట్టుకుని, 'యిందు' అని చెయ్యి చాపి, ఆమె చేతులో పసుపు పళ్ళెం చూసి, "యేంటి దంతా. అమ్మ యిచ్చిందా పూసుకోమని. కొంపదీసి పూసుకునేవు! వొక వేళ పూసుకున్నా యిదుగో యీ సబ్బుతో అంతా కడిగెయ్" అన్నాడు.

అతని వంక తాపీగా చూస్తూ సన్నగా నవ్వింది.

'యిట్లా రా.'

'రాను.'

'యిట్లా వొస్తావా ?'

'వూఁ' అని నవ్వి దగ్గిరికి వొచ్చి "యీ యింట్లో పెద్దవాళ్ళ దగ్గిర నుంచీ చిన్నవాళ్ళ వరకూ, అందరినీ గదమాయించటమేనా మీ పని ?" అంది.

"గదమాయిస్తే యెవడు వూరుకున్నా నువ్వు వూరుకునేటట్లు లేవుగా! ఐతే యింతకీ అత్తగారి కోర్కె ప్రకారం ఆ చెత్తంతా పూసు కుంటావన్న మాట వొంటికి !"

"కాదు; నేనే నాకు పసుపుతో స్నానం అలవాటు. మామూలుగా ప్రొద్దుటే లేవగానే ముఖానికి పొడి పసుపు బాగా రుద్దుతాను. తరవాత స్నానం చేస్తాను, వొంటికికూడా రాసుకుని."

"నిన్ను చూసి, డార్జిలింగ్‌లో పుట్టి కాలిఫోర్నియాలో పెరిగి వొచ్చా వనుకున్నాను. తీరా చూడగా — పసుపు, కాటుక, కుంకుమా, పసుపుతాళ్ళూ యింటి పనులూ యిట్లా అని తెలిస్తే——" అని చెయ్యి పట్టుకుని కిందకి లాగాడు.

పసుపు వొలికి పోకండా చూసుకుంటూ వొంగి, "యిలాంటి మాటలు విని విని వున్నదాన్ని — నేస్తాలూ తదితరులూ అంటూనే వుండే వాళ్ళు. నా కెందుకో నమ్మిక వొంటికి పసుపు మంచిదని. లోషన్లూ, క్రీములూ చర్మానికి పాలిపోయిన రంగునిస్తాయి పడమటి దేశాల తెల్లి చర్మం ఐతే యేమో మరి. పసుపు చర్మానికి జీవకళ నిస్తుంది ఆరోగ్య

అనుభూతిని గెరుగదట

రీత్యా కూడా మంచిది. నేను అతి నవనాగరిక స్త్రీని కాదు, ఆరోగ్యానికి మంచిదీ, మనసుకి నచ్చిందీ-యే పనైనా చేస్తాను. నన్ను యేవీఁ తెలియని పాతకాలపు మొద్దు అనుకున్నా పోకిరీ షోకిలా మెరుపుతీగ అనుకున్నా నాకేం బాధలేదు. కొత్త-పాత, రెండూ అక్కరలేదు నాకు. ఆ రెండూ వున్న మూడోదికావాలి' అంది.

"ఐతే తరగతుల్లో నువ్విట్లా వుపన్యాసాలిస్తావన్నమాట!" అని నవ్వి, యింకా కిందకి వొంచి పెదవులు తాకబోయాడు.

'పసుపు' అంది.

'పోనీ'

'మీద పడుతుంది'

'పడనీ'

కొంచెం విడిలించింది. గాలికి యెగిరినట్లుగా రేగి, కొంత అతని ముఖంమీద పడింది.

'త్ప్వూ-' అనుకుంటూ, దులుపుకున్నాడు ఆమె చెయ్యివొడిలి.

వొక అడుగు అవతలికి వేసి, పసుపు పళ్లెం బల్లమీద పెట్టి-దగ్గిరిగా వొచ్చి, మోకాళ్ళు రెండూ నేలమీద ఆన్చి అతని ఛాతీదగ్గిర కుర్చీమీద రెండువైపులా అరిచేతులు ఆన్చి, తలవొంచి, అతని పెదవులను అద్ది, తడిచేసి-అరనిమిషం అలాగే వుంచి-వొత్తి నొక్కి- పెదవులకి పెదవులు గుండ్రంగా అతికింది.

తృప్తిగా, ప్రేమగా ఆమె కళ్ళలోకి చూశాడు.

"గీతా !"

'యేవిఁటి!" అన్నట్లు కనుబొమలు కదిపి, కళ్ళతో అడిగింది.

"గీతా

అతని ముఖాన్ని చేతులలోకి తీసుకుని, "యేవిఁటో చెప్పు మరి అంది

"గీతా !

"యిష్-" అని, నవ్వుతూనే లేచి పసుపు పళ్ళెం తీసుకుని వెళ్ళింది. మళ్ళీ బయటికి వొచ్చి, కుర్చీ మీదవేసి మర్చిపోయిన తువ్వాలు తీసుకుని, అనుభూతిని గ్గెరుగదట

పట్టు చీరకేసి చూసి—"మీరు ఏ పావుగంట డ్రాయింగ్రూంలో కూర్చో కూడదూ?" అంది

"స్నానాల గదిలోనే కూర్చోకూడదా?"

నవ్వి "అలాగే, నాలుగు రోజులు పోయాక" అంది.

"చిత్తం" అంటూ లేచి బయటికి వెళ్లాడు.

గది తలుపు గడియ వేసుకుని, స్నానాల గదిలోకి వెళ్ళింది. తువ్వాలు చూపుడు వేలికి తగిలించుకుని.

తల స్నానం ముగించి, తువ్వాలు భుజం మీది నుంచి తొడల వరకూ యేటవాలుగా రెండు చేతులతో నొక్కి పట్టుకుని గదిలోకి వొచ్చింది.

చాకలి ఒగ్గిరి నుంచి వొచ్చిన బట్టలలోవున్న పూదా లోపావడా తీసి కట్టుకుని, విప్పిన బ్రాసియరు వేసుకుంది. జుట్టు మళ్ళీ తువ్వాలుతో తుడిచి, విదిలించి, దులిపి, తల మీదినుంచి తువ్వాలువేసి తిప్పి ముడి చుట్టింది. ఆకుపచ్చరంగు పట్టుచీర తీసి కట్టుకుంది తొమ్మిది కుచ్చిళ్ళు అమర్చి, చీర రంగుకి కలిసే బ్లౌజు తనబట్టలలో లేకపోవడంతో, తెల్ల బ్లౌజు వేసుకుంది. స్నానాల గదిలోకి వెళ్ళి వుతికి పెట్టుకున్న లోపావడా ఆరవేసి, మంగళసూత్రం వేసుకుంది. మళ్ళీ గదిలోకి వొచ్చి తువ్వాలు ముడి వూడలాగి, జుట్టు విడిలించి జారవిడిచింది రెండు చేతులతో ముఖం సున్నితంగా తుడుచుకుంది. కాటుక తీర్చి, తన చేసంచి లోంచి ఆరుద్రపురుగు రంగు ప్లాస్టిక్ భరిణ తెరిచి అదే రంగు కుంకుమ తీపి నిండుగా బొట్టు పెట్టుకుంది.

షాంపూ పరిమళంతో కలిసిన తన వొంటి పరిమళాన్ని శ్వాసలోంచి పీలవుతూ క్షణకాలం కనురెప్పలు వాల్చి, తెరిచింది.

కుడిపాపిట తీసి, చెవుల పై భాగాలు కమ్మేసేలా వొదులుగా దువ్వి జడవేసి, చివర మూడంగుళాల పొటవు అల్లకంకా వొదిలేసింది.

జడ చేత్తో పట్టుకుని వెనక నుంచీ పైకియెత్తి అద్దంలో చూసుకుని నవ్వుకుంటూ, తోక వుండీ యెగరలేనివాళ్లు ఆడవాళ్లు, తోక లేకపోయినా యెగరగలవాళ్ళు మగవాళ్లు. మరి, తను యెగరగలట్లా. యెగరగలనట్లా— కత్తిరింపు జుట్టుకీ, ముడికీ మధ్య మూడేళ్లు తోక పెళ్లాడేసుకున్న తను

<u>అనుభూతిని గెరుగదట</u>

యేదీకాదా—" అనుకుంటూ కుర్చీలోంచి లేచింది తలుపు గడియతీసి తెరిచి-వొచ్చి కుర్చీలో కూచుని, ముందుకి వొంగి కిందివైపున కుచ్చిళ్ళ ముడతలు సరిచేసి నొక్కి, అదిమింది. బల్లమీది పూల పొట్లం విప్పింది. చామంతులు, గులాబీలు, కనకాంబరాలు పొట్లం దారం సాపుచేసి, మూడు గులాబీలు వరసగా అమర్చి దారంతో కట్టి దానికి రెండు ప్రక్కలా రెండేసి చామంతులు కట్టింది. దారం కొస్త తెంచి కనకాంబరాలతో అడుగున్నర మాల కూర్చి, గులాబీ చామంతుల ముద్దకి చుట్టూ తిప్పి, కొంత మాల కిందకి జారవిడిచి, దారంతో అల్లికలా చుట్టి జడలో తురిమింది. కనకాంబరాల కొస, మెడ దగ్గిర భుజానికి ఆనుతోంది మిగతా పూలు అన్ని రకాలూ కలిపి మరో పెద్దదంప తయారించింది అంతలో అనూరాధ వొచ్చింది.

"మీ శివన్నయ్యని రావొచ్చన్నానని చెప్పమా" అంది

"లేడు, బజారుకెళ్లాడు."

"బజారా."

"అవును, మరే-మరి—"

"వూ" అంది. 'చెప్పూ' అన్నట్లుగా తలవూపుతూ.

"పెద్దమ్మకి నగలు తేవటాని కెళ్లాడు."

"కాదమ్మా. నువ్వు సరిగా విని వుండవు."

"వుహూ—సరిగ్గానే విన్నాను"

"సీకు అర్థమై వుండదు. చూడు ఆ మాల బావుందా ? పెట్టుకుంటావా?" అంటూ రెండుగా తెంచి, అనూరాధ జడలలో అమర్చింది, గీతాదేవి.

"నీ పట్టు పావడా బ్లౌజూ బావున్నాయి" అంది, గీతాదేవి.

"వోణీ వెయ్యమంటే, పెద్దమ్మ వెయ్యలేదు" అని తన అసంతృప్తికి నిరుత్సాహానికీ కారణం తెలియజేసింది

"యిప్పుడప్పుడే బాగోదు, యింకా నాలుగేళ్లు పోవాలమ్మా వోణీ వేసుకోవాలంటే"

"యెందుకనీ !"

"మరి చూడు, నేను చీర కట్టుకుంటే బావుంటుందా పాపడా బ్లౌజు వేసుకుంటే బావుంటుందా, చెప్పు?"

"చీర. పెద్దవాళ్లు పరికిణి వేసుకుంటారేం ఎక్కడన్నా!"

"అలాగే చిన్నపిల్లలు వోణి వేసుకున్నా బాగోదు నువ్వు యేదో తరగతిలోకి వొస్తావు చూడు, అప్పుడు వేసుకోవాలి. తెలిసిందా?"

పూర్తి వుత్సాహం రాకపోయినా తనకి వోణి వెయ్యాసి తన పెద్దమ్మతో రాజీ అయినట్టు సమ్మతి తెలియజేసింది తలతో.

"రాధా" అని పిలిచి గుమ్మంలోకి వొచ్చింది సుభద్రమ్మ.

కుర్చీలోంచి లేచి, "రండి" అని రెండడుగులు ముందుకు వేసింది గీతాదేవి.

"పెట్టుకోవాల్సిన వాళ్లులేక యింతకాలం మూలపడెయ్యాల్సొచ్చింది" స్వగతంలా అంటూ, చేతిలోని నూలుబట్ట విప్పి పెద్ద అట్టపెట్టె తీసింది. అనూరాధని డ్రాయింగ్రూంలోకి వెళ్లి ఆడుకోమంది. అనూరాధ అయిష్టంగా బయటికి అడుగులు వేసింది.

బల్లమీద ఆన్చి పెట్టె తెరిచింది. నగలు. యెనిమిది పేటల చంద్రహారం, కాసులపేరు, నాగరం, మరో రెండు గొలుసులు, రవ్వల దుద్దులు గాజుల జొత్తి-యింకా అడుగున రెండు మూడు రకాలు, యేవో వున్నాయి.

గీతాదేవి వంక తేరిపార చూసి, సంతృప్తిగా చూపు వాల్చి, పాదాల మీద దృష్టిపడి—

"కాళ్ళకి పసుపు ముందుగానే రాసుకోవాలి యిప్పుడు రాసుకుంటే చీరకవుతుంది. దూమెరుగ్గా రాసుకోలే—" అని వెళ్ళబోయినట్లుగా కదిలి, ఆగి, "తొందరగా కానిస్తే భోంచేద్దురుగాని, యిక్కడికే బోలెడుపొద్దెక్కిపోయింది" అంది.

"యిప్పుడివన్నీ యెందుకండి అత్తయ్యగారూ?"

"యింకా నయం! అన్నీ అంటే, యెన్నున్నాయసలసలు? వొడ్డాణం అవీ పెట్టుపోతల కింద యిచ్చేశాను దాయలేక. యివి కూడా యెక్కడో బ్యాంకీలో దాచాడు అబ్బాయి" అని యింకా యేవిటో తనతో చెప్పుకుంటూ

వెళ్ళిపోయింది, గది బయటికి.

ఆ [illegible]త్తం నగలలో గీతాదేవికి, కాసులపేరు, రవ్వల దుద్దులు, గాజులు నచ్చాయి.

[illegible]సం, ముక్కు పుడక తప్పించి మిగతా అన్నీ పెట్టుకుంది.

అద్దంముందు నిలబడి, పెదవివిరిచి, 'యేమో మరి, నాకేం తెలుసు!' అన్నట్టుగా తనకేసి చూసుకుని నవ్వుకుంది. అదేవేళకి గుమ్మం లోకి వొచ్చిన శివరాం, 'యిట్లా అని తెలిస్తే ఫోటోగ్రాఫర్ని పిలుచు కొచ్చేవాణ్నే!' అని లోనకి వొచ్చి "సింప్లీ మార్వెలస్"—అన్నాడు.

'అన్నాలు వొడ్డించమంటారేవో అడిగి రమ్మంది పెద్దమ్మ.' అంది అనూరాధ గుమ్మంలోకి వొచ్చి.

గీతాదేవికేసిచూసి, వొక్క గెంతులో ఆమె దగ్గిరికివొచ్చి, 'యివన్నీ నీకోసం కొనుక్కొరమ్మందా పెద్దమ్మ!' అంది.

'కొనుక్కు రాలేదమ్మా' యివన్నీ బాంక్‌లో దాచారు. పెద్దమ్మవే యీ నగలు.' అంది గీతాదేవి—

'వొసే రాధీ, అన్నాలు పెట్టమనిచెప్పు, పోయి' గదమాయించాడు. వెళ్ళింది నిదానంగా.

'భోజనానికి పిలుపురావాలా? మనవే పెట్టుకోకూడదూ వెళ్ళి?' అని ముందుకు అడుగువేసి అతనికి దగ్గిరికివెళ్ళి నడుంచుటూ చెయ్యివేసి, బుజంమీద చెక్కిలి ఆన్చింది. ఆమె నడుంచుట్టూ చెయ్యివేసి బిగించి, వొదిలి-చూపుడు వేలితో కండకేసి నొక్కి—అతని పొట్టమీద వేళ్ళతో గిలి గింతలు పెట్టి-దూరంగా జరిగి, పరస్పరం కళ్ళలోకి చూసుగుని, గది బయ టికి అడుగులు వేశారు-భోజనాల గదిలోకి.

గీతాదేవి అయిష్టం తెలియజేసినా తానే వొడ్డించింది సుభద్రమ్మ.

* * *

యిరవై రోజులు గడిచాయి.

మొదటిరోజున క్వార్టర్సలోని ఆడవాళ్లు కొందరు మధ్యాహ్నంవేళ వొచ్చి చూసి వెళ్లారు గీతాదేవిని పెళ్ళి అలా ఆ తీరులో జరిగిపోయినం దుకు కొడుకుని నిరశిస్తూ, మరోప్రక్క, కోడలిని మెచ్చుకున్నట్టుగా అనుభూతిని గ్గ[illegible]గడట

భావం వ్యక్తం చేస్తూ చెప్పింది సుభద్రమ్మ. సాయంత్రం, శివరాం సహోద్యోగులు వచ్చారు— వివాహితులు భార్యాసమేతంగానూ. కార్యాలయం నుంచి వొచ్చిన బంట్రోతుతో పళ్లూ ఫలహారాలు తెప్పించి, చూడటానికి వొచ్చిన అందరికీ యిచ్చింది సుభద్రమ్మ. వొక బంట్రోతును పంపించి తన తమ్ముడి యింటికీ, వూళ్ళోవున్న యితర బంధువుల యిళ్ళకీ కబురు పెట్టింది.

సందె చీకటివేళ ఆమె తమ్ముడు వొచ్చాడు భార్యాసమేతంగా. లోన బాధవున్నా చక్కని జంట అని అన్నారు. అరగంటసేపు కూర్చుని వెళ్ళారు సుజాతని యెవరో డిప్యూటీ కలెక్టరుకిచ్చి చెయ్యబోతున్నట్లు, కట్నం తేల్చి చెబితే పెళ్ళి ఖాయపడినట్లే అని అన్నారు. సుజాత రమాపతులు రాలేదు. మరసటిరోజు వస్తామన్నారట. ఆ మరసటిరోజున రమాపతి వొచ్చాడు సుజాత రాలేదు. తన అక్కను గురించి చమత్కారపు వ్యాఖ్యానాలు చేస్తూ, గీతాదేవిని పొగుడుతూ సరదాగా కబుర్లుచెప్పి, మళ్లీ రెండోరోజు వస్తానని వెళ్లాడు ఆ తరవాత వొకటి రెండుసార్లు వొచ్చాడు. సుభద్రమ్మ సుజాత పెళ్లి ఖాయపడటం గురించి ప్రస్తావించితే, "ఆ విషయం మా అమ్మకీ, అక్కయ్యకీ పైన దేవుడికీ తెలియాలి" అన్నాడు రమాపతి. సుభద్రమ్మ, గీతాదేవిని వంటపనులలోకి రానివ్వలేదు; అవకాశం చిక్కినప్పుడు యేదొక పని అందుకోబోయినా.

వుదయం తొమ్మిది గంటలవరకూ వంటగది ప్రాంతాలలోనే తచ్చాడుతూ వుంటుంది గీతాదేవి. అనూరాధకి స్నానం చేయించటం, బడికి పంపటం తన పని చేసుకుంది. సాయంత్రాలు యెవరో వొకరు రావటం, మాట్లాడుతూ కూర్చోవటం అప్పుడప్పుడూ సముద్రపుటొడ్డుకి, రెండుసార్లు సినిమాకి వొకసారి, సుభద్రమ్మను బలవంతం మీద కదలదీసి అందరితోనూ.

యిన్నిరోజులూ చదువు సాగలేదు. పదిరోజుల సెలవు అయిపోగానే కళాశాలకి వెళ్లింది. జీతం తీసుకుని, తెచ్చి శివరాం కిస్తే, తన దగ్గిరే వుంచుకోమని ససేమిరా తీసుకోలేదు. కళాశాలకి వెళ్లిన మొదటి రోజునే హాస్టల్ నుంచి సూట్కేసూ బెడ్డింగూ తెచ్చేసుకుంది యింటికి.

పెళ్లయిన విషయం కళాశాలలో వాళ్లకి తెలిసిందట, యితరుల ద్వారా. సుజాతతో అంటే 'అట' అందిట. చెప్పకుండా చేసుకున్నందుకూ, పోనీ కనీసం అయ్యాక అయినా తెలియజేసి యింటికి ఆహ్వానించనందుకూ అభియోగించి-మంచి విందు యిస్తేకాని కుదరదంటే, హాస్టల్లో యేర్పాటు చేసింది. బయటినుంచి పదార్థాలు తెప్పించి.

గీతాదేవి కళాశాలకి వెళ్లేసరికి అందరూ హాల్లో కూచునివున్నా. అప్పటికి పదికి పది నిమిషాలు తక్కువ. గీతాదేవి గుమ్మంలో కాలు పెడుతూ వుండగానే అంతా వికవికలతో పకపకలతో చెణుకులు విసురుతూ గలభాలాగా చేస్తూ ఆహ్వానించారు. యిద్దరు ముగ్గురు అమాంతంలేచి వొచ్చి కౌగిలించుకుని నలిపివేసి సరసమాడారు. గీతాదేవి హాలు మధ్యలోకి వొచ్చి, కిటికీలోంచి బయటికి గంభీరంగా చూస్తూ కూర్చున్న సుజాతను చూసి పలకరించింది ముఖం చిట్లించి. "ఛీ" అన్నట్లు చూసింది సుజాత. వెంటనే అందరూ పకపకమని నవ్వారు. చివాలున లేచి బయటికి వెళ్లిపోయింది. సుజాత అంటే వాళ్లలో చాలమందికి పరిహాసం. దానికి కారణాలు రకరకాలు. అలా అని, ఆమెను అసహ్యించుకోవటమూ కాదు. గీతాదేవి ఆంగ్ల సాహిత్యంలో దిట్ట అనీ, మళ్ళీ విశ్వవిద్యాలయానికి వెళ్ళి పరిశోధనా అదీచేసి యెప్పుడో మొత్తానికి అక్కడే వుద్యోగం చేస్తుందనే భావంవల్ల కొంత అసూయలాంటిది వున్నా—గీతాదేవి తన అధిక్యతను విషయాలలో ప్రదర్శించుకోనందున సఖ్యతగానే వుంటారు. యీ పెళ్లితో ఆ వైఖరి సరదాతీరులోకి మారింది.

"యేవోయ్, గీతా, పాతికముప్ఫయ్యేళ్ల నుంచి మేనత్త కొడుకుని రిజర్వు చేసుకుని వుండనైనా లేక, మధ్యలో వొచ్చి యెగనెత్తుకుపోతావా!" అని వొకామె అంది

చిన్నగా నవ్వి, "యిప్పుడు మాత్రం యేం మించిపోయింది, సాయంత్రం వొచ్చి తన బావని వెంట పెట్టుకు వెళ్లిపోతే నేనేం కాదన్నానా!" అంది గీతాదేవి.

"ఓహోహో—" అని విరగబడి నవ్వారు.

"మొత్తానికి లక్కీఛాన్సు కొట్టేశావ్!"

అనుభూతిసిగ్గెరుగదట

"అలాగా! అయితే నేను పశ్చాత్తాప పడనక్కర లేదన్నమాట?" అంది గీతాదేవి.

"యేమి అతిశయం! కాల్టెక్సులో నెలకి యేడెనిమిది వందలు తీసుకునే నవకూబరుడు—సొంతవూళ్లో లక్షరూపాయల ఆస్తీ—నన్ను చేసుకోడానికి వొప్పుకుని వుంటే మా అయ్యన్ని వొదిలేసి వొచ్చి చేసుకుందును;" అని, వొక వివాహిత పకపక నవ్వింది. అందరూ నవ్వారు

మరో యిద్దరు గీతాదేవిని కౌగిలించుకుని, నలిపి—అందరూ తరగతులకి వెళ్ళిపోయారు.

సుజాత ఆ మరసటి రోజు నుంచీ, గీతాదేవిని గమనించనట్లుగానూ, అసలు యెరుగనట్లుగానూ, వొకతూరి కోపంతో చూస్తూ, ముఖం చిట్లించుకుంటూవుంటుంది. వొకటి రెండుసార్లు, గీతాదేవి సుజాతతో మాట కలపటానికి ప్రయత్నించింది—యేవోఁలే తనదృష్టి తనది భావ్యం అయినా కాకపోయినా అని అనుకుని. కానీ సుజాత గీతాదేవిని ఆగర్భ శత్రువును చూసినట్లు చూడసాగింది.

వూళ్ళనుంచి అప్పుడు నలుగురు అప్పుడు నలుగురు బంధువులు వొచ్చి చూసి వెళ్లారు. గీతాదేవిని యెవ్వరూ ప్రత్యేకించి అసహ్యించుకోవటం జరగలేదు. లక్షణంగా పెళ్ళిచేసుకోవాల్సింది పోయి—యిదేమన్నా లేవొచ్చిన దానితో పెళ్ళనా, కులంలేని దానితోనా—మొకురు సన్నాని, చాటుగా చేసుకోవటం దేనికి!" అని అభిప్రాయం వెలిబుచ్చారు. అయితే ముందుగా అన్ని వివరాలతో తెలియజేసి వుంటే అందులో యెందరు నిజంగా మద్దతుయిచ్చి వుందురు—అనేది వేరే విషయం. ముఖ్యం అనూరాధకీ గీతాదేవికి మధ్య యేర్పడిన అనుబంధాన్ని చూసి ముచ్చటపడ్డారు. పెద్ద చదువు చదువుకున్నాకూడా గర్వమూ అతిశయమూ లేదనీ, చక్కగా మాటా మంచీ తెలుసుననీ, యింటి పనులుకూడా చూసుకుంటుందనీ మెచ్చుకున్నారు, పరోక్షంలో. అందరితో తనని గురించి సుభద్రమ్మ మెచ్చుకుంటూ తృప్తిగా చెప్పి వుండాలి—అనుకుంది గీతాదేవి, వాళ్ళందరి వైఖరీ చూసి. యెండాకాలంలో వాళ్ళవూళ్ళకి రమ్మని ఆహ్వానించారు అనూరాధ తండ్రి కంచిపట్టుచీర కొనియిచ్చాడు. నలుగురెదుగురు కట్నం

రాలేపని అసంతృప్తి వ్యక్తంచేశారు.

కాలం సరదాగానే గడిచినా యేదో అసంతృప్తి, అనుమానంలాంటి మసక భావం చదువు సాగటంలేదు. అది సాగితే తృప్తిగా వుండును— అనుకుంది. యిరవైరోజులలోనే ఆ యింట్లో చాలాకాలంగా వుంటున్న దానిలా కలిసిపోయింది

వొద్దన్నా వినకండా ఆమెను చాలాసార్లు స్కూటర్‌మీద కళాశాలలో దిగబెట్టి మళ్ళీ సాయంత్రంవెళ్ళి యింటికి తీసుకు రావటమూ చేస్తాడు శివరాం అతని స్వభావం చి:తంగా అనిపించింది యీ యిరవై రోజులలో—కొంత మొరటుగా, దాటీగా మీరెంత పొమ్మన్నట్లుగా ప్రవర్తిస్తాడు అందరితో కానీ బంధువులు అందరికి అతనిపట్ల ప్రేమాభిమానాలు వున్నట్లు కనిపించింది. అందరినీ తీసిపారేసినట్లుగా మాట్లాడినా అతని మనసులో వాళ్ళందరిపట్లా గౌరవం, ప్రేమ అభిమానంవున్నట్లు అనిపించింది గీతాదేవికి. బహుశా అందుకే అతనిని అలా సాదరంగా యిష్టంగా చూస్తారేమో—అని కూడా అనిపించింది. రోజులుగడిచి దగ్గిరితనం వచ్చినకొద్దీ భర్తని నువ్వు—అనీ అప్పుడప్పుడూ మీరు—అనీ, నలుగురిలో వున్నప్పుడు విధిగా మీరు—అనీ సంబోధించసాగింది గీతాదేవి.

శివరాం చాలాసార్లు మౌనంగా, గంభీరంగా తీక్షంగా చూస్తూ కూర్చుండిపోతాడు. మాటాడటం మొదలుపెడితే అనర్గళంగా చెప్పుకుపోతాడు. మాంచి హుషారుగా వున్నప్పుడు అతిగా మాట్లాడతాడు. మనిషిలో తొందరపాటుతోపాటు పశ్చాత్తాపం; కాఠిన్యంతోపాటు మమత వున్నట్లు అనిపించింది. అప్పుడప్పుడూ విదిలింపుగా మాట్లాడినా సంభావాను గుణంగానే గానీ వుద్దేశితంగా కాదని అనుకుంది.

యేమీ లోటులేదు అంతా హాయిగా, తృప్తిగా, విలువగా ఆత్మీయత నిండిన వాతావరణం కానీ యెక్కడో లోలోన యేదో కొరతలాంటి ఫీలింగు.

*  *  *

రేడియోలో, సి హెచ్ ఆత్మా—ప్రియ తమ్ ఆజ్ మిళో—

భోజనంచేసి వొచ్చి వింటూ మంచం మీద వెల్లకిలా పడుకుంది.

గీతాదేవి. సాయంత్రం వొచ్చి మళ్ళీ వెళ్లాడు శివరాం, కార్యాలయంలో యెనిమిదిపరకూ యేదో పని వుందని.

మంచంమీద కొద్దిగా అటూ యిటూ కదిలి, నుదుటిమీదకి చెయ్యి తిప్పి మణికట్టు ఆన్చి, వింటూ కనురెప్పలు వాల్చింది.

కడుపులో యేదో అలికిడి అయినట్లుగా అనిపించింది; మనసులో

—బహిష్ఠ అవ్వాల్సిన రోజు దాటిపోయి వారం రోజులైంది—తనకెప్పుడూ అలా జరగలేదు. మహా అయితే వొకటి రెండు రోజులు. నెల తప్పలేదు కదా! వొక్క నెలగానీ తప్పితే ఆ వాటం చూసుకుని వరసగా తొమ్మిది నెలలూ తప్పుకుపోతాయి. వొకటి రెండుసార్లు ఆలోచన వొచ్చింది, యేదైనా జాగ్రత్తపడితే అని. కానీ లక్ష్యపెట్టాను కాదేం ? పోనీ వొస్తే రానీ—చదువు సరిగాసాగదే—ముందు పరిశోధనకి అంతరాయం అవుతుంది పోనీ—తాపీగా చెయ్యొచ్చు. యేవోలే, అంతదాకా వొస్తే అప్పుడు చూసుకుందాంలే అని అనుకుంటే అంతదాకానూ వొచ్చేసినట్లుం దిప్పుడు—యేవిటి చూసుకునేదిప్పుడు, సంచీ...

అప్రయత్నంగా కుడి చెయ్యి పొట్టమీద వేసింది — చేతికింద యేవో కదలికలు, ధ్వనులు.

—శతాబ్దాలనాడు జీవం పోసుకున్న అణువులోంచి వో నలుసు రాలి, యీ కండరాల మధ్య మాంసపు గొట్టాల వెంట—రంగు రుచీ వాసనా రూపం లేకండా సంగనాచిలా ప్రాకులోంది కాబోలు. యీ గుండెలో నెత్తురు పీల్చుకుని పాలప్రతిమ కేరుకేరుమంటూ వెలికి వస్తుంది కాబోలు. తను వాలుచూపుతో యెవరీ అపరిచిత జీవి— అన్నట్టుగా చూస్తే, తన హృదయాన్నీ రక్తాన్నీ ప్రాణాన్నీ ప్రోడిచేసుకుని చిందించే బోసినవ్వుకి మనసు వెన్నలా కరిగి— దగ్గిరికి తీసి హృదయానికి హత్తుకుంటాను కాబోలు— హృదయానికి, యీ హృదయానికి తన హృదయంలోని హృదయాన్ని హత్తుకుంటాను కాబోలు! బొజ్జలో ఆకలి, పైకి యెగదట్టి ఆ పసినోటిలో వింతధ్వనులై మ్రోగుతుంది కాబోలు—స్తన్యం కోసం యీ స్తనాలకి—యేవేవో ధ్వనులు వినిపించి స్వర ప్రకంపనలతో వుద్వే

అనుభూతిసి గ్గెరుగదట

గంతో యెగిరెగిరిపడే యీ స్తనాలకి— అప్పుడు పాలబంతులు కాబోలు— ఆ నోటికి అందించి – అబ్బ–యేదో, అప్పుడే యేదో గాఢభావన, యేదో పాలధార మెత్తని తీక్ష వొత్తిడితో స్రవించినట్లు— పాలు తాగటం కూడా రాని పసిజీవి—

అనూరాధ వొచ్చింది పుస్తకం చేతపుచ్చుకుని, లేచి పాఠం చెప్పి–బల్లముందు కూచుని చదవమంది గీతాదేవి.

అనూరాధ గడగడా చదవసాగింది తప్పులు సరిచేసుకుంటూ.

అంతలో శివరాం వొచ్చాడు.

"వెధవలు చెప్పింది చెప్పినట్లు వొక్కడూ చెయ్యడు. ఆ పైన చిక్కులొస్తే మళ్ళీ నేనే చక్కదిద్దాలి" అని బూట్లు విప్పుకుంటున్నాడు.

"అధికారులకి ఆ మాత్రం పనికల్పించకపోతే సోమరులై పోతారని వాళ్ళకి తెలుసు కాబోలు!" అంది గీతాదేవి. పడుకునే ప్రక్కకి తిరిగి మోచేతిమీద యేటవాలుగా లేస్తూ

"లేకపోతే మాత్రం డిస్ట్రిబ్యూషన్ ఆఫీసర్‌కి పనేం తక్కువనా?"

"భోజనం వొడ్డిస్తాను, పదండి" అంది లేవబోతూ.

"ఆ శ్రమ నీకు యివ్వాల్సిన పనిలేదు. మా అమ్మ వున్నంత కాలం. రా. నాకు జత కూర్చుందువు వూరికే"

"ఆవిడ నిలబడి వొడ్డిస్తోంటే, నేను తనిఖీకి కూర్చున్నట్లుగా దేనికి లెండి. త్వరగా తిని రండి."

"అందుకే కదూ నేను రావటం. యే కొంచెం ఆలస్యం అయినా అత్తయ్యగారితోపాటు వంట గదిలోనే సాపడుతున్నావ్!" అని నవ్వుకుంటూ గది బయటికి నడిచాడు.

అనూరాధ మధ్యమధ్యలో కునికిపాట్లు పడుతూ తప్పులు చదువుతూంటే, దగ్గిరికి పిలిచి,నిద్రవొస్తోందామ్మా? కునికిపాట్లు పడుతూ చదివితే పాఠం రాదు. నిద్రవొస్తున్నదని చెప్పాలి. అందుకు కోప్పడనమ్మా—ప్రొద్దుట చదువుకుందువుగాని" అని తల నిమిరి, ముద్దు పెట్టుకుని—పంపించింది

అనుభూతిసిగ్గెరుగదట

శివరాం చెయ్యి తుడుచుకుంటూ వొచ్చి తలుపుగడియ వేశాడు. వొక్కపొడి నోట్లో వేసుకుని నేరుగావొచ్చి మంచంమీద పడుకున్నాడు.

డ్రాయింగ్రూంలో గోడ గడియారం తొమ్మిది గంటలు కొట్టింది.

తన జీతంలోంచి నూటయిరవై రూపాయలకి యెన్నికచేసి కొని తెచ్చింది. దీర్ఘ చతురస్రాకారంలో నల్లపాలిష్ యెక్కించిన గడియారం. కింద వెండి సిగ్గుబిళ్ళలా పెండ్యులం. దానిపైన పలకల ఆకారంలో, గాడి కొట్టి లతలాగా చెక్కిన గాజుపలక. శ్రావ్యంగా గంటల ధ్వని.

యింట్లో అలా గంటలు కొడుతూ వుంటే గీతాదేవి కిష్టం. వొక రోజు పోయాక "ఆ గంటలు మోగుతాంటే యేంటో శుభంగానూ భయంగానూ వున్నట్లనిపిస్తాంది" అని మెచ్చుకుని, "యిట్టా యింటోకి వస్తువులూ అయ్యీ తెచ్చి చక్కగా పెట్టుకోవాలన్న ధ్యాసే లేదు వాడికి—యేంటో ఆ వుద్యోగంచేసి జీతం తీసుకురావటం తప్ప, పొలం సంగతీ పట్టదు. పింతండ్రులు మంచాళ్లు కాబట్టి సరిపోయింది గానీ లేక పోతే యేనాడో ఆగం అయిపోయేదికదూ ఆస్తి!" అంది సుభద్రమ్మ.

"నీ గంటలు విన్నప్పుడు దాంట్లో నువ్వే కూర్చుని పలికినట్లుగా వుంటుంది. పాడటం వొచ్చినదానివి కదా మరి' అని, ఆమె వీపుమీద చెయ్యివేసి కళ్ళుమూసుకున్నాడు.

సంగీతంలో తదాత్మ్యత పొందటం రాదని తెలుసుకున్న గీతాదేవి మౌనంగా వుండిపోయింది.

ప్రక్కకి తిరిగి బల్లమీది దీపం మీటనొక్కాడు.

"మీకు అవసరంలేనంత మాత్రాన యింకెవరికీ అవసరంలేదనే!" అంది.

"యేం వెధవ చదువు యెప్పుడూ! తెల్లార్లూ జాగారణ. వున్న డిగ్రీ చాలదా, పడుకుందూ."

"చదువు కేవలం డిగ్రీకోసమే కాదు."

"డిగ్రీకోసం కాకపోతే తెల్లార్లూ చచ్చీ చెడీ కళ్ళు పోయేలాగా చదవటం దేనికి?"

'చచ్చీ చెడీ—కాదు. హాయిగా తృప్తిగా అనిపిస్తుంది, చదువుకుంటూ

 అనుభూతిని గ్గెరుగదట

వుంటే."

"ఏం, అదేవన్నా సినిమా అనా డాన్సుప్రోగ్రాం అనా—హాయిగా జూయిగా వుంటానికి!"

మౌనంగా వుండిపోయింది,

వొళ్లు విరుచుకుని, "హా వుయ్" అన్నాడు

ప్రక్కకితిరిగి తనని దగ్గిరికి లాక్కుంటాడని ఆశిస్తూ కనురెప్పలు వాల్చి, అతని స్పర్శను ఫీలైంది.

అతని వీపుమీద చెయ్యివేసింది.

"చదువుకోవాలా?" అన్నాడు.

"యింకో గంట పోయాక ప్రారంభిస్తాను."

అతను, మాటాడలేదు, కదలలేదు.

చేత్తో అతని వీపుమీద వొత్తి, చుట్టూ తిప్పి దగ్గిరికి లాక్కుంది. అతను ఆమెకి దగ్గిరిగా అంటుకుని కదలకండా పడుకున్నాడు.

చేత్తో అతని వీపు నిమురుతోంది. అతని చర్మపు స్పర్శకి ఆమె వేళ్లు చలించి కదులుతున్నాయి.

రెండు నిమిషాలకి, "యేంటా పావుడు?" అన్నాడు విసుగ్గా.

మనసు చివుక్కుమంది మౌనంగా వుండిపోయింది.

అలా తరచూ అతను విసుక్కోవటం ఆమెకు అలవాటైంది. ప్రత్యేకం బాధ పడకపోయినా, ఎలాగో అనిపిస్తుంది. ప్రక్కన అతని వొళ్లు ఆని—ఆమె శరీరం వెచ్చగా ఐ మేలొక్కుంటుంది.

లోలోన ఏదో తపన.

"రామ్ యిలా. రా—నా గుండెమీద తలపెట్టుకో" అని అతని భుజం దగ్గిర పట్టుకుని పైకి లాక్కుంది. "ఊఁ" అని జరిగాడు.

అతని ముఖాన్ని స్తనాలమీద ఆన్చి, జుట్టులో వేళ్ళుదూర్చి కదుపుతూంది.

స్తనాలు పొంగినట్లుగా కదిలి—కిందినుంచి సెగలాంటి జ్వాల పొట్టలోకి ఎగిసి రెండోచెయ్యి అతని వీపుచుట్టూ ఆన్చి—కనురెప్పలు వాల్చింది.

స్థలం, కాలం గతులుదాటి, నాలుగో పరిమాణంలో మేధా వికాస అనుభూతిని గ్గెరుగదట

వివరణల కతీతంగా, విశ్వపు కదలికలో కదలిక ఐ, లయలో లయ ఐ, సమస్త దిశలనూ వొక్క బిందువులోకి కేంద్రించి స్పందిస్తోంది ఆమె అస్తిత్వం, పరమాణు కేంద్రబిందువు తానే ఐ, తనలో సమస్త విశ్వపు సాంద్రతనీ వేగాన్నీ, లయనీ, గానాన్నీ నించుకుని తన్మయత్వపు ముద్దలా ఐపోయింది.

"యెంతసేపు యిట్లానిద్రలేకుండా? నడుములు పడతయ్" అన్నాడు.

యదార్థం చెదిరి స్వప్నం ఐ స్థిరపడింది యీ లోకంలో కళ్ళు తెరిచి స్వప్నపు స్థిరత్వంలో నిలిచిపోతారు. మరో లోకంలో కళ్లు తెరిచి యదార్థపు సంస్పందనలో ప్రకంపనలు పొందుతారు. స్వప్నపు వలయంలో తానొక యిసుకరేణువు. యదార్థపు టనంత మైదానంలో పచ్చదనం ఐ అంచుల కోసం ప్లావితమయ్యే తాదాత్మ్యపు మంచుకణం.

దీర్ఘంగా బరువుగా శ్వాస విడిచి, "మూడుక్షణాల రేయి యెంత సేపు వుంటుందని? అలవోకగా వుంటే రెప్పపాటులో రంగు వెలిసిన బట్టలా తెల్లవారుతుంది. కొంచెం పైకి జరుగు. నీ పెదవులు నాకు అందటంలేదు" అంది.

కొంచెం పైకి జరిగి ఆమె పెదవులమీద పెదవులు వొత్తి—మరుక్షణంలో ముఖం ప్రక్కకి తిప్పుకున్నాడు.

"అలా కాదు. యిదో—" అని, అతని ముఖాన్ని తన చేతులలోకి తీసుకుని, పొడిపొడిగావున్న అతని పెదవులను తడితో. అద్ది—తెల్లగా ప్రకాశిస్తున్న జ్వాల బొగ్గులా గడ్డకడితే, యెర్రని సెగ రగిలించి ఆ బొగ్గును వజ్రంగా మార్చాలని తపనపడుతూ అతని పెదవులమీద మూర్ఛనలు పోతున్న తన పెదవులను గట్టిగావొత్తి—కదిలి—అతని కనురెప్పలను పెదవులతో అద్ది—

"రామ్, రా, వోహ్, ఆ—" అంది.

"యెంతసేపు? కానియ్మరి." అన్నాడు విసుగ్గా.

చట్టన కదిలి, మంచం పట్టిమీదకి జరిగి పడుకుంది.

"యీ కళలుగూడానా? నాకు బతిమాలుతూ కూర్చోటానికి వోపిక లేదు. యే వొచ్చిందింతలో?"

ఆమె మౌనంగా వుండిపోయింది,

"నాకు నిద్రొస్తోంది, ఆ తరవాత నీ యిష్టం." అన్నాడు.

అలాగే మౌనంగా వుండిపోయింది. కళ్ళలోకి వుబికిన తడి దిండు కేసి అద్దుకుంది.

మూడు నిమిషాలు గడిచాయి.

"నెల తప్పినట్లుంది; వారం రోజులనాడు అవ్వాల్సింది, కాలేదు" అంది నిదానంగా, పొడిగా.

"గుడ్, ఐతే వొక ఛోటా కె. యస్. ఆర్. రాబోతున్నాడన్న మాట!" అని ఆమె మీద చెయ్యివేసి దగ్గిరికి లాక్కుని "యేవోలే. యెవడికి తెలుసు-ఛోటా కె. జి. డి. పోనీ-" అన్నాడు.

'యెవరుచెప్పగలం ఛోటానో ఛోటీనో—' అంది తాపీగా.

"అమ్మకి చెప్పావా?"

"అమ్మకీ, అమ్మలక్కలకి అప్పుడే చెప్పే విషయంకాదు. యింకా రూఢిగా తెలియదు" అంది.

"యింకా రూఢేంటి, రూఢికానిదేంటి!" అంటూ ఆమెను దగ్గిరికి వొత్తుకుని పడుకున్నాడు.

మళ్ళీ వొళ్లు వెచ్చగా అయి, శరీరంలో యేదో జ్వాలలా యెగిసి పోతోంది. అతని వీపుచుట్టూ చెయ్యివేసింది.

చెయ్యి బిగించింది.

వొరిగి, ఆమె మీదకి కదిలాడు

వెల్లకిలా తిరిగి—వీపుచుట్టూ చేతులు వొదులుగా బిగించి వేళ్ళతో నిమిరి-

ఆయాసపు వేడిశ్వాస, నరాల మెలకలు, చెమట — కదలికలు — తడి

అతనని, కదలకండా వుండాలన్నట్లు, చేతులతో కాళ్ళతో, నొక్కి-పట్టి - అస్పష్టపు కండరాల చలనంతో పాలపొంగులా యెగసి కుప్పకూలి పోవాలని—

పట్టు సడలించుకుని-కదిలి—రెండు వొంపులు, నాలుగు కదలికలు — ఆనుశగానిసిగ్గెరుగదట

ఆమె వొంటికి బరువుగా ఆనుకుని పోయి, ముఖం ఆమె మెడ దగ్గరనొక్కి— జారి, జరిగి, ప్రక్కకి తిరిగి పడుకున్నాడు.

ప్రక్కకి తిరిగి దిండులో ముఖం దూర్చి—వెచ్చని కన్నీళ్ళకు తడిసి చల్లగా ఐంది దిండు, ఆమె కళ్ళ దగ్గిర.

నిమిషమున్నరకి మించనివాడు, అలా గుడ్లెద్దు చేలోపడినట్లు కాక పోతే, కాస్సేపు గుమ్మున వుండమంటే వినడేం? పసివు—అనుకుంది.

అరగంట గడిచింది.

తల దిమ్మెత్తుతోంది నొప్పితో. కళ్లు మంటలుగా వున్నాయి. లోన బాధ, ఆవేదన, పూదరలాంటి కసి.

బొటనవేలితో నుదుటిమీద వొత్తుకుని తల గట్టిగా విదిలించి లేచి—

మంచం దిగి, స్నానాల గదిలోకి వెళ్ళి వొచ్చి, వో పుస్తకం తీసుకుని—బీరువాకి ప్రక్కగా తాను అమర్చుకున్న దీపం మీట నొక్కి—, పడక కుర్చీ వాల్చుకుంది.

ఆ కళ్లల్లో అఖాతంలాంటి బాధతో చలించే నీడలు, రెప్పలు వాల్చి ఆ నీడలలో చిక్కుకోవటం యిష్టంలేనట్లుగా, వెంటనే పుస్తకం తెరిచింది.

పావుగంట చదివింది.

పుస్తకం మనసులో యిమడదు. మనసు పుస్తకంలో యిమడదు. మనసులో తెల్లని అక్షరాల కత్తియుద్ధం. పుస్తకంలో నల్లని సిరాముద్రలు.

విసుకుగా పుస్తకం నేలమీదకి జారవిడిచింది.

అతను కొంచెం కదిలి, విసుక్కున్నట్లుగా గొణుగుడుధ్వనిచేశాడు. అంతలోనే అతని శ్వాస సవ్వడి.

లేచి, రేడియో వున్న ముస్తాబు బల్లముందు కుర్చీలో కూచుని నుదురు బల్లమీద ఆన్చింది. యెడమచెయ్యి మోకాలి మీదా కుడి చెయ్యి బల్లమీదా ఆన్చి కదలకండా అలాగే వుండిపోయింది.

పది నిమిషాలు గడిచాయి.

నుదురు బల్లకేసి అదిమి అటూ యిటూ కదిపి—లేచి—గది తలుపు చప్పుడవకండా తీసింది.

అనుభూతిపొరుగదట

మధ్యగదిలో మంచం మీదసుభద్రమ్మ నిద్రపోతోంది; ఆమెను అంటిపెట్టుకుని అనూరాధ.

డ్రాయింగ్రూంలోకి వొచ్చి వెల్లకిలా పడుకుంది సోఫాలో. పావు గంటకి నిద్రసోకినట్లయింది.

ఆవిడ లేచి చూస్తే బాగోదు యేదో గ్రహింపుకొచ్చినట్లు అర్థమైనట్లు ఐ, బాధ పడొచ్చు—అనుకుని, లేచి పడక గదిలోకి వొచ్చింది.

మంచం అంచుమీద పడుకుంది—విసుగు, చిరాకు, బాధ, కసి, చల్లారని సెగ—

వొక గంటకి నిద్రసోకింది.

కలత నిద్ర, నిద్ర కలత – మూడున్నరకి మెలకువ వొచ్చింది. యేదో అనుమానిస్తున్నట్లుగా, తనలోకి చూసుకుంటున్నట్లుగా ముఖం పెట్టి—లేచి, కుచ్చిళ్లు పట్టుకుని చీర పైకి యెగలాగి, ముందు వెనకా చూసుకుంది—తెల్లని లోపావడా మీద యెర్రని తడిముద్రలు.

మాఘమాసాంతంలో చిన్నపాటి వుత్సవంలాంటి క్రతువు జరిపింది సుభద్రమ్మ. నాలుగు రోజులు సెలవ పెట్టి పనుల్లో ఆమెకు చేదోడుగా వుండిపోయింది గీతాదేవి. కాని యే విషయంలోనూ తను స్వతంత్రించి యేదీ చేసేదికాదు. వొక ప్రక్కన యెంతో ఆత్మీయ వ్యక్తిగా వుంటూ మరో ప్రక్క దూరంగా వుండటం అలవరచుకుంది. అది అనుభవంకంటే స్వభావానుగుణంగానే వొచ్చినట్లనిపిస్తుంది. మంచి చెడ్డల విషయం అటుంచి—తన కిష్టంలేని విషయాలలో ఆమెది "మూడుకోతుల సూక్తి."

శివరాం వైఖరిలో మార్పులేదు. గీతాదేవికి యే అసౌకర్యం కలగటాన్నీ సహించలేడు. యింటినిండా రకరకాల పండ్లుతెచ్చి వుంచుతాడు. సాయంత్రంవేళ, గీతాదేవి సరిగా తింటున్నదీ లేనిదీ అజ కనుక్కుంటాడు. గీతాదేవి వొద్దన్నా వినకండా పచ్చలహారం కొన్నాడు. బజారు నుంచి వొస్తూ అప్పుడప్పుడూ తానే యెన్నికచేసి చీరలు కొనుక్కొస్తుంటాడు. మొత్తం అరవయ్ చీరలయ్యాయి. యీ మధ్య షిఫాన్, జరీ

అమకూలిసి గెరుగదట

అంచుల; జార్జెట్, డ్రాలాన్ చీరలు తీసుకొచ్చాడు. అప్పుడప్పుడూ విసుక్కున్నా, కసిరినట్లు మాట్లాడినా, కోపంగా తిట్టినంత పని చేసినా; మరసటిపూట అనునయించి బ్రతిమిలాడి ఆమె కోపాన్ని వుపశమింపచేస్తాడు. బాధ మరిచిపోయి, అతనిని పెనవేసుకుని యేవో రసభావాల నీడలలో కదులాడబోతుంది. ఆమె ప్రౌఢ్యలంమీద వెయ్యిగజాల యిళ్ళస్థలం తీసుకున్నాడు కొత్తగా.

బ్యాంకులో ఖాతా ప్రారంభించి తనజీతం జమ వేసుకోమన్నాడు. ఆ అలవాటులేని గీతాదేవి, ప్రతినెలా యేవేవో వస్తువులు కొని గృహాలంకరణచేస్తూ ఖర్చు పెట్టింది.

నాలుగు వైపులా గాజుపలకలు అమర్చిన సన్నటి బీరువా తయారు చేయించి, డ్రాయింగ్రూంలో గోడ గడియారానికి కింద యేర్పాటుచేసి అందులో రేడియో అమర్చింది. పూలగాజు గొట్టాలు, యేదో జమీందారీ వేలం జరిగితే స్ఫటికాల గుమ్మటాలు రెండు కొని, డ్రాయింగ్రూంలో వేళ్లాడ తీయించ్చి వాటి మధ్యలో కొవ్వొత్తుల బదులు పాలవిద్యుద్దీపాలను యేర్పాటు చేయించింది. సోఫాలకి మంచి బట్టకొని గలేబులు కుట్టించింది వొక జత. ముస్తాబు బల్లమీదకి గాజుపలక. విద్యుత్తు విస్త్రీ పెట్టె—యింటి రూపమే మారిపోయింది. యే మధ్యాహ్న వేళో, సుభద్రమ్మ యిల్లంతా తృప్తిగా చూసుకుని కోడలిని తలుచుకుని మురిసిపోతుంది.

యింకా కొనాల్సిన వస్తువులు చాలా వున్నాయి. చిట్టా మనసులోనే రాసుకుంది గీతాదేవి. పడక గదిలోకి వొక సోఫా కంబెడ్. వంట గదిలోకి కత్తిపీట, కొబ్బరి కోరుతో సహా అన్నీ తెలి వుక్కువి వుండాలి.

ఫాల్గుణం మధ్యలో సుభద్రమ్మ జబ్బుపడింది. నాలుగు రోజులు సెలవు పెట్టి, జబ్బు వుధృతం తగ్గేవరకూ యింట్లోనే వుండిపోయింది. యింటిపనులు, శుశ్రూషలతో, అసలే నిద్రలేని రాత్రులు గడుపుతున్న ఆమె కొద్దిగా చిక్కి; బాగా నలిగింది. శివరాం విసుక్కున్నాడు; కోపగించుకున్నాడు తిట్టినంత పని చేశాడు. పనిమనిషిని పిలుపించుతానంటే వినకుండా బుద్ధిలేకుండా యీ గొడ్డుచాకిరీ అంతా చెయ్యకపోతే—అని ఆగిపోయి విసురుగా అవతలికి వెళ్ళిపోయేవాడు అంత అవసరం అయి

అనుభూతిని గ్గెరుగదట

సప్పుడు అలాగే పిలిపించుదువు. భూదేవి లాంటి అత్తగారిని పని[redacted] మనిషి చేతులోకి విసిరి, డిటెక్టివ్ పుస్తకపో, సినీమాకో, క్లబ్బుకో, రివ్వున పోయేంత నాగరికురాలిని కాదు నేను. నా తల్లిని నేను యెరిగను. తల్లి అంటే యేవిటో తెలియజేసిందావిడ. మీకు గాని వేళకి యేదైనా అమరక పోతే చెప్పండి." అనేది. నాకేదో వేళకి అవసరలేదని బాధపడుతున్నానని అనుకునేంత గాడిదవి నువ్వు—అని విసురుగా అవతలకి వెళ్ళిపోతాడు.

'యేశుభవేళ ఆ గుండెలోంచి ఆ ప్రేమ పదార్థం స్రవించి నా మీద కురవటం ప్రారంభమైందోగాని, కురిసింది కురిసినట్లు తన చుట్టూ పేరుకుపోయి వుక్కిరిబిక్కిరి చేస్తోంది!' అని నవ్వుకునేది గీతాదేవి అప్పు డప్పుడూ.

కళాశాల, సుభద్రమ్మ, అనూరాధలతో పగళ్లు గడిచిపోతాయిగానీ, రాత్రులు గమనం లేకండా స్థిరంగా నిలిచి ఆమెకేసి చూస్తున్నట్లనిపిస్తు న్నాయి. ఆ మధ్య పుస్తకం తెరిచి కాలాన్ని మరిచి మునిగిపోవటం సాధ్యమవటంలేదు. శివరాంతో యేదో చిన్న ఘర్షణపడటం, లేక, మనసు చివుక్కుమనటం—ఆ పైన పుస్తకం చదవలేదు. నిద్రపోలేదు. కోపంతో అరిచి మరుక్షణంలో అతను నిద్రపోగలడు. వుదయం లేచి, ముభావంగావున్న ఆమెను అనునయించబోతాడు. వంట గదిలో తల వొంచుకుని, యేదో చేస్తున్నట్లుగా నటిస్తూ అతనిని గమనించనట్లుగా వుండి పోతుంది. కార్యాలయానికి వెళ్లేలోగా యేదొక వేళలో పడకగదిలో ఆమెను దొరక బట్టుకుని అనునయించి, బ్రతిమిలాడి బాధగా ఆమెకేసి చూస్తాడు. జాలిగా అనిపించి, పల్చగా నవ్వి, అతని భుజంమీద తలవాల్చు తుంది. అంతలోనే, యిట్లాగే భుజమ్మీద నిద్రపోయేవు నిలబడే! పది గంటలు దాటితే పరుగులు తియ్యాల్సొస్తుంది" అని జరిగి, "త్వరగా తెములు, కాలేజిలో వొదిలేస్తాను." అంటాడు. యేదో మధుర స్వప్నం లోంచి గావుకేకకి మెలుకువ వొచ్చి దిగ్గున లేచినట్లు గుండె కొట్టుకుని— రెప్పలు వాల్చి తాపీగా మధ్య గదిలోకి నడుస్తుంది.

చైత్ర మాసాంతంలో వొక సంఘటన జరిగింది. అప్పటినుంచి రెండుమూడు రాత్రులకొకసారి ఘర్షణ జరుగుతోంది. పగటివేళలకూడా అనుభూతిని గ్గెయుగదట

యేదొక విసురు, విసుగు అదిలింపు, తనూ గట్టిగా మాట్లాడితే సుభద్ర మ్మకి వినిపిస్తుందని; యీ పేచీలు ఆమెకికూడా తెలిసి బాధపడుతుందని. అక్కడికి పసికట్టి, వొకసారి, "వాడు మొదటినుంచీ యిట్లాగే మొకురు గటం మాట్లాడితే కోపం ముక్కు మీదుంటుంది. మనమంటే యిది లేకా కాదు. యేదో మనమే సర్దుకుపోవాలి" అని ప్రక్కకి తిరిగి, "వొర్నా యివరవూ(వున్న కోడలు దొరకబట్టి సరిపోయిందిగానీ" అని స్వగతం పలుక్కుంటూ, పవిటకొంగుతో కళ్ళు వొత్తుకుంటూ అవతలికి వెళ్ళిపో యింది సుభద్రమ్మ. అప్పటినుంచీ యెంత పేచీ వొచ్చినా నోరుమెదప కండా వుండేందుకు ప్రయత్నించింది, గీతాదేవి. కానీ—

ఆ సంఘటన జరిగిన దగ్గిరనుంచీ అశాంతిగా వుంటోంది మనసు. మనసులో యేవో రకరకాల ఆలోచనలు.

"నేనొక అలంకారపు వస్తువులా వున్నట్లనిపిస్తోంది నాకు." అని అంటే, "నోర్మూయ్" అని గద్దించాడు. బాధగా చూపువాల్చి, "ఆ మాటే నేనూ అని వుంటే!" అంది.

లెంపమీద వూచికొట్టాడు. "ఛీ" అంటూ గది బయటికి వెళ్ళిపో యాడు, బల్లమీద నుదురు ఆన్చి అలాగే వుండిపోయింది. వొకగంట తర వాత తిరిగి వొచ్చాడు. మెదలకండా మంచంమీద పడుకున్నాడు. పది నిమి షాలతో అతని శ్వాస సవ్వడి వినిపించింది.

అప్పటినుంచీ నిర్లిప్తత, అలక్ష్యంలాంటి నిరసన భావం. గొంతు బాగా తగ్గించి యెదుటమాట అనటం, కారణాలకి అర్థాలకీ సంబంధించి ప్రశ్నలు వెయ్యటం చేస్తోంది.

కానీ అతని వైఖరిలో మార్పులేదు. ఆమెపట్ల అతని ప్రేమ లంగా వుండిపోయింది. ఆమెకి యే లోటూ జరగకూడదనే భావం వుంది.

గీతాదేవి చిక్కిపోయిందని రెండు పూటలా పాలు, పండ్లరసం యిస్తోంది సుభద్రమ్మ. వైద్యుడికి చూపెట్టి మందులూ అవీ తీసుకురమ్మని చెప్పింది కొడుక్కి. ఆ అవసరం లేదని అతనికి తెలుసు. తనే బలానికి టానిక్కులూ అవీ తీసుకొచ్చాడు. సుభద్రమ్మ రెండు పూటలా అవి వాడ

టం సిద్ధంచేసి తానే తెచ్చి యిస్తుంది. యెలాగూ పూరుకోదని గుర్తు చెయ్యగానే తానే తీసుకుంటుంది గీతాదేవి.

యెప్పుడైనా, 'దేముడు యింకా వొక్క-కోరిక మిగిల్చాడు-' అని స్వగతంగా పలుక్కుంటుంది సుభద్రమ్మ.

'ఆ కోర్కె తీరటానికి యింకా మూడేళ్లు ఆగాలని తెలిస్తేతనని యేమనుకునేదో, పాపం!' అని అనుకుంటుంది గీతాదేవి.

చైత్రమాసం గడిచిపోయింది. కళాశాలకి సెలవులిచ్చారు. ఆమె వుద్యోగకాల పరిమితి అయిపోయింది.

యీ మధ్యకాలంలో విశ్వవిద్యాలయంలో ప్రొఫెసర్ని కలిసి మాట్లాడింది తన రిసెర్చి విషయం. యిప్పుడు కాదు. జూలైలో కదా చూదాంలెమ్మన్నాడు పగటి భోజనం అయ్యాక కాస్సేపు అలా గ్రంథాలయంలో కూచుని గడిపి వొస్తుంది. స్కాలర్‌షిప్ వొస్తుందో రాదో అని దిగులు. "వోడి స్కాలర్‌షిప్ రాకపోతే మునిగిపోయిందేమీలేదు. రిసెర్చిలో చేరు" —అని అంటాడు శివరాం. "యింట్లో అందరూ మంచి వాళ్ళు. అందరికి తనంటే అభిమానం. మంచివాళ్ల మధ్య తనకి బాధ—" అని అనుకుని విషాదంగా నవ్వుకుంటుంది గీతాదేవి — యేకాంతంగా కూచుని.

ఆ మధ్య వొక వుత్తరంలో, "అన్నట్లు, నాకు పెళ్ళైంది. అత్తవారింటనే మకాం" అని రాసింది శశాంకకి. ఆరో రోజుకి అనున్నర పేజీల జవాబు వొచ్చింది అతని దగ్గిర నుంచి. తనకు, తక్షణం వొచ్చి ఆమెను చూడాలనిపించినట్లూ త్వరలో రావాలనుకున్నట్లూ రాశాడు. రాశాడే కానీ ఫాల్గుణ మాసాంతం వరకూ రాలేదు. పత్రిక పనిమీద రావటం జరిగిందట—హడావిడిగా అరగంట కూచుని వెళ్ళిపోయాడు. కుశల ప్రశ్నలు వేసి, సుఖంగా వుంటోందని తలుస్తాను-అని అంటే, "చూశారుగా;యిల్లు సామగ్రి, ఆస్తి, వ్యక్తులు— అన్నీ వున్నాయి. అందరూ నన్ను చాలా అభిమానంతో చూస్తారు. యింక హాయి కాక యేముంటుంది!" అంది. "అవును నిజమే. కానీ మీ మొహంలో యేదో విషాదపు ఛాయ— సారీ, అనుభూతిని గ్గిరుగదట

నేను పొరబడి వుండొచ్చు. యెందుకో అలా అనిపించింది, మిమ్మల్ని చూస్తే"–అన్నాడు "సారీ అనవసరం మీరు పొరపడకపోయినా వుండొచ్చు" అని నిశ్శబ్దంగా నవ్వింది. ఆమె కళ్ళలోకి చూసి, యేదో అర్థమైనట్లుగా తల పంకించాడు. "ఓర్పు అవసరం. యేమైనావున్నా అదే చక్కబడు తుంది, నెమ్మది మీద" అన్నాడు "ఓర్పు, సమస్యా పరిష్కారికి అని నేననుకోను. అయినా, నేనేదో పశ్చాత్తాపపడాల్సిన పని చేశానని నేననుకో వటంలేదు దిగితేనే లోతు తెలిసేది. చాటుగా దిగినా–బహిరంగంగా దిగినా ఫలితం వొకటే–పర్యవసానమూ వొకటే" అంది. చటుక్కున వంగి ఆమె చేతులు పట్టుకుని "యేం మాటలు గీతాదేవిగారూ!" అని చటుక్కున చేతులు విడిచి పెట్టాడు. అతని ముఖం బాధతో బరువుగా తోణికింది చెమ్మగిలిన కళ్ళతో నిశ్శబ్దంగా నవ్వి, "మీరు రెండు రోజులపాటు వుండేలా వస్తారను కున్నాను" అంది "అలాగే అనుకుంటూ యింతకాలం గడిచిపోయింది యిదో యీ పనిబడి రావటం ఐంది. రాత్రి రయిల్లో తిరుగు ప్రయాణం కాకపోతే పత్రిక కార్యాలయంలో కొంపలంటుకుపోతాయి. నిజానికి యీ పూట ఐనా వుండి వారినికూడా చూసి వెళ్ళాలని వుంది కానీ–" అని బాధగా వెళ్లలేక వెళ్ళలేక వెళ్లిపోయాడు.

బొంబాయిలో ఐతే తనకి తప్పక స్కాలర్‌షిప్ వొస్తుంది–అని అనుకుని, వొకటి రెండేళ్లపాటు అక్కడవుండి వొస్తే బావుండునేమో అని అనుకుంది కానీ అందుకు, యింట్లో వొప్పుకోరని తెలుసు.

"సాయంత్రం సినిమాకి వెళ్దాం" అని చెప్పాడు శివరాం ఉదయం కార్యాలయానికి వెడుతూ

"పాడు సినిమా, ప్రొద్దుపోయేదాకా అలా బయట యెక్కడన్నా గడిపి వొద్దాం. వేసవి వెన్నెల రాత్రులు. సినిమా హాలు వుక్కలోకంటే యే పచ్చిక మీదనో ఆకాశం కింద నక్షత్రాల తళతళలో కూచుని గడి పితే, ఆ–"

చెప్పటం పూర్తి అవకుండానే అందుకుని, బ్రహ్మాండమైన సినిమా, యివ్వాళ ఆఖరి రోజు. నీ పచ్చికలూ, బుచ్చికలూ యెల్లకాలం పడివుండేవేలే" అని వెళ్ళిపోయాడు.

ఐదున్నరకి స్నానంచేసి తెల్ల షిఫాన్ చీర కట్టుకుని, జుట్టు బిగ లాగి బావంకాయ ఆకారంలో ముడిచుట్టి, కళ్ళకి కాటుక పెట్టుకుంటూ వుంతగా పక్కింట్లో స్కూటర్ మోత వినిపించింది.

"అమ్మగారి అలంకరణ ఐనట్లేనా ?" అంటూ గదిలోకి వొచ్చాడు శివరాం.

"అమ్మగారి అలంకరణదేం వుందిలే—అయ్యగారి స్నో పూతలకీ, పౌడర్ అద్దుళ్ళకీ తోడుగా వుందావని సిద్ధంగానే వున్నాను. కానివ్వండి త్వరగా స్నానం అదీ" అని స్నానాల గది తలుపు తీసి, యెడమ చేత్తో కుచ్చిళ్ళు కొద్దిగా పైకి యెత్తి పట్టుకుని, కుడిచేత్తో కొళాయి తిప్పి—అన్నీ అమర్చి వొచ్చింది.

అతను స్నానాల గదిలోకి వెళ్ళాడు.

అనూరాధ వొచ్చింది, ఆమె ముస్తాబు చూసి, "యెక్కడికి వెళ్తున్నావు ?" అన్నట్లుగా చూసింది.

"అనూ, మేవు సినిమాకి వెడుతున్నాం, యేం నువ్వూ కూడా వొస్తావా ?" అంది గీతాదేవి.

అనూరాధ మౌనంగా వుండిపోయింది.

గ్రహించి "మరి బట్టలు మార్చుకుని రా, వెడదాం. ఆ పచ్చ ఫ్రాక్ లేదూ, అది వేసుకో. వొంకీకి తగిలించే వుంది." అంది అనూరాధ ముఖంలోకి చూసి, "ఆఁ, వుండు, జుట్టు సరిచేసి కాస్త పౌడర్ వేస్తాను" అంది గీతాదేవి.

కళ్ళకి కాటుకకూడా పెట్టి, గౌనువేసుకు రమ్మని పంపింది.

శివరాం స్నానంచేసి వొచ్చి, బట్టలు వేసుకుని ముస్తాబు అవుతున్నాడు.

పదోసారి జుట్టు దువ్వి, "ఫరవాలేదులే—" అన్నట్లు సమాధానపడి దువ్వెన బల్లమీదకి విసిరి లేచాడు కుర్చీలోంచి.

"వదినా నేను రడీ" అంటూ గెంతుకుంటూ వొచ్చింది అనూరాధ.

అనూరాధని పరకాయించి చూసి, "యేం ముండా, చీర సింగారించుకున్నట్లు అలంకార మయ్యావ్, మీ బళ్ళోపిల్లల్లో యెవరిదన్నా బర్త్‌డే

గా తిసి గెరుగదట

పార్టీనా?" అని గదమాయింపుగా అడిగాడు శివరాం.

అనూరాధ చిక్కముఖం వేసింది

"యివ్వాళ్టి రోజున ఆళ్లోపిల్ల లెవ్వరూ పుట్టలేదటం. మనతో సినీమాకి వొస్తోంది" అంది గీతాదేవి.

"అదెందుకు న్యూసెన్సు?" అన్నాడు చిరాకుగా.

తన దారెన తను కూచుని చూస్తుంది. మీ వొళ్ళో కూర్చోబెట్టు కోవాల్సి వొస్తుందని భయపడుతున్నారేమిటి?" అని నవ్వింది.

"తన దారినే తను వెళ్ళి సినిమా చూడమను. స్కూటర్ మీద వీల్లేదు. పోలీసువాడు పట్టుకుంటాడు."

"వెనక నా వొళ్ళో కూచోబెట్టుకుంటాలెండి. యెవరూ పట్టు కోరు" అంది.

"యింట్లో కూర్చుని చదువుకోక అదిదేనికి సినిమాకి? నెత్తి నెక్కించుకుంటున్నావ్ దాన్ని. దానిమీద నీకే పెద్ద ప్రేమ వుందను కుంటున్నావేమో—నిన్న కాక మొన్నొచ్చిన దానివి నువ్వు."

"చిన్న పిల్లకి ఆశపెట్టాను. యిప్పుడు వొద్దంటే, పాపం, బాధ పడుతుంది."

"వేలెడు లేని వాళ్ళకు కూడా బాధ పడటాలు! వూరికే కూర్చుని తిన్నదరక్క- కాకపోతే బాధదేనికి?"

"మీ స్కూటర్ మీద యిష్టం లేకపోతే మీరు పదండి. నేనూ అనూరాధ రిక్షాలో వొస్తాం."

"మర్చిపోయాను. అసలుకి, యివ్వాళ మీనాక్షి వాళ్ళింట్లో పేరంటం అని చెప్పింది పెద్దమ్మ. పేరంటానికి వెళ్తాం" అని వెళ్ళబోయింది, అనూ రాధ—గీతాదేవి ముఖంలోకి వొకసారి చూసి.

కళ్ళు చమ్మగిల్లి—"అనూ—" అంటూ రెండడుగులు ముందుకువేసి అనూరాధను రెండు చేతులతోనూ పైకి యెత్తి ముద్దు పెట్టుకుంది.

అనూరాధ గది బయటికి వెళ్ళిపోయింది.

"వూఁ పదండి" అంది, కంఠస్వరం బిగించి.

బూట్లు టకటక లాడిస్తూ బయటికి నడిచాడు.

సినిమాహాలు ఆవరణలో నిలబడింది. స్కూటర్ ప్రహరీ గోడ ప్రక్కన నిలిపి, టిక్కెట్లు తీసుకుని ఆమె దగ్గిరికి వొచ్చి ఆమె చేతిని తన చేతిలోకి తీసుకుని, "పద" అన్నాడు. నిదానంగా చెయ్యి విడిపించేసుకుని మౌనంగా నడిచింది

తొమ్మిదన్నరకి యింటికి తిరిగి వొచ్చాడు. ఆమె మౌనంగానే వుండిపోయింది.

"నేను నీ చెయ్యి పట్టుకుంటే నీకు నామోషీ అన్నమాట!" అన్నాడు రోషంగా.

"నామోషీ అనుకుంటే స్కూటర్ మీద కూచుని వస్తారు కాబోలు!"

"మరి?" అన్నాడు.

"శృంగారాన్ని బజార్లో ప్రదర్శించుకో నక్కరలేదు"

"అయితే అట్లా చెయ్యి పట్టుకోవటం తప్పా?"

"కాదు. జీవితానికి ఆ ప్రదర్శనా చేష్ట వొకటే అయినప్పుడు అనవసరం."

"నేనూ గమనిస్తూనే వున్నా, మంచితనం సరిపడదు అందరికీ ప్రేమగా చూస్తే నెత్తినెక్కి వెక్కిరిస్తారు."

"అనురక్తిలేని ఆ ప్రేమ, భార్య యేం చేసుకుంటుందో నాకు తెలియదు."

"రక్తి విరక్తులకు, యిది సంసారం. ఆశ్రమమూ కాదు, నైట్ క్లబ్బూ కాదు."

అతను బట్టలు మార్చుకుంటున్నాడు.

మౌనంగా — బట్టలు తీసుకుని స్నానాల గదిలోకి వెళ్ళి బట్టలు మార్చుకుని వొచ్చింది.

"యింకా భోజనాలు చెయ్యరా, యేంటి!" అంటూ వొచ్చింది సుభద్రమ్మ.

"యిదో వస్తున్నానండీ అత్తయ్యగారూ—" అంటూ ఆమె దగ్గిరికి అడుగులువేసి కూడా నడిచింది గీతాదేవి.

అనుభూతిని గెరుగదట

ట్రాన్సిస్టరు మీట తిప్పి సిలన్ పెట్టి కిటికీలోంచి బయటికి చూస్తున్నాడు శివరాం.

"అబ్బాయ్, శివా—" అని లోననుంచి కేక. వెళ్ళాడు.

భోజనాలు ముగించారు. గీతాదేవి మౌనంగా వుండిపోయింది.

"ప్రొద్దుపోయి మీకు శ్రమదేనికి అత్తయ్యగారూ—అన్నీ బల్లమీదనే వున్నాయిగా, పెట్టుకుతింటాం. మీరు వెళ్ళి పడుకోండి" అంది సుభద్రమ్మతో.

"అట్టాగేలే అమ్మా" అని అన్నదే కానీ వెళ్ళకండా యేమేం తినాలో తనే చెప్పి వొడ్డించింది.

వొస్తూ, మధ్యగదిలో నిద్రపోతున్న అనూరాధను ముద్దుపెట్టుకుని తల నిమిరింది గీతాదేవి.

గదిలోకి వొచ్చేసరికి మంచంమీద అటు ప్రక్కకి తిరిగి పడుకుని వున్నాడు శివరాం.

చూసి—తలుపు గడియవేసి, ట్రాన్సిస్టరు ఆపేసి; సోఫామీద పడుకుంది.

"యేం ఆపేశావ్, నీ సంగీతం వినమనా!" అన్నాడు, ప్రక్కకి తిరిగి చూడకండానే

"నా పాట మీకెప్పుడూ వినిపించాలను కోలేదే! ఆ దిల్‌దేకే దేఖో పాటలు నాకు రావులెండి."

"మాటలు నేర్చావ్!"

"అవును, మీ దగ్గర నేర్చుకున్నానుగా యీ కొద్దినెలలలో!" అంది వెటకారంగా.

"అంత యిష్టం లేకపోతే యీ కాపరం చెయ్యటం దేనికి, యెవడితోనైనా లేచిపో"

"యిష్టంలేని రోజున ఆ పనే చెయ్యాల్సి రావొచ్చు"

"నువ్వు అన్నిటికీ తెగించిన దానివని తెలుసు నాకు. నీ తీరు గమనిస్తూనే వున్నా—యీ మంచం పనికిరాలేదా, ఆసోఫామీద పడుకున్నావ్!"

"యివ్వాళే కాదుగా!"

"అవునవును. యీ వేషాలు చాలా రోజుల్నుంచి మొదలయ్యాయ్! నేను వొచ్చి, నీ కాళ్ళు పట్టుకుని బుల్లీ లిల్లీ అని బుజ్జగించి తీసుకు రావాలిగా!"

వొక నిమిషం మౌనంగా వుండి, "ఈ సోఫామీద గమ్మున పడుకో వొచ్చని. అక్కడికి వొచ్చిన దగ్గిరినుంచీ—"

"వూఁ, అక్కడికి వొచ్చిన దగ్గిరినుంచీ—యేం, నీ పీక పిసుకు తానా?"

"అదీ వొక రకంగా మేలే. వొచ్చి మనసును చివుక్కుమనిపించు కునే ధైర్యం లేక."

"ఆ చివుక్కులూ బువుక్కులూ నీకే తెలవాలి. అక్కడపడి నీలగక గా వుందిలే" అన్నాడు.

"అంటే ఆ మూడు నిమిషాల పొర్లింత మాత్రవేఁ అనుకోను. అందుకోసం నేను పరితపించటంలేదు."

"మరింకా దేనికి పరితపిస్తున్నావ్! బట్టలిప్పుకుని డాన్సు చేద్దాం లే, రాపోనీ." అన్నాడు వెటకారంగా.

"డాన్సు వొక్క నేలమీదనే చేస్తారనుకునే వాళ్ళకేం తెలుస్తుంది! వొక్క దృక్కులో చేతివేలి కదలికలో లక్ష నృత్యభంగిమలు రూపు దిద్దుకుంటాయి."

"లెక్చర్లిచ్చే అవకాశం పోయిందని నా మీద చూపకు నీ వాగ్ధాటి — యిక్కడికే పొద్దోయింది. ఆనిక్కి మళ్ళీ తెల్లవార్లూ బుర్ర బద్దలు కొట్టు కుంటూ యేడుస్తూ కూర్చోకు, నీలగక, రా."

"అవసరం లేదు."

"పోనీ, అందుకు కాదులే. రా. నాకు వొక్కడికీ నిద్రపట్టదు

"యిద్దరైతే నాకు నిద్రపట్టదు."

"నే పట్టిస్తాలే, రా "

ఆమె మౌనంగా వుండిపోయింది

లేచి సోఫా దగ్గిరికి అడుగులువేసి చెయ్యి పట్టుకుని తీసుకు వెళ్ళాడు.

అన. భూతిని గ్గెరుగదట

దగ్గిరిగా జరిగి పడుకుంటూ "గీతా" అన్నాడు.

"వూఁ" అంది.

మరింత దగ్గిరికి తీసుకుని పడుకున్నాడు.

ఆమె వొళ్ళు మేల్కొంటోంది. అతనిమీద చెయ్యివేసింది. వొద్దనుకుంటుంది; అతనికి దగ్గిరిగా వెళ్ళొద్దనుకుంటుంది. కానీ గది తలుపువేసి పడుకోగానే, వొక్కచూపు, వొక్క స్పర్శచాలు– ఆమె మనసులో ప్రకంపనలు ప్రారంభమవటానికి.

తన వెనక భాగం అతనికేసి అదిమి; వెనకగా తిప్పిన తనచేత్తో అతని వీపు నిమురుతోంది.

"యేం, నీలిగావుగా!" అన్నాడు.

మనసు గివుక్కుమని–మంచం అంచుమీదకి జరిగింది.

"రా, రా, మళ్ళీ వెధవబెట్టుసరి కూడా!" అన్నాడు.

ఆమె మాటాడలేదు.

రెండు నిమిషాలు గడిచాయి.

చెయ్యివేసి దగ్గిరికి తిప్పుకున్నాడు. ఆమె కళ్ళలో తడి.

"యిప్పుడు నిన్నేం చేశానని యేడ్పు? నీకేం లోటు జరిగింది? యిప్పుడు నేనేం వొద్దనలేదుగా?" అన్నాడు బిరాకుగా ముఖం చిట్లించుకుంటూ.

వొక నిమిషం మౌనంగావుండి కనురెప్పలు వాల్చి, "శరీరం మాంసపు యంత్రంకాదు, మీటనొక్కి నురగ కక్కించటానికి. శరీరం వొక శతతంత్రుల వీణ మీటి ఆ తంత్రువులమీద మూర్ఛనలు పోతేనే రససిద్ధి" అంది స్వప్నంలోంచి పలికినట్లుగా.

ఫక్కున నవ్వాడు.

ఆమె మనసుమీద బ్రహ్మజెముడు అచ్చు పడినట్లయింది. మౌనంగా వుండిపోయింది.

"అన్ని తంత్రులు మీటటానికి మరో జన్మ యెత్తుతాలే. ప్రస్తుతానికి యీ వున్న పదివేళ్ళతో అట్లాగే మీటుతా, రా" అని నవ్వి దగ్గిరికి తీసుకోబోయాడు.

కదలకండా, శరీరం బరువును పక్కపులోకి వొత్తి పడుకుంది.

... మీద చేతులు వేసి దగ్గరికి తిప్పుకున్నాడు.

యింకా దగ్గరికి జరిగింది.

"గీతా!"

"వూఁ"

అతని వక్షంమీద చెంప ఆన్చి అతని గుండె చప్పుడు వింటోంది.

"యేం చేస్తున్నట్లు, అట్లా చడీచప్పుడూ లేకుండా పడి?"

"వింటున్నాను శతాబ్దాలనాటి రసగానం. లాలసాభావంతో ఉత్తేజితమై అనంత విశ్వం రసనాదంలోంచి అనాదిగా చేస్తున్నగానం, మరఫిరంగుల ధ్వనిలో మునిగిపోయిన సౌందర్యమూర్తుల రస కంఠపు సవ్వడి...

వొత్తిగిలి; ఆమెను గుండెమీదినుంచి జరిపి, "అవన్నీ వింటూ కూర్చోటానికి మనమేవన్నా పనీ పాటా లేనివాళ్ళమా? రా, పట్టు" అన్నాడు.

దీర్ఘంగా బరువుగా శ్వాస విడిచి, మంచం దిగి— బీరువా తెరిచింది.

మొదటినెల గడిచిన తరవాత— "రెండేళ్ళపాటు ఆగటమే వివేకం. పిల్లలు యెప్పుడైనా కలుగుతారు. రిసెర్చి ఆ తరవాత సాగుతుందో లేదో— కాగా, యీ విశ్వవిద్యాలయంలోనే వుద్యోగం రావటానికి రిసెర్చి పూర్తి చేస్తే మేలు—అని అనుకుని కుటుంబ నియంత్రణ వైద్యురాల్ని సంప్రదించి, ప్రెసెప్టిన్ ట్యూబు తెచ్చుకుంది. "ప్రభుత్వం వుచితంగా యిచ్చినదీ, దేశం వుపయోగపెట్టుకున్న వస్తువు అదొక్కటే" అనిపించింది ఆమెకు.

"యిదొక క్రతువు గంటసేపు, యేం, ఆ జిగురు దేనికి మధ్యలో అడ్డం?" అని విసుక్కున్నాడు.

"అది మధ్యలో కాదు. మనసులో అడ్డం. నిజానికి అదెక్కడో లోలోన వెనకవుండి పోతుంది. స్పర్శకి అందకండా. అది లేకపోయినా జిగురు వుంటుందని తెలియనట్లు ప్రవర్తించగలవాడిని నువ్వు. ఆ జిగురే అనుభూతిని గ్గెరుగదట

లేకపోతే ప్రపంచ చరిత్ర మరో లాగా వుండేది అసలు ప్రపంచమే వుండకపోను" అంది తాపీగా.

సోఫామీద నుంచి లేచి, ట్యూబూ గొట్టం స్నానాలగదిలో పెట్టి వొచ్చింది.

"యేంటీ బోగం వేషా లింకెన్నాళ్ళు?" అన్నాడు.

బాధతో కూడిన పరిహాసపు నవ్వు నవ్వి, "దేశం అంతటా నీలాంటి వాళ్ళు తయారయ్యారని వాళ్లెప్పుడో కళాసాధన మాని వేశారట. పదుగు రింటి ఆడపడుచులూ, కోదండ్రాడూ, మూణ్ని విశ్వాల ముడుపులు వసూలు చేసుకుంటున్నారట గదా, వీధి వీధికి దేశం అంతటా?" అంది.

"ఆపు నీ వాగుడు. రా, యింక. యిక్కడికే పొద్దుపోయింది, దబ్బున." అంటూ మీదకి తిరుగుతున్నాడు కచ్చిళ్లు పైకి లాగుతూ.

ఆమె నిశ్చలంగా, మౌనంగా వుండిపోయింది.

"యేంటీ నీలుగుడు, మళ్ళీ వొక గంట నిన్ను బతిమలాడాలా?"

పైకి రాబోతున్న అతనిని ప్రక్కకి నొక్కి, దగ్గిరిగా జరిగి, నుదుటిమీద అరిచెయ్యి అద్ది, "రామ్, యెప్పటికి యింతేనా యింక? యెందుకు అర్థంచేసుకోవు నా బాధ? తెలియని వాడివీకాదు. కాస్త ఆసక్తి వుంటే—కానీ—కానీ—" ఆగిపోయింది.

"రోజూ యీ లెక్చర్లూ, బాధ బాధ అని వాపోవటం—నాకు చిర్రెత్తు కొస్తోంది చూస్తున్నకొద్దీ—నువ్వు రాక్షసివి కామపిశాచానివి నాకు దాపురించావు."

అదే నవ్వు నవ్వి, "అవును, నేను కామపిశాచినే. ఆత్మని చంపు కుని కళ్ళుమూసుకుని తిమ్మిరి వొదిలించుకోలేని కామపిశాచిని. యేడాదులుగా వెన్నెట్లో తడుస్తూ, పుష్పాల సౌరభాన్ని కప్పుగుని, లోకాన్ని క్రమ్మి వేయబోయిన చీకట్లను ప్రోది చేసి ముడిచుట్టుకుని, నీలగిరుల నుదుటిమీద యీ పెదవులు ఆన్చి, అనంతవిశ్వాన్ని నా కౌగిటిలో యిముడ్చుకుని— సమస్త దిశాతీత విభ్రమణ భంగిమలో రాగరంజితంగా రమిస్తున్నాను; కసిదీరా విషయిస్తున్న కామపిశాచిని—వొక్క నీతోతప్ప. నేను యింత వరకూ నిన్ను తాకి యెరగను. నిన్ను శీలవంతుడిగా వొదిలేశాను. దాన్ని

అనుభూతిసిగ్గెరుగదట

నీ గాజు గుండెలో దాచుకుని నిద్రపో అని చివాలునలేచి వెళ్ళి సోఫా మీద పడుకుంది.

కన్నీరు ధారలుగా స్రవిస్తోంది. రెక్సిన్ బట్టమీద యింకిపోక ముఖం అంతా తడి అవుతోంది.

మూడు నిముషాలు గడిచాయి.

లేచి ఆమె దగ్గిరికి వెళ్ళి, "నీ పిచ్చివాగుడ్ని లక్ష్యపెడితే యేనాడో—" ఆగిపోయి ఆమె జబ్బపట్టుకుని, "పద, నోరుమెదపక, రా!" అన్నాడు. గొంతులో విసుగు, చిరాకు, కాఠిన్యత.

ఆమె మౌనంగా కదలకండా వుండిపోయింది.

"వూఁ" అన్నాడు, లేవమన్నట్లుగా.

"యేం. నీకు కావాలా?" అంది తాపీగా.

"నా స్వార్థంకోసం వొచ్చానని అనుకోగల స్వభావం నీదని నాకు తెలుసు—నీమీద జాలిపడి."

"జాలిపడి చూసేదిస్తేతిండీబట్టా—అవిలేని వాళ్ళకి, అవి నేను సంపాదించుకోగలను. నామీద జాలిపడటంలో అర్థంలేదు."

"పోనీ ప్రేమకొద్దీ."

"ఆ ప్రేమ మాత్రమే చాలదు. అనురక్తి వుండాలి."

"పోనీ అది కూడా."

"అనురక్తి రాగరంజితం అవ్వాలి."

"ఛీ, రాక్షసీ—" అని వెళ్ళిపోయాడు మంచం దగ్గిరికి.

పావుగంట గడిచింది.

అతను యింకా పక్కమీద అటూయిటూ మసలుతున్నట్లనిపించి, లేచి వెళ్ళి అతని ప్రక్కన పడుకుంది.

"రామ్" అంది.

అతను మాటాడలేదు.

మీద చెయ్యి వేసింది. తీసివేశాడు విసురుగా.

"కోపం వొచ్చిందా?" అంది.

"యేం, యింకోగంట అయ్యాక రాకపోయావూ తెల్లవార్లూ జాగరణ అనుభూతిసిగ్గెరుగదట

రణ చెయ్యటానికి, తిని కూచుని వోపికగా వుండటానికి, అసలు వుద్యోగం వుంది."

నవ్వి, "రామ్, యెందుకొచ్చిన పేచీలు చెప్పు? అందువల్ల యెవరం సుఖపడుతున్నామని నువ్వుకాస్త ఆసక్తి కనపరిస్తే—కొంత స్పందన చూపితే—నిజం చెప్పు, యింటి పనులూ వుద్యోగంతో నూ తీరికలేని కాలంలో మాత్రం నేను విసుక్కున్నానా? ఆ లాలస వుండలేకానీ—అది లేకపోయాక——"

"యింక వుపన్యాసా లెందుకు, కానియ్ యిప్పటికైనా" అన్నాడు విసుగ్గా.

మనసు చివుక్కుమంది.

నాలుగు క్షణాలు మౌనంగా వుండిపోయి, "అర్థం చేసుగోటానికి యెందుకు ప్రయత్నించవు? నిజానికి నేనెందుకు రాలేదిప్పుడు రామ్, అర్థం చేసుకో నన్ను-అంతేచాలు" అర్థిస్తున్నట్లుగా అంది.

"నేనేమీ ఈడియట్ ని కాను అర్థం కాకపోవటానికి. యేం అర్థం అవ్వాలి? నీకు పొగరు, గర్వం, రసమూ పులుసూ కారటానికి, యిది పడక గది; వంటగది కాదు. యే జన్మలోనో చేసిన పాపానికి ఫలితం యిది. అనుభవిస్తున్నాను. శాంతి లేకుండా ఐపోయింది."

"నీకు యింతకుముందు ప్రశాంతి అంటే యేమిటో తెలిస్తేగా యిప్పుడు అశాంతి అని తెలియటానికి!" అని అనుకుంది

ఐదు నిమిషాలు గడిచాయి. అతని శ్వాస సవ్వడి వినిపిస్తోంది.

కనురెప్పలు వాల్చి, శ్వాస బరువుగా విడచి, మంచంమీది నుంచి లేచింది.

గడియ తీసి, గుమ్మం బయటికి అడుగువేసి, తలుపులు దగ్గిరికి లాగింది.

మధ్యగదిలో సుభద్రమ్మ, అనూరాధ నిద్రపోతున్నారు.

డ్రాయింగ్రూంలో సోఫాలో కూచుని యేటవాలుగా జారింది.

ఆ స్ఫటికం గుత్తులను లాగి వొకదానికేసి వొకటి కొట్టి తెగకొట్టి— అవి నేలమీద పడి గదినిండా పప్పుపప్పుగా పడాలనిపిస్తుంది. గడియారం

అనుకూలిస్తే గిరుగదట

ముళ్ళను పీకేసి పెండ్యులాన్ని లాగి కిటికీలోంచి సముద్రంలో పడేలా విసరాలనిపిస్తుంది. రేడియోని యెత్తి నేలమీద వేసి కొట్టాలనిపిస్తుంది. కదలికనీ చలనాన్నీ స్ఫురింపజేసే అన్నిటినీ ఛిద్రం చెయ్యాలన్న అలక్ష్యపు ఆకాంక్ష—ఆమె మనసులో.

హృదయం మేధసుకి లంకెపడి వుండకపోతే—అన్నీ—అన్నిటినీ ఛిద్రం చేసి—పిచ్చిగా అరిచి—కన్నీటి ధార అయి అంతరించి వుండును.

నుదుటిమీద గట్టిగా బిగిసిన పిడికిలి—సమస్త లోకాన్నీ పుప్పొడి ముద్దలా చేసి బిగించి నలిపి పిండుతూన్న ఆ పిడికిలి—లోకం అణువుకంటే కూడా చిన్నది—పట్టుదొరకక పిడికిలి విడిపోయింది.

లేచి ముందు తలుపు తెరిచి వరండాలో నిలబడి బయటికి చూస్తూ—

పది నిమిషాలు గడిచాయి.

పై మెట్టు మీద కూచుని సిమ్మెంటు స్తంభానికి తల ఆన్చింది.

—యీ బంగళాల మీద యీ పాలవెన్నెల వ్యర్థంగా శుష్కంగా అజ్ఞానంగా కురిసిపోతోంది. పిచ్చివెన్నెల. అమాయకపు వెన్నెల. ప్రవిమలంగా నిద్రపోతూన్న అనూరాధ ముఖం అంత అమాయకపు వెన్నెల—యీ యినుకరాళ్ళ బోలుగుట్టల మీద మూర్ఖంగా కురిసిపోతోంది. యెక్కడో మంచు పర్వతాల మొనలమీద, నీలగిరుల సానువులలో, లోనావలా పచ్చిక లోయలో, అక్కడా యిక్కడా యెక్కడో తళుక్కుమన్న వొక్క మనసుమీద కురవాల్సిన వెన్నెల, గాజు గుండెలతో నిండిన రాతి గుట్టలమీద కురవటం నిజంగా మూర్ఖం, వెన్నెలకి మూర్ఖత—తనకి మూర్ఖత—మూర్ఖతే కాకపోతే యేమిటీ జీవితం! అందమైన గాజుగుండెలోంచి తేనెమంచు స్రవించాలనుకోవటం మూర్ఖత కాక యేమిటి! కాదని తెలిసి, నిర్లిప్తంగా, యెండిన కన్నీటి చారికలతో, హృది సవ్వడిని యినప గూటిలో మూగవోజేసి, అశాంతుల రత్నకంబళిని కప్పుకుని వూపిరాడక అటూ యిటూ కొట్టుకోవటం దేనికి! యీ దుప్పటి ముసుగులాగిపారేసి, గాజు గుండె మీద పోలిథిన్. పొరకప్పి—మంచులా కరిగిపోయే హృదిని, లోయలమీద స్రవింపజేసి, పచ్చదనాన్ని వెచ్చగా మేల్కొలిపే పరిస్థితి పొందకపోవటం—దేనికి? ఆవిశ—మసుకారపు పొరలాతనిని ఆవరిస్తుంది—

అనుభూతిసిగ్గెరుగదట

అనూరాధ అమాయకపు నవ్వు—ఆయన ఆదరణ. అభిమానం, ప్రేమ. వీటికన్న తనని యీ బంగారాకి కట్టివేసే బంధనం యేవున్నదని—కానీ యివన్నీ తనని బంధించగలవా? వాటన్నిటికీ కృతజ్ఞతతో, అభిమానంతో, గౌరవంతో ప్రణామం చెయ్యగలను-కానీ వాటికోసం యీ జీవితం శుష్కంగా, నీచంగా యంత్రంలా, యెద్దులా నిలిచిపోవాలా! తను వెళ్ళి పోతుంది. అందరికీ కృతజ్ఞతతో నమస్కరించి, వెళ్ళిపోతుంది. వెన్నెల బాటలో మంచు బిందువుల్ని యేరుకుంటూ—ఆవిడ ఘోరున రోదిస్తుంది; ఆ రోదన తన పునర్జన్మకి శాపం అవుతుంది—క్షమించమని బాధగా జాలిగా చూసి తలవొంచుకుని తను వొచ్చేస్తుంది. ఆయన మండిపడతాడు; బాధపడతాడు. ఆర్ద్ర పురుగు పాలరాతి గూటిలో వుండదని, ఆ మండే వేడిలో తన రేకు కవచాన్ని కరిగించి, సెలవు తీసుకుంటుంది. తను—అనూరాధ చిందించిన ప్రవిమలామాయకపు నవ్వును హృదయంలో గుప్తంగా దాచుకుని తను పెళ్ళికూతురిలా, నిజంగా పెళ్ళికూతురిలా గడ్డి పూలు సిగలో తురుముకుని నీలపు పెళ్ళిపందిట్లోకి వచ్చి మండపం మీదకి అడుగులో అడుగువేసుకుంటూ నడిచివొచ్చే పెళ్ళికూతురు తను. తను యేడిస్తే లోకానికి అశుభం. నవ వధువు కంటతడి లోకానికి అమంగళం—

లోన అలికిడి అంది. బల్లమీద గ్లాసు పెట్టిన చప్పుడు.

"పిచ్చిదానా తిన్నగాపడుకోవే—" సుభద్రమ్మ గొంతు.

లేచి చప్పుడవకండా గడియవేసి సోఫాలో కూచుంది.

పది నిమిషాలు గడిచాయి. సుభద్రమ్మ యింక నిద్రపోయివుంటుం దనుకుని—చప్పుడవకండా పడకగదిలోకి నడిచింది గీతాదేవి.

దీపం వెలుతుట్లో—రంగుచారల బట్టలలో అతను నిశ్చలంగా నిద్ర పోతున్నాడు. దీపంకాంతికి చామనచాయ ముఖం పచ్చగానూ, మీసం మరింత నల్లగానూ మెరిశాయి.

ఆ ముఖంలో కాఠిన్యం; విసుగు, చిరాకు అనాసక్తి—యేమీలేవు. ప్రశాంతంగా, గంభీరంగా, ఆదరంగా ఆమె కళ్ళకి అనిపిస్తున్నట్లయింది ఆ ముఖం.

అనుభూతిని గెరుగదట

క్షణకాలం అలాగే చూసి, దగ్గిరికి వెళ్ళి, మంచంమీద వొంగి— "పూ:పడుకో" అన్న శ్వాస చెవులలో గింగుర్లు తిరిగి, భారంగా పై లేచింది. ఆ అనుభవం ఆమెకుంది; యెన్నో రాత్రుల కొన్ని యుగా అనుభవం.

చప్పుడవకండా మంచంమీద పడుకుని అతనికి దగ్గిరిగా జరిగింది అంతలోనే దూరంగా జరిగి కనురెప్పలు వాల్చింది.

—అతనికి పొరపాటున మెలుకువ వొచ్చి-తను మేలుకునే వున్నట్లు చూసి—"గీతా యింకా పడుకోలేదా, పాడు చదువు పడుకో. నీ ఆరోగ్యం పాడవుతుంది—" అని వొక్క గుక్క మంచినీళ్లు తాగి మరు నిమిషంలో మళ్ళీ నిద్రపోయేస్తాడు. పల్లెత్తుమాట అంటే కొరడా కొసలాంటి మాట వినికి-సుఖజీవి—నిద్రపోగలడు.

పొద్దున్నం కాఫీ తాగుతూ, "అమ్మా, గీత చిక్కిపోతాంది యెట్లా అయిపోయిందో చూడు-చదువుమాని, తిని-హాయిగా నిద్రపొమ్మను" అంటాడు తల్లితో. దేనికీ వివరణ చెప్పుకోలేని సుభద్రమ్మ, బాధగా నిట్టూర్చి, "ఆరోగ్యం అన్నిటికన్నా ముఖ్యం అమ్మా గీతా" అని అవతలికి వెళ్ళిపోతుంది.

"గీతా నువ్వు కొన్న సామాన్లతో—అసలే చిన్న యిల్లు మరీ—యిరుకైపోయింది. మనం కొన్న స్థలంలో పెద్ద బంగళా కట్టుకుందామా—అడివరకంటే వొక్కడిని. యిప్పుడు సంసారం. యిద్దరు చుట్టాలొచ్చినా యిరుకిరుకు మంచి అందమైన బిల్డింగు కట్టుకుందాం. రమకి మంచి ప్లాను వెయ్యటం వొచ్చు, వేయించుదాం వొకటి. మాట్లాడవేం, చెప్పు, గీతా?" అంటాడు. ఆమె నవ్వుతుంది చప్పుడవకండా.

"చెప్పు గీతా, నీకు యీ యింట్లో యిబ్బందిగాలేదూ? మంచి విశాలమైన భవనం కట్టుకుందాం చెప్పు" అంటాడు! "నాకేమీ యిబ్బంది లేదిక్కడ. పదిగజాల బట్ట, రెండుపూటల పట్టెడు మెతుకులు, వుంటానికి యింత పంచ-పూరి గుడిసె అయినా ఫరవాలేదు—వుంటే చాలు; హాయిగా వుండగలను, అశాంతి మనసును ఆవరించకపోతే—" అని ఆగిపోతుంది. అతను మౌనంగా కాఫీ నన్నరిస్తూ వుండిపోతాడు.

—మళ్ళీ రాత్రి, మళ్ళీ పగలు-అన్నీ అవే రాత్రులు. అవే పగళ్లు-యెప్పుడో గొంగళి పురుగులోంచి సీతాకోక చిలుక రెపరెపలాడే రేబవళ్లు కలిసిపోయిన రోజు—యెప్పుడొస్తుందో ఆ...—

మగత నిద్రలోంచి, రేయి తెల్లవారబోతోంది.

కలతనిద్రలోంచి, ముఖం పేలవంగా అవుతోంది.

కలత నిద్రతో ముఖాన్ని కడిగి, మగతలోంచి మేల్కొంటున్నాయి, యెవరూ పేర్చని దొంతరరాత్రులు.

* * *

"గీతా—" అంటూ హడావిడిగా గదిలోకి వొచ్చాడు శివరాం, పన్నెండు గంటలకే.

టి. యస్. యెలియట్ వేస్టులాండ్‌లోంచి తలయెత్తి, అంతకన్న సారహీనమైన చూపు చూసింది గీతాదేవి.

"కమాన్, క్విక్-" అంటూ ఆమె చేతిలో పుస్తకం లాగేసి మంచం మీదకి విసిరాడు.

"పన్నెండు గంటలకే వొచ్చిన విశేషమా యిది!" అంది, సాఫీగా సాదాగా.

"యేది?"

"యీ హడావిడి."

"కాదు, మనం యివ్వాళ అరకులోయకి వెళ్లాం."

గాలి బుడగ పగిలినట్లు ఫక్కున నవ్వింది.

"దేనికి, నవ్వుతావ్, నువ్వేగా అన్నావ్ వెళ్దామని?"

"తెలియక అన్నాను, చాలా కాలం క్రితం."

"యేం తెలవక ?"

"అరకులోయ చూడాల్సిన అవసరం లేదని."

"అంతే?"

"అంతే—యేమీలేదు." అని కుర్చీలోంచి లేస్తూ, "నీళ్లు సిద్ధం చేస్తాను. పదండి స్నానం చేద్దురు" అంది.

"నీ యిండిఫరెంట్ సేవాపరాయణత్వం కట్టిపెట్టి ముందు విను—

 అనుభూతిసిగ్గరుగదట

యివ్వాళ ఆఫీసులో బొత్తిగా, అంటే యెబ్సొల్యూట్‌గా పనిలేదా. సంతకం చెయ్యాల్సిన కాగితం వొక్కటిలేదు. తనిఖీ చెయ్యాల్సిన పనులు అంతగాలేవు అమాంతం బుర్రలోకి వో ఆలోచన వొచ్చింది——

మధ్యలోనే అందుకుని, "ఐతే యీమధ్య మీ బుర్రలోకి అవి కూడా వొస్తున్నా యేవిటి! ఆలోచనల చౌర్యం చేసిందన్నమాట!" అంది

"అవు, నీ ధోరణి. అన్ని యేర్పాట్లూ చేసి వొచ్చాను. భోజనాలు చేసి తయారై స్కూటరెక్కటమే యింక"

"వూఁ," అంది, నిడుపాటి దీర్ఘం తీస్తూ.

"నీ కిష్టంలేదా? చెప్పు, యిన్నాళ్ళనుంచి వున్న యిష్టం యేమైంది? నాతో రావటం యిష్టంలేదని——"

మధ్యలోనే అందుకుని, "వెడదాం పదండి" అంది ఆ చర్చ మొదలవటం యిష్టంలేక.

"వుండు అమ్మకి చెప్పివొస్తాను" అంటూ వెళ్ళాడు.

స్నానాలు, భోజనాలు ముగిసీ—బట్టలు యెన్నుకునేసరికి అనుకున్న దానికంటే సమయం యెక్కువే పట్టింది.

ఆకుపచ్చ సాదా జార్జెట్ చీరకట్టుకుని పచ్చల కంఠహారం, చెవులకి రింగులు తగిలించుకుని, సాదాగా తయారైంది.

"నగలూ అవీ పెట్టుకో."

అడవిలోకి నగలెందుకు లెండి నగాన్నంగా దిగేసుకెడితే ప్రకృతి నుదుట మచ్చలాగా అనిపించగలదు" అంది.

"సరే, నీయిష్టం త్వరగా" అన్నాడు బూట్లతాళ్లు బిగించుకుంటూ.

ట్రాన్సిస్టరు, భోజనం కారియరు, ఫ్లాస్కు, మంచినీళ్ళ పొలిథిన్ సీసా, బట్టలు నాలుగుదుప్పట్లు రెండుగాలిడిళ్లు సూట్కేసులో సర్దింది.

ట్రాన్సిస్టరు ముందువేపు సొరుగులో దూర్చాడు. కారియరు, ఫ్లాస్కు నీళ్ళసీసా ముందువైపునే కాళ్ళదగ్గిర తాళ్ళతోకట్టాడు. వెనక స్టీలుచట్రం మీద సూట్కేసు నిలిపి గట్టి నూలుతాడుతో బిగించాడు.

అరకులోయ చేరేసరికి మసకచీకటి పడుతూవుంది. బంగళాలో గది అనుభూతిని గ్గెరుగదట

సిద్ధంగా వుంది. కారియర్ భోజనం తిన్నారు. గదికోనే వుండిపోయారు.

అలా వెళ్ళి మసక వెలుతుర్లో దాక్కోబోతున్న లోయల్ని చూడా లనిపించినా—ప్రయాణపు బడలిక తీరకండా యెందుకలే అనుకుని వూరు కుండిపోయింది

ప్రయాణపు అలసట, మూడు నిమిషాల ఆయాసపు పొంగుతో ద్విగుణీకృతమై—

అతను నిద్రపోయాడు. మరోపావుగంటకి ఆమె నిద్ర పోయింది.

వుదయం తొమ్మిది గంటలకి యింటి నుంచి తెప్పించుకున్న ఫలహారాలు తిని కాఫీలు చేయించుకుని తాగి, అలా బయల్దేరారు

వూదారంగు చీర—వొక భుజానికి ట్రాన్సిస్టరు-రెండో భుజానికి తోలు చేసంచి-అతను యెప్పటిలా తెల్లబట్టలలో.

నాలుగు ఫర్లాంగులు నడిచి- రెప్పలు పూర్తిగా విప్పి కళ్ళు పెద్దవి చేసి—నగ్నంగా పరున్న పచ్చనే లోయలకేసి చోద్యంగా చూడబోతూ వుండగా-"హలో కాంతారావ్ !" అని అరిచాడు శివరాం.

లోయలు పర్వతాలై లేచి శివరాం ఐ నిలిచినట్లుగా అతనేకేసి అని మిషితంగా చూసింది.

అవతలగా వెడుతున్న సన్నటి వ్యక్తి క్షణకాలం పరకాయించి చూసి—త్వరత్వరగా అడుగులు వేసుకుంటూ వొచ్చి, "సారీ సార్, దూరం నుంచి గుర్తుపట్టిసిలేక పోయాను. మీరు యిక్కడ !" అని ఆశ్చర్యపోయి, ప్రక్కన వున్న ఆమె వంక దృష్టి మరల్చి, అంతలోనే శివరాం వైపు చూశాడు.

"నా భార్య."

ఆ వ్యక్తి చేతులు జోడించి, "నమస్కారమండీ" అన్నాడు. ఆమె ప్రతి నమస్కారం చేసింది.

యిద్దరూ కబుర్లు చెప్పుకుంటూ నడుస్తున్నారు.

ఆ వ్యక్తి రెండేళ్లనాడు తాత్కాలికంగా కాలెక్ట్రేలో పనిచేసిన విషయం, ఆ తరవాత అతని పరిస్థితులు, సర్వేయరు ఉద్యోగంలో యిక్కడ వుండటం, విజయనగరంలో పెళ్ళాం పిల్లలు, తదితర పరిస్థి

అనుభూతిసిగ్గెరుగదట

తులు—యిక్కడి కొండజాతివాళ్లు, వాళ్ళ ఆచార వ్యవహారాలు, విద్యు దుత్పత్తి, ప్రారంభించబోయే యితర ప్రణాళికలు, తదితర విషయాలు.

వివరాంని దభీమని ముందుకు పడదోసి వెనక్కి వెళ్లిపోవాలనిపించింది ఆమెకి అతని వీపుమీదినుంచి చూపు, నేలమీదకి వాల్చి అలాగే నడుస్తూ వుండిపోయింది.

అతగాని స్థితిగతుల గురించీ, యీ ప్రాంతం అభివృద్ధి తదితర విషయాలు దేనికిప్పుడు—యీ కొండల్నీ లోయల్నీ అవమానపరచినట్లుగా. మధ్యాహ్నం బంగళా దగ్గిరి తోటమాలిని అడిగితే ఆ భోగట్టా అంతా యేకరువు పెట్టునే—యీయనతో రావటం అంటే తెలిసి పొరపాటు చెయ్యటవేఁ...

—మంచిదోయ్, తరవాత కలుసుకుందాం — అని మొగ్గలోనే తుంచి వెయ్యకూడదా—ఆ మనసు...

రెండు గంటలు గడిచాయి. మధ్యలో కొంతసేపు రాతిగుట్టమీద కూర్చున్నారు. ఆ వేళకి వెళ్ళిపోయాడు.

"గీతా—యిం. అట్లా వున్నావ !"

"యెలా వున్నాను !"

"యెట్లాగో."

మౌనం!

"గీతా, చెప్పవూ!" అన్నాడు అనునయిస్తున్నట్లుగా.

"యేఁవుంది చెప్పటానికి, చూశాంగా యింక పదండి పోదాం బంగళాకి—లేదూ యేకంగా యింటికి."

"యింటికి వెళ్ల టానకే వొచ్చామా ?"

"అలాగే కనిపిస్తోంది."

"తల విరుసు మాటలు మాట్లాడకు. అన్నీ చూసి రాత్రి బయల్దేరదాం."

"అన్నీ చూశాంగా ప్రొద్దుటినుంచీ, అన్ని వివరాలూ తెలుసుకుని మరీ !"

నవ్వి, "నో అదా ! అతనూ—"

అనుభూతిసిగ్గెరుగదట

"విన్నాను. యిందాకటినుంచీ. పదండి మొంప వేడెక్కుతోంది."

"బాగుంది నీ తీరు! సరే, పద" విసురుగా అని, ప్రక్కకి తిరిగి త్వరత్వరగా అడుగులు వేశాడు.

తాపీగా అడుగులు వేస్తోంది.

మూడు ఫర్లాంగుల ముందుకు వెళ్ళి నీడన నిలబడి కోపంతో ఆమె కోసం యెదురుచూస్తున్నాడు, ఆమెకేసి చూస్తూ.

భోజనా లయ్యాక నిద్రపోయారు.

అతని పిలుపుకి మెలుకువ వొచ్చి లేచింది. ఐదు అవుతోంది.

"గీతా యెంత సేపు నిద్రపోయావో తెలుసా!" అన్నాడు నవ్వు ముఖంతో.

ఆమెకి ప్రొద్దుటి విషయం యింకా గుర్తుంది. అతను యెంత పేచీ పడినాకూడా కాసేపు నిద్రపోయి లేస్తే అంతా మర్చిపోతాడు. ఆమె తేలికగా మర్చిపోలేదు. తను బాధపడాల్సి వొచ్చినా యింకొకరిని బాధపెట్టటం జరిగినా కూడా.

నిద్రమత్తులోంచి చూస్తున్నట్లుగా చూసి, "అవును. సాయంత్రం ఐనట్లుంది" అంది.

స్నానంచేసి ముస్తాబయ్యారు అతను యెప్పటిలా తెల్లబట్టలు! నల్లబెల్టు, ముదురాకుపచ్చ రంగు నెక్ టై. ఆమె తెల్ల షిఫాన్ చీర, తెల్ల ఫుల్‌వాయిల్ బ్లౌజు, పచ్చలహారం, చెవులకి రింగులు.

అతను. ట్రాన్సిస్టరు భుజానికి తగిలించుకున్నాడు. స్టీలు చట్రపు తోలు చేసంచీ భుజానికి వేసుకుంది ఆమె.

నడుస్తున్నాను ఆమె చేతిని తన చేతులోకి తీసుకుని వేళ్లు మెలిచుట్టి. "గీతా" అన్నాడు.

"వూ" అంది.

"అట్లా అటువైపు నడుద్దామా ?"

"వూఁ" అంది.

ప్రక్కకి తిరిగి కాలిబాటన నడుస్తున్నారు, వొక్కరికే చాలీచాలని బాట అతను గడ్డిలో నడుస్తున్నాడు, ఆమె ప్రక్కన.

అనుభూతిసిగ్గెరుగదట

స్వప్నంలోంచి పచ్చని లోయలు తుళ్ళిపడి లేస్తాయేమో నన్నట్లుగా ట్రాన్సిస్టరు పీక నొక్కేసింది.

"అక్కడ కూర్చుందామా ?" అన్నాడు.

"వూఁ హూఁ అలా పైకి వెళదాం, సూర్యాస్తమయం కాబో తోంది" అంది

నడిచి నడిచి పైకి చేరుకున్నారు.

చుట్టూ చూసింది కళ్లు తిప్పి. మళ్ళీ చూసింది. మళ్ళీ చూసింది.

పచ్చని పర్వతపు నుదుట కుంకుమ బొట్టులా అతికిపోవాలను కుంటూ జారుతున్న లేత యెరుపు సూర్యబింబం; కోటి కోట్ల గులాబీలను నుదుట పిండుకుని కిందకి కుంగి, పచ్చని పర్వతాలను తన పరిష్వంగపు జ్వాలలో రగల్చాలన్నట్లుగా ఆకాశం; ఆత్మీయత, మెత్తని గడ్డలుగా బిగిసిపోయినట్లు పచ్చని గుబురు చెట్లు; వాలుచూపులా సాగిన పర్వతపు సానువులు; నాగరికత చూపులకి జడుసుకుని పరుగు లంకించుకుని రాళ్ళ గుట్టలమీద యెదురు దెబ్బలు తగిలి, తూలి, గెంతి యెదురు చూపులు చూచుకుంటూ పారెపోయే సెలయేరు; లోయల పాన్పుకి ఆకాశపు పందిరి బిగించుకుని ప్రకృతి పరుంచే వుఛ్వాసానికి వువ్వెత్తుగా లేచిన స్తనాలలా కొండలు; స్వప్నంలో మదగమనంతో సాగిపోతూ సాగిపోతూ, నడుం విరిగినట్లుగా దభీమని అఖాతంలోకి పడిపోయి హోరుమని యేడ్చిన జల పాతం——

వరదనాటి గోదావరిలా, హిందోళ రాగంలా, సుడులు తిరిగి తిరిగి పడిపడి పొరలుతోంది, ఆమె మనసు.

విశృంఖలంగా యెదిగి అలవోకగా పరున్న ప్రకృతి, ఆమె కనుల నీలిమలో పచ్చనై పోతోంది.

"గీతా—"

"గీతా."

పర్వతపు పచ్చని నుదుటిమీద నిప్పురవ్వ ఐ పడి, పగకొద్దీ కాల్చి— అనుభూతిసిగ్గెరుగదట

అక్కడికీ కసితీరక దోసిళ్ళతో మసి యెత్తి గాలిలోకి యెగబోసి, వెళ్ళి పోయాడు సూర్యుడు

"రామ్, పద"

"మెలుకువ వొచ్చిందా నీకు ?"

"మెలుకువ కాదు. స్వప్నంలోంచి, నాకు కసిగా వుంది."

"యెవరి మీద ?"

"నా మీద. నీమీద. రామ్, రా, పద. అలా అలా ఆ లోయల పచ్చని పాన్పుమీద వొరిగి, నిన్ను కసిదీరా——"

"వూఁ కసిదీరా ?" అని నవ్వుకున్నాడు

అతని చెయ్యి పట్టుకుని లాగి నడుస్తోంది.

"గీతా !"

"వూఁ." మూడువొంపుల స్వరం

"చాలా బాగుందిక్కడ."

"యిప్పుడేం చూశావు బాగు ? చూడాల్సింది ముందుంది పద, చూద్దువు."

"అట్లాగా! నాకు తెలవదే, యిప్పటికి యీ ప్రదేశానికి మూడు నాలుగుసార్లు వొచ్చినా !" అన్నాడు.

"తెలియదు; నువ్వు చూడని ప్రదేశాలున్నాయి, చూపిస్తాను పద. నీకు తెలియని ప్రదేశాలున్నాయి, తెలియజేస్తాను పద. పచ్చని పచ్చికల చెంత, నల్లగా మదుగు కల్పిస్తున్న పర్వతాల మాటున, పచ్చని తివాసీమీద కడవల కొద్దీ వెన్నెల కుమ్మరించి—అమృత హృదిలోంచి చిచ్చుబుడ్లు సంటించి, నీ ముఖాన్ని మతాబాలా వెలిగించి, తెల్లని నదుల మధ్య కోటి కోట్ల సూర్యబింబాలను మండించి, నన్నూ, నిన్నూ బొగ్గులాకాల్చి, వజ్రంలా మెరిపించి తెలియజేస్తాను పద, అలా అలా ఆ లోయల లోకి——"

అతను నవ్వుతున్నాడు.

"యిష్——" అంది. నడుస్తున్నారు.

ఐదు నిమిషాలు గడిచాయి. సూర్యుడు చిమ్మిపోయిన మసి మీద

అనుభూతిసి గ్గెరుగదట

పాలపొంగులా ఆవరించబోతుంది వెన్నెల.

మరో ఐదు నిమిషాలు గడిచాయి.

సన్నగా చినుకులు ప్రారంభమయ్యాయి. అక్కడక్కడా పొగ రంగు మబ్బులు.

"చినుకులు మొదలైనయ్. త్వరగా నడువ్" అన్నాడు.

"పడనీ. యీ చినుకుల్లో తడిసి చల్లగా వెచ్చగా హాయిగా—"

"నీకు కవిత్వం వొచ్చునని తెలుసు నాకు. వాన యెక్కువైతే నీ కవిత్వం గొడుగు పట్టదు మనకి."

"యిది కవిత్వం కాదు. హృదయాల అలికిడి. వృత్తమాటలు విని కవిత్వం అనుకుంటారు, కవిత్వం మాటల కూర్పుకాదు"

ఆమె హృదిలోని తపసులాంటి తపనను అక్షరాలు భగ్నంచేస్తే కవిత్వం అయి ధ్వనిస్తుంది కాబోలు.

మౌనంగా నడుస్తోంది, అతని చెయ్యి పట్టుగుని.

ఆ మౌనపుముద్రకి భయపడినట్టుగా ఆకాశం కన్నీటిబొట్లు కార్చు తోంది, నోరు మెదిపే ధైర్యంలేక.

ట్రాన్సిస్టరు రెండో భుజానికి మార్చుకుని వేగంగా నడవసాగాడు.

"యెంత పరిగెత్తినా యీ లోయలు యీ జన్మకి తరగవు." అని అతని నడుంచుట్టూ చెయ్యితిప్పి—

మరో ఐదు నిమిషాల నడక.

"త్వరగా నడువు, తడిసిపోతాం" అన్నాడు,

"యేం, తడిస్తే: మనం తడవాలి. ఆ తడిలోంచి సెగ రగలాలి. ఆ సెగ యీ అరకులోయ అంతా దహించుకుపోవాలి" అని ఆగి అతనికి యెదురుగా నిలబడి, అతని మెడమీద చేతులు బిగించి అతని కళ్ళల్లోకి చూసింది.

"యేంటి పిచ్చివేషాలు, వొకప్రక్కన వర్షం రాబోతావుంటే ? చూడూ, యిక్కడికే బట్టలు తడిసినయ్" అన్నాడు మందలిస్తున్నట్లుగా.

"అవును బట్టలే తడిశాయి హృదయాలుకూడా తడవాలి. శరీరం లోని అణువణువూ తడవాలి. ఆ తడిలోంచి—" అని మునివేళ్ళమీద నిల అనుభూతిని గ్గెరుగడట

ంది "యీ తడి పెదవులలోంచి రగులుకునే జ్వాల—" అని అతని పెద వులను తన పెదవులతో బిగించింది.

వొత్తిడికి వొదిలిన పెదవులను తప్పించి అతని భుజంమీద తల ఆన్చి, వీపుచుట్టూ చేతులు తిప్పింది.

"మర్యాదగా నడువు-నీతో మాటలనవసరం. నా కిక్కడికి రేచి కొత్తు కొస్తొంది, పద-లేదంటే—"

"లేదంటే?"

"లేదంటేనా-రెక్కపట్టుకుని యీడ్చుకెళ్తాను."

"అంత నీచంగా నేను యెవరి దగ్గిరా బ్రతకలే ననుకుంటాను" అంది.

"అందుకే పద."

"లేకపోతే?"

"చెప్పానుగా—" అని జబ్బ పట్టుకుని గుంజాడు.

"మూర్ఖంగా ప్రవర్తించకు. యెవరికుండే ఆత్మగౌరవం వారికుం టుంది."

"ఆ మాటలన్నీ అనవసరం వానలో తడిసి నీకు జబ్బువొస్తే?"

"నీకు రాకపోతే చాలు. నా జబ్బుమాట అలా వుండనీ."

"నువ్వు నా భార్యవి."

"అయితే?"

"నీ మంచిచెడు నాది."

"అందుకే; సరిగ్గా అందుకే; నా మంచిచెడు చూద్దువుగాని, రా, యిలా కూర్చో" అంటూ చెయ్యివిడిపించుకుని కూర్చుండి పోయింది పచ్చికమీద.

నిశ్చలంగా చూస్తున్నాడు ఆమెకేసి, కోపంతో రోషంతో.

"రామ్, నా రామ్, యిలా రా, నా మంచిచెడు చూద్దువు" అని అతని చెయ్యి అందిపట్టుకుని లాగబోయింది.

విదిలించుకుని "ఛీ, నీకు సిగ్గులేదు" అన్నాడు.

"సిగ్గా! దేనికి? రామ్ దేనికి సిగ్గు! నేనింతవరకూ సిగ్గుపడాల్సిన

పని చెయ్యలేదు రామ్, యికముందూ చెయ్యను. పవిత్రత మీద సిగ్గుపొర కప్పి సిగ్గుపడాల్సినట్లుగా కాలేను నేను."

"యిక్కడికే యెంతో ఓర్పుపట్టాను. నాకు కోపం తెప్పించకు. మర్యాదగా పద" అన్నాడు.

"లేకపోతే!"

చటుక్కున వొంగి ఆమె జబ్బ పట్టుకుని, "పద. నువ్వెంత నీబతుకెంత!" అని పైకి గుంజాడు.

ఆ వూపుకి సగం లేచి—వొంటి బరువునంతటినీ కేంద్రించి కిందకి గుంజుకుంది తనని.

తూలిపడి గంగా చూశాడు.

"ఆ మాటే నేనూ అంటే" అని నవ్వింది.

"నోర్మూయ్"

"నాకు నోరుమూసుకోవటం రాదు" వొంగి, నీ అరిచెయ్యి నోటి మీద కప్పి—

"వొక్క నోటినే కాదు, నీ బతుకునికూడా ముయ్యగలను శాశ్వతంగా. నీకు దిక్కెవరిక్కడ, అట్లాగే వొంగి నీ పీక నులిమితే!"

"నాకా! నాకు దిక్కా! నాస్పర్శకి యీ చెట్లు యీ పువ్వులు యీ ఆకులు యీ వెన్నెల యీ గాలి యీ చినుకులు—సమస్తం మేల్కొని నా హృది సవ్వడికి ప్రతిధ్వనిస్తాయి. నా కళ్ళల్లో నీటిబొట్టు తొణికితే ఆకాశం బాధతో కంపించి నీమీద రాళ్ళవర్షం కురిసి నిన్ను హత మార్చుతుంది."

"మాటలకేం భాగ్యం, యీ రోజుల్లో కుక్కలు కూడా నేర్చుకుంటున్నయ్. చిరగదన్ని తీసికెళ్తాను."

"చిరగదన్నటం నేర్చుకున్నందుకు సంతోషం. మరోటి కూడా నేర్చుకుందువు, యిలా రా, కూర్చో."

"ఛీ, సిగ్గులేని లంజా, నువ్వు బజార్లలో తిరగాల్సిన దానివి."

"షటప్, బ్రూట్. యింతకాలం నిన్నూ నీ మాటల్నీ యెందుకు సహించానో నాకే సరిగా అర్థంకాదు" అంది

అనుభూతిని గ్గెరుగదట

నాగుపాము చివాలున లేచి పడగవిప్పి బుసకొట్టినట్లయి—నిశ్చేష్టుడై క్షణకాలం ఆమెకేసి, "అయితే యిందాకా వచ్చావన్నమాట" అన్నాడు.

"రాలేదు. వొస్తున్నాను; యిప్పుడిప్పుడే వొస్తున్నాను. నువ్వు యెందాకా లాక్కొస్తే అందాకా వొస్తున్నాను" అని, అతని ముఖంలోకి చూసి, "రామ్, యిదో యిలా కొంచెం వొంగి నా కళ్ళలో నీ ముఖం చూసుకో కొంచెం—నీకే తెలుస్తుంది—నిన్ను చాలా వాటికి క్షమించాను."

"బోడిముండ, నువ్వు నన్ను క్షమించటమేంటే! పళ్ళు రాల గలవు"

"నా పలువరస రత్నాల కూర్పు అని అనుకున్న వాడివి కదూ—యేరుకుందావని ఆశగా వుందా!" అని నవ్వి, "చూడు రామ్ నేను అనాల్సిన మాటలన్నీ నువ్వు నన్ను అంటున్నావు సహిస్తున్నాను. యెన్నిటినో సహించాను. నా సహనానికి నాకే ఆశ్చర్యం వేస్తోంది యెలాగోలా సర్దుకుపోదావని. కానీ దానికి హద్దులున్నాయి. ఆ హద్దులుకూడా దాటినప్పుడు—"

"యేం బెదిరిస్తున్నావా! నీ బెదిరింపులకు నేను జడిసేవాణ్ని కాదు. గడప బయటికి గెంటి నీకు దిక్కున్నచోట చెప్పుకో పొమ్మనగలను. యేమనుకొంటున్నావో!"

ఆమె మౌనంగా పచ్చికకేసి చూస్తోంది.

"యేం నంగనాచిలాగా కూర్చున్నావు! అవును. కూర్చోక యేం చేస్తావు! నీకేం బాధ! నిన్ను భార్యగా పొందినందుకు నేను బాధపడని రోజు లేదు."

ఫక్కున నవ్వింది.

"నన్ను చూస్తే నీకు నవ్వులాటగా వుంది పరిహాసంగా వుంది. నువ్వు యే పోకిళ్ళు పోయినా, యే వేషాలు వేసినా, యే తిరుగుళ్లు తిరిగినా దద్దమ్మలాగా నీ కాళ్ళముందు పడివుంటాననే కదా! నువ్వు గడ్డి పరకతో సమానం. ఛీ" అని ఆమె నుదుటి పై భాగం మీద చెయ్యివేసి బలంగా వెనక్కి నెట్టాడు.

వూపుకి తలవెళ్ళి గడ్డిమీద అదిరిపడింది.

అనుభూతినిగ్గెరుగదట

"చచ్చిన పీనుక్కమల్లే అట్లా గడ్డిమీదే పడివుండు. నే వెళ్తున్నాను" అన్నాడు.

"నే వెళుతున్నాను. ఈ నాటితో నీకూ, నాకూ బంధం తీరిపోయింది.'

"యేం?" అని బూటుకాలితో ఆమె తొడమీద అదిలించాడు.

నవి., "నన్ను చూస్తే నాకే నవ్వొస్తోంది రామ్. బంధం తెగిపోతుందనికదూ రామ్, బెదిరిస్తున్నావు! బంధం, పడబోతున్నట్లుగా అనిపిస్తూ అనిపిస్తూ అంతలోనే ముడి జారిపోయింది. బంధం లేదు. చుట్టూ దారాల అల్లిక చిక్కు. అంతే" అంది.

"అంటే నీ వుద్దేశం? నామీద జాలిపడి వున్నావన్నమాట! అంత ఖర్మ నాకేం పట్టలేదు. నీలాంటి ముండలు కో అంటే కోటిమంది. యీ క్షణంతో చెల్లు మళ్ళీ నా గుమ్మం తొక్కబోకు."

"అలాగే" అంది తాపీగా.

"నవ్వేలాటనుకున్నావా?" అరిచి లాగి తన్నాడు ఆమెను.

చివాలున లేచి, అతని ముఖంలోకి చూపుగుచ్చి—

ఆమె కళ్ళనీలం విరుగుతోంది యెఱ్ఱగా.

యేదో అనబోయి—ఆగి—కనురెప్పలు వాల్చి—

"సంగనాచి లంజా, ఆ పోజు చూడు—అందితే జుట్టు అందకపోతే కాళ్లు!" అని హూంకరింపులాంటి పొట్టి నవ్వు నవ్వాడు.

"జుట్టు అందకపోయినా పశువు కాళ్లు పట్టుకోలేని అసహాయురాల్ని. మంచిది. వెళ్లు. కానీ నీ ముఖం మళ్ళీ చూపెట్టకు నాకు" గొంతు బిగించి తీక్ష్ణంగా అంది

"నీ ముఖమా! ఛీ" అని, నాలుక పళ్ళమధ్యలోకి లాగి, పెదవులు వొంచి గట్టిగా "తూ" అని వుమ్మి—వెనక్కి తిరిగాడు

వాన తుంపరలో కలిసింది వుమ్మి.

పచ్చలకంఠహారంతీసి,"యేయ్,యిదిగో—"అని విసిరింది. అతనివీపు అనుకూతిసిగ్గెడుగదట

మీదుగా కిందికి పడింది.

వెనక్కి తిరిగాడు.

అతని బూట్లదగ్గిరిగా పచ్చికమీద వింతగా మెరుస్తోంది హారం.

"యిదుగో" అని భుజాన వేళ్లాడుతున్న ట్రాన్సిస్టరు కిందకి వొదిలి—వొంగి హారం వేళ్ళతో అందుకుని, నిటారుగా నిలబడి ఆమెకేసి చూసి, "అది కూడా" అన్నాడు, ఆమె మెడలోని మంగళసూత్రం కేసి చేత్తో సూచిస్తూ.

ఆమె మౌనంగా, నిశ్చలంగా, యెదురుగా అతని బూట్ల దగ్గిర పచ్చగడ్డికేసి చూస్తోంది.

"అది నీ మెళ్ళో వుంటే నా పరువుకూడా పోతుంది తే." అన్నాడు అసహ్యించుకుంటూ.

తల కొద్దిగా వొంచి, సూత్రం తీసి, తాడు మంగళసూత్రాలకేసి ముడతలుగా వొత్తి, అతనిమీదకి విసిరింది.

చేత్తో అందిపట్టుకుని వెనక్కి తిరిగాడు.

"చూడూ, పసుపు తాడు నీ చేతులో వుండతగ్గది కాదు. యిలా పారెయ్" అంది గొంతుబిగించి.

"పైసకో రెండు పైసలకో కొని వుంటావు దీన్ని. దాచుకో. వురి పోసుకోటానికి పనికొస్తుంది" అని ఉండ చుట్టి విసిరి, వెనక్కి తిరిగి, తుపుక్కున వుమ్మేసి పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ నడిచాడు.

దూరాన గుట్ట ప్రక్క పల్లంలో కనుమరుగయ్యేవరకూ నిర్లిప్తంగా చూసి—వెనక్కి వొరిగింది

గడ్డకట్టిన కోపం రెప్పలకింద కరుగుతోంది.

కన్నీటి ధారలు, చినుకుల తడికి భగ్నమౌతున్న కన్నీటిధారలు.

ధారలు కట్టి కారుతున్న వర్షం, వాల్చిన రెప్పలలోంచి వూరి వురికివొస్తున్న కన్నీటిలో కలిసిపోతోంది.

—యిలాగే యిలాగే యీ పచ్చికమీద యీ వర్షానికి తడిసి యీ పచ్చదనంలో నా హృది కలిసిపోతే యెంత బావుండును—యీ వర్షంతో వర్షానై యీ పచ్చికలోంచి యింకిపోయి, యీ పచ్చదనంలా శాశ్వితమై

అనుభూతిని గెరుగదట

పోతే బావుండును తను బతికి పొందగలిగేది యేమీ లేదనిపిస్తోంది. చిత్రం ! యేమీ అనుకున్నంత తేలికకాదు. యేమిటీ అనుబంధం అని ! బంధం-యెందుకి పెనుగులాట. యేవో తెలియని ఛాయ—అర్థంలేని సంచలనం-లేకపోతే తను—తను—ఆ రకంగా పూరుకోగలనా ! మిన్నాగులా కంఠాని కెగిసి—డాడీ, నన్ను చూసి జాలిపడుతున్నావా, అసహ్యించుకుంటున్నావా—అసహ్యించుకోవాల్సిన పని నేనేమీ చెయ్యలేదనుకుంటాను డాడీ. నీ కళ్ళ ముందు నీచంకాలేను, డాడీ-నీ ఆత్మకి తలవొంపులుగా, ఆత్మగౌరవానికి భంగంగా యేదీ చెయ్యను, డాడీ—నీ స్వప్నాలను నాలోంచి వాస్తవం చేసాను డాడీ—బతికి చెయ్యలేనప్పుడు చచ్చి చేస్తాను. కానీ ఆత్మ చచ్చిపోయాక, అస్తిత్వం...

కాలం, నీలిగగనపు కంటిలోంచి కన్నీరై స్రవిస్తోంది. ఆమెకు గమనింపులేదు.

ఆమె నుదుటి కుంకుమ వర్షానికి తడిసి, యెర్రగా కారి, పచ్చని ముఖంలో యెర్ర జీరలా కలిసిపోయింది.

వర్షానికి తెల్ల షిఫాన్ చీర తడిసి ముద్ద అయి, తొడలకీ మోకాళ్ళకీ అంటుకుపోయి వొంటి మలుపుల్లో సందుల్లో అతుక్కుని పోయింది. తెల్ల వుల్‌వాయిల్ బ్లౌజు, పట్టీలు లేనిచోట వొంటిరంగులో కలిసిపోయింది. బ్రాసియరు మాత్రం, వర్షానికి తడిసి మెరుస్తూన్న ఆమె వొంటి మీద వింతగా కనిపిస్తోంది. నడుంచుట్టూ, పొడవు పవిట రక్షరేఖలా చుట్టుకుపోయింది. జుట్టుముడి వూడి పచ్చికమీదా భుజాలమీదా నల్లని తడి మరకల్లా కనిపిస్తోంది. సన్నటి పొడవాటి వేళ్ళు గడ్డిలోకి దూరి, దుమ్ములో రాలిన నల్లపూసలను యేరాలన్నట్లుగా కదులుతున్నాయి.

లోని వోపికనంతటినీ పచ్చిక వోడ్చుకుంటే, శరీరం వెన్నెలను పీల్చుకుని తేరుకుంటోంది గడ్డిమీద కదిలి, దొర్లి బొక్కబోర్లా అతుక్కుపోయి —తిరిగి తిరిగి—ఆగి—

వెన్నెట్లో పచ్చికమీద మంచుముద్దలా మెరిసింది.

లోనికి వోడిగిలిన సీళ్ళు గడ్డకట్టి —వెచ్చగా-చల్లగా—సెగలా ఐ నిప్పు రవ్వలా మండబోతోంది తడిగాలిలో ఆవిరి పొగముద్దలా కదలబో అనుభూతిసిగ్గెరుగదట

తోంది. గాలి కౌగిలింతకే ఆమెలో కోటి విద్యుల్లతలు వెలగబోతు న్నాయి.

తడిసి ముద్దయిపోయిన ప్రకృతి, ఆమె శరీరంలోంచి యెగసే ఆవి రికి తేరుకుంటోంది.

—యీ లేత చీకటి, యీ చుక్కలు, యీ వెచ్చని వెన్నెలసోన, యీ గాలీ, యీ పచ్చికా, యీ మిణుగురులూ తనని యెందుకింతగా వూగి స్తాయి; తనని మత్తెక్కించి హిమకణంలా మండిస్తాయి — అబ్బా, యీ చీకటి అధరం—యీ వెన్నెలమొహం, యీ గాలికోత—కానీ యీ యేకాంత రసధుని-యిలాగే కాకపోతే, తను యీ పచ్చికమీద పుచ్చపువ్వులా విచ్చు కుంటే-యీ పచ్చికా, యీ గాలీ, చుక్కలూ, లోయలూ నన్నిలా యేడి పిస్తోంటే నిస్సహాయురాలిలా వూరుకునేదాన్నా—కానీ—కానీ-తనకి కావల సింది మాల్‌రో వాయ్‌సెస్ ఆఫ్ సైలెన్స్‌లా నిలిచిపోతుంది — దాన్ని కదల్చగలిగే శక్తి నాలో లేదో, వాటిలో కదల్చబడే స్వభావం లేదో గానీ— నా జీవితం-యిలా యిలా—సహారా యిసకమీద, వెల్‌వెట్ ఆకాశం కింద, నీలం నక్షత్రాల ప్రక్కన, నల్లని గాలి తెరల మధ్య రెండు జతల యవ్వనం పెదవుల వొత్తిడిలోంచి యెగసే తెల్లని జ్వాల నన్ను కసిదీరా మనసారా వుకికిస్తోంది—చూసి, చూసి చివరకి వెన్నెలే నన్ను బుజ్జగిస్తుంది. చీకటి నా కళ్లు తుడుస్తుంది. పచ్చిక నా వొంటిని నివురుతుంది—

లేచి కూచుని, పసుపుతాడు తీసి వేళ్ళ మధ్యనొక్కి పిండింది. చేసంచి అందుకుని నిలబడింది నాలుగడుగులువేసి, వొంగి, ట్రాన్సిస్టరు తీసి భుజానికి తగిలించుకుంది. ముఖం మీదకి పడిన తడిజుట్టును తల తోటే పైకి ప్రక్కలకి విదిలించింది.

కనుబొమలు యెగరేసి, తడిసి ముద్దయిపోయిన చెప్పులతో పచ్చిక మీద నడుస్తోంది.

మౌనంగా తపసు చేస్తున్న ప్రకృతి చెంత, నడకకి కదిలి, మెత్తటి వింత సవ్వడి చేస్తోంది చీర.

కాలిబాట వెంట నడిచి, రోడ్డుమీదకి అడుగులు................

అనుభూతిని గ్గెరుగదట

# 5

...— వేసి చుట్టూ చూసి నడక సాగించింది.

విచారమూ ఆనందమూ లేని నిర్లిప్తత.

—ప్రపంచం విశాలమైనది. హృదయం అంతకంటే సువిశాల మైనది. యెవరూ వెయ్యనిబాటన సాగనివ్వు జీవితాన్ని. ప్రపంచంలోంచి హృదయంలోకి హృదయంలోంచి ప్రపంచంలోకి—

—కానీ ముందు, యెవరోవేసిన యీ రోడ్డును నిడుపుగా దాటాలి. చేసంచిలో పాతికో పరకో యెంతో వుండాలి. యీ ట్రాన్సిస్టర్ని యే దుకాణం మెట్లమీదో ట్రాన్సిస్టర్ని చేసే యెంతిస్తారో—గాజు పెంకుల గూడు, యెంతిస్తారు, యే మూడొందలో ధర్మం కింద యిస్తారు— కాని ముందు యిప్పుడు బస్సులుండవు—ఆ బసకే వెడితే—వ్హు హూ— యేకాంత జాతివాళ్ళ పంచనో సిఫార్సయిన పడకట్ట్ ఆదరణలో యీ రేయి గడిపేసే...

హిమ పర్వత లోయలో చిక్కటి ద్రవంలా కరిగి తాపీగా అంచెల వారీగా జారుతూన్న మంచులా, కమాచి రాగంలా, సాఫీగా సాగదీసుకుం టోంది ఆమె మనసు.

దూరాన యెక్కడో, యేకాంత నిశ్శబ్ద లోయలో కర్కశంగా కీచుమన్న హారన్మోత ఆమెకు వినిపించలేదు. ఆమె చుట్టూ, మనసు సాలె గూడు అల్లుతోంది.

చర్ర్—సర్ర్ మని చప్పుడు చేస్తూ వెనక నుంచీ వొచ్చి ఆమె ప్రక్కగా జీపు ఆగితే—తుళ్ళిపడి పక్కకి గెంతి—తల తిప్పి చూసింది.

"యెవరమ్మా నువ్వు? వర్షపుధారలతో తలంటుపోసుగుని, వెన్నెట్లో ఆరబెట్టుకుంటూ రోడ్డుపక్కగా నడుస్తున్నావ్."

రెప్పలు పైకెత్తి చూసి, "నేనా—నేనా—" అంది అప్రయత్నంగా.

చక్కెర పానకంలో రసగుల్లాలు కొట్టుకున్నట్లు నవ్వి, "అవు ప్రేమ వెర్రిబాగులదట

నమ్మా నువ్వే. హిమకన్యలా, యీ పచ్చని లోయల ఛాయలో తళుక్కు మనే నువ్వే!"

ఆ కంఠస్వరం సైగల్ గొంతును స్ఫురింపిస్తే—కనురెప్పలు పైకెత్తి తేరిగా పరికించి చూసింది.

నల్ల ఫ్రేము కళ్ళద్దాలు, వెండిపోగులు వొంకర్లు తిరిగి చుట్టుకున్నట్లుగా ఆ తల, ఆ తల పెళాలతకి సరితూగే లేత గోధుమ రంగు ముఖం; ముడతలకి వింతగా మెరుస్తున్న చర్మం; సన్నగా బలంగా హరివిల్లులా వొంగి, మధ్యలో కిందకి వొంపుతిరిగిన పై పెదవి; ఆ పెదవిపైన, అక్కడక్కడావున్న తెల్లవెంట్రుకలనల్ల మరింతనల్లగా అనిపించే గుబురుగా బద్దీమీసం; నల్లని వృల్లిపొరలోంచి సహజవర్ణాన్ని చూసుకోవాలనుకుంటున్నట్లుగా కింది పెదవి; వయో భారానికి, లాలిత్యం చిదికిస్రవించి చంపలమీంచి జారి కోసుగా గడ్డకట్టినట్లు గడ్డంకొస; సామ్రాజ్యాలతోపాటు సామ్రాజ్ఞులను కూడా కైవసం చేసుకున్నట్లుగా యెర్రజీరలోంచి నల్లగా మెరిసే ఆ కళ్ళలోని "ముట్టడి"—వయోగమనంలోంచి అనుభవానికి హృదయం పండిపోయినట్లు,

మీగడరంగు బొంత ఖద్దరు జోధ్‌పూర్ కోటు, పంటలూను;

ఆ వ్యక్తిని చూస్తే ముచ్చటగా. సరదాగా అనిపించి, కనుబొమలు యెగరేసి, "నేనెవరినో యెలా తెలుస్తుంది? అనుభవం తెలుసుకోలేని విషయాన్ని నేను మాత్రం తెలుసుకోగలనా!" అని నవ్వింది.

"పోనీ యెక్కడికి వెళ్ళాలి?"

"యెక్కడికా? యెక్కడికో సరిగా తెలిస్తే యిప్పుడు యిలా నడుస్తూ వుంటానా!"

"వో!"

"యీ అరకులోయ దహించివేస్తే కరిగి, యెలిఫెంటా గుహల్లో శాశ్వతంగా ఘనీభవించాలనుకుంటున్న నేను యెవరినో యెక్కడికి వెళ్లాలో—"

"సరిసరి, ఐతే. కూర్చో వాల్తేరు. స్టేషనుముందర దించేస్తాను" అన్నాడు.

ఆ మాటాడే తీరులో, సెలయేటి గలగలలోని వేగం, స్పష్టత వున్నాయి.

చివాలున తోలుపట్టీ పట్టుకుని యెక్కి కూర్చుంది.

జీపు కదిలింది.

మౌనంగా కదలకుండా కూర్చుని, గాజుపలకలోంచి జారిపోతున్న రోడ్డుమీంచి యెక్కడో శూన్యపుటూదరలోకి చూస్తూ వుండిపోయింది.

పది మలుపులు తిరిగి ఆరు ఫర్లాంగులు పరిగెత్తింది జీపు. ప్రతి మలుపులోనూ స్టీరింగ్ చక్రం మీది అతని చేతికింది నల్లబిళ్ళ కర్కశంగా అరుస్తోంది.

"చూడమ్మాయ్ కూర్చోమనగానే నిర్భయంగా యెక్కి కూర్చున్నావుగానీ నేను నిన్ను దారిలో హత్యచేస్తే!"

"నా దగ్గిర యీ ట్రాన్సిస్టరు మాత్రమే వుంది. చిల్లరనోట్లు తప్పించి. పొరపాటున మీరు అలాంటి వారైతే మర్యాదగా యిది మీ చేతులో పెట్టి నమస్కారం చేసి దిగిపోతాను."

"పోనీ నిన్ను బలవంతంచేసి చెరిస్తే!"

"నాకు మీ జుట్టు యిందాకే అభయమిచ్చిందిలెండి."

నవ్వాడు—అదే నవ్వు. నవ్వినా మాట్లాడినా అదే సెలయేటి గలగల—ఆ గలగలలోని వేగం, స్పష్టత.

జీపు వేగానికి గాలి రివ్వున వీచి, తడిసి ముద్దయిన బట్టలలో వొళ్లు వొణుకుతోంది చలికి. చేతులు పొట్టమీద బిగించి పట్టుకుని కొంచెం వొంగినట్లుగా కుదించుకుని కూచుంది.

వాతావరణపు నెంబులోంచి జీపు దూసుకుపోతోంది.

గాలికి, తడిజుట్టు కదలలేక కదులుతూ భుజాలమీదకి వొళ్లోకి పడుతోంది.

రెండు చేతులతో జుట్టు పొదివి—చేతి వొత్తిడికి నీటిబొట్లు రాలాయి వొళ్ళో.

"నిమోనియా వొస్తుంది, ఆ తడిజుట్టుకి తల చీకితే. వెనక సీట్లో తువ్వాలుంటుంది తీసి తుడుచుకో" అన్నాడు ముందుకు చూస్తూనే.

ప్రేమ వెర్రిబాగులదిట

రెండు నిమిషాలు గడిచాయి

జీపు వేగంతోపాటు అతని దృష్టికూడా వేగంగా తీక్షణంగా పోతోంది ముందుకు.

రవ్వంత ప్రక్కకి జరిగి, తల వెనక్కి తిప్పి చూసింది. యేమీ కనిపించలేదు. చెయ్యివొంచి వేళ్ళతో తడిమింది. తెల్లటి దుబ్బు తువ్వాలు. తీసి, వెంట్రుకల చుట్టూ తిప్పి అదిమి రుద్ది తుడిచి-తలమీద వేసు కుని తుడుచుకుంది తువ్వాలు పీపు దగ్గిర సీటు పై అంచుమీద పరిచి నట్లుగా వేసింది వెంట్రుకల కొసల దగ్గిర, వేళ్ళతో — విదిలించినట్లుగా కొట్టింది.

యేదో భారం తగ్గినట్లుగా తల తేలికగా అనిపించింది ఆమెకు. మగతలోంచి తేరుకున్నట్లుగా తన చుట్టూ పలకరించుకున్నట్లుగా చూసి— భుజాలమీంచి చుట్టిన పవిట తీసి మెలి తిప్పి—కొద్దిగా జీపులోంచి బయటికి వొంగి, నీళ్లు పిండింది రోడ్డు మీదకి.

తడి ఆరని బ్లౌజులోంచి పీపు, భుజాలు.

"వాతావరణం యిలా వుండగా యివేళప్పుడు బయల్దేరారు మీరు?" అంది స్వగతంలా.

నవ్వి, "చిన్నదానివి నువ్వే వొంటరిగా నడుస్తూ పోతూండగా లేండి జీపులో నేను బయల్దేరటంలో యేముంది వింత? ఆ సీతాఫలం గుడ్డు యి. యి కుప్పలా కూలిపోయాడు మధ్యాహ్నం—మలేరియాకి. బస్సులో తీసికెళ్ళి కె. జె హెచ్. లో పారెయ్యమని డ్రైవరికి చెప్పి పంపాను మలేరియాకితట్టుకోలేనివాడువుద్యోగం అఘోరించటం అనవసరం." అన్నాడు

ఆమె మౌనంగా వుండిపోయింది.

"వానపడి వెలిసింది వానపడిన రోజున నాకెలాగో అనిపిస్తుంది. ఆ యి. యి. వెధవమీద మంటపుట్టి అమాంతం జీపెక్కేశాను."

"మీరూ"— ఆగిపోయింది

అతను విననట్లుగా ముందుకుచూస్తూ యెడమచేత్తో జేబులోంచి సిగ రెట్ కేసు తీశాడు. అరిచేతిలో వేళ్ళకింద బిగించి, బొటనవేలితో మీట నొక్కాకు చివాలున తెరుచుకుంది. తొడమీద ఆన్చి చిటికిన వేలితో

మూతపైన నొక్కి మాపుడువేలితో బొటనవేలితో సిగరెట్ కేసుని తొడలమధ్యకి వొడిలి, సిగరెట్ పెదవుల కతికించి, కేస్‌తీసి జేబులో వేసుకొని, అగ్గిపెట్టె తీశాడు. స్టీరింగు చక్రంమీద మోచేతుల దగ్గిర బలం ఆన్చి, ముందుకు వొంగి అగ్గిపుల్ల గీశాడు వెలిగి ఆరిపోయింది గాలికి.

ఆమె, ప్రక్కకి వొంగి మౌనంగా అగ్గిపెట్టె అందుకుని చేతుల మధ్య పుల్లగీచి జ్యోతిలా నిలిపింది. వొంగి ముట్టించుకుని పొగ వొదు లుతూ, బిగించిన పెదవులలోంచే "థాంక్స్ మై గుడ్ గర్ల్" అన్నాడు.

"మీకే నేను చాలా కృతజ్ఞతలు చెప్పుకోవాల్సివుంది. యీ రాత్రి వేళ నన్ను కనికరించి, రక్షించి—"

"నాకు యెవరిమీదా కనికారం వుండదు, పగా వుండదు. రక్షిం చటం అంతకంటే వుండదు. నేను లక్ష్యపెట్టను అదంతా. హ్యూమేన్ కన్సిడరేషన్. అంతే, యీ అడవిలో యిక్కడ దిగిపోతానంటే దించే స్తాను కించిత్తుకూడా ఆలోచించకుండా."

"మీరు యీ ప్రాంతంలోనే వుంటారా?" అంది.

"నేనా, నేను ఆంధ్రప్రదేశ మంతటా ఆముదం దీపంలా తిరు గుతూ వుంటాను. మధ్యమధ్యలో రాష్ట్రం విడిచి పారిపోతూ. నేను పి డబ్లియు సి యి. ని. యింకో నాలుగేళ్ళకిరిటైరై యీ కొండప్రాంతా లకి వొచ్చి వుండిపోవాలన్నా సొంతచోటు మీదా యింటి మీదా మమ కారం లాంటిది వుంది అంచేత, అడవులలోకి పారిపోయే పని చెయ్యను" అని నవ్వాడు.

"మీ పేరు"

"విజయ సారథి"

మనిషికి తగిన పేరులాగా అనిపించింది ఆమెకి.

"విద్య చదవటం నేర్పుతోంది; వివేకాన్నివ్వటంలేదు. వయసు మళ్ళని ఆడది యివేళప్పుడు యిక్కడ వొంటరిగా—షివల్రీ అనుకుంటారు. కాదు, వుత్త ఫూలిష్‌నెస్స్ అందుకు నువ్వు ప్రత్యక్ష నిదర్శనానివి తెలి సిందా?" అన్నాడు. చివరిమాట మందలింపుగా పలుకుతూ.

ఆమెకు ముచ్చటగా అనిపించింది.

వేసు వెర్రిబాగులదిటట

నవ్వుకుంటూ "తెలిసింది" అంది.

"గుడ్. చెప్పగానే తెలుసుకునే పిల్లలంటే నాకిష్టం"

ఆమె మౌనంగా వుండిపోయింది, తనలో తాను నవ్వుకుంటున్నట్లుగా ముఖం పెట్టుగుని.

"తోలు చేసంచీ, స్టీలు వసపిట్టసీ వూగించుకుంటూ—జత బట్టలు కూడా లేకుండా యేం చేదామని? బస్సు లెక్కటం నేర్చసంత మాత్రాన చాలదు. వివేకంకూడా వుండాలి. చీర పొరలు లాగి పిండుకో అన్యాయంగా చచ్చిపోతావు తడికి వూరి."

ఆమె మౌనంగా వుండిపోయింది.

"అవివేకానికి తోడు అభిమానం కూడా. పర్లేదు విప్పి పిండుకో. లోన పెట్టికోట్ లేదూ!"

ఫక్కున నవ్వింది, అప్రయత్నంగా.

"విష కన్యలా యేవిటా తింగ్యని నవ్వు?" అన్నాడు మందలింపుగా.

ఆమె మౌనంగా వుండిపోయింది.

రెండు నిమిషాలు గడిచాయి.

"పోయి వెనకసీట్లో కూచుని పిండుకో" అన్నాడు ప్రక్కకి తిరిగి చూడకండానే

లేచి వొంగి, ప్రక్కకి తిరిగి, సీటు పై అంచుపట్టుకుని కిందకి వొంచి అవతలికి వెళ్ళింది.

చీర విప్పి పిండుకుంది. పిండినచీర నడుం దగ్గిరినుంచి మోకాళ్ళ మీదకి వేసుకుని—లోపావడా వూడదీసి పిండి, మళ్ళీ వేసుకుంది—కూచ్చునే అటూ యిటూ ఒరుగుతూ.

గాలికి బ్లౌజు అప్పుడే కొంత పొడిబారింది. బ్రాసియరింకా చెమ్మగానే వుంది. ప్రక్క సీటుమీద కూచుని చీర వెడల్పుగా చేసి గాలికి యెత్తి పట్టుకుంది.

"చెత్త ప్రయాణం. పగలంతా తిరిగి తిరిగి, బయల్దేరాల్సింది కాదు డ్రైవర్ లేకుండా" అనుకున్నాడు పైకి.

ప్రేమ వెర్రిబాగులదిట

"పోనీ నేను నడిపేదా?" అంది.

"జీపు నడపటం వొచ్చునా?"

"కారు నడపటం తెలుసు. జీపుకూడా కారులాంటి యంత్రమే అనుకుంటాను"

"గుడ్. ఐతే సారధికి సారధ్యం వహించు" అని నవ్వాడు.

"నడుపుతాను గానీ ప్రాణాల పూచీ నాదికాదు" అని నవ్వింది

"కు్రదానివి, నీకు లేని భయం నాకా! గోయెహెడ్. యేడాదులుగా నింగినుంచి నిరీక్షిస్తోంది, యీ రోడ్లెంట తిరిగే నాకోసం. రెప్పపాటులో వెళ్లి పాదాలచెంత వాలతాను" అని నవ్వి జీపు అపి—స్టీరింగ్ చక్రం దగ్గిరినుంచి కుడివైపుకు జరిగి, యెడమచేత్తో పక్క సీటు పైభాగం కిందకి వొంచాడు.

చీర నడుం దగ్గిర చుట్టూ లుంగచుట్టి పట్టుకుని ముందుకు వొచ్చి—సీటు అంచుతిన్నగా నిలబెట్టాడు.

కూచుని చీర పొరలు జీపు బయటికి జారిపోకండా వొళ్ళో గుచ్చింది

జీపు కదిలింది.

రెండు నిమిషాలపాటు రోడ్డు మలుపులదగ్గిర చక్రం తిప్పే తీరూ వాడుపూ గమనించి 'వో. కె.' అన్నట్లు తల పంకించుకున్నాడు.

గాజు పలకలోంచి ముందుకు చూస్తూ నడుపుతూ కాస్త తడిఆరిన ముంగురులను యెడమ చేత్తో సవరించుకుంటోంది అప్పుడప్పుడూ.

వెనక్కి కొంచెం వొరిగినట్లుగా సాగదీసుకున్నాడు వొళ్లు. కాలి బూట్లకి తగిలి పడిన ట్రాన్సిస్టరూ చేసంచీ తీశాడు.

చే దమాలతో రెంటినీ తుడిచి—చెయ్యి వెనక్కి వొంచి, వెనక సీట్ల మధ్యన ఉన్న సూట్కేసు మీద పడేశాడు చేసంచి

ట్రాన్సిస్టరు మీట తిప్పాడు.

"ఐతే అది పనిచేస్తోందన్నమాట?" అంది ముందుకు చూస్తూనే.

"నీలాగా అది మనిషి చర్మం కప్పుకో లేదమ్మాయ్ తడిసి ముద్దవటానికి" అని నవ్వాడు. ఆమె కూడా నవ్వింది.

ప్రేమ వెర్రిబాగులదిట

పశ్చిమ దేశాల అరదజను వాయిద్యాల సమిష్టిరొద.

"యింతకీ నువ్వెవరిపిమ్మాయ్!"

"మా నాన్నగారి అమ్మాయిని" అని నవ్వింది.

"ఉత్త హైస్కూలు చమత్కారం. కాగా నేనడిగింది, ఎవరమ్మాయివని కాదు, యెవరివని"

"చూస్తున్నారుగా ఎవరినో తెలియటం లేదా" అని నవ్వీనవ్వనట్లుగా ధ్వనిచేసింది.

"పెంకిపిల్లల సమాధానం. గేట్ వే ఆఫిండియాలోంచి యీ అరకు లోయలో కట్టుబట్టలతో యిలా యెందుకు పడి వున్నావని! అంతకంటే మరేంలేదు."

"యేడాదినుంచి విశాఖలో లెక్చరర్‌గా వుంటున్నాను. తాత్కాలికపు టుద్యోగం. కాలపరిమితి అయిపోయింది. యీ లోయ చూసి వెళ్లిపోదామని."

"యిదేనా చూసేతీరు? అందుకే అన్నాను విద్యవల్ల వివేకం రావటంలేదని."

"కొండమీద నడుస్తూ వుండగా వర్షపుగాలి వొచ్చింది. తూలినప్పుడు, ప్రయాణపు సంచి, చెయ్యిజారి కింద అఖాతంలోకి పడిపోయింది"

"వో, అలాగా. నీపేరు?"

"పేరు అంతముఖ్యమా?"

"అబ్బే ముఖ్యం కాదనేగా అడగటం. ముఖ్యమైన విషయాలు అడిగే చెడ్డ అలవాటులేదు నాకు, చెప్పే దురలవాటు నీకు వున్నా" అని నవ్వాడు.

నవ్వి, "గీతాదేవి" అంది.

"చూడమ్మాయ్ గీతా, పెద్దపెద్ద నగరాలలో పెరిగి పెద్దపెద్ద చదువులు చదివినందుకు యిలా అద్భుత సాహసాలనుకునే పనులు చేస్తేతప్ప నాగరికత నిలబడలేదా!" అని నవ్వాడు, సిగరెట్ వెలిగించుకునే ప్రయత్నంచేస్తూ.

ప్రేమ వెర్రివాగులదిటు

"అనుకుని కాదు. అలా సంభవించింది."

యిద్దరూ మౌనంగా వుండిపోయారు.

అరగంట గడిచింది.

చినుకు చినుకుగా ప్రారంభమైన వర్షం వురుములు మెరుపులతో జోరుగా పడసాగింది. యీదురుగాలికి వానసీళ్ళు జీపులోకి పడసాగాయి.

ట్రాన్సిస్టరు మూసి, మైనం పట్టాలను కిందకిలాగి బిగించాడు అన్ని వైపులా.

సిగరెట్ వెలిగించి పొగవొదులుతూ, "నీళ్ళతడికి చక్రాలు జారగలవు. నేను నడుపుతాన్లే" అన్నాడు.

"పగలంతా నిద్ర, తీరక. నిద్రమత్తు రావటంలేదు. కొత్తజీపులా వుంది. పరవాలేదు. మీరు విశ్రాంతి తీసుకోండి" అంది

"అయితే వెనక సీట్లలో ముడుచుకుంటాను కాసేపు. భయంవేస్తే లేపూ–"

"వొ. అలాగే" అని కనుబొమలు యెగరేసింది–యెడమచేత్తో ముంగురులను సవరించుకుంటూ.

ట్రాన్సిస్టరు పాదాల దగ్గిర కిందపడుకోబెట్టి–వొంగిలేచి, వెనక్కి వెళ్లాడు. సూట్కేసు తెరిచి మఫ్లర్ తీసి, తలమీదనుంచి వొదులుగావేసి మెడచుట్టూ తిప్పాడు. వో వున్నికోటు తీసి, "తగిలించుకో, వెచ్చగా వుంటుంది" అని, ఆమె కుడి భుజంమీదకి విసిరాడు పడి, జారి, రెండో సీటు పై అంచుమీద ఆగింది.

సూట్కేసు మూసి దానిమీద కూచుని, ప్రక్కగా వొరిగి తల, ప్రక్క వైపు సీటుమీద ఆన్చాడు.

మూడు నిముషాలలో అతని శ్వాస మూతవేసిన జీపులో వింతగా సవ్వడి ఐంది—ఆ శరీరం పగలు తిరిగి తిరిగి అలిసిపోయిందని నిరూపిస్తున్నట్లుగా.

జీపు దేనికో గుద్దుకున్నట్లుగా ఐ, తల యినప గొట్టానికి కొట్టుకుని మెలుకువ వొచ్చింది అతనికి.

"యేమైందమ్మాయ్, నీ పేరేవిటో మర్చిపోయినట్లున్నాను

ప్రేమ శ్రీరికాగులదిట

నిద్రలో" అన్నాడు కళ్లు తెరవకుండానే.

"గీతాదేవిలెండి. యింకా యేమైందని అడుగుతున్నారా కునికిపాట్లు పడుతూ, కొత్త ఉప్పు తూటా గుండులా దూసుకుపోతున్నదేమో, మైలు రాతికి గుద్దేశాను. యింజను పచ్చడైపోయింది. లేవండి. సంచులు భుజాన వేసుకుని నడక సాగిద్దాం" అని గలగలా నవ్వింది

"పచ్చడైనా ఏమైనా పర్లేదులే—జీపు ప్రభుత్వానిది" అంటూ యేటి రొద నాలకించి కళ్ళు నులుముకుంటూ లేచి బాగా పొంగిన వాగుకేసి చూసి, "వో" అన్నాడు.

"యెవరో ధోవతి రోడ్డుమీద ఆరేసుకున్నారేవిటా అనుకుంటూ పోబోతే, యేరు తెల్లతాచులా బుసకొట్టిలేచింది పైకి. సడన్ బ్రేకు వేశాను. ధన నష్టవూ ప్రాణ నష్టవూ లేదు మీరు నిశ్చింతగా పడుకోండి. యీ వాగు పొగరుబోతుతనంకేసి చూస్తూ కాలక్షేపం చేసాను" అంది వెనక్కి తిరగకుండా స్టీరింగ్ చక్రంమీద ఆన్చిన చేతులమీద వొంగి గడ్డం అదిమి నీళ్ళలోకి చూస్తూ.

"వర్షం పోయినట్లుంది" అన్నాడు.

"పోలేదు. యిదో యీ వాగులోపడి కొట్టుకొస్తోంది."

"యేం చెయ్యటం? వెనక్కి తిరిగి పోతే?"

"చాలా దూరం వొచ్చేశాం. వాగనీరుకిదా నదిలా పెళ్ళికూతురిలా నడవదు. గంటసేపట్లో ఆనవాలు లేకండా అయిపోతుంది" అంది.

లేచి, మైనం పట్టాలు తొలిగిస్తున్నాడు.

చుట్టూ బీడు భూమి. అక్కడక్కడా చెట్లు, చిన్న చిన్న గుట్టలు, పరవళ్లు తొక్కుతున్న వాగు నీరు—మైదానంమీద వెన్నెల ప్రశాంతంగా, విశాలంగా అనిపిస్తోంది

దిగి, వొళ్ళు విరుచుకుని, చుట్టూ చూసి, తాపీగా నడిచి నీళ్ళ దగ్గిరికి వెళ్ళాడు. సిమ్మెంటు చప్టా కనపడటంలేదు. మోకాలిలోతు నీళ్ళు.

అతనికేసి చూసింది——పొడవుగా, నిండుగా, హుందాగా కనిపించాడు.

కోటు విప్పి, దిగి, జీపువెనక రోడ్డు మధ్యలో నిలుచుని చీర కట్టు

కుంది. జుట్టు జారపిడిచి వేళ్ళతో దువ్వి ముడి చుట్టింది మెలికేసి.

అతను తిరిగివొచ్చి, యింజనుముందు యినప కడ్డీమీద కుడికాల వేసి చుట్టూ పరికించాడు.

కుచ్చెళ్ళు సర్దుకుంటూ అడుగులు వేసి—పవిట భుజాలచుటూ తిప్పి పట్టుకుని వొచ్చింది.

రెప్పలు పైకెత్తి ఆమె కళ్ళలోకి చూస్తూ—అలాగే నిమిషంపాట వుండిపోయి, తత్తరపడినట్లు సంచలనంగా చూపువాల్చి చరచరా నాలుగ అడుగులు వేసి రోడ్డు ప్రక్కకి వెళ్ళాడు.

అతనికేసి వింతగా చూసి, కనుబొమలు యెగరేసి, గడియారంకేసి చూసుకోబోయినట్లుగా కుడిచెయ్యి వొంచి—మళ్ళీ ముఖం పైకెత్తి, "యెంతైందో యిప్పుడు!" అనుకుంది. వానకి తడిసిన చేగడియారం యెప్పుడో ఆగిపోయింది.

అతను, అటూయిటూ యెత్తుదిబ్బమీద అడుగులువేసి కాస్తపొడిగా అనిపించిన చోట కూచున్నాడు.

రెండు నిమిషాలు గడిచాయి.

తాపీగా నడిచి అతని దగ్గిరికి వెళ్ళి, "నా గడియారం నీళ్ళు తాగి వుబ్బరించుకు పోయింది. టైమెంతైందండీ!" అంది.

చెయ్యి వొంచి, కోటు అంచులోపలి నుంచి బయటపడిన గడియారంకేసి చూసుకుని చెప్పాడు.

"తెల్లవారక ముందే వాల్తేరు చేరుకుంటే—" స్వగతంలా గొణిగింది.

"యీ ప్రవాహం వొడిసిపోతే యెంతసేపు! నువ్వు బాగానే లాగించినట్లున్నావ్! యువక రక్తం కదూ, యెంతయ్యిందేళ్ళు?"

నవ్వి, "లేదు. అరవై అయిదే" అంది.

"కూర్చో నిలబడే వున్నావేం?"

"వూఁ" అని అటూ యిటూ అడుగులువేసింది.

మళ్ళీ చినుకులు ప్రారంభమయ్యాయి.

"యీ రాత్రి యీ యెడారిలోనే గడిచిపోవాలేమో!" అని స్వగ

తంలా పలుకుతూ రోడ్డుపైకి అడుగులు వేసింది.

లేచి "ఆ యి యి. వెధవకి వో చురక వెయ్యాలి" అని పైకి అనుకుంటూ తాపీగా అడుగులు వేశాడు, నడుం వెనక చేతులు బిగించి.

వెళ్ళి స్టీరింగ్ చక్రం ముందు సీట్లో కూచుంది.

అతను కుడివైపుగా వొచ్చి సీట్లో కూర్చుంటూ, "వెనక సీట్లమధ్య కుదించుకుని వో కునుకు తియ్యి యిప్పట్లో వాగు తగ్గే సూచనలు లేవు" అన్నాడు

"నిద్ర రావటంలేదు మనసు యీ వెన్నెలలా పరుచుకుంటోంది యీ వాగులా పొర్లుతోంది" అని స్టీరింగ్ చక్రంకేసి చేత్తో చూపెడుతూ, "దీని మీద గడ్డం ఆన్చి యీ యేటి రొద వింటూ కూచుంటాను" అంది.

"పోనీ ట్రాన్సిస్టరు పెట్టుకుని పాటలు విను" అని నవ్వాడు

"ప్రపంచం అంతా నిద్రించింది."

"అమెరికా తప్ప" అని నవ్వాడు.

పావుగంట గడిచింది.

మేఘాలు కమ్మి చీకటిగా అయింది. ఆ చీకటి వెనక వెలుగు పొరలా మణిగిపోయిన వెన్నెల. వర్షం యెక్కువైంది.

కుడివైపు నుంచి జల్లుకొట్టి—మైనం పట్టా వెయ్యబోయాడు.

"గాలి బొత్తిగా లేదు, ముయ్యకండి. కొంచెం లోనకి జరిగి కూర్చోండి" అని మెడ నొప్పి పుట్టినట్లుగా అనిపించి, వాగులో కలుస్తున్న తన దృష్టిని కళ్లలోకి లాక్కుని, చక్రంమీద యెడమ చెంపఆన్చి, అతనికేసి చూసింది చీకట్లో అతనిజుట్టు వింతగా కనిపించింది. కళ్లు—ఆ కళ్లలోని "ముట్టడి"— చూపు కిందకి మరల్చి రెప్పలు వాల్చింది.

వర్షంతోపాటు యీదురుగాలికూడా ప్రారంభమైంది.

పవిట మరింత బిగించి, చలికి వొణికినట్లుగా ముణగతీసుకుంది.

"కోటు తీసిపారేసి అలా చలికి వొణుకుతావేం? ఫూలిష్‌గర్ల్". అని వెనక ప్రక్కగా పడివున్న కోటుతీసి, ఆమెభుజాల చుట్టూ వేసి—

ఆమె తల పైకెత్తి, అతని ముఖంలోకి చూసింది.

తెల్లని వెన్నెల జీరలో ముఖాలు మెరుస్తున్నాయి.

ప్రేమ వెర్రిబాగులదిట

అతను, ఆమె కళ్లలోకి నిశ్చలంగా నిలకడగా చూస్తూ వుండిపో యాడు, బిగుసుకు పోయినవాడిలా. ఆమె,కనురెప్పలు వాల్చలేకపోయింది భీతిలో గుప్పెగిలించి చూస్తున్నట్లుగా వుండిపోయింది.

అలాగే ఆమె కళ్ళలోకి చూస్తూ, మెడవొంచి ఆమె పెదవులమీద పెదవులు ఆన్చాడు. చీకట్లో దేనికోసమో చేత్తో తడిమి చూసినట్లుగా,అతని పెదవులు ఆమె నోటిమీద కదులుతున్నాయి. విడివడని ఆమె పెదవులను వొత్తి తడి అద్దుతున్నాయి.

అలాగే అతని భుజాలు పట్టుకుని అతని పెదవులకు తన పెదవులను బిగించి—కనురెప్పలు వాల్చింది.

అతని కనుల ముట్టడిలో ఆమె హృదయం చిక్కుపడిపోయింది.

ఆమె కనుల నీలి జ్యోతులలో అతను లీనమైపోతున్నాడు.

పెదవులు విడిపడి — కదిలి — జరిగి—వొరిగి—యేటవాలుగా దగ్గిరికి లాక్కుని, కుడిచేతిమీద ఆమెవీపు ఆన్చి, ఆమెతేసే తదేకంగా తీక్షణంగా చూస్తున్నాడు

కనురెప్పలు తెరవకండా అలాగే వుండిపోయింది.

కనురెప్పలమీద పెదవులు అద్ది—యెడమ చేతివేళ్ళతో ఆమె కుడి చేతి జబ్బ తడిమి, చేతి పొడవునా నిమిరి, సన్నటి పొడుగాటి ఆ వేళ్ళను సవరించి తన వేళ్ళలోకి తీసుకుని చెయ్యి పైకివొంచి ఆమె అరిచేతిని తన నోటికి అద్దుకున్నాడు.

ఆమెచేతి వేళ్ళు పాము నాల్కలలా కదిలి ప్రాకి అతని ముఖాన్ని స్పృశిస్తున్నాయి.

యెడమచెయ్యి ఆమె పొట్టమీద ఆన్చి, జరిపి-వేళ్లతో చర్మాన్ని మృదువుగా రాస్తున్నాడు.

-తానొకగాడిద, అడ్డగాడిద, బుద్ధిలేని గాడిద-తనేం చేస్తున్నట్లు-యీ ముసలి డొక్కు - కానీ—ఆ కళ్ళముట్టడి తన అస్తిత్వాన్నంతటినీ ముద్దగా వొత్తి-తన కేమైపోతోంది—తను—తను — యేమిటిది-యేమిటీ సాంద్ర ప్రగాఢ వొరవడి—కానీ తనకి బుద్ధిలేదు-జ్ఞానంలేదు—వొహో, నర నరంలో అణువణువునా యీ విద్యుల్లతల ప్రవాహం—యీ వెలుగుముందు; ప్రేమ వెర్రిబాగులదిట

మహత్తర అనుభవం ముందు తన జీవితం, తన అనుభూతి సమస్తం పేలవంగా కనిపిస్తోంది– యీ వెలుగు యీ కాంతిపుంజం హృదయమంతటా నిండి భారంగా చేస్తోంది. యీ మెత్తటి దూదిపింజలాంటి భావం–యిన్నాళ్ళూ తను చూడనిది తను స్పృశించనిది తను యెరగనిది– ప్రేమ అంటే యిదే కాబోలు–యెంత విమలంగా, యెంత మహత్తరంగా – యిష్–వృత్త అజ్ఞానపు చేష్ట–కానీ–ఆ కళ్ళలోని ముగ్ధత తనని చుట్టేసి యెక్కడికో తెలియని దూరతీరాలకు యెలాగో యెలాగో తీసుకుపోయి – యీ శరీరం ఆ చేతులమధ్య చిదికి వొళ్ళోంచి ప్రవహిస్తోంది ఆ వాగులా– యిందులో, వేడిలేదు, కసిలేదు ఆవేదనలేదు – చల్లగా గోర్వెచ్చగా తమల పాకు స్పర్శలా...

తొణకకుండా, వేగంగా నిండుగా ప్రశాంతంగా ప్రవహిస్తున్న హృదయం కింద మేధసు అణగారిపోయింది. ఆలోచనల అల్లికలో సమస్యల చిక్కు– పుడివిప్పలేకపోతోంది. చేష్టలుడిగి పోయింది. మేధసు, హృదయపు ప్రశాంతిలో మూగవోయింది.

ఆమె సుషుప్తిలాంటి స్థితిలో కలిసిపోతోంది. చల్లగా గడ్డకట్టటాలు వెచ్చగా రగలటాలులేవు. అంతా ప్రశాంతి, కాంతి

వీణమీద కదిలే వేళ్ళలాగా: అతని వేళ్ళు ఆమె వొంటిమీద చలిస్తున్నాయి. యింకా, వాలిన ఆ కనురెప్పల కింది ఆ నీలిమలోకి చూస్తూనే వున్నాడు.

అతని వేళ్ళు పొట్టమీదనుంచి కిందకి ప్రాకి, కుడిభాగం ఆమె తొడమీద తెల్లని చీరమడతలలో చిక్కుపడి – ఊపిరాడనట్లుగా కదిలి–స్పృశిస్తూ—

అతని వేళ్ళకింద ఆమె శరీరం వీణ అయి, కంపిస్తోంది.

—ఆ వేళ్ళ అలా అలా–మహత్తర వైణికుడిలా–ఆ వేళ్ళు తన శరీరంలోని నరనరాన్నీ మీటి శ్రుతించి మౌనగానం వినిపిస్తున్నాయి. ఆ వేళ్ళ–ముడతలుపడి వంకర్లు తిరిగిన వేళ్ళు కాదు అవి పైనకప్పుకున్న చర్మం–నెత్తిన అది అతికించుకున్న ముగ్గుబుట్ట కిరీటం– వయోభారంతో కుంగిపోతున్నవాడు కాదు యవ్వనంభారంతో పొంగిపోతున్న యువకుడు–

ప్రేమ వెర్రిబాగులదిట

వృత్త మోసకారి-భీకరంగా గీపెట్టి అరిచి కారులోంచి కిందకి తొక్క-గొంతు గొంతి-

ఆమె గొంతు పలకలేదు. అతని వేళ్ళకింద తన్మయించి ప్రశాంతంగా నిద్రపోతోంది, ఆ అపూర్వగాన గళవాహిక.

అతని వేళ్లు పైకి ప్రాకి పొట్టనిమిరి, నడుంచుట్టూ చర్మాన్ని రాసి-కొంచెం ప్రక్కకి వొత్తిగిలి, వేళ్లు వీపు నంటుకుని ప్రాకి-

రెండు చేతులతో ఆమెను బిగించి పైకి లాక్కొని దగ్గరికి వొత్తుకుని ముఖం వొంచి-అలాగే, వాలిన ఆ కనురెప్పలవల కింది నీలిజ్వాల కేసి చూస్తూ-వెర్రిగా కంపించిపోయి "జ్యోతీ" అని భీతిగా అరిచి, ఆమె ముఖంమీద తన ముఖం వొత్తి, వెక్కి-వెక్కి యేడ్చాడు.

తుళ్ళిపడి రెప్పలు విప్పింది. అతనే కళ్ళలోని నీళ్లు రాలి ఆమె కళ్ళ మీద పడ్డాయి.

అర్థంకాక, కళ్లలోకి కన్నీరు పడుతూంటే రెప్పలు వాల్చి అతని వీపుమీద చెయ్యివేసి, వేళ్లతో తడిమి, చెయ్యి పైకి పోనిచ్చి మెడమీది నుంచి జుట్టులోకి వేళ్లు దూర్చి వెండిపోగుల చిక్కు విడదీస్తోంది.

"జ్యోతీ" నన్ను అన్యాయం చేసి వెళ్ళిపోయి యిన్నాళ్ళకి మళ్ళీ నీ నీలి జ్యోతులను నా కనుల ముందర వెలిగించావ్ — పుచ్చ పువ్వులా విప్పుకుంటోంది నా మనసు ముప్పయ్యేళ్ళనాడు కృష్ణా తీరాన గడిపిన తొలి రేయిలా వుంది యిక్కడ యీ యేటి వొడ్డున-హాయిగా నిద్రపోతా నింక నేమ నీ కళ్ల వెలుగులో—జ్యోతీ" ప్రేలాపనలా అని పెదవులతో ఆమె కన్నులమీద అద్ది "బ్లూ బెల్స్ విచ్చుకోవాలి జ్యోతి వాటిలో నేను నిద్రించాలి—యేదీ విప్పు కళ్లు" అని వెంటనే యేదో స్ఫురణకొచ్చినట్లు చలించి వెక్కి-వెక్కి పడుతున్నాడు.

అతని చెంపలకు తన అరిచేతులు అదిమి, వేళ్ళతో స్పృశించి, "సారధీ యెందుకు పిచ్చివాడిలా యేడుస్తున్నావ్ !" అంది

"జ్యోతీ, జ్యోతీ."

ఆమె పలకలేదు యేదో మౌనంగా వింటూ తన్మయం పొంది మరో కిమలో మైమరిచిపోతోంది.

పేమ వెర్రిబాగులదిట

"జ్యోతీ, జ్యోతీ" అని కదిలించాడు ఆమెను.

తుళ్ళిపడి లేచి, రెప్పలు విప్పి, క్షణకాలం చూసి, వెంటనే తొట్రుపడినట్లుగా చూపు కదిల్చి, రెప్పలు వాల్చి లేవబోయింది

భీతితో కంపించినట్లుగా వొణికి, చివాలున కుడి ప్రక్కకి జరిగి, కిందకి దిగి, వెక్కి-వెక్కి యేడుస్తూ పిచ్చివాడిలా నడుచుకుంటూ రోడ్డు దాటి డిబ్బమీద కూలబడిపోయాడు.

యెడమ ప్రక్కకి జరిగి, స్టీరింగ్ చక్రంమీద, యెడమ చేతివేళ్ళ మీద కుడి చేతి వేళ్ళు ఆన్చి, మణికట్టుకీ చేతివేళ్ళకీ మధ్యలో నుదురు ఆన్చింది.

బలహీనమైన కెరటంలా, ఆమె కళ్ళలోంచి నీరు వుబికింది.

పావుగంట గడిచింది——

అతను, లేచి జీపు దగ్గిరికి నడిచి వొచ్చాడు. కళ్ళు పొడిగా యెర్ర జీరలతో వింతగా మెరుస్తున్నాయి.

ప్రక్కకి వొచ్చి నిలబడి ఆమె ముఖంలోకి చూడకండా తనముఖం వారగా తిప్పుకుని, ఆమె యెడమ జబ్బ పట్టుకుని కిందకి లాగి-ఆమె కదిలిండి-దించి వెళ్ళమన్నట్లుగా నెమ్మదిగా నెట్టాడు.

కనురెప్పలు పైకెత్తి అతని ముఖంలోకి చూడబోయి, అంతలోనే వాల్చి——రెండడుగులు ప్రక్కకివేసి, జీపులోకి వొంగి, ట్రాన్సిస్టరూ, చేసంచీ తీసుకుంటోంది.

సీటులో కూర్చుని, చక్రంమీద చేతులువేసి ముఖం ఆన్చాడు.

ట్రాన్సిస్టరు, చేసంచీ-రెంటి తోలు పట్టీలు కలిపి పట్టుకుని చెయ్యి పైకి వొంచి వీపుమీది నుంచి కిందకి వేళ్ళాడేసుకుని నడిచింది వాగు వైపుకి.

రెండు నిమిషాలు నీటి ప్రవాహం ప్రక్కన రోడ్డుమీద టచ్చాడి-యేటి ప్రక్కగా యిసకలో నడుస్తోంది. యిసకలో తూలిపడకండా పట్టిపట్టి నడుస్తూ, వందన్నర గజాలు వెళ్ళి యిసకలో కూలబడింది. ట్రాన్సిస్టరూ చేసంచీ యిసకలోకి జారవిడిచి.

కాళ్ళు పైకి వొంచుకుని, ముందుకు వొంగి, మోకాళ్ళ చుట్టూ

ప్రేమ వైరిబాగులదిట

చేతులు బిగించి— మోకాళ్ళమీద నుదుటు ఆన్చింది.

ప్రేమతో ద్విగుణీకృతమైన హృదయం, గాలికి కదులాడిన తడి బట్టలా వుంది. మేధ ఆలోచనల వలలో తానే చిక్కుకుని, హృదయపు వొత్తిడికి అణగారి సోలిపోయింది.

పావుగంట గడిచింది.

అతను జీపు దిగి, చుట్టూ పరికించి చూసి కొంచెం వడివడిగా వాగు వైపు అడుగులు వేశాడు.

నీళ్ళ వొడ్డున యిసకలో కూర్చుని వుండటంచూసి, తాపీగా ఆమె దగ్గిరికి వెళ్ళాడు.

తుళ్ళిపడినట్టు కదిలి—అతను కనిపించి—అలాగే వుండిపోయింది.

మౌనంగా వొంగి ఆమె కుడిజబ్బ పట్టుకుని పైకి లేవదియ బోయాడు, అతని చేతివేళ్ళమధ్య తెలిపసుపు చర్మం కింది రండ ప్రదిలి నట్టుగా నలిగింది. శరీరపు బరువును యిసకమీదకి జారవిడిచి, కదలలేదు ఆమె.

మళ్ళీ వేళ్ళు ఓగించి పైకి లేవదీయబోయాడు, లేచింది.

వొంగి, ట్రాన్స్పరెంటు చేసంచీ తోలుపట్టీలు పట్టుకుని లేచి రెండో చేత్తో మణికట్టు దగ్గిర ఆమె చెయ్యి పట్టుకుని ముందుకు నడిపించాడు.

వొకరికేసి వొకరు చూసుకోలేదు. తల రవ్వంత కిందకి వొంచి మౌనంగా నడుస్తోంది. ఆమె ప్రక్కన ముందుకు నడిపించుకు వెడు తున్నాడు మౌనంగా.

జీపుకి కుడివైపుగా తీసుకొచ్చి, ముంజెయ్యి వొదిలి జబ్బ పట్టుకుని పైకి యెక్కించాడు. గమ్మున యెక్కి కూచుంది.

వెనక, సూట్కేసుమీద పడివున్న వున్నికోటుతీసి ఆమె భుజం మీద వేశాడు. ముందునుంచి తిరిగివొచ్చి స్టీరింగ్ చక్రం ముందు కూచు న్నాడు.

అంతటా నిశ్శబ్దం—వాగు రొదతప్ప

రెండు నిమిషాలు గడిచాయి.

కుడివైపుకు తిరిగి, కుడిచేతి సీదుగా వొరిగి ఆమె వొడిలో ప్రేమ పత్రంబాగులదట

మ ఖం దూర్చాడు.

మరో రెండు నిమిషాలు గడిచాయి.

ఆమె యెడమచెయ్యి, అప్రయత్నంగా జారినట్లు అతనిపెపు మీంచి తలమీదవాలింది.

అంతా అంతటా నిశ్శబ్దం. వాగు వొక్కటి మాత్రం అలక్ష్యంగా రొద చేస్తూనే వుంది.

అతను ఏదో గొణిగినట్లుగా సవ్వడిచేసి లేచేసరికి, రేయి నడిచి వెళ్ళి పోయింది. ఆమె అలాగే పాలరాతి శిల్పంలా కూర్చుని వుంది.

తెల్లవార్లూ రేయి వినిపించిన హోరు, తానేమీ ఎరగనట్లు, ఉష స్సంధ్య—తూర్పు బీడుభూమి చివర ఆకాశపుటంచున అనుకుని, రక్తం కలిసిన గులాబీరంగుతో సింగారించుకుంటోంది.

మౌనంగా దిగి, వాగుదగ్గిరికి వెళ్ళి చుట్టూ పరికించి చూసి— లాగూ మోకాళ్ళదాకా లాక్కుని నిమ్మది నిమ్మదిగా అడుగులు వేస్తూ సిమ్మెంటు చప్టామీద నడిచి చూశాడు. మోకాటిలోతు నీళ్ళు.

నీళ్ళ బయటికి వొచ్చి వడివడిగా అడుగులు వేస్తూ జీపు దగ్గిరికి వొచ్చి చివాలున సీట్లో కూచున్నాడు.

జీపు కదిలి, నీళ్ళను చిమ్ముకుంటూ అవతలివైపుకి చేరింది. మిట్టగా వున్న రోడ్డు ఎక్కించి, గేరు మార్చి వేగం హెచ్చించాడు.

"సారీ" అన్నాడు.

ఆమె మౌనంగానే వుండిపోయింది. జీపు కదలికకి తప్ప, ఆమెలో చలనం వున్నట్లు అనిపించనట్లుగా బిర్రుగా కూచుంది.

"వుత్త సారీ అంటే చాలదేమో— సంజాయిషీ చెప్పుకోవటం భావ్యం అనుకుంటాను. జ్యోతి నా అర్ధాంగి. నా జీవనజ్యోతి. పన్నెండేళ్ళ నాడు వెళ్ళిపోయింది నన్ను విడిచి వెళ్ళలేక అసహాయంగా వెళ్ళి పోయింది. ఆమెతో పాటు నేను వెళ్లలేక నిస్సహాయంగా వుండి పోయాను. రాత్రి నువ్వు జీపు బోల్తాకొట్టిస్తే వెళ్ళివుందును. కానీ రాత్రి, నా జ్యోతి, అక్షరాలా నా జ్యోతి, తెల్లపవిట భుజాల చుట్టూ తిప్పుకుని, అదే సిలికళ్ళతో కృష్ణాతీరాన తొలిరేయి నాటిలా అలంకరించుకుని దర్శన



1 ప్రేమ వెర్రిబాగులదట

మిచ్చి పసివాడిని పొదుపుకున్నట్లు నన్ను తన వొడిలో దాచుకుంది" అన్నాడు. అప్రయత్నంగా పడినట్లు అతని కుడిచెయ్యి ఆమె భుజంమీద వాలింది.

తుళ్ళిపడి, తల ప్రక్కకి తిప్పి చూసింది! అతను మెడ ప్రక్కకి త్రిప్పి ఆమెకేసి చూశాడు. అతని కనుల ముట్టడిలో ఆమె కళ్ళ నీలిమ్న వొదిగిపోయింది.

ఆమె తల వొంచి వొళ్ళోకి చూసుకుంటోంది నిశ్చలంగా. వొడి నిండా, తెల్లవార్లూ అతని తల వొత్తికి తాలూకు నీడలు.

"గీతా నీగురించి వినాలనుంది."

ఆమె నోరు మెదపలేదు,

"చెప్పొద్దులే, యిష్టం లేకపోతే." అన్నాడు.

గొంతు పెకలించుకున్నట్లుగా మెడ కదిపి, "యే ముంటుంది నాగురించి!" అంది.

"చంద్రకాంత శిల పుట్టినే మెరవదు యీ ప్రదేశంలో. చెభితే వుంటుంది."

"నా పుట్టు పూర్వోత్తరాలు నాకే సరిగా తెలియకపోతేనో!"అంది

"అదికాదు నేనడిగింది, యెవరు, యేవిటి, యెక్కడ వుంటున్నట్లు యేం చేస్తున్నట్లు, యేం చేయబోతున్నట్లు-యేదో యిలాగే- సరిగా బోధపరచటం నాకు రావటం లేదమ్మా"

"యేడాదినాడు బొంబాయి నుంచి విశాఖవొచ్చాను. శ్రీలకళాఖిలలో వుద్యోగం వొస్తే. అప్పటినుంచీ వున్నాను. వుద్యోగ కాలపరిమితి ఐపోయింది బొంబాయి బయల్దేరాను, వెళ్ళి రిసెర్చి చేస్తాను."

"అఁహాఁ" అన్నాడు.

నెంబుగాలి, సూర్యకిరణాలకి తేరుకుంటోంది. చెట్ల కొమ్మల మధ్యలో చిక్కుకుని కిరణాలు విరిగి బంగారు సూదుల్లా వొరుగుతున్నాయి.

యిద్దరూ మౌనంగా వుండిపోయారు.

పది నిమిషాలు గడిచాయి.

"సారీ; రాత్రి మిమ్మల్ని కలవరపెట్టి నందుకు" అంది నిదానంగా పొడిపొడిగా.

"ఆ మాట అనాల్సింది నువ్వు కాదు గత పన్నెండేళ్ళలోనూ—వొక్క— ఈ గడిచిన రాత్రి మాత్రమే జీవించివున్నట్లు." ప్రతిధ్వనిలా పలి కాడు. గాలి వేగానికి వింతగా ధ్వనించింది

"యీ గడిచిన రాత్రి మాత్రమే ప్రేమ నెరిగి జీవించాను. ప్రేమ నెరగని జీవికి ఆనందం దొరకవొచ్చు. తెలివి అబ్బవొచ్చు. మహత్తర అనుభూతిని సిద్ధించుకోవొచ్చు. కాని ప్రశాంతి సాధ్యంకాదు" అంది.

"అంటే?"

"అంటే—అంతే. అంతకన్నా నాకేం తెలియదు. నా హృదయం దేనితోనో నిండిపోయి గొంతు బిగుసుకుపోయి నట్టుంది. చెప్పటం రాదు."

మరో పది నిమిషాలు మౌనంగా గడిచాయి,

నోటికి చెయ్యి అడ్డం పెట్టుకుని ఆవులించింది. చేతులూ వొళ్ళూ వొంకర్లు తిరగకుండా వొళ్ళు విరుచుకుంది సుతారంగా.

"తెల్లార్లూ కట్టిపడేసినట్లు కూచోబెట్టాను. నన్ను క్షమించమ్మా" అన్నాడు.

"పెద్దవాళ్ళు, మిమ్మల్ని నేను క్షమించటం యేమిటి?"

"పెద్దవాడినే. కానీ పెద్దవాడు, అలా వొళ్ళో తలదూర్చి తెల్లార్లూ నిద్రపోతాడా నిన్ను కష్టపెట్టి!"

"కష్టం యేవుంది లెండి"

"పన్నెండేళ్ళ తరవాత నిద్రమందు లేకుండా కూడా కంటినిండా నిద్రపోయిన రాత్రి యిదొక్కటే" అన్నాడు ప్రతిధ్వనిలా.

రోడ్డుమీద అలికిడి యెక్కువైంది. పశువుల్ని యితర వాహనా లనూ తప్పించుకుంటూ నడుపుతున్నాడు వేగంగా.

యిద్దరూ మౌనంగా వుండిపోయారు.

జీపు సింహాచలం స్టేషను ప్రాంతాలకి చేరుతూ వుండగా, "యెక్క డికి వెళ్లాలి?" అన్నాడు.

"బొంబాయి."

"అదికాదు. వూళ్ళో యెక్కడ దింపాలీ—అని?"

"వాలేరు స్టేషను ముందర"

"అదేమిటి?"

"అంతే బట్టలసంచి పోయిన విషయం చెప్పానుగా. యిక నా సామాన్లేవీ లేవు వూళ్లో. నేరుగా రైలెక్కడిపే?"

"మకాం పూర్తిగా యెత్తేసే అరకు చూసుకుని వెళ్ళిపోదా మను కున్నావన్నమాట. యింతకాలం యెందుకు చూడలేదు? అన్నట్లు నువ్వు వెళ్లటానికి రైలు మధ్యాన్నంవరకూ వుండదు ఇన్స్పెక్షన్ బంగాళాలో విశ్రాంతి తీసుకోదలిస్తే మూడు గంటలకి జీపులో స్టేషనుకి పంపిసాను" అన్నాడు.

ఆమె మౌనంగా వూరుకుంది.

పావుగంటలో జీపు, ఆర్ అన్డ్ బి యిన్స్పెక్షన్ బంగళాకి చేరు కుంది.

స్నానించి గదిలోకి వొచ్చేసరికి, అతను గుమ్మంలో కాలు పెడుతూ, "స్నానంచేస్తే బడలిక తీరినట్లుండాలి కాస్త" అన్నాడు.

నవ్వింది కళ్లతో.

పొట్టిచేతుల తెల్లసిల్కు బుష్షర్టు. సిమ్మెంటు రంగు ట్వీడ్ లాగూ, అరబూట్లు.

"వో నిద్ర తియ్యి. యీలోగా, నేను అలా వెళ్ళి పనులు చూసు కొస్తాను" అన్నాడు.

"సరే" అన్నట్లు తల వూపింది.

అతను వెళ్లిపోయాడు.

తెల్లవార్లూ నిద్రలేనిమీదట కళ్లు మంటలుగా అనిపిస్తున్నాయి. కానీ నిద్రరావటం లేదు సోఫాలో వెల్లకిలా పడుకుని చూస్తోంది. రాత్రి భోజ నంలేక, ఆకలిగా వుంది.

కాలం నడవటంలేదు. గడవనితనం కాదు— నిలిచిపోయిన ఫీలింగు. ఆలోచనలూ రావటంలేదు, కాలాన్ని గిల్లి కుంటి నడక నడిపించటానికి

యెవరో మనిషి గుమ్మందగ్గిర కాళ్ళతో చప్పుడుచేసి, దగ్గి, లోప _పేమ వెబ్రిబాగులదిట

లికి వొచ్చినట్లనిపించి లేచి చూసింది.

యెవరో బంట్రోతు. చేతులలో పలహారం పళ్లెం, కాఫీ.

తెచ్చి సోఫాముందు బల్లమీద పెట్టాడు

యేమనాలో తోచనట్టుగా చూసింది,

"బాబుగారు పైకెళ్లిసినారు. తమరు తీసుకొనేండి" అన్నాడు బంట్రోతు.

"మంచినీళ్లు" అన్నట్లు చేత్తో సూచించింది.

బంగళా బయట- జనం తిరిగిన అలికిడి, మాటలు, రకరకాల సామాన్ల చప్పుడు

పలహారం తిని, కాఫీ తాగితే కాస్త మత్తుగా అనిపించి, మళ్ళీ వెల్లకిలా పడుకుంది

పది నిమిషాలకి నిద్ర వొచ్చినట్లుగా వొచ్చి అంతలోనే చెదిరిపోయింది. మరో పది నిమిషాలు ప్రయత్నించి- యింక విరమించుకుని, లేచి గదిలో అటూ యిటూ టచ్చాడి-యేదో పత్రిక కనిపిస్తే పేజీలు తిప్పుతూ సోఫాలో కూచునిపోయింది

పన్నెండు గంటలకి విజయసారథి వొచ్చాడు. అతని వెనక, కాకీ బట్టలలో వొకతను అల్యూమినియం కారియర్ చేత పట్టుకుని వొచ్చాడు.

"నిద్రపోలేదా ? ఆలస్యం ఐపోయింది. వెధవలు వెంటపడి వొదలరే!" స్వగతంలా అన్నాడు విజయసారథి, ఆమెకు ఇంగ్లీ దినపత్రిక అందిస్తూ.

రెండుచేతుల్తో తెల్లటి చిక్కటి వుంగరాల జుట్టు సవరించుకున్నాడు. యెడమప్రక్క పాపిటతో విడివడిన జుట్టు ముదుప గోధుమరంగు వేళ్ళ కింద వింతగా మెరిసింది.

"హేజిల్లూ, ఆ బల్లమీద సర్దు భోజనాలు"

కాకీ బట్టల వ్యక్తి విస్తరాకులు తడిపి విదిలించి బల్లమీద వేస్తున్నాడు.

"అవేం ఆకులు బికూ్కా- పోయి అరిటాకులు పట్రా."

ప్రేమ వెర్రిబాగులదిట

"అరిటాకు లియ్యకపోయిండు, సాబ్"

"యివ్వకపోతే పంతలా తిరిగొచ్చావ్ నువ్వు! పప్పులా నువ్వేందుకూ పనికిరావు."

"జీ సాబ్"

"యిదో" అని రెండు రూపాయల కాగితం యిచ్చి, "నీకు అరిటాకు లివ్వని వాడి హోటల్లోనే మస్తుగా మెక్కిరా మన వూళ్ళో రూపాయి యిక్కడ అర్ధవుతుంది—వెధవ్వూరు, నిప్పు లేకుండానే తగలడుతుంది కసితీరా తిని రా" అన్నాడు.

సోఫామీద ఆమెకు కొంచెం యెడంగా కూచుని విస్తరాకుల్లో వొడ్డిస్తున్నాడు.

అప్పటినుంచి నవ్వుగా అనిపించి, "ఆ టిల్లూ బిల్లూ బికూ— యెవరండీ?" అని సన్నగా నవ్వింది.

"వాడా, వాడు సహస్రనామం, విజయసారథి రథాన్ని నడిపే తోనాయి వెధవ. కోస్తా చావుతెలివి సోకనివాడు."

మరో బంట్రోతు వొచ్చి భోజనాల దగ్గరి అవసరాలు చూస్తున్నాడు.

పది నిమిషాల్లో భోజనాలు ముగించి లేచారు.

కిటికీ దగ్గిరిగా వున్న పేము కుర్చీలో కూచుని ముఖానికి పత్రిక అడ్డం పెట్టుకుంది.

సోఫామీద యేటవాలుగా జారి కూచుని సిగరెట్ వెలిగించాడు విజయసారథి.

యెవరో ధోవతీ, జుబ్బా వేసుకుని-వొచ్చాడు. ఆ తరవాత మరొకరు, మరొకరు యేవో కంట్రాక్టుల మాటలు. కంకర, సిమ్మెంటు, తారు డబ్బాలు, బంగళాలు, బిల్సు, రాళ్లు—యేవో యెన్నో మాటలు. నలుగురు వ్యక్తులు నోట్ల కట్టలు యిచ్చి వెళ్ళారు.

లేచి జేబులోంచి ఆ కట్టలు తీసి, గోడ ప్రక్కగా రాతబల్ల మీద వున్న తన సూట్కేసులో దూర్చాడు.

"ఉదయం లేస్తే—యిదే దండయాత్ర. ఆపైన తిరగటం, తనిఖీలు

రిపోర్టులూ, కమిటీలూ, కాల్పులూ వాళ్ళ కాష్టం" అన్నాడు ఆమె నుద్దే

అప్పటివరకూ పత్రిక ముఖానికి చాటు చేసుకుని అంతా గమనిస్తున్న గీతాదేవి, "మీరు యింజనీరేకాక బిల్లుకలెక్టరుకూడా నన్నమాట!" అని నవ్వింది.

గలగల నవ్వి, "మీర్జాఅలీ జమానా తరవాతనుంచి మడిబట్టలు విప్పేశాను. దేశానికి బుద్ధిలేదు. బుద్ధిలేని దేశంలో బుద్ధిగా వుండాలనుకోవటం బుద్ధిలేనితనం" అన్నాడు.

"వొకవేళ నేను యాంటి కరప్షన్ మనిషినని మీకు యీ క్షణంలో తెలిసిందనుకోండి. మీరేం చేస్తారు?" అంది.

"నాలుగులో రెండు కట్టలు నీ ముఖాన విసిరి కొడతాను" అని నవ్వాడు.

"విసిరినా నోటకరవని దాన్ననుకోండి— అప్పుడు?"

"నీ పై వాడి ముఖాన నాలుగు కట్టలు విసిరికొడతాను. వాడూ కాదంటే వాడిబాబు ముఖాన మరో నాలుగు కలిపి" అని గల గల నవ్వి, "నువ్వు యాంటికరప్షన్ మనిషివే అయుంటే నాకు యెప్పుడో తెలిసి వుండేదానివి. వాళ్లు నా శాశ్వత అతిథులు" అన్నాడు.

"మొత్తానికి గట్టివారే"

"యీ కంట్రాక్టర్ల—అందునా ఆంధ్రా కంట్రాక్టర్ల చేతుల్లోపడి గట్టితేలాను" అని నవ్వాడు. ఆమె కూడా నవ్వింది.

"వొక నిద్ర తియ్యి. కార్యాలయం తనిఖీకి వెళ్ళి వొస్తాను వో గంటలో" అన్నాడు.

లేచి నిలబడుతూ, "సూట్కేసు నీ దగ్గిరే వుంటోంది. యాంటికరప్షన్ వాళ్లొచ్చి పట్టుకుంటే నా పూచీ లేదు సుమా!" అన్నాడు.

ఆమె లేచి నిలబడింది.

"వొస్తా మరి" అంటూ బయటికి నడిచాడు.

గది తలుపులు దగ్గిరికి లాగి సోఫామీద పడుకుంది. రాత్రంతా నిద్రలేని మీదట భుక్తాయాసంతో—ఐదు నిమిషాల్లో నిద్రపట్టేసింది.

[ప్రేమ వెర్రిబాగులది!

మెలుకువ వొచ్చి చివాలున లేచి గడియారంకేసి చూసుకుంది. రాత్రి నుంచి అది అలంకారం కింద వుండిపోయింది. తిరగటం మానేసి పడుకుంది; జలుబుచేసి, ప్రక్కకి తిరిగింది.

విజయసారథి పేము కుర్చీలో కూచుని, బూట్ల పాదాలు కిటికీ అంచుమీద ఆన్చి, పత్రిక చూస్తున్నాడు.

"టైమెంతైనట్లు ?" అంది స్వగతంలా.

"నాలుగు ముప్పావు."

"యేవిటీ, యెంతైందన్నారు !" అంది నమ్మలేనట్లుగా చూస్తూ.

"నాలుగూ సలభయ్యారు. రెండున్నరకే వొచ్చాను. కానీ లేపలేదు. నిన్న తెల్లవార్లూ జీపు సీటుకి కట్టిపడేసింది కాక వొళ్ళు మరిచి నిద్రపోతూంటే లేపటం అమానుషం అనిపించి లేపలేదు."

"మీ దగ్గిర రైల్వే టైంటేబులుందా ?" అంది, ఆలోచనగా నేల మీదకి చూస్తూ.

"లేదు. నీకు మళ్ళీ బండి రేపు మూడుగంటలకే."

"అలా అయితే యెలా ?" అన్నట్లు తల అడ్డంగా కదిపింది కిందకి వొంచే.

"అన్నట్లు నేను నేరుగా హైదరాబాద్‌కి బయల్దేరుతున్నాను, అన్ని కార్యక్రమాలు రద్దుచేసి జీపులో వొస్తానంటే నేరుగా పూనా యెక్స్‌ప్రెస్ యెక్కించేస్తాను. యీసారి జీపు నడిపే శ్రమ కల్పించన్లే—డ్రైవరున్నాడు" అని నవ్వాడు.

ఆమె మౌనంగా వూరుకుంది.

విజయసారథి లేచి బయటికి వెళ్లాడు.

డ్రైవరు వొచ్చి సూట్కేసూ తదితర సామగ్రి తీసుకువెళ్లాడు

బంట్రోతు వొచ్చి. "తవరు తయారయ్యాసినారేవో—అయ్యోస్తే తీసుకు రమ్మన్నారు" అని చెప్పాడు ఆమెకి

లేచి చుట్టూ చూసింది. తన ట్రాన్సిస్టరూ చేసంచీ కూడాలేవు. యేదో ఆలోచనగా రెప్పలు అదిలించి గదిబయటికి నడిచింది.

జీపుకి అవతలగా నిలబడివున్న విజయసారథి ముందు నలుగురైదు పేము కార్రిజాగులదిట

గురు చేతులు కట్టుకుని వినయ విధేయుల్లాగా నిలబడి వున్నారు. యేదో చెబుతున్నాడు. వాళ్ళు తలలు వూపుతూ వింటున్నారు.

బంగళా మెట్లు దిగింది. డ్రైవరు యెదురొస్తున్నట్టుగా అడుగులు వేశాడు.

వెనక సీట్లమీద యేదో దస్తరం వొక బంట్రోతు.

విజయసారథి వడివడిగా అడుగులు వేసుకుంటూ జీపుకి కుడి వైపుగా వొచ్చి సీట్లో లోనకి జరిగి కూచుని ఆమెను కూచోమని సూచించాడు. కూచుంది.

డ్రైవరు స్టీరింగ్ చక్రంముందు కూర్చుని "సీదా లష్కర్ కే. పొయ్యేడిదంటవా సాబ్?" అన్నాడు.

"వూఁ వూఁ. పొద్దుపొడిచే సరికి చేరాలి. యేకబిగిని తోలగలవా?"

"జీ సాబ్."

"యేమిఁ జి సాబ్? నీ మొహం. కునికి పాట్లొచ్చి యే చెట్టుకో గుద్దెయ్యగలవు."

"జీ సాబ్." అన్నాడు డ్రైవరు.

యెవరూ మాట్లాడలేదు మళ్ళీ.

జీపు పట్టణ పరిసరాలను దాటుతోంది.

"చెబ్బూ ట్రాన్సిస్టరెక్కడ?"

"గాడ వెడితిసాబ్." అని డ్రైవరు, కుడిచేత్తో వెనక్కి చూపెట్టాడు.

లోన కూచున్న బంట్రోతు వెంటనే తలవొంచుతూ, "చూస్తున్నా బాబుగారు" అని వెతికి, సూట్కేసు ప్రక్కగావున్న ట్రాన్సిస్టరు తీసి, "యిదుగోనండి బాబుగారు" అన్నాడు.

అందుకుని, రెండు నిమిషాలు బరబరా అటూయిటూ తిప్పి, చేగడియారం కేసి చూసుగుని "ఎ. బి. సి. దొరకటంలేదే-?" అన్నాడు స్వగతంలా.

ఆమె మౌనంగా, అతని చేతిలోంచి ట్రాన్సిస్టరు అందుకునిబాండు మార్చి బి.బి.సి. పెట్టింది. వార్తలు.

మౌనంగా బయటికి చూస్తూ కూచుంది.

రాజమండ్రి చేరుతూవుంటగా, యిన్‌స్పెక్షన్ బంగళాకి వెళ్లాలేమో అని డ్రైవరు అడిగితే అవసరంలేదని, వో హోటలు ముందు ఆపించాడు.

యిద్దరూ వెళ్లి భోజనం చేసి వొచ్చారు.

సిగరెట్ వెలిగించి పొగ వొదులుతూ, "మీరిద్దరూ పోయి తిని రండి త్వరగా" అన్నాడు, ఐదు రూపాయలనోటు యిస్తూ.

యెదురుగా చేతులు కట్టుకుని నిలబడిన వాళ్ళిద్దరూ తటపటాయిస్తున్నట్లు కనపించారు.

"దేసనకాడ బోజినం పాకిట్లు తీసుకుని దీంటోనే తినేస్తాలెండి బాబుగారు." అన్నాడు బంట్రోతు "అవున్ సాబ్" అని వంత పలికాడు డ్రైవరు.

"పర్లేదులే. పోయి త్వరగా తినిరండి" ధాతుగా అన్నాడు.

వాళ్ళిద్దరూ హోటేల్లోకి వెళ్లారు.

"మీకు అందరూ భయపడతారను కుంటాను" అంది, కొద్దిగా నవ్వుముఖం పెట్టి.

"నాక్కాదు. నా వుద్యోగ హోదాకి భయపడటం కాదుకదా సలాం కూడా చెయ్యరు, రేపు రిటైరెయ్యాక" అని నవ్వాడు.

యెవరో యిద్దరు రోడ్డుమీద నడిచిపోతూ అతనికి చేతులు జోడించి వెళ్ళిపోతున్నారు. రోడ్డువారగా పోతున్న వొక వ్యక్తి అతనిని చూసి, చకచకా నడిచివొచ్చి నమస్కారంచేసి, చేతులు కట్టుకుని "యి.యి. గారు యింటి దగ్గిరే వున్నారు. తమరు రేపొస్తారని చెప్పినారు" అన్నాడు.

"లేదు అర్జంటుగా యింటికి వెళ్లాల్సిన పని కలిగింది. కార్యక్రమం అంతా రద్దు చేశాను. మీ యి.యి. గారికి చెప్పు" అన్నాడు విజయసారథి.

"యి యి. గారికి ఫోను చెయ్యమంటారా, వొస్తా రిక్కడికి తమర్ని కలుసుకోటానికి?" అన్నాడు "అవసరం లేదు. రెండు నిమిషాల్లో బయల్దేరుతున్నాను" అన్నాడు విజయసారథి.

బంట్రోతూ, డ్రైవరూ వొచ్చారు.

జీపు కదిలింది.

గోదావరి దాటాక డ్రైవర్ని లోన కూచుని నిద్రపొమ్మన్నాడు.

కొవ్వూరు దాటుతూ వుండగా, "కాసేపు నేను నడిపేదా?" అంది గీతాదేవి.

"వొద్దులే. నువ్వు కునుకుతీస్తూ వుండమ్మా. బెజవాడలో చక్రం మళ్ళీ డ్రైవర్కి అప్పగిస్తాను" అన్నాడు.

యేటవాలుగా జరిగి సీటుపై అంచుమీద తల ఆన్చి నిద్రపోయింది. యేలూరు దాటిన తరవాత లేచింది.

జీపు బెజవాడ వూళ్లోకి ప్రవేశించగానే, ఆమెకు శశాంక గుర్తొచ్చాడు. "కలుసుకుంటే—" అని అనిపించి "యిది సమయం కాదు. తరవాత బొంబాయిచేరాక వుత్తరం రాసి సంగతులు తెలియజెయ్యొచ్చులే— అని సమాధానం చెప్పుకుంది.

జీపు జగ్గయ్యపేట చేరుతూ వుండగా ఆపి, ప్రక్కకి జరిగి, డ్రైవర్ని పిలిచాడు. "జీసాబ్" అంటూ దిగి వొచ్చాడు.

ఫ్లాస్కులో కాఫీ ఐపోయింది.

అలాగే సీటుకి ఆనుకుని అటూయిటూ వూగుతూ నిద్రతీసి నాలుగున్నరకి లేచి, తిన్నగా జరిగి కూచున్నారు.

జీపు నగర పరిసర ప్రాంతాలకి చేరుకుంటోంది.

"సీ రైలు యింకా కాజీపేట ప్రాంతాలలోనే కునుకు తీస్తూ వుంటుంది" అని నవ్వాడు. ఆమెకూడా నవ్వింది.

"పూనాకి రైలు యేడు గంటలకి వుందనుకుంటాను" అంది స్వగతంలా.

"రూఢిగా తెలియదు నాకు, తెలుసుకుందాం" అన్నాడు.

మలక్పేట వొంతెన కివతల యిరాని హొటేలు దగ్గిర ఆపించి, పూనాకి రైలు యెన్ని గంటలకి వున్నదో తెలుసుకు రమ్మన్నాడు డ్రైవరుతో.

దిగకుండా, "నా కెరికనే. పొద్దుపేకి యేడు గంటలకున్నది సాబ్" అని తెలియజేశాడు డ్రైవరు.

ప్రేమ వెర్రిబాగులదిట

"ఢిక్కా నీకు ఖాయంగా తెలుసా!"

"అగో, మొన్నగద, వరంగల్ యస్. యి. సాబ్ బొంబయ్ పోంగ పంపొస్తి!"

"సాకి ఈ జీపును నేరుగా బొంబాయి వరకూ నడిపించే అధికారం లేని అధికారిని" అన్నాడు.

"యింకా నయం!" అని పల్చగా నవ్వింది.

యితరులకు తెలియటం బాగోదనిపించే విషయాలు ఆంగ్లంలోనే ముచ్చటించటం గమనించి తనూ అలాగే మాట్లాడింది.

"సాయంత్రం వరకూ నా యింట్లో విశ్రాంతి తీసుకుని వెళ్ళ కూడదూ? యీ ప్రమాణం బడలికనుంచి కూడా తేరుకుంటావు" అన్నాడు.

ఆమె మౌనంగా వూరుకుంది—తల వొంచుకుని అరిచేతిలోగీతలు చూసుకుంటూ వుండిపోయింది.

అయిదు నిమిషాలు గడిచాయి.

కారు ఆపి డ్రైవరు దిగాడు.

ఆమె తల యెత్తింది "వొచ్చేశాం" అన్నాడు విజయసారథి.

యింకా పూర్తిగా వెలుతురు రాలేదు.

దిగి చుట్టూ చూసింది.

బంగళాముందు దీపం వెలిగింది. ముందు తలుపు తెరుచుకుంది.

డ్రైవరూ బంట్రోతూ సామానులు లోనకి తీసుకువెళ్లారు.

ఆమె అలాగే చూస్తూ నిలబడిపోయింది. మనసులో వెలుగు మరకలా యేదో తెల్లని నీడ కదులాడుతోంది. ఆమె చూపులు, వొణికినట్లుగా కదులాడుతున్నాయి.

అతను దిగి, "పద" అని అన్నట్లుగా తలవూపి అడుగులువేశాడు. ఆమె గమనించనేలేదు.

అలాగే శిలా ప్రతిమలా నిలబడిపోయింది. చూపులు వింతగా వెదుకుతున్నాయి.

అతను వెనక్కి తిరిగి, "యేం అలా నిలబడిపోయావేం రామ్మా" అన్నాడు, వొక అడుగు యివతలికి వేసినట్లుగా కదిలి.

ఆమె మాటాడలేదు.

"బంగళా చూస్తున్నావా? యెప్పుడో వెనక నవాబులు కట్టించు కున్నది. పాత బంగళా. కొత్త మాయగూడదని నా పట్టుదల. కట్టించు కున్నవాడు, "నఫీజ్ మంజిల్" అని నామకరణం చేశాడు. ఆ పేరుకి అర్థం తెలిసి, మార్చాలనిపించక అదే పేరు వుంచేశాను. బయటికి అంతగా బాగోదులే" అంటూ ఆమెకోసం నిలుచున్నాడు.

ఆమె యెంతకీ కదలకపోతే — వింతగా ఆశ్చర్యంగా చూసి ఆమె వైపు అడుగులు వేశాడు.

ముందుకు అడుగులు వేసింది తడబాటుగా.

ఆమె ప్రక్కన నడుస్తున్నాడు

ఆమెకు తల గిర్రున తిరిగుతునట్లుగా అనిపించింది. కాళ్లు వొణికి తడబడుతున్నాయి.

మెట్ల దగ్గిరికి రాగానే అతని చెయ్యి పట్టుకుంది—మెట్లు యెక్క లేనట్లుగా.

నడిపించి లోనకి తీసుకువెళ్లాడు. కళ్ళుమూతలు పడుతున్నట్లుగా నడిచింది.

గదిలోకి తీసుకువెళ్ళి "బాగా అలిసిపోయినట్లున్నావ్, పడుకో" అని, గుమ్మందాటి తలుపు దగ్గరగా లాగాడు.

అలాగే నిశ్చేష్టలా నిలబడిపోయింది. తలనిండా పూర్వస్మృతుల వూదర.

రెండు నిమిషాలు గడిచాయి.

తూలినట్లుగా రెండు అడుగులువేసి, వొకకాలు నేలమీద ఆనించె మంచం మీదకి వొరిగి, దిండులో ముఖం దూర్చింది.

కన్నీరు పెల్లుబికి తెరలు తెరలుగా వొస్తోంది.

• • •

ఆరున్నరకి హడావిడిగా గుమ్మంలోకి వొచ్చి, తయారైనట్లేనా?" అన్నాడు విజయసారథి.

లేచి నిలబడుతూ, "కట్టుబట్టలతో వున్న మనిషి తయారయ్యేదేc

ప్రేమ వైరిబాగులదిట

వుంటుంది—" అని ట్రాన్సిస్టరూ చేసంచీ తీసుకోవటం కోసం ప్రక్కకి తిరిగింది.

"అన్నట్లు" అని ఆగిపోయాడు, యేదో చెప్పదలచింది మర్చిపోయి నట్లుగా—

ఆమె వెనక్కి తిరిగి అతనికేసి చూసింది.

వూదారంగు బుష్షర్టు, తెల్లలాగూ.

అతను అలాగే ఆమె ముఖంలోకి చూస్తున్నాడు

వొక నిమిషం నిశ్శబ్దం.

చెయ్యి వెనక్కి వొంచి తలుపు దగ్గరగా నొక్కి ముందుకు అడుగులు వేశాడు.

ఆమె అలాగే నిలుచుని అతనికేసి చూస్తోంది.

అతను నిదానంగా అడుగులు వేస్తూ ఆమె దగ్గిరికి నడిచి యెదురుగా నిలుచుని—

ఆమె నేలమీదకి చూస్తోంది, కొద్దిగా తల వొంచి.

ఆమె నడుంకి రెండువైపులా చేతులు వేశాడు.

తుళ్ళిపడినట్లుగా వెనక్కి జరగబోయి—తల పైకెత్తి చూసింది.

అతను ఆమె కళ్ళలోకి గుచ్చి చూస్తున్నాడు— ఆమె రెప్ప వెయ్య లేదు.

"అరకు లోయలో ఆ స్థితిలో చూసి నిన్ను విశాఖలో దిగబెట్టి వుందును. కానీ లోలోన యిష్టంలేదు వేళకి రైలు లేదు. ఆ తరవాత— నిద్రపోతుంటే లేపాలనిపించకే లేపలేదు నిన్ను. అన్ని పనులూ దారి పొడవునా చూసుకుంటూ రావాల్సిన వాణ్ని. సాధ్యం కాలేదు ఆ పని స్వార్థంతో అందుకే యింతవరకూ తీసుకొచ్చాను. యిప్పుడు అరగంటలో రైలు సిద్ధంగా వుంది." అని ఆగిపోయి చూపు కిందకి వాల్చి "నేడో యీ ప్రపంచాన్ని విడిచిపెట్టి వెళ్లాల్సినవాణ్ని నేను. యింకా యెన్నో వసంతాలు యీ ప్రపంచంలో ఓందించాల్సిన దానివి నువ్వు. హృదయ స్పందనకి అనుగుణంగా యేమీ ఆశించలేను గానీ—" అని ఆమె కళ్ళలోకిచూసి, "నాకోసం నాలుగురోజులు యిక్కడ వుండలేవూ, ప్రేమ వెర్రిబాగులదిట

నాకోసం, యీ పండి రాలిపోయే ఆకుకోసం, జాలిపడి నాలుగురోజులు- వొక్క నాలుగురోజుల కోసం నన్ను మన్నించి వుండలేవూ?" అన్నాడు.

అతని ముఖం ప్రకంపనలా వొణుకుతోంది, వింతగా మెరుస్తోంది— తెల్లని జుట్టుకింద. ప్రకంపనకి యింకా నొక్కులు పడుతోంది చర్మం. కళ్ళలో నీరువూరి వొకబొట్టు రాలి ఆమె ముఖంమీద పడింది.

రెప్పలు వాల్చి, శ్వాస దీర్ఘంగా విడిచి, "మీకోసం కాదు, నాకోసం వుంటాను" అంది.

యేదో పండు మాగిన వాసన తేనె వాసనలో కలిసినట్లుగా ఆమె శ్వాస అతనిని చుట్టేస్తోంది.

అతను మౌనంగా వుండిపోయాడు.

"వొద్దనిపిస్తున్నా యింత దూరం మీ వెంట తువ్వాయిలా వొచ్చాను. నేను యెవరి కోసవూ యెవరిదగ్గిరా వుండలేను. కానీ యిక్కడ వుంటాను. నాలుగురోజులు కాదు. యెప్పటికీ." అంది.

"అంతే, అంతే!" అని ఆమె ముఖాన్ని చేతులమధ్య కదిపాడు.

రెప్పలు విప్పి అతని కళ్ళలోకి చూస్తూ, "నేను మిమ్మల్ని ప్రేమించాను" అంది.

ఆ మాట ఆమెకే కొత్తగా వింతగా ధ్వనించింది.

"నన్నా ! నన్నా! యీ పండుటాకుని."

"అవన్నీ ఆలోచిస్తే ఆ పని చెయ్యలేకపోదును. జీవితంలో తొలి సారిగా నా యిష్టాలకీ అభిప్రాయాలకీ భిన్నంగా ప్రవర్తించటం జరిగింది. నేను యిక్కడినుంచి వెళ్ళలేను." అని యింకా అతని దగ్గిరిగా జరిగింది. ఆమె వీపుకి చేతులు చుట్టి దగ్గిరికి వొత్తుకున్నాడు. అతని భుజం కిందుగా కంఠం ప్రక్కన ముఖం ఆన్చింది

కాళ్లు పట్టు తప్పినట్లుగా అయి- కదిలినట్లు చలించింది.

తూలినట్లుగా రెండు అడుగులువేసి మంచం అంచుమీద ఆమెను గాలనొక్కి ప్రక్కన కూచుని, ఆమె ముఖాన్ని చేతులలోకి తీసుకుని— పెదవులమీద పెదవులు అద్దాడు.

వింత పరిమళం అతని నావరించింది.

ప్రేమ వెర్రిబాగులదట

వాలిన ఆమె కనురెప్పలలోంచి తడి బయటికి వుబికింది.

పట్టుతప్పి విడివడి కూచున్నారు.

ఆమె లేచి రెండు అడుగులు వేసి సోఫామీద కూచుంది.

రెండు నిమిషాలు మౌనంగా గడిచాయి.

అతను మంచం అంచుమీదనుంచి లేచి, కిటికీ దగ్గిరికి నడిచి అడ్డ చువ్వలమీద చేతులు ఆన్చి నిలుచున్నాడు.

మూడు నిమిషాలు గడిచాయి.

యేదో స్ఫురించినట్లుగా కదిలి, చే గడియారంకేసి చూసి; తల పైకెత్తి "యింకా పావుగంట వుంది. నువ్వు నాలుగురోజులుకూడా వొద్దు. యీ బండికే వెళ్ళిపోదువు , పద" అన్నాడు యెటో చూస్తూ.

"నేను వెళ్ళను" అంది.

ఆ మాట తనకే వింతగా అనిపించినట్లు నవ్వుకుంది, నిశ్శబ్దంగా.

వొక పండుటాకు కోసం నో పచ్చని జీవితం బలి కాకూడదు."

"నేను వుండటం మీ కిష్టంలేదా ?"

"లేదు."

"అయితే నేను వెళ్ళిపోతే మీకు బాధ కలగదుకదా ?"

అతను మౌనంగా వుండిపోయాడు.

"నాకూ వుండాలని లేదు. కానీ వెళ్ళలేను. ప్రొద్దుటినుంచీ వెళ్ళటానికే నిశ్చయించుకున్నాను. కానీ వెళ్లలేను. వెళ్లి మీకూ నాకూబాధ కలిగించలేను."

"అది అవివేకం. యీ వృద్ధుడు రేపో మాపో రాలిపోయే పండు."

"వివేకంతో నరకం అనుభవించేకన్న అవివేకంతో స్వర్గం పొందటం మేలు."

"యేమీ ఆశించలేవనుకుంటాను నువ్విక్కడ."

"క్షమించాలి, నేను మీ ఆస్తి, సంపాదన ఆశించటంలేదు.

"అదికాదు నా ఉద్దేశం. డబ్బు మాటకాదు. నువ్విక్కడ లేకపోయినా యీకొద్ది గంటల అనుభవంవల్ల నీకు నేను డబ్బు యివ్వగలను. నాకు వొక్కడే అబ్బాయి. యిక్కడే లెక్చరర్. ప్రస్తుతం దక్షిణ భారత ప్రేమ వెర్రిబాగులదిట

తంలో యెక్కడో పరిశోధనా పర్యటన చేస్తున్నాడు. క్రిష్ణ దేనికీ అడ్డు పెట్టడు. అతగాణ్ని నువ్వెరగవు—చాలా వున్నతమైనవాడు. యిలాంటి విషయాలేవీ పట్టించుకోడు. కానీ విచ్చీవిచ్చని మొగ్గవి, యీ పండుటాకు నుంచి యేమి ఆశించగలవని-అంతే."

"నేనేవీ ఆశించటంలేదు. యింతవరకు మీనుంచి పొందింది చాలు ప్రశాంతికన్న మించింది యేవీ లేదనిపిస్తోంది."

"కావొచ్చు. కానీ నేనెన్నాళ్లు బ్రతుకుతాననీ—ఆ తరవాత నీ జీవితం యేమైపోవాలి."

"ఆలోచించి నేను జీవితంలో పొందింది యేమీలేదు, యేదో పొందాలను కోవటం తప్ప. మొన్నరాత్రి ఆలోచన నుంచి విముక్తి పొందాను. హృదయం చెప్పినట్లు నడవటంకన్న నేనేమీ చెయ్యలేని అశక్తురాలిని. మేధను వొక సాలెగూడు. హృదయం వొక అరకులోయ ఆ అనుభవం తరవాత నేను చేష్టలుడిగిన దాన్నయ్యాను. నాడూ నేడూ యేనాడూ ఎవరి డబ్బూ ఆశించలేదు. అది నాకు అసహ్యం. నా కాళ్ళమీద నేను బతగ్గలను" అని ఆగిపోయి, లేచి అతనికి దగ్గిరిగా వెళ్ళి భుజాలమీద చేతులువేసి, తల పైకెత్తి అతని కళ్ళలోకి చూస్తూ—"సారథీ నువ్వు నాకు కావాలి. నీకంటే నేను పెద్దదాన్నని తెలుసుకున్నాను. పరువు, మర్యాద, తదితర విషయాల దృష్ట్యా నన్ను వెళ్ళమంటే మాత్రం, తక్షణం వెళ్లిపోతాను" అంది

"ఆ దృష్టితో కాదు. చెప్పానుగా, అంతే తప్ప—" అని ఆగిపోయి క్షణకాలం యెటో చూసి, "అరకులోయలో నాటి రాత్రి చాలా చెడ్డరోజు. నీ జీవితాన్ని పాడుచేసిన రోజు" అన్నాడు.

అతని కళ్ళలోకి చూస్తూ, "సారథీ నీకు నేను వొద్దూ? ఆ మాట చెప్పు వెళ్ళిపోతాను" అంది. ఆ ధ్వనిలో మమత, ప్రేమ, లాలిత్యం, ఆత్మీయత, ఆదరణ స్ఫురించాయి.

ఆమె చెంపలకి తన అరిచేతులు అద్ది, "నన్ను నేను యెలా వొద్దను కోగలను!" అని ఆమెను దగ్గిరిగా లాక్కున్నాడు. అతని కంఠం ప్రక్కన తల ఆన్చింది.

గుమ్మం బయట యేదో అడుగుల సవ్వడి అయి—విడిపడి తలుపు

కేసి చూశారు.

యెవరో వచ్చాడు తున్నట్లనిపించి—వెళ్ళి తలుపు తెరిచాడు.

యెవరో వొచ్చారట, అతనికోసం. పని మనిషి చెప్పి వెళ్ళిపో యాడు.

లోపలికి రెండడుగులువేసి, "పొద్దుట వొచ్చానో లేదో—అప్పుడే దండయాత్ర ప్రారంభించారు జనం యింటి మీదకి" అన్నాడు నవ్వు ముఖంతో.

అతని ముఖంలోకి చూసి నిశ్శబ్దంగా నవ్వింది

కళ్లతో నవ్వి, బయటికి వెళ్ళాడు.

వొకసారి గది అంతా కలియజూసింది గీతాదేవి.

దిళ్లు, దుప్పట్లు, గోడలు—అన్నీ పాల తెలుపులో. ముస్తాబు బల్ల, అద్దం, గోడకి బంగారం రంగు చట్రంలో క్రిష్ణచైతన్య తల్లి — తైల చిత్రం.

ఆ పటం కేసి చూస్తూ, వొళ్ళో పవిట మడతల వెంట చూపుడు వేలుతో గీచినట్లుగా పోనిచ్చి—

తల విదిలించి లేచి తాపీగా అడుగులువేసి కిటికీ చువ్వల మీద చేతులు ఆన్చి నిలుచుంది రెండు నిమిషాలు.

యెక్కడికో యెక్కడో దిగబడి పోతున్న తన చూపును కళ్ళలోకి గుంజుకుని ప్రక్క తలుపు తెరిచి బయటి ఆవరణలోకి వెళ్లింది.

మల్లె పొదలు, చామంతులు, నందివర్ధనం, జూకా మందారం — మధ్యలో పచ్చగా గడ్డి.

పాత స్మృతులు మురిసినట్లుగా తల విదిలించి అడుగులు వేసింది. విజయసారథి గదికిటికీ మీద పచ్చని ఆకుల తీగ దట్టంగా పెరిగి వుంది.

—తను పాదుచేసి మొక్క నాటితే క్రిష్ణ చేతిమీద నీళ్లుపోశాడు. యెంతగా యెదిగింది మొక్క! తనూ యెదిగిందేమో కానీ క్రిష్ణ యిప్పుడు యిక్కడ వుండివుంటే నా స్థితి యెలా వుంటే వుండును. యేం చేసి వుందునో! క్రిష్ణ-క్రిష్ణ! తన్వ పరిశోధన జీవిత పరమావధికాదు. యేదో పొందాల్సింది మిగిలిపోయిన అవేదన-అన్వేషణ—కానీ తనకిప్పు ప్రేమ వెర్రి బాగులదిట

దేమీ అక్కర్లేదు. యేదో తపనతో వ్రాత లూగిపోవటం లేదు పన్నీటి జల్లులాంటి ప్రశాంతి యేదో తనలో ప్రవేశించింది. కానీ, జీవితం దృష్ట్యా అర్ధంలేని పనే అయ్యిది......

అప్రయత్నంగా తీగ ఆకుల మీద చెయ్యి వేసింది. కళ్ల చెమ్మగిల్లినట్లుగా రెప్పలు వాల్చి—తెరిచింది. తనలో తాను నవ్వుకుంటూ ముందుకు అడుగులు వేసింది.

అదే పచ్చిక. అదే గులాబీతోట. అప్పుడు యిదంతా స్వప్నంలో నిద్రపోతుండేది. ఇప్పుడు దైనందిన జీవితాన్ని గుర్తుకు తెస్తోంది.

ఆవరణలో, పెద్దవి చిన్నవి అయిదారు కార్లున్నాయి బంగళాలో ముందువైపు మూలగా పైకి మెట్లు కట్టిన కింద భాగంలో బూడిద రంగు కారు—మైనంపట్టా కప్పివుంది

ఆ కారుకేసి క్షణకాలం చూసి, తల విదిలించి — వెళ్లి పచ్చిక మీద కూచుంది

రెండు కార్లు కదిలాయి. తలయెత్తిచూసింది. ప్రభుత్వపుకార్లు. సచివాలయ కార్యదర్శులవో యెవరివో. యెవరో యిద్దరు నవ్వుకుంటూ వొచ్చి చెరొక కార్లో కూచున్నారు.

మరో వ్యక్తి — షేర్వానీ, బొచ్చు టోపీ. మరో యిద్దరు పొందూరు ఖద్దరు బట్టలలో.

అన్ని కార్లూ వెళ్లిపోయాయి.

విజయసారథి, ముందు వరండాలో నిలుచుని అందరినీ సాగనంపి వెనక్కి తిరగబోయి - పచ్చికలో గీతాదేవి కూచుని వుండటం చూసి ఆగిపోయి ఆమెకేసి చూస్తున్నాడు.

మెట్లు దిగి అడుగులు వేస్తున్నాడు.

మరో కారు వొచ్చింది.

"హలో నాయక్" అంటూ ముందుకు అడుగులువేసి—కరస్పర్శ చేశారు.

"హలో యివ్వాళే పర్యటన నుంచి తిరిగి వొచ్చారని తెలిసికూడా రాక తప్పలేదు."

"ఆఁ, పర్లేదు. అదే, ఆ విషయమేగా—సరే. రేపు రమ్మనండి ఫైలు తీయించి పూర్తి చేయించుతాను. కానీ యి, యి లను మాత్రం అన్యాయం చెయ్యకూడదని చెప్పాలి మరి మీ వాడికి" అని నవ్వాడు.

"ఎంతమాట! మీరు అంత దయచూపినప్పుడు ఆ మాత్రం చూడటం వాడి విధి."

"రండి లోపలికి" అని, చుట్టూ చూసినట్లుగా తలతిప్పి, "పోనీ అలా కూచుందామంటారా?" అన్నాడు విజయసారథి.

సంతోషంగా—"వాతావరణం కూడా బావుంది యీ పూట"

మెట్లకి దిగువగా నిలబడిన పనిమనిషి, విజయసారథికేసి చూస్తున్నాడు, పిలుస్తాడేమో నన్నట్లుగా.

చూపుడువేలితో రమ్మని సూచించాడు విజయసారథి. చరచరా నడిచివొచ్చాడు.

"వారే ముచ్చూ, నాలుగు కుర్చీలు తెచ్చి అలా వెయ్యి" అన్నాడు విజయసారథి.

"దేనికండీ. హాయిగా పచ్చికమీద కూర్చుందాం" అన్నాడు ఆ వ్యక్తి.

"వొ. కె." అని, చూపుడువేలితో – తీసుకు రావొద్దన్నట్లు సూచించి పచ్చిక వైపు అడుగులు వేశాడు.

వాళ్ళను కంటికొసలోంచి గమనిస్తున్న గీతాదేవి, తనవైపే రావటం చూసి, లేచి నిలబడింది.

"ఈయన నాయక్‌గారని విశ్వవిద్యాలయం రిజిస్ట్రారు" అని, "యీమె గీతాదేవి. నాకు చాలా దగ్గిర వ్యక్తి. యెమ్మే చదివారు" అని, "కూచోండి" అంటూ కూర్చున్నాడు.

ప్రతి నమస్కారాలతో కూచుని—

"యిప్పుడేం చేస్తున్నారు?" అని గీతాదేవిని అడిగాడు నాయక్.

"ప్రస్తుతం యేమీ లేదు. గత సంవత్సరం విశాఖపట్నంలో స్త్రీల కళాశాలలో పనిచేశాను" అంది.

"అహా" అన్నట్లు తల పంకించి, "యెమ్మే యెక్కడ చది ప్రేమ వెర్రిబాగులదిట

వారు?" అన్నాడు నాయక్.

మీగడరంగు సిల్కు జుబ్బా, గ్లాస్కో ధోవతి, లావుగా మూటలా ఆకృతి. వయసు నలభయ్యైదు, యాభయ్యికి దాటవనిపిస్తుంది చూడగానే.

"బొంబాయి విశ్వవిద్యాలయంలో" అంది.

"అన్నట్లు యీమెకు లెక్చరర్ వుద్యోగం యెందుకు చూడకూడదు!" అన్నాడు విజయసారథి.

"మీలాగా, నేను మా విశ్వవిద్యాలయానికి పై అధికారిని కాదుగా!" అని చిన్నగా నవ్వాడు నాయక్.

"కావొచ్చు. కానీ మీరు తగినంత స్థానంలో వున్నవాళ్ళేకదా! చూడండి, అవసరం ఐతే ఐదారు వేలు పారేద్దాం" అన్నాడు విజయసారథి.

"అవన్నీ మీ ప్రభుత్వ శాఖల్లోనే. యింకా విశ్వవిద్యాలయాలు మడిబట్టలు విప్పలేదు" అని నవ్వి, "మొన్న మేలో ప్రకటన చేశాం. క్రితం వారంలో ఉద్యోగ నియామకాలు జరిగిపోయాయి. మీరు ముందుగా గానీ నాతో వొకమాట అనివుంటే ప్రయత్నించే పని" అని, గీతాదేవి వంక చూసి, "మీ సబ్జక్టు ?" అన్నాడు.

"ఆంగ్లం."

"అయ్యో! ముగ్గురు లెక్చరర్ల నియామకం ఐపోయింది మొన్ననే—పోనీ రిసెర్చి చేస్తే—లినోవాలా మంచివ్యక్తి. ఓరోజు రండి పరిచయం చేస్తాను" అన్నాడు,

ఆమె నాకు తెలుసు. బియ్యే యిక్కడే విశ్వవిద్యాలయపు స్త్రీల కళాశాలలో చదివాను."

"మరింకేం! ప్రొఫెసర్ దత్తా రిటైరయ్యారు క్రిందటేడు. ఆమె ప్రొఫెసర్ ఐ బదిలీ అయ్యారు అక్కడినుంచి" అని విజయసారథి వైపు తిరిగి "రిసెర్చి చెయ్యొచ్చు. కేంద్ర ప్రభుత్వపు స్కాలరుషిప్పు లుంటాయి. నెలకి మూడు వందలిస్తారు" అన్నాడు.

"మూడొందలు కాకపోతే మూడు రూపాయ లివ్వనీ పర్లేదు. ప్రస్తుతం కావాల్సింది వ్యాపకం" అన్నాడు విజయసారథి

ఆమెకేసి చూసి, "మరి మీకు రిసెర్చి చేయాలనే తలంపు వుందా!"

ప్రేమ వెర్రిబాగులదిట

అన్నాడు నాయక్.

"వుద్యోగం అప్పుడే చెయ్యాలని లేదసలుకి. వొస్తే మంచిదే అనుకోండి. కానీ ముందు రిసెర్చి చెయ్యాలి. అసలు బొంబాయిలో చెయ్యాలనుకున్నాను. ప్రొఫెసర్ మోరియా కొలంబియానుంచి యింక వొచ్చినట్లు లేదు — అక్కడ మరొకరి దగ్గిర చెయ్యాలనిలేదు. అందుకని ప్రారంభించలేదు"

"మోరియా నాకు బాగా తెలుసు. మేమిద్దరం బాల్య మిత్రులం. నవంబరులో తిరిగి రాబోతున్నట్లు పదిరోజులనాడు వుత్తరం రాశాడు" అన్నాడు నాయక్.

"అంతదూరం దేనికి—యిక్కడే వుద్యోగమో రిసెర్చో చెయ్యొచ్చు లెమ్మనీ, యిక్కడే చెయ్యమనీ; మన నాయక్‌గారు అన్ని యేర్పాట్లూ చేస్తారనిచెప్పాను స్మా!" అన్నాడు విజయసారథి.

"స్కాలర్‌షిప్పు తప్పకుండా యిప్పించవొచ్చు" అని, ఆమెకేసి చూసి, అన్నట్లు యెమ్మేలో మీ మార్కులు—" అన్నాడు నాయక్.

"అరవైనాలుగు శాతం" అంది.

"గుడ్. ఐతే నా అవసరంకూడా లేదు. దానంతట అదే వొస్తుంది." అన్నాడు నాయక్.

టీ మూడు కప్పులు.

ట్రే, గీతాదేవి ముందుగా పెట్టాడు పనిమనిసి.

"ఒరే నీళ్లేవిరా ముచ్చా?" అదిలించాడు విజయసారథి.

పరుగుతీశాడు.

రాష్ట్ర రాజకీయాల చర్చ ప్రారంభించాడు నాయక్.

పనిమనిషి, గాజుగ్లాసులతో నీళ్ళు తెచ్చి ముగ్గురికీ అందించాడు. తాగాక, గ్లాసులు అందుకుని అవతలికి వెళ్లి నిలుచున్నాడు.

యిద్దరికీ టీ కప్పులు అందించింది, కొద్దిగా ముందుకు వొంగి.

పావుగంట కబుర్లు నాయక్, యింక వెడతాననీ, యిద్దరినీ తన యింటికి ఆహ్వానించి లేచాడు.

కారువరకూ గీతాదేవి, విజయసారథి నడిచారు.

కారు కదిలి వెళ్ళిపోయింది.

ఆమె భుజంమీద చేత్తో 'పోదామా లోపలికి' అన్నాడు. విజయసారధి.

"వో" అంది కనుబొమలు యెగరేస్తూ.

"ఐతే ఓయ్యే యిక్కడే చదివావా నువ్వు? నిన్ను నేనప్పుడే చూసి వుంటే—"

"ఐతే నేనిక్కడ రిసెర్చి చెయ్యాలనో వుద్యోగం చెయ్యాలనో అనుకుంటున్నట్లు యెవరు చెప్పారు మీకు?" అని పల్చగా నవ్వింది.

"నా పనుల్ని యింకొకరు గుర్తు చేసేంత వరకూ జాప్యం చెయ్యను నేను" అని నవ్వాడు.

డ్రాయింగ్రూం దాటి క్రిష్ణచైతన్య గదివైపు నడిచాడు విజయ సారధి.

ఆమె అతనికూడా లోనకి వెళ్ళింది.

ప్రేమ కుర్చీలో కూచుంటూ, "యీ గదినీకు నచ్చిందా?" అన్నాడు.

"గది చాలా బావుంది. కానీ మరో గది—" అని ఆగిపోయింది.

సోఫామీద కూచుంది.

"ఆ సంశయం అవసరంలేదు. మా క్రిష్ణ చాలా వున్నత మైనవాడు. మరోలా భావించడు. అతను వొచ్చే వరకూ యిందు లోనే వుండొచ్చు. అతిథి గదులకి స్నానాల గదులు జోడించి లేవు. మూటికీ కలిపి ప్రక్కగా వుంది స్నానాల గది. బంగళా ఎంత పెద్దదైనా పాతకట్టడం కదా, నవీనావసరాల ననుసరించి వుండవు. అక్కడికీ కొన్నాళ్ళ ఆ కాలంలోనే పదిహేను వేలు ఖర్చు పెడితే యీ యేర్పాట్లన్నీ జరిగాయ్. క్రిష్ణ వొచ్చేలోగా మరో గదికి స్నానాల గది కూర్చుదాంలే" అన్నాడు,

"యెప్పుడొస్తారు?" అంది.

రెప్పలు వాల్చి, ( వూపి, "వొసాడు, యెప్పుడో మబ్బుల్లేని వానలా వొస్తాడు" అన్నాడు.

"అదేవిటి?" అంది.

తల పైకెత్తి ఆమె ముఖంలోకి చూసి పల్చగా నవ్వాడు. ఆ నవ్వు వెనక కళ్ళలో కదిలిన మసక తెర—ఆమె గమనించింది.

"అదో తరహా మనిషి. ముప్పయ్యేళ్ళలో అరవయ్యేళ్ల చదువు చదివి విజ్ఞానం బరువుతో వృద్ధుడైన యువకుడు. తన నీడను వెంటాడుతూ తెలియని దేనికోసమో గాలిస్తూ తిరుగుతున్నాడు. యెప్పుడో, తన నీడ తనలో కలిసినట్లనిపించి అమాంతం యువకుడై వొచ్చేస్తాడు."

"యే విశ్వవిద్యాలయంలో చేస్తున్నారు వారి పరిశోధన?"

"తనలోని విశ్వవిద్యాలయంలో" అని బలహీనంగా నవ్వి ఆమెకేసి చూసి, "అదివరలో బెంగుళూరు, ప్రస్తుతం యెక్కడున్నదీ తెలియదు" అన్నాడు.

"అదేవిఁటి! అసలెందుకు వెళ్ళినట్లు?"

"రూఢిగా, స్పష్టంగా తెలియదు తన విషయాలు యెవరితోనూ విప్పి చెప్పుకోడు–వెనక, వాళ్ళమ్మతో తప్ప. రెండేళ్ళనాడు నేను జర్మనీ వెళ్ళాను. వేసవి ఐపోతూండగా నేను తిరిగొచ్చాను. వొచ్చిన వారం తరవాత అనుకుంటాను–వో రోజున తను మద్రాసు వెళ్తున్నట్లు చెప్పాడు. సరే అన్నాను, యేదో పనిమీద వెళ్తున్నాడనుకుని. అంతే, తరవాత రెండుసార్లు డబ్బుకోసం రాశాడు. మొదట ఉత్తరానికి జవాబు రాశాను. రెండో దానికి రాయలేదు, అనవసరమనిపించి. వివరాలు తెలియదు. నేను వెళ్ళిపోయాక పనివాళ్ళనందరికీ సెలవు యిచ్చి పంపేశాడట. వంట మనిషి, వొకపనివాడూ వున్నారట. నేను తిరిగొచ్చాక-మూడోరోజున ఆ పనివాడు యేదో తప్పుపని చేస్తే తన్ని తరిమేశాను. నేను లేని ఆ వేసవిలో యేం జరిగిందీ తెలుసుకోటానికి వొక్క వంటమనిషిమాత్రం మిగిలింది. ఆ ముసల్దివృత్త మతిమరుపుది. వంటవిషయాలు మాత్రమే గుర్తుంటాయ్. సరిగా వినిపించదు, కనిపించదు. కానీ వంట మనిషిగా మాత్రం వుండతగిన మనిషి. అడిగితే యేమీ చెప్పలేకపోయింది. యెవరో వొకామె వొచ్చి రెండెళ్లో యేమో వుండి వెళ్లిపోయిందట. స్నేహితురాలని చెప్పాడట. ఆమె యెవరో యేమిటో తెలిస్తే బావుండేది—"

"అంటే?"

ప్రేమ వెర్రిబాగులదిట

"బహుశా ఆమె వెళ్ళిపోవటం అతని ఈ స్థితికి కారణం ఐవుంటుందేమోనని."

"తెలిసి మాత్రం యేంచేస్తారు?"

"నా శాయశక్తులా ప్రయత్నిస్తాను"

"యేం ప్రయత్నం?"

"వాళ్ళిద్దరిమధ్య ఉత్పన్నమైన విభేదాలేవన్నా వుంటే—"

"వొకవేళ ఆమె మీకు భార్య, ప్రేయసి యేపదమైన వాడండి—ఆ స్థితిలో వున్న వ్యక్తి ఐతే!"

"యిష్—యేమ్మాటలర్థం లేకుండా—" అన్నాడు. అతనిముఖంలో విసుగుదల.

"పరిస్థితులకి అర్థం లేనప్పుడు మాటలకీ అర్థం వుండదేమో—"

"మీ విజ్ఞానులతో యిదేచిక్కు, పరిస్థితికంటే ముందే ఆలోచిస్తారు, ఆ పరిస్థితి వొచ్చినట్లుగా" అని లేచి ఆమె దగ్గిరికి నడిచి సోఫామీద కూచుని ఆమె భుజాల చుట్టూ చెయ్యివేసి "మనకు కాని విషయాలు గురించి ఆలోచించి బుర్ర పాడుచేసుకోవటం అవివేకం. కొన్నికొన్ని విషయాలు కాలమే పరిష్కరించాల్సి వుంటుందేమో" అన్నాడు భారంగా.

ఆమె కళ్ళు చెమర్చాయి.

అతనిని దగ్గిరికి తీసుకుని వొళ్ళోకి తీసుకుంది. తల, ఆమె వొళ్ళో సరిగా ఆన్చి, ఆమె కళ్ళలోకి చూశాడు.

మెడవొంచి అతని నుదుటిమీద పెదవులు అద్దింది.

ముఖం జరిపి ఆమె కంఠం ప్రక్కగా అదిమాడు.

"గీతా, అన్ని దేశాల పరిమళద్రవ్యాలు తెలిసినవాణ్ని—ఐనా తెలియటంలేదు నువ్వే సెంటు వాడతావో" అన్నాడు.

"నా దగ్గిర సెంటువాసన వొస్తుందనా?"

"కాదు. అన్ని సెంట్లూ అత్తర్లూ నాకు తెల్సు. అవేవీ కావు. కానీ—యేదో పరిమళం—లాలించి మత్తెక్కించి నరాలలో అలజడి కలిగించే, యేదో వింత పరిమళం.

నవ్వింది.

"దేనికి సర్వ్యతావ్? పోసీ చెప్పొద్దులే."

"చెప్పేందుకు నేనేదైనా వాడితే దా!"

"అంటే?"

"అంతే."

"మరి యీ పరిమళం—తేనె, పొగల పండిన అరటిపండ్లు, రాత్రంతా పక్కమీద నలిగిన మల్లెలు—యేవేవో సమ్మిశితమై నట్లని పించే వింత పరిమళం—"

"వృగ్గుపాలలో పన్నీరు కూడా కలిపి తాగించారేమో మరి నాకు!" అని నవ్వి, "ప్రతి దేహానికీ వొక రకమైన పరిమళం వుంటుంది. అది మరుగుపడకుండా చూసుకుంటే—"

"అది వేరు, ముఖ్యంగా, బాగా అలసటతో నలిగినప్పుడు వొస్తుంది యిదివేరు" అంటు చేతులు వెనక్కి వొంచి, ఆమె నడుంచుట్టూ వేశాడు.

"యింతకీ అసలు నువ్వెరివో యేమిటో నాకు తెలియదు!" అన్నాడు స్వగతంలా.

—నిజంగా నిజం చెపితే తట్టుకోగలడా? ముఖ్యం, క్రిష్ణకీ తనకీ మధ్య యేర్పడిన అనుబంధం గురించి. సందిగ్ధస్థితిలో మనసు నలుగుడు పడిపోయి కుమిలిపోక తప్పదు. అబద్ధం చెప్పకండానూ, కావాలని నిజం చెప్పకపోతేనూ, వొక వ్యక్తి జీవితం నరకం కాకండా వుంటుందికానీ— క్రిష్ణ! వొక నిండు జీవితం తన కారణంగా అధ్వాన్నమైపోవటం—కానీ తననేం చేసుకోను—యేదో ఆధ్యాత్మిక శిఖరాల నధిరోహించాలని సాధన చేస్తున్నా డనుకున్నాను—కానీ—యేమిటో యేదీ బోధపడదు సరిగా— తన తండ్రి కంటె తనే...

"నువ్వెవరివో నాకు తెలుసు" ప్రతి ధ్వనిలా అన్నాడు.

ఆమె, ఆలోచనలలోంచి చెదిరింది. కానీ మాటాటలేదు.

"నా కోసం దివి నుంచి భువికి దిగివొచ్చిన దేవతవు" ఆ మాటలు స్వప్నంలోంచి పలుకుతున్నట్లుగా ధ్వనించాయి.

"నేనెరగని, యింతా జన్మించని? యెవరికోసమో యెందుకో అన్వేషించేదాన్ని. వొక వ్యక్తికీ నాకూ మధ్య వింత అనుబంధం. మరోవ్యక్తి ప్రేమ వెర్రిబాగులదిట

మాజీభార్యని" అని నవ్వింది.

నవ్వి, "మరి నాకు." అన్నాడు.

మెడవొంచి అతని నుదుటిమీద పెదవులు అద్ది— "తెలియదు" అని నవ్వింది.

"వూఁ" అని దీర్ఘం తీసి—

చేతులు వీపు మీదకి జరిపి, కిందకి వొంచి, ఆమె ముఖానికేసి తన ముఖాన్ని వొత్తుకున్నాడు.

కదిలి, జరిగి, లేచి— మంచంమీది, దుప్పటి దిళ్లు సరిచేస్తోంది.

"నువ్వు నా గది చూడనేలేదింకా పద చూద్దువు" అన్నాడు.

"వెనక ఎప్పుడో చూడటమేకాదు, మీ గదిలోనే వున్నాను" అంది

నవ్వుతూ తలుపువైపు అడుగులు వేశాడు.

అతని వెనకగా నడిచింది ఆమె.

గది తలుపునెట్టి, లోనకినడిచి, "చూడు— యెలావుందో చెప్పు" అన్నాడు.

నవ్వి, "మీలాగనే వుంది" అంది.

"ఐతే నీకు నచ్చుతుందన్నమాట!"

"నచ్చటం మాట తెలియదుగానీ విడిచిపెట్టిపోలేనిగది"

అతను, వినిపించుకోనట్లుగా, "అది రేడియోగ్రాం. అన్ని రకాల రికార్డులూ వుంటాయి పది రకాల కింద విభజించాను. చూసి చెప్పు" అంటూ పేము కుర్చీ కిటికీ దగ్గిరకి కాలితో నెట్టి కూచున్నాడు

వొకసారి గది అంతా కలియజూసింది. మార్పులేదు. మంచం దగ్గిరికి వెళ్ళి చేత్తో పక్కమీద తడిమింది మమకారంగా.

అంచుమీద కూచుని, వొళ్ళో చీరపొరలలో వేలితో గీస్తోంది.

"అన్నట్టు నీకు బట్టలు అవసరం."

"యిప్పుడేం తొందరలేండి."

"కట్టుబట్టలతో వున్న మనిషి ఆ మాట అనటం, నన్ను అపహాస్యం చేసినట్లు" అని నవ్వి, యేదో స్ఫురించినట్లుగా తల పంకించి, "నిజానికి, యింట్లో జ్యోతి బట్టలు చాలా వున్నయ్ మంచివి. కానీ క్రిష్ణ అదీ

ప్రేమ వెర్రిబాగులదిట

ళంలో వున్నయ్ అవి. తీసి యివ్వొచ్చు కానీ ఆ నగలూ బట్టలూ యీ యింటి కోడలికని ప్రత్యేకంగా అనుకోకుండా భావించుకోటం జరిగింది. నాలుగు నెలలకోసారి తీసి దులిపి తడిమి మళ్ళీ జాగ్రత్తగా పెడుతూ వుంటాడు. ఆ పని చేసే ధైర్యం లేక నేను......

ఆమె లేచి కిటికీ దగ్గిరికి వెళ్ళి చువ్వల మీద చేతులువేసి అతనికి ముఖం కనిపించకుండా నిలబడింది.

నాటి ముదురు ఆకుపచ్చ పట్టుచీర, కళ్ళముందు మెసిలి, ఆమెను కట్టుకోమనటానికి క్రిష్ణచైతన్య పడిన సంచలనం గుర్తుకొచ్చి—కను రెప్పలు వాల్చింది రెప్పలలోంచి తడి వుబికింది. పవిటకొంగు వేలికి చుట్టుకున్నట్లుగా తీసి కళ్లు వొత్తుకుంది

లేచి ఆమె దగ్గిరికి వెళ్లి ఆమె చుట్టూ చేతులు వొంచి పొట్టమీద బిగించి, మెడ ప్రక్కగా ముఖం ఆన్చి, "యీ యింటికోడలు యెవరో, యెప్పుడు వొస్తుందో అసలురాదో, చెప్పలేని స్థితిలాగా కనిపిస్తోంది అనూహ్యంగా కోడలికి బదులు తానే వొచ్చింది. నిజమే నువ్వే కట్టుకోవాలి అని" అన్నాడు.

"నేనిప్పుడు ఆ విషయంఆలోచిస్తున్నా ననుకున్నారా?"అని అతనికి ఎదురుగా తిరిగి నిశ్శబ్దంగా నవ్వింది.

"కాదనుకో, కానీ నువ్వు యెందుకు కట్టుకోగూడదు?"

"యథేచ్ఛగా కట్టుకోవొచ్చు కాని క్రిష్ణని గానివ్వండి. నేనే అడిగి తీసుకుంటాను." అని నవ్వింది.

"గుడ్. నిజంగా నువ్వు చిన్నదానివి కాదు" అన్నాడు నవ్వుతూ.

"స్త్రీకి పుడుతూనే నిగూఢంగా పదిహేనేళ్ళ వయసు వుంటుందట. అవసరాన్నిబట్టి, పాతుపెరిలా తీసి వాడుకుంటుందని వో మరాఠీ బొమ్మగా రంటూండేవారు!" అని అతని కళ్ళల్లోకి చూసి నిశ్శబ్దంగా నవ్వింది.

ఆమెను దగ్గిరికి వొత్తుకుంటూ, "పద బజారు వెళ్దాం" హుషారుగా అని, ఆమె బుగ్గమీద చిటికివేసి, గది మధ్యలోకి నడిపించుతూ, "అలా తత్వవేత్తలా తటపటాయిస్తే వెళ్లేలోగా దుకాణాలు కట్టేస్తారు" అని నవ్వి అవతలికి అడుగులు వేశాడు.

ప్రేమ వెర్రిబాగులదిట

నవ్వింది. ఆమె మనసును యేదో పూర్వస్మృతుల ఛాయ ఆవరించింది.

డ్రాయింగ్రూంలోకి వెళ్ళి జింఖానా క్లబ్బుకు ఫోనుచేసి యివ్వాళ రావటంలేదనీ, పబ్లిక్ వర్క్స్ మంత్రికి—రేపు ఉదయం తొమ్మిది గంటలకి తాను వొచ్చి కలుసుకోదలిచినట్లూ చెప్పి హడావిడిగా వరండాలోకి వొచ్చాడు. అతని వెనక ఆమె నిదానంగా అడుగులు వేస్తూ వొచ్చింది.

జీపు దగ్గిరినుంచి డ్రైవరు వొచ్చాడు.

"భల్లూ యింటికి వెళ్ళిపోలే నువ్వు. కానీ పొద్దుపొడిచేసరికి ఇక్కడ కనిపించాలి సుమా" అని వడివడిగా నడిచి, డాబా మెట్లకింది కారుమీద కప్పినపట్టా లాగేసి-కూచుని, రెండువొంపులు తిప్పి — మెట్లముందు వాకిట్లో ఆగి, సిగరెట్ వెలిగించుకున్నాడు.

ఆమె, వొంగి సీట్లోకి జరిగి కూచుంది

ఇరవై రోజులు గడిచాయి.

పనిమనిషి వొచ్చి పిలిస్తే లేచింది. యింకా నాలుగవలేదు లేపినందుకు విసుగుముఖం పెట్టుకుని యేమిటన్నట్లు చూసింది.

అత్యవసరమైతే తప్ప అలా లేపటం జరగదు ఆమె పేర టెలిగ్రాం వొచ్చింది

గుండె దడదడ లాడింది. కవరు చించి—

చేతులు రవ్వంత వొణికినట్లయ్యాయి.

చూడకుండా అంతలోనే, కళ్లు మూసుకుని శ్వాస దీర్ఘంగా విడిచి, కనుబొమలు యెగరేసి, తేలగా నవ్వుకుంది.

కళ్లు తెరిచి కాగితం మడతలు విప్పింది.

సాయంత్రం వొస్తున్నాను స్నానం తొట్టి సిద్ధం—సారథి.

నవ్వుముఖంతో లేచి కిటికీ దగ్గిరికివెళ్ళి నిలబడింది.

వొచ్చిన రెండోరోజు వుదయం, ఆమెను వెళ్లి నాయకునీ వాళ్ళనీ కలుసుకోమంటే, సరే అంది. కారు తీసుకువెళ్ళమంటే; అవసరంలేదు, బస్సులో వెడుతానంది. యిక్కడ దరిదాపులో బస్టాపుకూడా లేదు. చెమటలు

ప్రేమ వెర్రిబాగులదిట

కాయతూ వెళ్ళటం బావుండదుస్మా అని మందలింపుగా వీపుమీద తట్టాడు. వెళ్ళి కలిసింది. దరఖాస్తు నమోదు చేసింది.

వారం రోజులకు విజయసారథి చెల్లెలు వొచ్చింది. వొస్తూనే గీతాదేవిని చూసి అదోలా ముఖం పెట్టి లోనకి వెళ్ళింది. ముసలావిడ వో తుఫాను గేపేలా వుందే అనుకుంది గీతాదేవి. రెండురోజులు తిరక్కుండానే ఎత్తిపొడపులూ అవీ సాగించింది. గృహలక్ష్మి లేకపోతే యేమౌతుంది యిల్లు, బజారు ముండలు చేరక—లాంటి సూటీ పోటీ మాటలేకాక వొకతూరి 'యెన్ని కొంపలార్పి యిక్కడికి దాపురించావు?' అని గీతాదేవితోనే అంది. మౌనంగా వూరుకోవటం, లోలోన బాధపడటం, మరు నిముషంలో తుడిచేసుకుని నవ్వుకోవటానికి ప్రయత్నించటం తప్ప—విజయసారథితో సూచ్యంగా కూడా అనలేదు. వొతూరి యేదో అలాగే అంటూవుండగా విని, చివాలున వొచ్చి "సీతీ నోరు మూసుకుని వుండదలిస్తే వుండు లేకపోతే తక్షణం బయటికి నడువ్" అని కళ్ళెర్రజేశాడు విజయసారథి. "యేంటీ, పొమ్మన్నాక. నీ కొంపలో పడి వుండాల్సిన ఖర్మ నాకేం లేదు. ఆయన పోయినంత మాత్రాన దిక్కులేని దాన్ననుకుంటున్నావా! పెద్దన్నయ్యకి చెప్పి నీ ఆట కట్టిస్తాను చూడు. యిన్నేళ్ళొచ్చి—అవ్వ!" అని సణుక్కుంటూ, అప్పటికప్పుడు బట్టలు చేసంచీ సర్దుకుని బయల్దేరింది.

"ఐనవాళ్ళు, వుండమని నేను బతిమిలాడతాను." అంది నిమ్మదిగా విజయసారథితో. వొద్దన్నట్లు చేత్తో సూచించి—చెల్లెలు డ్రాయింగ్రూం దాటగానే, "యిది యెక్కడికి పోతుందట! పదిరోజుల్లో షైలాక్‌కి రాసి బేరింగ్ కవర్లా తిరిగిరాదూ! మావాడు దీనిబాధ పడలేక యేదొకటి చెప్పి మళ్ళీ యిక్కడికే తరుముతాడు" అన్నాడు. 'కానీ అంతవైరందేనికి పోనీలే అని, చూసీ చూడనట్లు వూరుకో కూడదూ?' అంది గీతాదేవి "యీ ములుకు మాటలు వొచ్చినప్పటినుంచీ వినుకుతూ వుండే వుంటుందనిపిస్తోంది నువ్వు నాతో మాటమాత్రం అని వుంటే—"

"నాలుగు రోజులు పోతే ఆవిడే సమాధాన పడును. ఆ మాత్రానికే—"

ప్రేమ వెర్రిబాగులదిట

"గీతా సీతో సహనం కూడా వుంటుందని నేననుకోలేదు. దాని భయం వేరేవుంది. యీ ఆస్తి యేమై పోతుందోనని. యిక్కడికే క్రిష్ణ తన కూతుర్ని చేసుకుంటాడో లేదోనని భయం."

"యివ్వా లనుకున్నారా?"

"పిల్లలు పుట్టగానే మేనరికాల మాట అనుకోపటం సహజం కదా! అంతమాత్రాన అవి జరుగుతయ్యనేవిందే? క్రిష్ణకి యిష్టంలేదు. యిష్టం లేని పనిచెయ్యమని యెదిగిన పిల్లల్ని నెవ్వరినీ బలవంతం చెయ్యటం నాకు సరిపడదు. యిప్పుడు నీ కారణంగా నా తరపునుంచి కూడా——"

ముగించకండానే అందుకుని "నా వల్ల అలాంటి అవకాశాలకీ పరిస్థితులకీ దారి తియ్యకూడదు. నా కారణంగా యింటి పరిస్థితులూ బంధుత్వాలూ చెడటం నా కిష్టంలేదు. నేను మీ ఆస్తి ఆశించటంలేదని రాసిస్తాను పోనీ" అంది

నవ్వి "నువ్వు రాసిచ్చినా — వాళ్ళకి తీసుకునే హక్కు లేదు. వాళ్లెవరు? అభ్యంతరం చెప్పాల్సింది క్రిష్ణ. అదీ తన వాటావరకూ. నిజానికి ఈ ఆస్తి అంతా నేను వొక్కరోజులో మూడు ముక్కల్లో నష్టపోయినా పల్లెత్తుమాట అనడు క్రిష్ణ అసలు నీ కెందుకులేదు, ఈ ఆస్తి అనుభవించే హక్కు? యీ క్షణంలో అంతా నీ పేర రాసెయ్యగలను. నిజానికి, యీ ఆస్తికి రెండో వారిసురాలివి నువ్వు. ఆ అర్హత వుంది నీకు. యెవరు కాదనగలిగేది —— యిలా వొచ్చి నా ముందు అనమను?" అన్నాడు వుద్రేకంగా.

"పాపం, అనవసరంగా ఆవిడ—"

"యిష్టం సీతి విషయం నీకు తెలియదు. పది రోజుల్లో మళ్ళీ తిరిగి వొస్తుంది. దానికి, సొంత అవసరం వరకూ ఆలోచనలుకూడా మంచివే వొస్తాయి. క్రిష్ణని తన కూతురి కిప్పించేట్లు నాకు నచ్చచెప్పమని సీతో సఖ్యంచెయ్యకపోతే చూడరాదూ?" అని నవ్వాడు.

"మీ మేనకోడలు——"

"సలక్షణమైన పిల్ల. కానీ క్రిష్ణ యింతవరకూ యే వొక్క పిల్ల మీదా మోజు చూపినట్లు కనపించలేదు. నేనేం చేసేది? చూస్తాను. మంచి

ప్రేమ వ్వైరిబాగులదట

సంబంధం దొరికితే నిర్మలకి పెళ్లి ఖాయపరిచి కట్నంకూడా కొంత సర్దుతాను. యీ గొడవ తీరిపోతుంది అంతటితో" అని అన్నాడు విజయసారథి.

విజయసారథి అన్నట్లుగానే పన్నెండో రోజుకి తిరిగి వొచ్చింది సీతమ్మ. వొచ్చాక రెండు రోజులు ముభావంగా వుండి, తరవాత తరవాత సఖ్యంగా వుండటం ప్రారంభించింది. విజయసారథి, కేవలం సరదాగా సాగిపోయే వ్యక్తేకాక ప్రాపంచిక విషయాలలోకూడా దిట్ట అని అనుకుంది గీతాదేవి.

విశాఖ జీవితం ముగిసిందనీ, యిక్కడికి వొచ్చి వుంటున్నట్లూ శశాంకకి వుత్తరం రాస్తే; ప్రత్యుత్తారానికి బదులు అయిదోరోజుకి తా' వొచ్చాడు నమ్మలేనట్లుగా. శివరాం గురించి రెండుమాటలలో విషయ' అర్థం అయ్యేలా చెప్పి, "అరకులోయలో విజయసారథిగారు కలిశాఁ వొచ్చాను, యిక్కడికని తెలియక. ఆయనను విడిచి వెళ్ళలేక వుండిపొ యాను" అని అంటే; శశాంక, యేమీ అర్థంకాక అవస్థపడుతూంటే. "జీవితంలో తొలిసారిగా ప్రేమించటం అంటే, యేమిటో తెలిసింది. అ ఫలితమే నా యీ రాక. అందుకు నేను విచారపడటంలేదు" అని అంది. "కానీ జీవితం—" అని ఏదో చెప్పాలని శశాంక ప్రయత్నిస్తోంటే— "అవును; జీవితం చాలా సుదీర్ఘం—అని సాగదీస్తూ కూచుంటే యెన్నటికీ ముడిపడదు. కాగా హృదయం ఆలోచనల చిక్కు విడదియ్యదు! ఆలోచించటం రాని పసిడి, హృదయం" అని ఆమె అంది. మాటలు రానివాడిలా కూచుని, సిగరెట్ మీద సిగరెట్ కాల్చుతూ వొక గంటసేపు వుండి, తను వొచ్చినట్లు విజయసారథికి చెప్పవొద్దని వెళ్లిపోయాడు.

పద్మకు వుత్తరం రాసింది-విశాఖ నుంచి బయల్దేరినట్లూ, మిత్రుల వూళ్లు చూసుకుంటూ త్వరలో రాబోతున్నట్లున్నూ, ఆమెకు తన వివాహం గురించి రాయనేలేదు. ఆ విషయం వొక్క శశాంకకి మాత్రమే రాస్త.

రోజులు దొర్లిపోతూ—లోనా బయటా ప్రశాంతి. తీరిక సమయం అంతా గీతాదేవితోటే గడుపుతాడు విజయసారథి. కానీ కలుసుకోటానికి

ప్రేమ వెర్రిబాగులదిట

వొచ్చే వాళ్లతోటే యెక్కువ సమయం అయిపోతుంది. వారానికి అయిదారు రోజులు, రాత్రి యేడున్నరకి భోజనం చేసి క్లబ్బులకు వెడతాడు. పేకాటలో నాలగైదువేలు గెలిచో వొడిపోయో పన్నెండు గంటలకి తిరిగి వొస్తాడు హుషారుగా. అప్పుడే పుస్తకం మూస్తూ గీతాదేవి, అతని అడుగులసవ్వడివిని నవ్వుకుంటుంది. అతని షెషారుకీ ఉత్సాహానికీ. నీకుకాలం గడవనట్లుగా గానీ నేను నీతో లేనట్లుగా గానీ అనిపింటేతే చెప్పు— వుంటి పోతాను. అదేమంత ముఖ్యంకాదు. కాకపోతే తద్వారా నలుగురితో సంబంధాలు వుండి వుపయోగపడటం జరుగుతుంది—అని విజయసారథి అంటే, "నాకు పన్నెండువరకూ చదువుకునే అలవాటు యింవైనాలుగు గంటలూ మీరు నా చెంతనే వుండిపోవాలనుకునేంత మూర్ఖురాలిని కాదు మీరొక గంట ముందు రండి. నేనొక గంట త్వరగా పుస్తకం మూస్తాను" అని అంది. అప్పటినుంచీ పదకొండు గంటల ప్రాంతంలో తిరిగి వొస్తాడు. ఒట్టలు మార్చుకుని—ఆమె గదిలో వొక గంట వుంటాడు. ప్రాయింగ్రూంలో నలుగురైదుగురు కూర్చుని వుంటే అందులో యెవరితో ఐనా యేకాంతంగా మాట్లాడాల్సిన విషయాలు వుంటే తన గదిలో కూర్చోపెట్టి మాట్లాడటం అలవాటు విజయసారథికి. ఆ కారణంగా గీతాదేవికి అతని గదిలో యెక్కువగా వుండే అలవాటు కాలేదు. అప్పుడప్పుడూ "రద్దూ యెప్పుడూ చదువేనా!" అని సినిమాకో, క్లబ్బుకో తీసుకు వెడతాడు. రాజ్ సంగీతంలో తేలిపోయే అతను, హిమాయత్ సాగర్ వెళ్ళినప్పుడు ఆమె పాడిన పాటకి వీణలా స్పందించటం చూసి, పొంగి పోయింది గీతాదేవి. కానీ—యెంత ప్రశాంతిగా వున్నా, లోలోన సంచలనం. అతని కౌగిలిలో వొళ్లు మత్తెక్కి, రక్తం పొర్లింతలై నరాలు పంకర్లు తిరిగే ప్పుడు—మౌనంగా శిలలా, అతనికి అతుక్కుపోతుంది. అతను గ్రహించినట్లుగా చలించి ఆమెను కదిపి యేదో ప్రయత్నం చెయ్యబోతాడు. కానీ ఆమె మౌనంగా, ఓగుసుకుపోయినట్లుగా అతనికి అంటుకుంటుంది. వొకటి రెండుసార్లు యేదో చెప్పబోయాడు. కానీ ఆమెకు అతని ప్రయత్నం అర్థం అయ్యేది కాదు.

టెలిగ్రాం మళ్ళీ వొకసారి చూసి—విజయసారథి గదిలోకి వెళ్ళింది.

ప్రేమ వెర్రిబాగులదట

గీతాదేవి.

విజయసారథికి ప్రతి ఆదివారం వుదయం వొక గంటసేపు పింగాణీ తొట్టిలో పడుకుని స్నానం చెయ్యటం అలవాటు. యెపైనా పర్యటనకి వెళ్ళి వొస్తే-వొక గంటసేపు నీళ్ళలో అలసట నంతటినీ కడిగేసుకుని —అప్పుడే నిద్రలేచి స్నానించి, వొచ్చిన వాడిలా డ్రాయింగ్రూంలోకి వుషారుగా చురుగ్గా హడావిడిగా వొస్తాడు.

యెప్పుడూ ఆ యేర్పాట్లన్నీ పనిమనుషులే చేస్తారు. టెలిగ్రాం విషయం చెప్పి చేయించాలనిపించక, తనేచేస్తూ —స్నానాల గదిని పరిశీలనగా చూసింది. అదివరలో ఆ గదిలో - ఆమె వున్నప్పుడు, ఆ సీసాలూ తదితర సామగ్రి బయటపడలేదు.

వేడినీళ్ళకు మీటనొక్కి — తొట్లోకి చన్నీళ్ళు వొదిలి—వొక్కొక్క సీసా తీసి చూస్తోంది.

పరిమళ ద్రవ్యాలు. మూడురకాల సబ్బుపొడి, రెండురకాల షాంపు. నాలుగు వొంటి బ్రష్షులు. స్నానం తరవాత వేసుగునే పొడవాటి బొంత కోటు—

తొట్టి కాసింత నిండాక, కొళాయి బిగించి— ఆ నీళ్ళు పైకి కదిపి కడిగి, కింది రంధ్రం ద్వారా ఆ నీళ్ళు వొదిలేసింది. మళ్ళీ నాలుగో వొంతుకి నీళ్ళు నింపి మిశ్రమ సబ్బుపొడి కలిపి, పరిమళ ద్రవ్యాలు చిలకరించి చేత్తో కలిపి—వేన్నీళ్ళు అతను వొచ్చాక వొదలవొచ్చనుకుని, గదిలోకి వొచ్చి, గీతాదత్ పాడిన "వోఁక భయో అబ్ జాగ్ వుఠో" రికార్డువేసి వింటూ కూచుంది.

అతను యింకా రాలేదు. సరిగ్గా యెంత కొచ్చేదీ తెలియదు.

వరసగా తనకిష్టమైన రికార్డులు పెట్టుకుని వింటూ కూచుంది, రేడియోగ్రాం ముందు పేము కుర్చీ వేసుకుని.

అరగంట గడిచింది.

బయట జీపు ఆగిన ధ్వని. లోన పనివాళ్ళు వడివడిగా అటూ యిటూ నడిచిన అలికిడి.

వో పనిమనిషి గుమ్మంలోకి వొచ్చి, "అమ్మగారూ అయ్యా ప్రేమ వెర్రిబాగులదిట

గారొచ్చారు నీళ్లెచ్చ శేద్దావనీ—" భయం భయంగా అని ఆగిపోయాడు
ఆ యేర్పాట్లు, చెలిగ్రాం చూసి తనే చేసినట్టు చెప్పింది.
గుమ్మంలోకి హడావిడిగా అడుగులు వేస్తూ వొచ్చి, గు"గుడ్, నేననుకుంటూనే వొచ్చాను, వాటర్ హీటర్ సీట నొక్కి— నాకోసం యెదురుచూస్తూ రికార్డులు పెట్టుకుని వింటూ కూచుని వుంటావనుకుంటూ. వొచ్చినట్టుగానే-నువ్వు, నందివర్ధనం పువ్వులా—వోహ్ యిలా రద్దూ." అంటూ ఆమె దగ్గిరికి వెళ్ళాడు. లేచి నిలుచుంది.
ఆమె చుట్టూ చేతులు తిప్పబోయి "చవో, వొళ్లంతా దుమ్ము, జిల్లాల దుమ్ము. ఫినైల్‌పోసి కడిగితే గానీ పోదు" అని అవతలికి రెండడుగులు వేశాడు.
'ఆ ఫినెలే నీళ్లలో కలిపివొచ్చాను' అని నవ్వింది. రికార్డు ఆపుతూ.
"నీకేం అవసరమొచ్చింది? వాళ్ళేమయ్యారు ?" అని అప్రయత్నంగా తిరిగినట్టు గుమ్మంవైపుచూసి, "వొరే ముచ్చా నాగా వెంకా శుంఠా బడ్డూ గాడిదా" అని వేగంగా అన్నాడు.
ఫక్కున నవ్వింది.
"యేం కథ ? యిదేదో గూడుపుఠాణిలా వుంది చూడగా !" అని ఆమె ముఖంలోకి చూశాడు
ఆమె లేచి వెళ్ళి తొట్టిలోకి వేన్నీళ్లు వొదిలి వొచ్చి, "నాకు చెలిగ్రాం యిచ్చారని యేర్పాట్లు నేనే చేశాను, వాళ్లకి చెప్పకుండా. అంతేకానీ మీ సిబ్బంది మీ మాట వినకపోవటం వుంటుందా ? భయ భక్తులతోపాటు చచ్చేంత అభిమానం కూడాను, వాళ్లకి" అని నవ్వింది.
పసిమనిషివొచ్చాడు. "వొరే మీరంతా-పోయి కొబ్బరిచెట్టు చుట్టూ మన్ను పొయ్యండి" అన్నాడు.
"వో అదా ! నేను రేపు రావాల్సినవాణ్ని కదా—అందుకని. నువ్వే చెయ్యాలనికాదు యిలాంటి పనులకి వుద్దేశించబడని దానివి నువ్వు"
"యేమో !"
"యెందుకో చెపా. ముందు యీ దుమ్ము కడిగేసుకొనే." అని
ప్రేమ వెర్రిబాగులదిట

హడావిడిగా స్నానాలగది తలుపుతెరిచి తొంగిచూసి, "సిగరెట్లు అగ్గి పెట్టె, టెలిఫోను—అవసరం. మధ్యలో ఫోను పిలుపులొస్తే పెద్దచిక్కు, గంటసేపు వాళ్ళు విసుక్కోనూ, నేను దడదడ పడనూ"—అంటూ వెనక్కి తిరిగి వొచ్చి బట్టలు విప్పుతున్నాడు.

ఆమె లేచి ఫోను తీసుకొచ్చి అమర్చింది.

"ఆ స్టూలుమీద పెట్టేసెయ్యి" అన్నాడు.

అన్నీ అమర్చి గది బయటికి వెళ్ళబోయింది.

"కూడదు" అన్నట్లుగా తల అడ్డంగా వూపుతూ, గుమ్మంవైపు అడుగులు వేసి గడియ తిప్పి వొచ్చాడు.

"బాగోదు బయట అందరూ—" అని ఆగిపోయి అతనికేసి చూసింది.

మొలలాగుతో నిలబడి వున్నాడు. క్రిష్ణచైతన్యకంటే వొక అంగుళం పొడవు తక్కువ నలుసంత లావెక్కువ.

"యేం, యింతకాలం అందరూ కళ్ళుమూసుకుని యివ్వాళే తెరిచా రనుకున్నావా" అని వొక క్షణం ఆగి, "కాదూ, మరోలా అనుకునేట్లు చెయ్యాలంటే అదీ సాధ్యమే— నా కార్యాలయం కాగితాలు చూసే అంత రంగిక కార్యదర్శిని వసి చెప్పటానికి కావాల్సిన స్తోమత, ఆ పైనచెప్పే నేర్పూ వుండాలి" అన్నాడు.

"అదేం కాదు కానీ పగటివేళ—"

"రాత్రి వేళ వొప్పు అయింది, పగటివేళ తప్పు అవటానికి వీల్లేదు. కాగా, మన విషయం యెవరికీ సంబంధించని విషయం—క్రిష్ణ తప్ప. వోల్డ్‌మన్, యిది నీకు తగదు అని అంటే, కనీసం అనుకుంటే—అప్పుడు చూద్దాం, యే అరకులోయలోనో సిమ్లాలోనో వుండిపోదాం వెళ్ళి" అని నవ్వి, ఆమెకేసి చూసి, "ఐనా యేళ్ళు పై బడటం నేరమా చెప్పు" అంటూ స్నానాల గదిలోకి నడిచాడు.

అతని బట్టలు తీసి చాకలిబట్టల అరలో దూర్చి మంచంమీద కూచుని వొళ్ళో చేతులు కట్టుకుని కాళ్లు వూగిస్తూ— గొంతులో, మల్లికా పుఖార్ పాడిన "అభీతో మై జవాఁ హూఁ" ను శ్రుతిచేసుకుంటోంది.

ప్రేమ వెర్రిబాగులదిట

స్నానాల గదిలోంచి పిలుపు

తెల్ల మస్లిన్ పమిట భుజాల చుట్టూ తిప్పుకుంటూ వెళ్ళింది

మెడవరకూ నీళ్ళలోకి వొరిగి, కుడి అరిచెయ్యి వొకవైపు పింగాణీ తొట్టి అంచుమీద — రెండోచెయ్యి నీళ్ళలో వొళ్ళు నిమురుకుంటున్నట్లుగా కదులుతోంది.

"ఆ పైన స్పాంజి వుంటుంది యిలా యివ్వు" అన్నాడు.

తీసి అతనికి అందించి, వో అంచుమీద వున్న మొలలాగూ తీసి పిండి వొంకీకి తగిలించి గుమ్మంలోకి అడుగులు వేస్తూ, తల ప్రక్కకి తిప్పి "యింకేమైనా కావాలా?" అంది.

యీలపాట ఆపి ఆమెకేసి చూడకండానే "కావాలి యిలా రా, చెప్తా" అన్నాడు.

తొట్టికి దగ్గిరిగా వెళ్ళి యేమిటో చెప్పమన్నట్లు చూసింది.

"కబుర్లు చెప్పు, వింటూ స్నానం ముగిస్తాను."

ఆమె తిరిగి వెళ్ళబోయింది.

"హే" అన్నాడు, వెనక్కి తిరిగి. "కుర్చీ తెచ్చుకుంటాను" అంది.

"యిలా దగ్గిరిగా అంచుమీద కూర్చుందూ. యేం, నడుం నొప్పి పుడుతుందా?" అని నవ్వాడు.

"అంత సుకుమారం కాదులెండి" అని రెండడుగులు వేసి అంచు మీద కూచుంది, అతని వైపుకు కొద్దిగా మెలితిరిగి.

"సిగరెట్" అన్నాడు.

అందించి నిప్పుల్ల వెలిగించింది.

వేన్నీళ్ళ ఆవిరి పొగలోకి, దమ్ములాగి పొగ వొదులుతూ, "నాలుగు రోజులుగా నేనొక విషయం ఆలోచిస్తున్నాను" అన్నాడు.

"యేమిటి?" అన్నట్లు చూసింది అతనికేసి.

ప్రేమ వైరిబాగులదిట

"మనం యెందుకు పెళ్ళి చేసుకోగూడదూ-అని."

"అది అంత ముఖ్యం అనుకోను. యిలా గడిచిపోనీండి. కాగ లేనిపోని అలజడులు రావొచ్చు దాంతో" అంది నిదానంగా.

ఆమె ముఖంలోకి చూసి, "లోకం వుత్త పిరికి గొడ్డు. భయపడే వాళ్ళని భయ పెడుతుంది. భయపడని వాళ్ళని చూసి బెదురుతుంది" అని నవ్వి, "యేం యెందుకు చేసుకోగూడదో చెప్పు" అన్నాడు.

"ఆ తంతు జరగనంతమాత్రాన మనం మనం కాకండా పోతామా" అని పల్చగా నవ్వింది

అతను తన ఉద్యోగ విషయాలు ప్రారంభించాడు.

వింటూ, యేదో స్ఫురణకొచ్చినట్లుగా తలయెత్తి, "అన్నట్లు మిమ్మల్ని యెప్పటి నుంచో వో విషయం అడగాలని-మీరు యీ వుద్యోగంలో యెంతకాలంగా వుంటున్నారు?" అంది.

"అర్థంలేని ప్రశ్న. ఉద్యోగంనుంచి యెప్పుడు రిటైరవబోతున్నారని అడగాలి. నవాబు జమానాలో గౌరవమర్యాదలతో చేశాను. మాః తెలంగాణా కాలంలో గౌరవంగానూ, ఆంధ్రప్రదేశ్ హయాంలో అగౌరవంగానూ వుద్యోగం సాగిపోతూ వొచ్చింది. మూడేళ్ళనుంచి యీ ప్రజకార్యాల సి. యి. గానూ—"

"అంతకుముందు?" అంది.

"యెన్నని చెప్పేది? అంతకుముందు నగరపాలక సంస్థలో సి. యి గా-యింకా అంతకుముందు, యింకా అంతకుముందు – వెయ్యి పేజీల రికార్డు వుంది. తెప్పించుతాను, చూసుకో నువ్వే" అని నవ్వాడు. ఆమె కూడా నవ్వింది.

అటు ప్రక్కకి వొత్తిగిల్లి, స్పాంజితో వీపు తోముకోటానికి ప్రయత్నిస్తున్నాడు.

ప్రేమ వెర్రిబాగులదిట

స్పాంజి తీసుకుని వీపుమీద రుద్దుతోంది.

పవిట జారి నీళ్ళలో పడింది, తీసుకోబోయింది రెండో చేత్తో.

వెల్లకిలా తిరిగి పవిట అందుకుని చెంపలకి వొత్తుకున్నాడు.

బాగా ప్రక్కకి జరిగి ఆమె చెయ్యి—మణికట్టుపైన పట్టుకున్నాడు.

"సబ్బు" అంది.

"తెలుసు."

లేవబోయింది.

కిందకిలాగాడు జబ్బపట్టుకుని. జారి నీళ్ళలోకి పడింది. లేచి వెళ్ళబోయింది.

ఆమె భుజంమీద చెయ్యివేసి అదిమి—ఆమె పూర్తిగా వొరిగి—

అణిగి, జారి, తలలు నీళ్ళలో మునిగి—శ్వాసకోసం పైకి తలలు యెత్తి—

ఆమె జుట్టు, ముడివూడి సబ్బునీళ్ళమీద మబ్బు తునకలా తేలుతోంది.

వెచ్చని నీళ్ళలో అవయవాల వింత స్పర్శ. చేతివేళ్ళ పరామర్శ. నరాలు మెలితిరుగుతున్నాయి.

యుగాల తరవాత నిద్ర మేల్కొంచి, వింతగా చుట్టూ చూసుకున్నట్లు అతని అవయవాలు—

ఆమె శరీరం, మతాబాలా వెలిగి నీళ్ళలోంచి వుప్పెనలా పొంగి పుక్కిలింతలై తేలుతున్నట్లుగా, చూశాడు ఆమెకేసి.

వురితాళ్ళలా అతని నరాలు అతనినే చుట్టివేస్తున్నట్లుగా కంపించాడు.

పడమటి ఆకాశాన్ని సాయంత్రంపూట చుట్టేసి రగిల్చిన మంటలా, ఆమె పెదవులు, తడిలోంచి మండిపోతున్నాయి.

ప్రేమ వైరిబాగుఅదిట

ఆ సెగ భగ్గుమనాలి, ఆ జ్వాల తనలో భగ్నమవ్వాలన్నట్లుగా ఆమె మీదకి వొరిగాడు. ఆమె పొట్టమీద నుదురు ఆనింది. వేన్నీళ్ళకంటే వెచ్చగా, వేసవి మధ్యాన్నపు ఆకాశంలా, కాల్చుతోంది పాదరసంలా కదిలే చితకని మైదాముద్దలు అతని చేతివేళ్ళను కొరికివేస్తున్నాయి.

నిప్పు రవ్వలా జ్వలించే నోటిమీద పెదవులు ఆన్చి నొక్కాడు. అంతా సమస్తం తానే అయి వువ్వెత్తుగా యెగిసి పోతున్నాడు.

తను విశ్వమంతగా యెదిగిపోయి—ఆమె తనలో అణువై భగ్గున మండి మాడి పోయినట్లుగా—

శిఖరం విరిగి లోయలో పడినట్లు, నిశ్శబ్దం వొక్కసారిగా చలించినట్లు, కాగితం మండి మసి అయి గాలికి యెగిరినట్లు—తెరిచి వున్న రెప్పలు విప్పాడు.

యెడారి పూలు పూసింది. వెచ్చని ఆవిరి నీళ్ళు వొక్కసారిగా గడ్డ కట్టుకుపోయినట్లు, శరీరాలు చల్లగా కుప్పకూలినట్టయ్యాయి.

అతని కళ్ళలోంచి చూపు తిప్పుకుని తొట్టి అంచుకి తల ఆన్చి, అలసటగా తృప్తిగా కనురెప్పలు వాల్చింది.

ప్రేమ వెర్రిబాగులదట

# 6

రయిల్లో కూచుని, కిటికీలోంచి బయటికి చూస్తున్నాడు క్రిష్ణ చైతన్య.

మనసులో సంచలనం సంక్షోభం సుడులు తిరగటంలేదు. అలా అని; ప్రశాంతీలేదు. నివురుకప్పిన నిప్పులా వుంది. రగులుకోవటంలేదు. ఆగిపోనూ లేదు. కానీవొక వొడుపూ, వేగం, ప్రయాసలేని వేగం-రయిలు పెట్టెకింది చక్రాలవేగం; వాటిలాగా సునాయాసంగా తిరిగిపోతోంది. యింజను చక్రాల మధ్య బద్దీ చేసే బలంతోకూడిన ఇనుము కదలికలాంటి చప్పుడు లేదు.

నున్నటి రయిలు పట్టాలమీద నున్నటి రయిలు చక్రంలా తిరుగు తోంది అతని మనసు. ఆ వేగపు సుడిలో గత రెండేళ్ళ అతని జీవితం చుట్టుకుపోతోంది, సాలెపురుగు తీసే దారంలా సాగి.

అతను తనకి వూహ తెలిసినప్పటినుంచీ నమ్ముతున్న దేవుడూ, ఆత్మ, మంచీచెడు, పాప పుణ్యాలు, ధర్మాధర్మాలు చిక్కుపడిన దారపు వుండలా అయ్యాయి. తను ఆ దారపు వుండ, అప్పన్న దారం పోగులు. ఆ పోగులు విడతియ్యాలంటే దారం తెగుతుంది. పీట ముళ్లు విడవు. విడకపోతే అవేమిటో అసాంతం ఆకళింపుకాదు. విడనిచోట, తెంపితే అఖాతం యేర్పడి "తన" అనే దానికి అర్థం దొరకనట్లుగాఅవుతుంది చిక్కు విడదీస్తే దారపువుండ వుండదు, విడదియ్యకపోతే అర్థం వుండదు. రెండేళ్ళ సాధన అధ్యయనం, అతనినే ప్రశ్నిస్తున్నాయి యేం చేసినట్లని. ప్రశాంతి కోసం రెండేళ్లు తపసు చేస్తే చివరికి ప్రశాంతికాదు పొంద గలిగింది ఆ ప్రశాంతికి చుటూవున్న నీడ— ఆ నీడలలో మనసుకుతాకిన సుడులు ముళ్ళు, మలుపులు, రంపపు టంచులు—లాంటివి, సాధనవల్ల సాధించగలగ వొచ్చని తెలిసింది. అతనికి అక్కరలేదు అధ్యయనంవల్ల సాధించింది. యెవరికి అక్కరలేని యెని



మరీచికాన్వేషణ

మిది పండల పేజీలు, అచ్చు అయినవీ, వెనకటి కాలంలో చేత్తో రాసినవీ— సంస్కృత గ్రంథాలు, మెరిగలి పొత్తుల్లా విచ్చుకునే సరికొత్త ఆంగ్ల గ్రంథాలు, వాటికీ స్వామీజీతో అతను చేసిన చర్చలు—వీటి సారాంశం ఆ పేజీలు. అతనికి అక్కరలేని వుపయోగపడని పేజీలు, ప్రెపు చేయించి యే విశ్వవిద్యాలయానికో సమర్పిస్తే వో డి. లిట్. డిగ్రీ తెచ్చుకునే పేజీలు. అదీ వాటికి అర్థం.

తనకి కావలిసింది డి. లిట్. కాదు. తనకి కావలసింది తనే. తనే మిటో తెలుసుకోవాలి. తనేమిటో నిజంగా తెలుసుకోబోతే—తెలిసేలోగా తను తనకి చిక్కకుండాపోతాడు. తను లేని 'తన జ్ఞానం' తనకి అక్కర లేదు. తను, తన సాధన—యేటిఒడ్డున కూచుని, యెండకికాగి, వానకి తడిసి—వొక్కొక్కమెట్టూ యెక్కుతూ వెళ్లి—యెక్కడికి వెళ్లేది—యెక్క డికి—తను లేనిచోటుకి—తను లేనిచోటుకు వెళ్లటంలో యేముంది అర్థం. అర్థం మాట అటుంచి తనకి అక్కరలేదు తనులేని సత్యం. సత్యం చెప్పేం దుకు తను లేకపోయాక. సత్యం వధ అవుతుంది. ధర్మం ఆచరించేందుకు తనే లేకపోయాక, ధర్మం చెర అవుతుంది. తనులేకపోయాక— ధర్మపు చెరలో సత్యం వధించబడుతుంది, కానీ—కానీ యిది తెలుసుకునేందుకు తను పడిన శ్రమ—పద్దేనిమిదో నెలకి కానీ నాలుగో మెట్టు యెక్కినట్లనిపించలేదు—అబ్బ, యిప్పుడనిపిస్తుంది ఆ యెండలో వానలో యిసకలో కాళ్ళు మడిచి తాపడంచేసి—కానీ, ఆ అనుభవం కూడా వొక అపురూపం——

భృకుటి త్రినేత్రంలా జ్వలించి, తెల్లని కాంతి పుంజమై, పాల పొంగులా పొరలి, విస్తరించి, విస్తరించి — అందని విశ్వపుటంచుల వ్యాపించి——

"గీతా!"

"వూఁ" మూడు వొంపులు తిరిగిన ధ్వని—పీణ, మూర్ఛనలలోంచి— తుళ్ళిపడి నట్లయింది.

నడుస్తోంది; తడి యిసకమీద వుప్పు నీరు కక్కిన నురగలోంచి— సౌదామిని మూర్ఛిలి, మగతగా కదిలింది కాబోల నన్నట్లు.

మరీచికాన్వేషణ

నీలి సాగరపు నుదుట కుంకుమ బొట్టులా సూర్యుడు; అలలమీద నుంచి మత్తుగా వీస్తున్న గాలి—

పచ్చని నడుం, వెడల్పుగా యెత్తుగా గుమ్మటంలా విస్తరించుకున్న చోట రెండు చేతులూ వేశాడు. మస్లిన్ పొరలకింది కంప అరిచేతుల్లో కదులుతోంది.

నడపటం మాని "గీతా—" అన్నాడు.

"క్రిష్ణా" అని, "యేమో" అన్నట్లు మెడ త్రిప్పి వెనక్కి చూసింది అతని పెదవుల ప్రక్కగా ఆమె నుదురు, కళ్ళలో కళ్ళ ప్రతి బింబాలు.

"యిక్కడే యెల్లకాలం, యిలా—యిలా" అని చేతులతో నడుం వూపి, "యిలాగే వుండిపోవాలి" అన్నాడు ముఖం రవ్వంత వొంచి పెద వులతో నుదుటిమీద అద్ది.

"వేళ అయ్యేసరికి ఆకలి భుగభుగ లాడుతూ లేస్తుంది. నాకు అప్పుడే ఆకలేస్తోంది."

"ఆకలా? యెక్కడ!"

నవ్వి, గుండ్రంగా తిరిగి, అతని భుజాలమీద చేతులువేసి, దురుసుగా నెట్టి చకచకా నడుస్తోంది.

కాలు నిలదొక్కుకుని, ముందుకు త్వరగా నడిచి, ఆమె చెయ్యి అందుకుని "గీతా—" అన్నాడు.

"యేం గీత?"

"నా గీత."

"కల్లు గీత."

"నా నుదుటి గీత."

"మందమతితో కళ్ళుమూసుకుని నడిస్తే బొక్కబోర్లా పడితే నుదుటిమీద గీత యేర్పడదూ మరి?"

"నా గీత గీయని గీత."

"మూయని తలుపు."

"యెంతకాలమని, యింక వేద్దాం తలుపు" దగ్గిరికి లాక్కొని

చేతుల మధ్య ఎగిరించాడు. అతని చేతులమీంచి చేతులు బిగించింది.

పెదవుల వొత్తిడిలోంచి రగిలినమంట వేడికి కనలి—అతని మెడ చుట్టూ చేతులువేసి, పాదాలు అతని మోకాళ్ళ వెనక బిగించి—అతనికాళ్ళ పట్టుతప్పి—యిద్దరూ యిసకలో కుప్పలాకూలి—

కాంతిపుంజం కుంచించుకుపోయి కనుబొమల మధ్య ముడుచుకున్న కంతరాలలో నల్లగా బిగిసిపోయింది కనురెప్పలు విప్పి చుట్టూ చూశాడు క్రిష్ణచైతన్య.

యేటిలో నీళ్ళుతెల్లగా మెరుస్తున్నాయి. యిసక బరకగా జరుగుతున్నట్లనిపిస్తోంది. కాస్త ప్రక్కగా-బంగళా, పాకలు, మామిడితోట, పూలమొక్కలు, కూరగాయల మళ్లు, పచ్చిక, పచ్చికలో మేస్తున్న ఆవులు—

కనుబొమలు చిట్లించి తల విదిలించి, కళ్లు మూసుకున్నాడు క్రిష్ణచైతన్య.

సూర్యుడు, ఆకాశపు పొట్టకి కరుచుకుని కసిగా పైకి యెగబ్రాకుతున్నాడు. లుంగీలు పైకిమడిచి యెవరో యిద్దరు, కడవలతో నీళ్ళు పోస్తున్నారు కూరగాయల మళ్ళకి. యెంకెవరో పూలు తుంచుతున్నారు. మామిడి తోటకి ఆవల యెవరో పుల్లలు యేరుతున్నారు.

ఇవన్నీ అతనిని తాకలేకపోతున్నాయి. గాలి, అతని శరీరాన్ని చలింపజెయ్యలేక పోతున్నది. యెండ అతనిని కాల్చలేక పోతున్నది. పూవుల కదంబ పరిమళం మత్తుగా సాంద్రంగా ఆవరించినా, అతనిని

అతని యింద్రియాలకీ, బాహ్యజగతుకీ మధ్య లంకె తెగిపోయింది. యింద్రియాలు అంతర్ముఖమైపోయాయి. పద్మాసనంలోకి మలుచుకున్న అతని అవయవాలలో, శ్వాస తీక్షణంగా ప్రసరిస్తోంది ప్రాణాయామంలో అతని శరీరం వుత్తేజితమవుతోంది. ప్రత్యాహారతిని సాధించి ధారణ సాగిస్తున్న దశ.

ఇరవై నెలలుగా అతను చేసిన సాధనవల్ల ఇంద్రియాలకీ, చుట్టూ వున్న వస్తువులకీ మధ్య బంధం తెంచగలిగాడు. మనసును భృకుటిలో మరీ ఏకాగ్వేషణ

కేంద్రించటానికి ప్రయత్నిస్తున్నాడు. కానీ—

లోతుగా లోలోతుగా, వృవ్యేత్తున ఆకాశమంతగా, ఆకాశంపైన ఆకాశాల దొంతర్లదాకా విస్తరించుకుంటున్న మనసులో—

చౌరంఘీలో గ్రాండ్ హోటల్ ప్రక్కగా సినిమా మొదలటం కోసం యెదురుచూస్తూ రంగుల తీపి వస్తువులు తింటున్న సూట్లు, ఫోవతులు చీరలు ఫ్రాక్లు. పొగలు విడుస్తున్న పైపులు చుట్టలు, సిగరెట్లు. సన్నటి పొడుగాటి వేళ్ళమధ్య చిత్ర విన్యాసాలు చేస్తున్న చే సంచులు. అర్ధ చంద్రాకారంలో విప్పుకున్న తెల్లని పచ్చని పీపులు-మురికి సందుల మాసిన భవంతులకి ప్రక్కగా గంగానదిలో పిండుతున్న మురికి బట్టలు-నీలం ఆకాశపు ఛాతీమీద ఆనాలని పైకి లేచిన డార్జిలింగ్ మంచు శిఖరాలు—కాశ్మీర్ లోయలో చలికి వొణికి రాలిన యాపిలుపండు-రైలు తాకిడికి వొణికిన తాంబరం వొంతెన—చార్మినార్ ప్రక్కన పూగిన యెర్రటోపీకుచ్చు—కాళీఘాట్ లో భద్రరూపం దాల్చిన జగజ్జనని—అతని అస్తిత్వాన్ని తన కనులలో కేంద్రించిన గీత— యెన్నో ఎందరో—

అతనికి ధారణ సాధ్యమవటంలేదు.

కనురెప్పలు తెరిచి—నీటిలో మునిగి, యీది— తువ్వాలుతో తుడుచుకుని మొలకిచుట్టుకున్న పంచె పిండుకుని ఆశ్రమంలోనికి నడక సాగించటం.

భారతీయ తత్వశాస్త్రంలో తన పరిశోధనకి సంబంధించి కొన్ని ప్రయోగాలు చెయ్యాల్సిన అవసరం వుందనీ, అందుకోసం రెండు సంవత్సరాలు సెలవు కావాలని రాసి మంజూరు చేయించుకున్నాడు. మనుషక్తోకి పట్టణాల్లోకి వెళ్లాలంటే అయిష్టం. కళాశాలలో వుపన్యాసాలివ్వబుద్ధి కావటంలేదు. కార్లు బస్సులు సినిమాలు జనం రద్దీ - యివన్నీ అయిష్టంగా అనిపిస్తున్నాయి. యిక్కడ ఆశ్రమంలో ప్రశాంతి కోసం ప్రయత్నిస్తున్నాడు. పూర్వస్మృతులు పూర్తిగా చెరిగిపోవటంలేదు. బాహ్యా[illegible]త్తు అతనిని తాకకుండా చూసుకో గలుగుతున్నాడు కానీ, తనలో, తన మనసులో తిష్టవేసిన బాహ్య జగత్తు అధిగమించలేకపోతున్నాడు. యింక ధారణ సాధ్యమైతే; ఆ పైన ధ్యానసమాధులు సులభమేనన్న మరీచికాన్వేషణ

అభిప్రాయం. అకుంఠిత దీక్షతో సాధన చేస్తున్నాడు.

సాయంకాలాలు స్వామీజీతో చర్చ సాగించేప్పుడు యెన్నెన్నో సంశయాలు. చదువుతున్నప్పుడు, వుపన్యసించినప్పుడు, పరిశోధన గ్రంథాలు రాసినప్పుడు యిలాంటి సంశయాలింతగా వుత్పన్నించలేదు. లోతులు తరచిచూస్తున్న కొద్దీ సంశయాలు. వొడ్డున కూచున్నవాడికి—యేదైనా వుంది—అనుకుంటే వుంది; లేదు—అనుకుంటే లేదు.

స్వామీజీకి క్రిష్ణచైతన్య పట్ల వొక ప్రత్యేక వైఖరి. మొదట్లో, అతను వెళ్ళినప్పుడు అక్కడే వుండిపోదలచినట్లు చెబితే అయిష్టం తెలియ జేశాడు.

స్వామీజీ పేరు నిఖిలానందస్వామి విదేశ పర్యటనలు చెయ్యలేదు. భారతదేశంలోని పుణ్యక్షేత్రాలు మాత్రం దర్శిస్తుంటాడు. ప్రత్యేక సందర్భాలలో. మిగతా కాలం అంతా తన ఆశ్రమంలోనే గడుపుతాడు. శిష్యులకు, దర్శనార్థం వొచ్చిన భక్తులకు జ్ఞానబోధ చేస్తుంటాడు. చుట్టు ప్రక్కల పట్టణాలలో ధనికులు కొందరు ఆయనమీద గురి కుదిరి భూములు, డబ్బు తదితర సహాయం చేశారు. దానితో ఆశ్రమాన్ని బాగా విస్తృతం చేశాడు. కొన్ని ప్రత్యేక సందర్భాలలో పామర జనం తండోప తండాలుగా వొస్తుంటారు; దర్శనార్థం. నయంకాని మొండివ్యాధులు ఆయ నని దర్శిస్తే నయమవుతాయని గట్టినమ్మిక వాళ్ళకి.

క్రిష్ణచైతన్య విశ్వవిద్యాలయంలో తత్వశాస్త్రం బోధిస్తాడనీ, విదేశాలలో పరిశోధనలు చేశాడనీ తెలిసి కొంత అయిష్ట పడ్డాడు, అలాంటి వాతావరణంలో పొందిన విజ్ఞానం పెడదారి పట్టిస్తుందనీ, వుపయోగ పడదనీ స్వామీజీ అభిప్రాయం. వూహ తెలిసినప్పటినుంచీ దివ్యతమీద నమ్మకం వుందనీ అందుకు ప్రత్యక్ష దర్శనం అభిలషిస్తున్నట్లూ చెబితే; "సరే" అన్నట్లు తల వూపాడు స్వామీజీ. రోజులు గడిచిన కొద్దీ క్రిష్ణ చైతన్యతో చర్చ సాగించటం స్వామీజీకి ఆసక్తిగా అనిపించసాగింది. క్రిష్ణచైతన్య సంస్కృతంలో కొన్ని మూల గ్రంథాలూ లిఖిత ప్రతులూ మధించిన వాడని తెలిశాక అతనిపైన కొంత గౌరవం లాంటిదికూడా యేర్పడింది. స్వామీజీ, తను చదివినన్ని గ్రంథాలు చదవలేదని కొద్ది

నెలలలోనే తెలుసుకున్నాడు క్రిష్ణచైతన్య. ఐతే ఆ విషయం స్వామీజీకి తెలిసేలాగా ప్రవర్తించలేదు. స్వామీజీలోని చిత్తశుద్ధి, ఆత్మ వికాసం క్రిష్ణచైతన్యను ఆకర్షించాయి. ముఖంలో యేదో కాంతి, తేజసు కనిపించాయి.

కూచుని - మామూలు కబుర్ల నుంచి మళ్ళీ - ప్రశ్నోత్తరాల దొంతరలు - దేవుడు, ఆత్మ, శరీరం, స్థూల సూక్ష్మ జగత్తులు, వేదాల జ్ఞానాలను, ఉపనిషత్తుల వైవిధ్యం, క్షణికత, అసత్సత్ కార్యాలు పురుష ప్రకృతుల కలబడిన చమత్కారపు తీరు, దేవుణ్ణి గురించి నైయ్యాయికుల భోగట్టా, బుద్ధ పథం, సుగుణ నిర్గుణ సత్యాలు, అహపు బెండ మానవులు - వాటితోపాటు అతని మనసులో కదిలే జీనో, స్పినోజా, కాన్ట్ యెందరో, యెన్నో -

స్వామీజీ చెప్పే సమాధానాల అతనికి పూర్తి సంతృప్తి నివ్వటం లేదు. అవి ప్రశ్నించని వారికి పనికొచ్చే సమాధానాలు. తనలో తనకి చిక్కాలి కానీ యితరులు యిచ్చి సంతృప్తిపరచేందు కవకాశం లేదేమో,

- శివం ఐన దేవుడు సృష్టికర్త ఐతే లోకంలో యీ బాధ, అన్యాయం, మోసం యివన్నీ యెలా చొరబడినట్లు? కార్య కారణ సంబంధాన్ని జననమరణాల చివర్లకి నెడితే, కర్మ సిద్ధాంతం చేసిందానికి అనుభవించక తప్పదు. అది కొండవీటి చాంతాడు. వ్యక్తి బాధ్యతను వొత్తి చెప్పటం వరకూ గొప్ప విషయమేగానీ - దేనికీ అంటని యీ పాదరసపు ఆత్మ వెధవ శరీరానికి యెందుకు అతుక్కోవాల్సొచ్చిందసలు? అతకలేదు - అతకదు. అలా అనిపించటం వొట్టి భ్రమ. అసలు, నీ - నా ఆత్మలంటూ లేవు ఆ మాటకొస్తే అసలు సృష్టి అనేదే వొక బూటకం, మాయ అని అద్వైతించినా; పురుష సాన్నిధ్య మాత్రంగ ప్రకృతి యీ నవాలక్షలాయి వేషాలు వేస్తుందని సాంఖ్యం అన్నా, ఆత్మని కరిగించి క్షణికాల అనాంత్మపు చంద్రహారంలా బౌద్ధం పలికినా - యేది యెలా అయినా, యీ బాధ అనేది తొలిసారిగా యెలా వొచ్చిందని? దేవగణం కూడా జగత్పుటుక తరవాతనే ప్రాణవాయువు లాడించకుంట - అని వేదం పలుకుతోంది. తృష్ణ కారణంగా మానసం వెల్లివిరిసిందని వేదం అన్నంత

మరీచికాన్వేషణ

మాత్రాన అది అన్ని ప్రశ్నలకి సమాధానం కాలేదు. అసలు ఆ తప్పకి పూచీ యెవరు? యేమైనా, మానవుడు మాత్రం బాధ్యుడుకాడు. అదేదో; స్వతహా జగత్స్వభావం అనండి, మాయ అనండి, మరేమైనా అనండి— కానీ, యీ రక్తమాంసాల మనిషి మాత్రం బాధ్యుడుకాడు — మానవుడు స్కేప్ గోట్ అయ్యాడు. మానవుడు తిరగబడాలి. తన కథ తిరగ రాసుకోవాలి. కానీ లోనకి దిగినకొద్దీ అనుకున్నంత స్పష్టంగా కనిపించదు — యేదో అంతుచిక్కని అట్టడుగు తగిలినట్లు అవుతుంది. ఆ అట్టడుగు యేమిటా అని దిగినకొద్దీ తను తనకి చిక్కకుండా పోతాడు. యింద్రియ శక్తికి యేదో ఆలంబన వున్నట్లనిపిస్తుంది. అతీంద్రియతను కాదనటానికి సికార్సయిన కారణం కనపడదు—అవును, తను ధారణ సాధించి ధ్యాన సమాధుల్లోకి చేరుకుంటున్నట్లుగా అనిపించిన దశలో యేమిటి జరిగింది? తను యేమైపోతున్నట్లు? తనే లేకపోయాక తనని గురించిన పరాజ్ఞానం యెవరికి తెలుస్తుంది? వ్యక్తిగా యెవరికీ తెలియనిది జ్ఞానం యెలా అవుతుంది? తను—అని అనుకున్నంత దాకా జ్ఞానంలేదుట. మరి, తను—అనేది పోయాక జ్ఞానం అనేదానికి అర్థం యేముంటుందో! అది పొటాసియం సైనైడ్ రుచి తెలుసుకోవటం లాంటిది లాగా వుంది. రుచితెలిస్తే మనిషి వుండడు. మనిషి వుండకపోతే రుచి తెలియదు. యిలాంటిదే యేదో సార్త్రి వివరించాడట—కానీ—నందివర్ధనం పువ్వు విశాలంగా సువిశాలంగా, విస్తరించుకుని విస్తరించుకుని— ఆకాశం అంతగా అయి, అంతటా అం తెల్లని చల్లని నందువర్ధనం కాంతిలో, సెగలేని జ్వాలలో—యేదో మ తర అనుభూతి

యింజను బెంగుళూరు సిటీ స్టేషన్లో చొరబడి—డీజెలింజన్లని చూస్తే అవమాన మనిపించింది గావును; బిగుసుకుపోయింది.

పెట్టెలోకి చొరబడి తోలుపెట్టె, మెనపు పరుపుచుట్టా చేతపుచ్చుకుని హడావిడిగా దిగిపోయాడు కూలీ. లేచి త్వరగా అడుగులు వెయ్యక తప్పలేదు క్రిష్ణచైతన్యకి.

* * *

పదిరోజులు గడిచాయి.

మరీచికాన్వేషణ

పగలూ, రాత్రీ నిద్రపోవటం, సాయంత్రాలు స్నానించి గది బయట కుర్చీలో కూచుని లోకాన్ని పరికించటం. అప్పుడప్పుడూ అలా బయటికి వెళ్ళి బజార్ల వెంట తిరిగి — కాళ్ళు నొప్పులనిపించితే, టాక్సీలో వొచ్చేసెయ్యటం హోటేలు గది జీవితం విసుగ్గా అనిపిస్తోంది క్రిష్ణచైతన్యకి. వొకసారి జయాకర్ కలిసి, తన కాడలో తను పనిచేసే సంస్థకి తీసుకు వెళ్ళాడు. కాసేపు బార్‌లో కబుర్లు. మద్యం వేసుకోమని అతను బలవంతం చేసినా క్రిష్ణచైతన్య పుచ్చుకోలేదు. అతను వొంటరిగా, తన సంస్థ యిచ్చిన క్వార్టర్లో వుంటాడు. అవివాహితుడు. వొకటి రెండుసార్లు క్రిష్ణచైతన్య గదికి వొచ్చి తీసుకువెళ్ళాడు క్లబ్బులకి,

స్వామీజీకి కృతజ్ఞతలు తెలుపుతూ వుత్తరం రాయటం భావ్యం అనిపించిరాస్తే, జవాబుతో పాటు వున్సాల్మనియా విశ్వవిద్యాలయం రిజిస్ట్రారు రాసిన వుత్తరం కూడా వొచ్చింది. రెండేళ్ళు సెలవు ఐపోయింది. వొచ్చి చేరనూలేదు. మరోవిధమైన వర్తమానమూలేదు—నోట్ పుటప్ చెయ్యాల్సి వొస్తుందని వెంటనే ఐనంతవరకూ పరిశోధన కాగితాలు పంపించి, త్వరగా వొచ్చి చేరటం మంచిదని రాశాడు. సెలవు ఐపోయి యిప్పటికే యిరవై రోజులైంది వెంటనే వెళ్ళాలని లేదు. అసలు వెళ్ళాలా వొద్దా అనేమాట అటుంచి, యేంచెయ్యాలో కూడా ఆలోచించుకోలేక పోతున్నాడు, యేది చెయ్యటానికీ చెయ్యకపోవటానికీ అర్థం కనపడదు. జీవితాన్ని తిరగా బోర్లావేసి, యెడా పెడా నిర్లక్ష్యంగా, అనాలంబనగా గడిపెయ్యాలని లోలోన కాంక్ష.

అకస్మాత్తుగా వో సాయంత్రంవేళ కూచుని, ఆశ్రమంలో రాసిన కాగితాలన్నీ క్రమంలో పెట్టి రిజిస్ట్రారుకి పంపించాడు. ఆశ్రమంలో టైపు చేయించే వీలులేదనీ, తననే టైపు చేయించమని రాశాడు, "ది యింపోసిబిలిటీ ఆఫ్ మెటాఫిజిక్స్ అండ్ ది పోసిబిలిటీ ఆఫ్ ది మెటాఫిజికల్—" అని శీర్షిక పెట్టాడు. యీ పరిశోధనకి సంబంధించి యెక్కడెక్కడో చాలా నిగూఢ ప్రదేశాలు తిరగాల్సి వుందనీ ప్రయోగ పరిశోధన అవసరం అనీ, సెలవు మంజూరు చెయ్యటానికి వీలుకాని పక్షంలో రాజీనామాకింద వ్యవహరించవొచ్చనీ రాశాడు.

ప్రక్కగదిలో వున్న వ్యక్తి కారణంగా బెంగుళూరుకీ, అతనికీ సంబంధం ఏర్పడింది.

సాయంత్రం వేళలు గది బయట నడవలో కూచుని కింద గదులలో వాళ్ళు, పచ్చికలో కుర్చీలు వేసుకుని రంగుసీళ్ళు కాఫీ టీలు తాగటాలు హడావిడిగా మెట్లు ఎక్కే వ్యక్తుల పాదరక్షల చప్పుళ్ళతో, టకటకలతో, పకపకలతో తొందరలతో గజిబిజితో తిరగటాలు గమనిస్తూ వుండిపోయే అతనికి ప్రక్కగది ఆసక్తి కలిగించింది.

రకరకాల వ్యక్తులు ఆ గదికి రావటమూ—పోవటమూ—మార్వాడీ టోపీ ధోవతి చొక్కా పాత వాదులు కోటు వేసుకుని వొక వ్యక్తి యెవరెవరితోనో రావటమూ, బయట నిలబెట్టి మాట్లాడటమూ—అతని ఆసక్తికి కారణాలు.

వో సాయంత్రం గదిముందు నడవలో కూచుని—కింద పచ్చికలో టీ, కాఫీలు తాగుతున్న వాళ్ళనూ, నీలం బట్టలువేసుకుని బంతితో ఆడుకుంటున్న నాలుగేళ్ళ పిల్లల్నీ చూస్తూ వుండగా, ప్రక్క గదిలోంచి మార్వాడి టోపీ వ్యక్తి అతని వెనక అనె—

మద్రికాయల్లా చెవులకి అతికిన యెర్రరంగు వొంటిరాయి దుద్దులు, కుడిచేతికి నీలంరంగు నైలాన్ పట్టీకి బిగించిన పలకల చేగడియారం, రెండోచేతికి కడియం ఆకారంలో కూర్చిన తెల్లపూసలగాజు, గుమ్మటంలా తిరిగిన దుమ్ముఠంగు జుట్టు, కనురెప్పలమీద నీలంపూత, పాదాలకి ములుకు మడమల తెల్లరంగు బూట్లు, మోచేతి వొంపు దగ్గిరినుంచి వేళ్ళదే చేసంచి వెదురు బద్దల రూపంలో పోతపోసిన ప్లాస్టిక్‌ది, పెదవులకి లేత ఎరుపురంగుపూత—ఎత్తులూ పల్లాలూ వొంపులూ స్పష్టంగా తెలిసే పచ్చరంగు ఫ్రాకు—

ఓరగా చూసి, దృష్టి కిందకి మరల్చి—"తనది తలుపుసందు నీతి కాటోలు"—అనుకున్నాడు.

గుడ్‌మార్నింగ్ — అంటూ అతని పక్కగా నడిచి వెళ్ళిపోయింది. అతను మారుపలకటం ఆమె బూట్ల టకటకలో కలిసిపోయింది.

మరో అరగంటకి తిరిగి వొచ్చింది. కూడా, టోపీ వ్యక్తిలేడు.

కావేషణ

అతని ముందుగా నడిచి వెళుతూ, "మీరు యీ నదిలో వుంటున్నట్లు న్నారు!" అంది.

"అవును" అన్నాడు తల యెత్తి ఆమెకేసి చూసి

రెండు మాటల అర్థోక్తితో అతని వివరం అడిగింది, మర్యాద కోసం అన్నట్లుగా.

చెప్పాడు రెండు ముక్కల్లో.

"రండి, కాఫీ తీసుకుందాం—మీకు అభ్యంతరం లేకపోతే—" అని ముందుకు అడుగులువేసి తాళంతీసి తలుపు తెరిచి, చిరునవ్వుతో తన ఆహ్వానాన్ని సూచించింది. క్రిష్ణచైతన్య, లేచి గుమ్మంలోకి అడుగులు వేశాడు.

పంకావేసి, పేముకుర్చీలు సరిగా జరిపి—కూర్చోమంది.

కుర్రాడు కాఫీ తీసుకొచ్చాడు. మరొకటి అని చెప్పి ఆ కప్పు క్రిష్ణ చైతన్య ముందుకు నెట్టి – బల్ల సొరుగులోంచి బిస్కట్ల పొట్లం తీసుకుని వొచ్చి కూచుంది, అతనికి యెదురుగా కుర్చీలో.

"నాపేరు అసీతాస్టెల్లా" అంది, పొట్లం చించుతూ అతనివైపు చూస్తూ.

ఆమె మీదకి దృష్టిమరల్చి, "యిక్కడ చాలా రోజులుగా వుంటు న్నారా?" అన్నాడు

గౌను దిగువఅంచు మోకాళ్ళ కిందకి జారలాక్కుంటూ "అవును" అంది.

కుర్రాడు మరో కాఫీ తీసుకొచ్చాడు. రూపాయి కాగితం యిచ్చి సిగరెట్ పెట్టె తీసుకురమ్మని చెప్పింది.

కొన్ని బిస్కట్లు ఫెమినా పత్రికమీద పోసి, "తీసుకోండి" అంది.

కాఫీ ముగించారు. అతను మౌనంగా వుండిపోయాడు. ఆమె యీవ్స్ వీక్లీ పేజీలు తిప్పుతూ వుండిపోయింది.

కుర్రాడు సిగరెట్ పెట్టె తెచ్చి, అవతలి బల్లమీది అగ్గిపెట్టె తీసి యిచ్చి ఖాళీ కప్పులు తీసుకు వెళ్ళిపోయాడు

తగరం చించి చెయ్యి ముందుకు చాపి "తీసుకోండి" అంది.

మరీచికాన్వేషణ

"నాకు అలవాటు లేదు. మీరు కానివ్వండి" అన్నాడు.

"నో. అలాగా-సారీ, నాకూ అలవాటు లేదు. కాల్చేవాళ్ల సరదా కోసం మాత్రమే కాలుస్తాను" అంది.

"సరూ—" అన్నాడు, ఏమంటుందో నన్న ఆసక్తితో.

"నేనూ—నేను యేం చేస్తుంటానని కదూ మీ వుద్దేశం—యితరులకి కావలసింది యిచ్చి, నాక్కావలసింది తీసుకుంటాను. యాచించను—దోచుకోను." అని అతని ముఖంలోకి చూసి పల్చగా నవ్వింది.

"బెంగుళూరు వాతావరణం బావుంటుంది" అన్నాడు.

"అవును బావుంటుంది. మీరు కొత్తగా వొచ్చినట్టున్నారు ఇక్కడికి. నేను ఇక్కడ చాలా నెలలుగా వుంటున్నాను. మరో ఐదారు నెలలు వుంటాను" అంది

"ఆ తరవాత వెళ్ళిపోతారా?" అన్నాడు.

"ఆహా-యెల్లకాలం వొక్కచోటే వుండిపోతే మట్టిగొట్టుకు పోవటమే" అని క్షణకాలం ఆగి, "మీకు పరిచయం లేనట్లుంది" అంది.

"యేమిటి పరిచయం?"

"యేం పరిచయ మంటున్నారా—నేను మీరిక్కడికి వొచ్చినప్పటి నుంచీ గమనిస్తున్నాను, పైలోకమే మీది మీకు నాలాంటివాళ్ళు తెలియరు కదూ!" అంది.

"ఆంగ్లో యిండియ నమ్మాయిలు కొందరు తెలుసు."

"వాళ్ల మాటకాదు. నాలాంటివాళ్ళమాట" అని ముందుకు వొంగి, కాలుమీద కాలువేసుకుని మోకాళ్ళచుట్టూ చేతులు బిగించింది. స్తనాలు సగంమేర బయటికి కనిపిస్తున్నాయి.

"తెలియదనే చెప్పాలి" అన్నాడు.

"యీవూరు బావుంది. కిటప్ప మంచివాడు అందుకని మరి కొన్ని నెలలు వుండి, మీ హైదరాబాద్ వెళ్తాను. నాది అసలు మద్రాసు." అని ఆగి, "మీరు చాలా రోజులు వుంటారా యిక్కడ?" అంది

"రూఢిగా తెలియదు. మరీ యెక్కువ రోజులు వుండకపోవొచ్చు." అని ఆమెవంక చూసి, "మరి వొస్తానూ—" అని లేవబోయాడు

మరీ ఇ కాన్వేషణ

"మీరు భయపడనవసరం లేదు" అని, అతని చేతిమీద అరచెయ్యి వేసి "నేను మంచిదాన్ని కాదు—అంచేత మీకు కొత్తగా ప్రమాదంలేదు" అంటూ సన్నగా నవ్వి, లేచి నిలబడింది.

ఆహ్వానించి కాఫీ యిచ్చినందుకు కృతజ్ఞతలు చెప్పి వొచ్చేశాడు.

మరుసటిరోజు సాయంత్రం, సంపాదించుకునే దానికి పనికిరాని పోవటం దేనికనిపించింది—తన గదిలోకి టీకి ఆహ్వానించాడు. కాసేపు మాట్లాడి వెడుతూ కరచాలనంచేసి, అతని చేతిమీద సుస్మితంగా పెదవులు అద్ది, "విష్ యు స్వీట్ డ్రీమ్స్" అని నవ్వుకుంటూ వెళ్ళిపోయింది. ఆమెని చూస్తే అతనికి సరదా, ముచ్చటలా, వొకరకం యేవగింపూ

ఆ తరవాత ఐదారు రోజులు ఆమెను చూడటం జరగలేదు. మూడు రోజులు మైసూరు వెళ్ళి వొచ్చాడు జయాకర్‌తో. జయాకర్ యీ కొద్ది రోజులలో బాగా సన్నిహితుడయ్యాడు ఐనా వొకరకంగా దూరమే. తనకి వ్యక్తిగత విషయాలు యెవరికీ చెప్పుకునే అలవాటు లేదు. జయాకర్‌కి వుద్యోగం పని అయిపోయాక వ్యాపకం—క్లబ్బులు, తాగుడు, వేశ్యలూ మాత్రమే నన్నట్లనిపించింది క్రిష్ణచైతన్యకి. సంపాదించిన శాస్త్ర జ్ఞానాన్ని అభివృద్ధి చేసుకోవాలనే కాంక్ష కనపడదు. ఆ వున్న పరిజ్ఞానం సంస్థ వుద్యోగానికి చాలు.

అతని బలవంతంమీద వొకటిరెండుసార్లు కొద్దిగా మద్యం పుచ్చుకున్నాడు క్రిష్ణచైతన్య. "విదేశాలుకూడా తిరిగి వొచ్చారు. అలవాటు లేదంటే సిగ్గుచేటు." అని అతను అంటే "అడవిజాతి వాళ్లని చూసినంత మాత్రాన ఆ అలవాట్లు మనంచేసుకోనక్కరలేదు. మరోజాతి సంస్కృతిని పరిశీలించినంత మాత్రాన ఆ లక్షణాలు మనం అలవరుచుకో నక్కరలేదు— మనలో యిమడదగినవి వుంటే తప్ప. యెప్పుడైనా అవసరం అయితే సహపంక్తిగా వొక గుక్క—వేస్తాను అసలు, నాకు యీ రుచీ వాసనా నచ్చదు" అన్నాడు క్రిష్ణచైతన్య "యిది దేవతలదీ, వాళ్ళ వారసులం అయిన భారతీయులదీనిట— పుచ్చుకోకపోతే మన సంస్కృతిని మంటగలిపిన వాళ్ళ మవుతామయ్యా స్వామీ" అని బలవంతంచేస్తే కాసింత పుచ్చుకోవటం వొకరకంగా అతనంటే క్రిష్ణచైతన్యకి అయిష్టం. యీ నగరంలో

మరీచికాన్వేషణ

తెలిసిన వ్యక్తి అతనొక్కడే. కాగా అతనే తన దగ్గిరికి వొచ్చి తీసుక పోతూ వుండటంచేత కాలక్షేపంగా అనిపించటమూ. అసలు కారణం, తన మనసు దేనికీ అతక్కపోవటం. మాధురి స్మృతి, అతని మనసును సుడి గాలిలా చుట్టేస్తుంది. అప్పుడప్పుడూ, ఆమెపైన నిర్దుష్టంగా కారణాలు తెలి యని యేవగింపు, రోషంతోకూడిన తామసం. అంతర్యంలో యింకా లోలోన వుదరలాంటి గాఢానుభూతి. యేం, అనుభూతో, యెవరిగురించి నదో స్పష్టంగా ఆకళింపుకు రదు. వేశ్యల యిళ్ళకి రమ్మని జయాకర్ అంటే, తనకి అసహ్యమనీ రోత అనీ చెప్పాడు నీతి—అవినీతి ప్రసక్తి తెస్తే; అది అణా పైసలితో పొందగలిగేది కాదన్నాడు.

అన్నీ—తండ్రి రాసిన వుత్తరం మొదలుకుని అన్నీ, నీడలలా వెంటాడుతున్నాయి వయసు చిన్నదైతే సైన్యంలో చేరేపని అనీ. వయసు మరీ యెక్కువైతే, శాశ్వతంగా అలిసిపోయిన నరాలకింద కళ్లు మూసు కుని పడుకునే పని అనీ, మరికాస్త ధైర్యం వుంటే, ఆత్మహత్య చేసు కునే పని అనీ; ఆత్మహత్యకి కావలసింది ధైర్యమా అధైర్యమా అని, బుద్ధివుంటే కళ్లుమూసుకుని యెడాపెడా యేదొకటి సాగిపోవాలనీ—జయాకర్ జీవితంలో "లోతు" కనపడదు. లోతులేని జీవితం వ్యర్థం. లోతు, ఏమిటి లోతు తన జీవితం వ్యర్థం, అర్థరహితంకాక మరేమిటనీ—ఆలోచనలతో. తనలోనే తను. తనకి తను చిక్కనట్లుగా "పొదగటం" మాత్రమే చేస్తు న్నాడు.

* * *

సాయంత్రం జయాకర్ వొస్తే బయల్దేరి వెళ్ళి క్లబ్బులో అతని స్నేహితులతో బ్రిడ్జి ఆడి—పది గంటలవేళ భోజనంచేసి, పన్నెండు వరకూ బార్‌లో కూర్చుని పాశ్చాత్యగానపు పొలికేకలు వింటూ నాలు గుక్కలు మద్యం పుచ్చుగుని, జయాకర్‌ని వేశ్యలకి వొదిలేసి హోటేలుకి చేరుకున్నాడు. కొంచెం తూలుతూ తిమ్మిరిగా అనిపిస్తోంది. వొకసారికి మరోసారి పుచ్చుకుంటే ప్రభావం తగ్గాలిగానీ పెరగటం యేమిటి— బ్రాందీలో గుడుంబా కలిపివుండాల ఆ స్కౌండ్రల్ జయాకర్—కర్— కిర్—కర్ అని నవ్వుకుంటూ బట్టలు విప్పి అవతల విసిగాడు బ్రాందీలో మరీచికాన్వేషణ

విస్కీ, రమ్ కలిపి రవ్వంత సిగరెట్ నుసి రాల్చి యిచ్చినట్లు క్రిష్ణచైతన్యకి తెలియదు. లుంగీ చుట్టుకుని బొమ్మల పాతపత్రిక పేజీలు తిరగేసి—అవతలికి విసిరి, దీపం తీసేసి, కళ్లుమూసుకు పడుకున్నాడు.

నంగనాచిలా తిరిగే భూమి కొంచెం పోకిరిగా తిరుగుతున్నట్లుంది—అతని తల తిరుగుతోంది. భూగోళం లోపల పలకల మంచం గుండ్రంగా ఐపోతోంది. కళ్లు విప్పాడు- అన్నీ, యేమీ యెరగనట్లు నిలిచిపోయాయి.

—పదహారేళ్ళ అమ్మాయి చూపుల్లా పుస్తకం ముందేసుక్కూచున్న ఒడిపిల్లాడిలా యివి తమాషా పోతున్నాయి-మళ్ళీ రెప్పలు వాల్చితే— యిష్. అల్లీబిల్లి-లిల్లీ లిల్లీకాదు. స్టెల్లా—ల్లా—సుద్దముక్క- అవయవాల్లామారి—తమాషా—చక్కగా ముద్దుగా-యేమిటి. ఆ కొవ్వొత్తి-మంట కిలేవటంబోయి లోనకిచొరబడి- వోహ్ తెల్లని మైనపొత్తి యెర్ర నియాన్ సైన్‌లా ప్రజ్వరిల్లుతోంది—బుద్ధిలేనితనం వృత్తబుద్ధి లేనితనం—అర్థంలేని జీవితాన్ని అర్థంలేని పనులతో తిరగబొయ్యాలి-విషానికి విషమే, విషాదానికి విషాదమే, షమే, దమే విరుగుడు-గరళ ప్రయోగం ప్రాణం పోస్తుంది-అవునుకదయ్యా వైద్యరాజ భిషక్కూ—అవును అవును అను, అవును అను, అవును నూ—

కళ్లమూసుకునే లేచి మంచంమీద కూర్చున్నాడు క్షణకాలం తల గుండ్రంగా వూపి—లేచి నిలబడి. చీకటిలోనే గది బయటికి నడిచి ప్రక్క గది తలుపుమీద చెయ్యి వేశాడు. వోరగా లాగి వున్న తలుపు తెరుచుకుంది.

నకురిసి కురిసి—వొట్టిపోయిజాలిగా వొణుకుతూ చల్లగాలిగుసుకుపోయింది. చలి చుట్టుకుని చుట్టుకుని గడ్డగట్టిపోయి—వొత్తిడికి తట్టుకోలేక పెటేలుమని చిట్లిపోయింది. యెండ మండి మండి—వేడికి భీతిచెంది భోరున కన్నీరు కార్చింది. మూడు మలుపులూ తిరిగి—మళ్ళీ మొదటి మలుపులోంచి, వర్షానికి తడుస్తూ జారుతున్న టాక్సీ ఆపి, దిగి గాజు తలుపు తోసుగుని "నైట్ త్రూ బ్లాక్ అన్డ్ వైట్ బై క్లారా" నీడలలోకి

మరీచికాన్వేషణ

వొచ్చి కూచున్నాడు క్రిష్ణచైతన్య.

జాజ్ సంగీతంతో హాలు దిమ్మెత్తి పోతోంది.

అంతలో రంగస్థలం తెగతొలిగి—మేనేజర్ మైథేల్, కార్యక్రమ వివరణ, క్లారా ప్రాముఖ్యం, ప్రావీణ్యం గురించి చెప్పి. ప్రక్కకి తప్పు కున్నాడు రంగస్థలం చీకటిగా ఐపోయింది.

చీకట్లో బొట్టిసెల్లి చిత్రించిన "ది బర్త్ ఆఫ్ వీనస్" రీతిలో క్లారా అవతరించింది. వొంటిమీద దుస్తులు వున్నదీ లేనిదీ ఆకళింపుకు రావటం సులభం కాదెవరికీ. ఎత్తుపల్లాల వొంపుల ఆకారం—తెల్ల తైల వర్ణం పులిమినట్లుగా వొళ్ళు. వొంట్లో తెల్లని బల్బు వెలిగించి నట్టుగా ఆకారం మెరుస్తోంది రంగస్థలం పై మూల భాగంలో దీపాలు నైపుణ్యంగా అమర్చిన కారణంగానని స్ఫురించకుండా అవయవాల విరుపులు. జార విడిచిన జుట్టు వొంటిమీద నల్లని చారికలా కదిలి చీకటిలో కలిసిపోతోంది. తోడులేని ఓ వ్యక్తుడాన్ను. అమావాస్య రాత్రి తళుక్కుమన్న మెరుపుతీగ, మనిషి ఐపోయి, లెక్క ప్రకారం వొళ్లు చేస్తే యిలా వుండునని పిస్తోంది. సౌదామినిలోని జీవకళ వుందాలేదా అనేది స్ఫురణకి రానివ్వని సంరంభం లాంటి హోరు.

క్లారినెట్, గొంతు బిగించి "శృతి" పెంచింది. ట్రంపెట్, గుండెనంతా గొంతు చేసుకుని ఘీంకరిస్తోంది. అంతలో అంతటా దీపాలు మణిగిపోయాయి.

ఆర్తనాదం; కేకలు అరుపులు, కొయ్యసామాగ్రి విరిగిన చప్పుడు—అంతలో, దీపాలు వెలిగాయి. అందరూ అంతటా చూసుకున్నారు. కాళ్ళ తొక్కిడి తప్ప ఎవరికీ దెబ్బలు తగలలేదు. టెలిఫోను మోతలు—అందరూ రంగస్థలం ప్రక్కకి పరుగులిడుతున్నారు క్లారా కనిపించటం లేదట.

పోలీసు విజిల్లు. బూట్లటకటకలు అరుపులు—గలభాగలభాగా వుంది. హాల్లో జనం పల్చబడ్డారు. యీ పోలీసు వెధవల దృష్టిలోకి వొస్తే రేపు కోర్టులో సాక్ష్యం ఇవ్వటానికి రమ్మని పేరు రాసుకునేడుస్తారు. చల్లగా జారుకుంటే మేలు—అనుకుని ప్రక్క హాలులోకి వొచ్చాడు క్రిష్ణచైతన్య.

మద్యం సీసాల కౌంటర్ దగ్గిర కౌంటరు మీద మోచెయ్యి ఆన్చి.

వొంటికాలుమీద బరువుమోపి, రెండోపాదం నేలమీద రవ్వంత పైకి యెత్తి బొటనవేలు నేలకిపోటీ పెట్టి, గ్లాసు చేత్తో పట్టుకుని, తేలుతున్న మంచుగడ్డను పెదవులకు ఆనేలా కదుపుతోంది రమణి.

"హలో డియర్. యేంటా గలభా, క్లారా బట్టలేసుకుగానీ స్టేజీ మీదకి రాలేదు కదా!" అని పకపకా నవ్వింది. పొడవు పవిట జారి నేల మీదకి పడింది

పవిటకేసి చేత్తో చూపెడుతూ, "ప్లీజ్" అంది, తీసి యిమ్మన్నట్లుగా.

ప్రక్కగా వెడుతూన్న క్రిష్ణచైతన్య ఆగి—వొంగి, పవిట అందుకున్నాడు.

"యేం డియర్, పోదామా ?" అంది.

"నడవగలవనే! యీ సంచీని భుజాన వేసుకు పొమ్మనా ? వస్తా" అంటూ పవిట ఆమె ముఖంమీదకి విసిరి, హాలు బయటికి అడుగులు వేశాడు.

"నేను సంచినా! నీపొగరు అణుస్తాను, యెప్పుడో చేతికి చిక్కితే" అని అనటం క్రిష్ణచైతన్యకి వినిపించలేదు.

—క్లారాని నిజంగా యెవరన్నా యెత్తుకుపోయినట్లా ? లేక రద్దీ పెరగటానికి ఆడుతున్న నాటకమా? యీ మైఖేల్ క్లారాని పట్టుకొచ్చి నెల రోజులు కాలేదింకా. మొత్తం పది ప్రదర్శనలు, యీ ప్రదర్శనలు యిలాగే సాగితే బెంగుళూరు నగరానికి పిచ్చెక్కుతుంది—బంగళూర్, దక్షిణాది కాస్మొపొలిటన్ సిటీ—యీ నగరం తన మేనకోడలన్నట్లుగా వ్యవహరిస్తాడు కిటప్ప—ఆ వెధవ, కనిపించి వారంరోజు లౌతోంది. వెధవ, చేతలు తగ్గి మాటలు హెచ్చాయి. కనపడనీ కోటు తొలిగించి డొక్కలో పొడుస్తాను. కోటుపైనుంచి పొడిస్తే ఆ పొట్ట యెక్కడ వుంటుందో – చేతికి అందదు—వూచ వెధవ – యేమిటా గలభా స్తంభం అవతల – క్లబ్బులో గలభా—పడగ్గదుల్లో గలభా. వాన వెలిసిందేమో, యీ రోడ్డుమీద గలభా – యేమయ్యా ముసిలాయనా, ఆ కుర్రదాన్ని మెడ పట్టుకుని యెందుకలా తోస్తావు—ఆ యిద్దరాడాళ్ళూ, డాళ్ళూ డోళ్ళూ—యేం తల్లులూ ఆ బిక్క మొహాలు—యేమిటి, పొమ్మనా—యెక్కడికి పోతుందయ్యా యింత రాత్రి

వేళ కుర్రాడి—మెళ్ళో తాడుకూడా లేదు—యేమిటీ కడుపొచ్చిందా—వొస్తే యేం—ఆడదానికి కడుపు రాక మరేం వొస్తుంది—అసలు కడుపు రావటానికి కలియటం జరగాలనేమిటి—యే డాఫ్నియా లక్షణాలో ప్రబలంగావుండి దానంతటదే సంభవించగూడదా—వర్జిన్ మేరీ అంటారు గానీ యేదైవ మహిమా లేకుండానే జరిగి వుండొచ్చు—మరి యీ డాఫ్నియా యేం చేస్తుంది- సన్నగా, లేతగా నాజూగ్గా వుంది—నెలలు నిండితే లావవుతుంది కాబోలు—ఛా, ఘోరం. అసలు పిల్లల్ని కనేందుకు ఆడవాళ్ళని వుపయోగించకూడదు. కోళ్ళకి యేర్పాటు చేసినట్లు మనుషులకి- కూడా యేదో యేర్పాటు చెయ్యాలి. బ్రేవ్ న్యూవరల్డ్‌లో అలాంటిదే యేర్పాటైంది, కానీ ప్రపంచం యేకవుమ్మడిగా యింకా డ్రాగ్ నెయివ్ వరల్డులోనే వుంది. అందుకు మొదటి కారణం ఆల్డస్‌లాంటి వాళ్ళేనని అంటే యేమంటాడో. అన్నట్లు, యీ అమ్మాయి యేం చేస్తుందో! ఫ్రీడ్‌మన్ టెస్టు కూడా చేయించకుండానే గెంటేస్తున్నట్లున్నారు—ఆ ప్రియుడు యెలాగా చేసుకోడు మన సినిమాల్లో మాదిరిగా. మరి యేం చేస్తుందీ—ఆఁ, యేం చేస్తుందీ, కడుపు తీయించేసుకుంటుంది-కానీ యెవడు తీసేది—డబ్బుకావాలి-కుర్రదాని దగ్గిర డబ్బెందుకుంటుందీ? పోనీ నగలు—యీ కుర్రముండలు నగలు కూడా మొయ్యగలరా—మనువు కుదిరిందని యేవేటోచేస్తే యేమిటో అయినట్లుగా యేంచేస్తే యేమైనట్లు—యీ ప్రశ్న లీలావతి మున్షీ నడగాల్సింది—యింక మరీ—యేం వుంటుంది; మరి, యే కంపెనీకో చేరుకుంటుంది. ఆ పని ఆ సైతానీయే చూసుకుంటుంది— పగటినిద్ర రాత్రిపొద్దు పొద్దు సుద్దు రద్దీ—వందాయాభయ్ పాతికా పదీ ఐదూ మూడు రెండు ముప్పావలా పావలా—పావలా గమ్యస్థానం, వైకుంఠం, నందనవనం—వనంలో పన్యమృగాల ఘోషలు — భగ్న ప్రేమలు, తీరని అనురాగపు కోర్కెలు, శరీరపు చిత్రవధలు—చీకటి మురికి రొచ్చు మచ్చలు—వాస్సెర్‌మన్స్ టెస్టులూ—రక్తం తిరగమోత—డిమోన్షియా పెరలిటికా—అది జన్మరాహిత్యపు తుదిస్థాయి—ప్రభుత్వానికి బుద్ధుంటే తాలూకాకొక గర్భస్రావ చికిత్సాలయం చొప్పున యేర్పాటుచేసి వుండును. కాని ప్రభుత్వానికి బుద్ధెలా వుంటుంది—వసందరికీ యేదిస్తేగా దానికి అఘోరించటానికి—అందు

మరీచికాన్వేషణ

లేగా, కాబ ట్టాకితే యీ చిన్నాలిన్నీ తప్పించలేము—కాబట్టే జాగ్రత్తగా నడుస్తాం. వాన వెలిశాక నంగనాచిలా మోసగిస్తుంది, నిగ్రో వీపులాంటి రోడ్డు; అరటి తొక్కలా నిన్ను నమస్కారంగా సాష్టాంగ పడేస్తుంది—పెరేడ్ కఫే మిలిటరీ వాళ్ళకోసమా—కవాతువేసే మిలిటరీ వాళ్లని చూడటానికొచ్చిన వాళ్ళకోసమా – బస్సు పిలుపులోంచి బుస్సుమని వొస్తోంది బస్సు-లైన్లు జారతాయయ్యా నిదానంగా ఆపు-రద్దీ—అంతటా అన్ని వేళలా రద్దీ—అమ్మయ్య-ఆ అలి నీలవేణి—ఆ నల్ల తిరగలి చుట్ట—వేణితోచుట్టి పడెయ్యి. కీచువాణి వేణి వాణి వోణీవీణ-యేవిటీ, యెక్కడికా—సాగర్ దగ్గిర దిగిపోతాను-ఎన్ని టిక్కెట్లు కొట్టావంటావా—వొకటి— కనబడటంలేదూ—ప్రక్కనెవరన్నా వుంటే టాక్సీలో యెప్పుడో దూసుకుపోయి వుందును-అంతగట్టిగా అరిచి చెప్పకయ్యా కండక్టరూ, యెవడిల్లు వాడికీ, యెవడి పెళ్ళాం వాడికి తెలిసు దటయ్యా, సవ్యంగానే దిగిపోతారులే-అమ్మయ్య, వాన తీరుగాలేదు. మెజస్టిక్ రోడ్డుకి తెల్లవాడేసిన లిఫ్‌స్టిక్ కడిగేసి కెంపెగౌడా రోడ్డు చెయ్యటం దేశభక్తి-బ్రాడ్వే మూసేసినట్లున్నారు—ఇరానీ జిందాబాద్-జిందాబాద్‌ని అరబ్బీలో జిందాబాదే అంటాకో మరేమంటారో—పిళ్ళనడిగితే—ఆ రబ్బీ మాకు తెలియదంటారేమో—మా వూళ్ళో యిప్పుడుగానీ ఖుర్షిద్ యెదురైతే అడిగే పని-అహ్, అమ్మయ్య-ముందు నీళ్ళు అఘోరించవయ్యా-మూడు రోజులనాటి యెద్దుమాంసం తాలూకు కారం పులుసు మరకలు, వాటిమీద టీ జిగురు అలంకారాలు – బన్నూ వొద్దు-మనూతి వద్దు—యేక్ చాయ్-అబ్బా పొయ్యిలో కోటిసూర్యుళ్ళను వేసి కాస్తారనుకుంటాను, యీ వెధవలు—సాసర్లో పొయ్యి, లేకపోతే పావుగంట బుల్‌బుల్ వింటూ కూచో, ఆరుతుంది వగరు తీపి, చిక్కదనం, వేపాకూ, యిటిక పొడుం, తుమ్మబంకవేసి శాక్రారిన్నోడించి నారికేళ కేరళ నారికేళ పాకంలో, పొగరు తగ్గించ ప్రౌఢలాంటి బైద్యనాథ కషాయం – మదాం క్యూరీకిచ్చి యెనలైజ్ చెయ్యమనుంటే—యిరానీవాడి ప్రతిభకి జోహార్లర్పించి వుండునేమో—రెండణాలకి పదమూడు పైసలా, పదమూడు పైసలకి రెండణాలా—రూపాయకి యెనిమిది పైసల కొసరు – వెధవ పెనుకులు, పత్తేమరీచికాన్వేషణ

దుమ్ముగలపా పడేసెయ్యరాదూ-యేవిటీ ధైర్యం చెయ్యలేని గృహిణిలా తారట్లాడి—గృహిణిలో వ్యభిచారిణి. వ్యభిచారిణిలో గృహిణి గ్రహచారిణి అని రాజీకుదిర్చితే సరి—కొబ్బరిపీచు పసుపు, చాకలివాడి బట్టికి పూర్తిగా లొంగని మసకమురకల వెలిసిన రంగు దుప్పటి, మూలగా కూజాలో నీళ్ళు—లోనకి చొరబడి బెంచీమీద కూచోగానే బిలబిలా బొలబొలా బెలబెలా పకపికలు వికపకలతో వొచ్చి పరిహాసంగా నిలబడతారు. మన సినిమాల్లో ఆ తీరూ ఆ సీనూ యెవడూ చూపెట్టలేదేమబ్బా—రెండోసారి గానీ వెళ్ళి యేవొకటి అడగటం తప్పదు. సెంటుసీసా, పౌడరుడబ్బా, స్నోబుడ్డీ-లేదూ, కనీసం తలపిన్నూ-సుందరి. ఋష్, ముక్కులేని సుందరి-అందుకే కాబోలు కిట్టప్ప వీళ్ళ వాళ్ళపేర్లతో వ్యవహరించడు. పైగా వాడి తర్కం వాడికుంది-వాళ్ళు చెప్పేపేర్లు నిజంగా వాళ్ళ పేర్లే అనే హామీ యెక్కడుందని-మరి వీడూ-వూచవెధవ-పాపం వెధవ మంచివాడు-అవి తగని చోట్లని చెప్పి అటకాయించేవాడు—తప్పక ఆ కొన్నిసార్లయినా తీసుకుపోయాడు-వెధవ హొటేలు గది మార్పించటం సుఖంగా వుంది-మురుక్కాలవమీది ఈగల్లా— ఆ వుండేవాళ్ళూ, ఆ వెళ్ళేవాళ్ళూ-అంతకన్నా యేం చెయ్యగలరులే-డబ్బు- డబ్బు కావాలి యేం చెయ్యాలన్నా—గురజాడ అప్పారావు పంతులుగారి మధురవాణిని చూద్దామంటే యెక్కడా కనపడింది కాదు యే వీరేశలింగం పంతులుగారో, వితంతువులతోపాటు వీళ్ళందరికీగూడా ముళ్ళేయించేస్తే పోను—కానీ కిట్టప్ప విజ్ఞానకోశం ప్రకారం కాపరాలు చెయ్యమంటే వీళ్ళలో యెనభయ్ వొంతులు ఆర్నెల్లలో పారిపోతారు. పారిపోవటమూ లేచిపోవటమా? పారిపోవటమనే అనాలి. లేచిపోతారని అనలేం—లేచిపోవటం ప్రాథమిక దశ. కానీ పాపం కావాలని యిలా ఐపోవాలని వొక్కరూ కోరుకున్నట్లుగా లేదు. అనేకం కారణాలు—అజ్ఞానం, మోసం, వుద్రేకం, మరోగతి లేకపోవటం—యేదైనా కావొచ్చు వెస్టర్మార్కు- నడిగితే యేమేం కారణాలు చెప్పునో......

కబ్బన్ పార్కులో పొదరింటి చెంత మదుగుకోసం తారట్లాడుతున్న ప్రేమికుల జంట—కూడనిచోటు; లాల్‌బాగ్ పోవాల్సింది—టాక్సీకి మరీచికాన్వేషణ

డబ్బులుండి వుంచవు వెళ్ళవద్దు—అబ్బాయి తండ్రి అమ్మాయి తండ్రి వొప్పుకోరు. వాళ్ళూ వాళ్ళకాలంలో యిలాంటి అవస్థే పడివున్నాకూడా—అబ్బాయి చదువు పూర్తవాలి వుద్యోగం రావాలి—మొదటిది నెరవేరిన రెండోది అంతతేలికా—అథవా వొచ్చిందనుకుందాం—సరే అప్పుడు విముక్తి దేన్నుంచి విముక్తి—యేడాది గడిచేసరికి తిమ్మిరి దిగి—యింక చూడాల్సిన పొరలు లేక విప్పాల్సిన మడతలు లేక—కట్టెల అడితీముందు చక్క బొమ్మలా తిరిగి తిరిగి—రాత్రి పగలూ వొకళ్ళచెంత వొకళ్ళు—మరి వుద్యోగం—సరే సెలవు పగళ్ళుమాత్రమే—చెంత వుండి—వుండీ—సావిత్రికి నాచెంత వుండాలని—వుండివుంటే యేమిటీ—యీనెల రోజుల్లో పదిపన్నెండుసార్లను కుంటాను. అప్పుడప్పుడూ రాత్రీపగలూకలిపి జాములు నేతలా—రూపాయల్లో లెక్కపెడితే, యేడెనిమిదొందలు భోజనంతో కలిపి—పాపం, యెందుకొచ్చిన నష్టం—యిచ్చినా పుచ్చుకోదు—పాదాలచెంత పడివుంటానంటుంది, పనిమనిషిలాగా — పనిమనిషి, అంట్లగిన్నెల చెంత వుంటుంది— పాదాల చెంత అంటే అర్థం—తను—అందుకు—యీ క్షణంలో— పోనీ యే క్షణంలో ఐనా—సావిత్రి అంటే తనకి అంతర్యానుబంధం యేర్పడి వుంటే—పాపం, సావిత్రి మంచిది — యెవరు చూశారు నా ఆలనా పాలనా అలా—తనకేమిటి కావలిసింది—అది రూఢిగా తెలిస్తే అమృతపుముద్ద—కాంతిపుంజం, కళ్ళు—ఆ కళ్ళు—యెవరు యెవరికళ్ళు—గీతా—అర్థంలేని భావన—కానీ—కానీ—వూటీవగ్గిరినుంచీ యేమిటీ పరితపన— మనసులో రగడ—తన తప్పేనా యేం—తనదెలా తప్పు అవుతుంది— వూటీలో నాటి రాత్రి ముంచెత్తిన జెర్సోప్పా—యేదో కనువిప్పులా యేవో కవాటాలు తెరుచుకున్నట్లు తెరిచి తెరిచి—యీ సుందర నగరంలో మూసుకున్నాయి—మూర్ఛిల్లిన కనురెప్పలకింద కాంతి చింది యెన్నాళ్ళైంది— యేనాడు యెక్కడ—మళ్ళీ అదే భావన—మరి అదికాక—కాకమరేవిటి—చెత్త—అంతా చెత్త—రొచ్చు శ్రీరాంపురం మాత్రమే రొచ్చంటాడు కిట్టప్ప—యీ అందాల వీధులు మాత్రం యేం ఆధిక్యమని—యిదొక ప్లాస్టిక్ కచడా సండీ—కచడా—కచరా చరచడో చరచర చరీయం—అయ్యా డాక్టర్ కుల ...ష యేమన్నావ్—రక్త పరీక్ష విషమంగా వుందా—వుండదూ మరి, విషం

వున్న రక్తాన్ని పరీక్షచేసి నువ్వు తెలుసుకున్న సంగతి అదా—గొప్ప డిస్కవరీయే—వక్కగింజకో ఎయ్యపుగింజ వీకి డిగ్రీ లాగేసుకోవొచ్చు ప్రభుత్వం—వీడి డిగ్రీకూడా—వీకి వీకి పాడె వీడికేం తెలుసు—సావిత్రికున్నంత జ్ఞానంకూడా లేదు-కొత్త వైద్యుడికన్నా పాతరోగి మేలన్నా రందుకే కాబోలు—సావిత్రి నిజంగా సావిత్రే-మరి యముడెవరు—దాని మొగుడెవరు—సమాధానం కావాలంటే దాని మొగుడెవరు నవల చదవండి—గొప్ప అపరాధ పరిశోధక గ్రంథ రాజం—యేమి అపరాధం—అదీ యిదీ—అన్నీ పుడుతూనే నేర్చుకుంటూ రావాలి—బంజారాహిల్స్ దంతపు గిలకల వుయ్యాలలో వేసి వూపితే యెగిరొచ్చి సుబేదార్ చత్రం రోడ్డు మొగదల చెత్తకుండీలో పడినట్లున్నాను-బంజారాహిల్స్ లోనా బెజవాడలోనా—యెక్కడైనా వొకటే-ఆ వుయ్యాల-అదీముఖ్యం-హలో అవును వాకింగ్‌కి బయల్దేరాను. వాకింగ్ కే యీ చీకటివేళ వ్యూకింగ్-వాకింగ్ వేకింగ్ వీకింగ్ యింగ్ సింగ్ డింగ్—డింగ్‌డాంగ్‌బెల్ పుస్సీసాందావాల్-పుస్సీ సిందీ వెల్, వెల్, ఆల్ సెయింట్సు సెన్టు జార్జ్సు బిహెచ్‌యూ హార్వర్డులు విజ్ఞానం ఉస్మానియా మీంచి పారలి. చివరికి యీ గీతా సినిమాహాలు ముందు నీళ్ళులేని మిట్ట చెరువుకో నింకి కెంపెగౌడా రోడ్డుపాదాలు తడిపి—యంజి రోడ్డు—యంజి అంటే బెజవాడలో యేమర్థం చెబుతారు-సర్గ్గా అదే అర్థం లో, తో, సారి, అదేదో తెలియని బూజిలా కనిపించి కాబోలు చర్చిగుమ్మం ముందునిలిచిపోతుంది—గుమ్మం దాటకూడదు—దాటనంతవరకే దానికి అర్థం దాటితే యేమీ కనపడదు—యే అర్థమూ వుండదు—అర్థాలు యెన్నర్థాలు—యెన్ననర్థపుటర్థాలు—వొక అర్థం విప్పితే మరో అర్థం విప్పుకుంటుంది—అందుకే కిటకిట తలుపులు కిటారు తలుపులు—యెవరదీ-కిట్టప్ప—అదేం పీనగలా వాడే—

రోజులు దొర్లిపోతున్నాయి. చదవబుద్ధికాదు. యేమీ కాదు నిరంతరం తోచనితనం. చిరాకు విసుగులాంటి సున్నిత మానసిక రగడ.

లీల సాన్నిధ్యం, జలతారు పోగుల పట్టుపరదాలో గులాబీ పరిమ

శపు ఆవిరిలా చుట్టేస్తుంది అస్తమానం. ఆ సాయంత్రం లీలచెప్పిన విషయాలు విన్నతరవాత తన మనసు మేఘంలా క్షణక్షణానికి వింత రూపాలూ వినూత్న ఛాయలూ మారుతోంది తనస్థితి "యిద్" అని నిర్ధారణగా అనుకోలేదు. ఆమె ప్రభావంనుంచి బయట పడలేదు. తను అంగీకరించగలిగే రీతిలో ఆమె లభ్యం కాదు. వొకవేళ ఆమె అందుకు అంగీకరించినా—అది తన సమస్యకి పరిష్కారం కాగలదనీ అనిపించదు తనకి కావలసింది సరదాకాదు; మనశ్శాంతి

—సావిత్రిని తలుచుకుంటే తనకి జాలి. తన కారణంగా చాలారకాలుగా నష్టపోతున్నది. కానీ ఆమె యెన్నడూ తన హృదయపు లోలోతుల ఆంతర్యాన్ని కదిలించలేకపోయింది—ఆమెమీది జాలికొద్దీ ఆమె దగ్గిరికి వెళ్ళి రావటం లీల దగ్గిరికి-వెళ్ళకుండా వుండలేక వెళ్ళటం. తనమీద తను జాలిపడి వెళ్ళటం లాంటిది.

—జీవిత వలయపు టావల విముక్తి పొందలేని తనకి "జీవించటం" ప్రారంభించేంత వరకూ విముక్తి లేదేమో. నఫీన్ మంజిల్ మనసు చుట్టూ గూడు కడుతుంది. యేదో చేసి వుండాల్సింది చెయ్యలేదన్న జిజ్ఞాస-వొక్కసారి భోరున మనసార భారం దిగిపోయేలా యేడవాలని పిస్తుంది. కానీ యెవరిముందు? అన్న ప్రశ్నలో ఆ దుఃఖం గడ్డకట్టిపోతుంది.

ఆ దుఃఖాన్ని కరిగించి; శాశనం చెయ్యగల వ్యక్తి లేనిది-సావిత్రి అందుకు తగిన వ్యక్తి, కాని తన దౌర్భాగ్యం కొద్దీనన్నట్లుగా ఆ వ్యక్తి అందుకు కాకుండా పోతూంది.

—లీల—అలాంటి వాటన్నిటికి అతీతం. తన ఆశయాల అభిప్రాయాల పరిధి నుంచి జారకుండా వాస్తవంలో స్వప్నాలను చూపించగల నేర్పరి. తడికన్నులు తుడిచి హృదయానికి హత్తుకుని శాశ్వతంగా తనలో దాచేసుకునే తత్వం కాదు. ఆమె నరాలలోని రక్తం, గుండెలోంచి కాక మేధసులోంచి ప్రవహిస్తున్నట్లనిపిస్తుంది.

—మాధురి—అలలమీద తేలించినట్లే తేలించి అమాంతం సుడిగుండంలోకి నెట్టేసి తనకేమీ కానట్టూ పట్టనట్టూ నిష్క్రమించిన వ్యక్తి

మరీచికాన్వేషణ

అనే భావం. ఆమె పట్ల యెంతోకసి. అసహ్యం, భయం, తామసం— లోలోన యేదో కృతజ్ఞతా భావం.

—వర్తమానం గతంలోకి, గతం వర్తమానంలోకి కలబోసుకుని— భవితవ్యపు బూచిలా కళ్ళముందు కదిలి-జీవితార్థ రాహిత్యం, అలలమీద నుంచి దిగజారుతోంది—మనస్సంతటా.

—యెక్కువసేపు పుస్తకంమీద మనసు లగ్నమవదు. యేకాంతాన్ని గీత చుట్టేసుకుని—వురితాడులా కంఠానికి యేదో బిగుసుకున్నట్లవుతుంది శ్వాసకోసం కొట్టుకులాడుతూ జనంలోకి వొచ్చి పడితే తప్ప విముక్తిలేదు. కృత్రిమ శ్వాసలా అందులో హాయి, తృప్తిలేవు. దాహమేస్తే ఉప్పునీళ్ళు తాగినట్లు మళ్లాజనంలోంచి బయటపడగానే ఆ ప్రాణవాయువు గొట్టం ముక్కు పుటాలలోకి దూరదు.

—తాత్కాలికోపశాంతి తన జీవితానికి పరిష్కృతి కాదని తనకి తెలుసు. యేదో తాత్సారం చేస్తున్నట్లు భావన. చీకట్లో కళ్ళు తెరిచి వెర్రి ప్రాపులాట.

—యెక్కడో-తనలో, తన చుట్టూ కాంతిపుంజ వలయాలు. ఆ వలయంలో సుడిగుండంలా తిరిగి, తిరిగి-పద్మావతీ చరణ చారణ చక్రవర్తి—అని సంబోధించు కున్నట్లుగా గీతాక్షరమాల. ఆ మాల మనసులో హరివిల్లులా విరిసి కలవరపు హాయి కలిగిస్తుంది నాలుగు క్షణాలపాటు. అంతలోనే విద్యూరంలా మేఘాలు కమ్మి కుంభవృష్టి దిమ్మెత్తిపోతుంది.

బజారుకి వెళ్ళిన పూట భోజనం; లేని పూట లేదు ఆరోగ్యం చవుడూరినగోడలా క్షీణిస్తోంది. రక్తంలో కండరాలలో యేవో క్రిములు ప్రాకిన అలికిడి లాంటిది.

మూడు పూటలనుంచి భోజనంలేదు. స్నానించి నాలుగు రోజులైంది. యీంటి బాడుగ కోసం యెవరో మనిషి వస్తే ఫ్లాస్కు యిచ్చి తెప్పించకున్న కాఫీ నీళ్ళు; కడుపులో ఆకలి, గొంతులో మనసులోంచి వెచ్చగా యేదో స్రవిస్తున్నట్టు వికారం.

అర సీసా విస్కీ-పట్టిస్తే కుదురుకుంటుందన్నట్లనిపించి, స్నానం పరిచి కాన్వేషణ

లేకండానే బట్టలేసుకుని బయల్దేరాడు ఐదున్నరకి.

తల వొంచుకుని నడుస్తున్నాడు.

—యీ జీవితం యిలాగే సాగితే - అసలు సాగుతుందా - తన యేమీ కోరుతున్నట్లు - పరిచయంవున్న యెవతెచెయ్యిపట్టుకుని తీసుక పోయినా, శుంతలా నడిచి - తెల్లవార్లూ బురదగుంటలో పొర్లాడి, కాగితాల విసిరి రావటం—అసలు తను యిల్లు విడిచి రావలసింది కాదేమో—యిలా యెన్నిసార్లు అనుకోలేదు-ఐనా యిప్పటికైనా వెళ్ళగలిగానా—యీ నగ రానికీ నాకూ యేవిటి సంబంధం— యెవరు—లీల-వ్యాధులు సోకని వేశ యాలు, అందుకు తీసుకునే జాగ్రత్తల్ని అసలు కే స్ఫురించకండా చేయ గల నేర్పరి యింద్ర జాలిక లీల-వొద్దనుకుంటూనే వెళ్ళటం-నగల దుకా ణాల్లో బిల్లులు చెల్లించేలా చూడగల జాణ. మరో మరో వెయ్యిరూపా యల కంఠహారం —అంతే అంతకంటె యేముంది—దేనికో దేనికోమధ్య ముళ్ళకంపలా పడే డబ్బు—కానీ లీల తనని రక్షించలేదు—లీల అసలెవరినీ రక్షించదు—తనని తను రక్షించుకుంటుంది—తనకి కావలసింది లీల కాదు— తనకు యేమీ అక్కరలేదసలు-యేమీ అక్కరలేకపోవటం—అదీ తనకి కావలసింది—పోనీ లాలిపాట పాడగల లోలికా లీల ? ముందు యీ లీల నుంచి తనని తను రక్షించుకోగలిగితే — గలిగితే—కానీ అదెలా సాధ్యం — యెన్నిసార్లు అనుకోలేదు, కళ్లుమూసుకుని అమాంతం రయిలెక్కే సెయ్యాలని యెక్కడికో అక్కడికి—కానీ చెయ్యగలిగానా— యీ మోహపాశం తెంచుకోగలిగితే—నిజంగా తెంచుకోగలిగితే మరొక— మరొక హారం—సెన్నైనా యిస్తాను—కానీ లీలకి ఆ హృదయంలేదు— ఆమె హృదయం శరీరంలో యెక్కడో అట్టడుగు భాగానికి దిగబడిపోయి మిణుకు మిణుకు మంటూ వుంటుంది—కానీ కానీ—ఆ ఆ—పని చెయ్యగలిగితే—మోతాదుకి మించి యెన్నడూ తాగనిదానిచేత తప్ప తాగించి—పోనీ చేశానే అనుకుందాం దానివల్ల యేం లాభం—దానివల్లనా నావల్లనా—ఆ జాగ్రత్తలేవీ పాటించకుండా—అవును మళ్ళీ లీలకి తన ముఖం చూపలేను— అంటే అంటే— యీ మోహపాశం యీ విస్పష్ట పరిచిత పద్మవ్యూహం నుంచి బయటపడగలిగినట్లు—ఆలోచనలతో

గింజుకుంటూ కూచుంటే యేదీ ముడిపడదు యేదీ విడివడదు—కళ్ళు మూసుకుని చురకత్తిలా, సుగంధ ద్రావకంలా, యేదో కటి చేసె య్యటమే—

"టాక్సీ."

ఆగింది. కూచ్చుని, "జయనగర్" అన్నాడు.

* * *

—తొలిసారిగా, తనకేసి తను జాలిగా చూసుకోవటం కాక—యింకొకరికేసి— అందునా లీల— నన్ను చుట్టేసిన రంగుల వలకేసి—జాలిగా చూడగలిగాను-అంటే యికనుంచి తను అనుకున్న పని చెయ్యగల నని కాబోలు-చేస్తాను యేదైనా చేస్తాను— ఆ పాల కంఠాన్ని నులిమేసీ వుందును—చేసేస్తాను ఊరా వూరినుంచి పోవటంకూడా చేసేస్తాను—చేసెయ్యగలను.

దారిలో టాక్సీ యెదురుపడితే యెక్కి యింటికి చేరుకున్నాడు. డబ్బులిచ్చి వెనక్కి తిరుగుతూ—అంతలోనే డ్రైవరు వైపు చూసి, వుండమని సౌంజ్ఞచేశాడు. యింట్లోకి వెళ్ళాడు.

ఐదునిమిషాలకి సూట్కేసూ బెడ్డింగూ చేతపట్టుకొని వొచ్చాడు స్టేషనుకి.

మద్రాసుకి రయిలు సిద్ధంగా వుంది. యే రయిలయినా వొకటే నన్నట్లుగా యెక్కేశాడు.

—తనని తను రక్షించుకునేందుకు తనేం చేసినట్లు గులాబీ పూస జ్జను కాష్టంమీదకి విసిరినట్లు పసివాడికి విషపాయసం తాగించినట్లు—ఉదయం లేస్తుంది పక్కన నేనుండను. వొళ్ళంతా నొప్పిగా వుంటుంది రాత్రంతా స్మరణకి వొస్తుంది. పగలంతా జడ్డకంగా ప్రక్కమీద పడుకుని వుంటుంది. సాయంత్రం అవుతుంది వొళ్లుతీపు కండరాల్లో యేదో కత్తి కోత నరనరంలో తీపు యేదో పచ్చగా యెర్రగా స్రవిస్తున్నట్లు రాత్రవుతుంది చీకట్లో తనలోంచి నాకేసి చూస్తుంది ఆ చూపు యెంత యేహ్యంగా బొద్దింకను చూసినట్లు బురదలో పొర్లాడి రోడ్డుమీదకి పరిగెత్తుకొచ్చే పందిని చూసినట్లు అబ్బ యెంత యేహ్యంగా అసహ్యంగా ఛీత్కారంగా మరిచి కాన్వేషణ

అంతకంటే నరకం తను చర్మాన్ని కాల్చేసి అసహ్యంగా అవహేళనగా చూస్తుంది అప్పు ఆ చూపు సెగతో అవమానంతో నైచ్యంతో కుంగిపోయి నిలువునా ఆమె ముందు కత్తితో తనని తను పొడుచుకుని చావటం మేలు ఆ చూపును భరించి జీవించటంకన్న జీవితంలో యింతకన్న అమానుషమూ క్రూరమూ నీచమూ ఐన పని మరొకటి వుండబోదు అబ్బా—

నుదుటికేసి పిడికిలి వొత్తుకున్నాడు, కళ్లు మూసుకుని. లోకం అంతా నిశ్చలంగా పడివున్నట్లయింది—రైలింజను తప్ప.

వేకువ తెలిసలి చీకట్ల లోంచి యింజను తూసుకుంటూ మద్రాసు సెంట్రల్ చేరేవరకూ వొక్కమాట కూడా మాట్లాడలేదు యెవరితోనూ.

హోటేల్లో దిగిన తరవాత అతనికి తెలిసివొచ్చింది తన దగ్గిర వంద రూపాయల లోపుగా మాత్రమే వున్నట్లు సరే బెంగుళూరికి రాసి ఖాతా బదిలీచేయించుకోవొచ్చు లెమ్మనుకుని వుండిపోయాడు ఒక్కొక్కరోజు గడిపేసరికి మద్రాసు తక్షణం విడిచి పెట్టాలనుకున్నాడు. యెన్నడూ మూడు రోజులకి మించి వుండలేదు. యీ మద్రాసులో యెందుకోగానీ మొదటినుంచీ అదోరకమైన అయిష్టత తనకి—అనుకున్నాడు, వుద్యోగ వ్యాపకమే వొకరకంగా దొరికి లొక్కరావొచ్చు; దారిమాట యెలావున్నా గాడిలో పడి— సరే. చూద్దాం. యీ స్థితిలో అదీ వొక మార్పేకదా— అనుకుని—

సాయంత్రం నాలుగు గంటల హైదరాబాద్ ఎక్స్‌ప్రెస్‌కి బయల్దేరాడు.

* * *

విజయవాడ స్టేషన్లో, కాఫీతాగి కిటికీలోంచి తల బయటికి పెట్టి డబ్బిస్తున్నాడు, క్రిష్ణచైతన్య.

"క్రిష్ణా—"

క్రిష్ణచైతన్య తల ప్రక్కకి తిప్పాడు. శశాంక! బిస్కట్ల గాజు పెట్టెబండి ప్రక్కనుంచి వొచ్చాడు.

"నువ్విక్కడ!" ఆశ్చర్యపోతూ అన్నాడు క్రిష్ణచైతన్య.

"అదే ప్రశ్న నేను వెయ్యబోయాను! యేమిటి వింత. నువ్వి

పెట్టెలోవున్నావు?"

"యేం, నేను పెట్టెలో ప్రయాణించకూడదనా!"

"అని కాదయ్యా అలవాటుకొద్దీ వొక్క గీత గియ్యాల్సిన వాడివి మూడుగీతలు గీశావేమిటా—అని!"

"చేతులో డబ్బు లేదు."

"డాలర్ లాంటిమనిషివి నువ్వు ఆ మాట అంటే పూర్తిగా భారతదేశం, దివాలా తీసేస్తుంది." అని పకపకా నవ్వుతూ వంకర్లు తిరిగాడు.

శశాంకని చూసేసరికి కాస్త తేరుకున్నాడు, క్రిష్ణచైతన్య.

"యీ ప్లాట్‌ఫామ్మీద యేం చేస్తున్నావీవేళ? నువ్వూ ప్రయాణమా—యెక్కడినుంచి?"

"వో మిత్రుణ్ని రెండో నంబరు ప్లాట్‌ఫాంమ్మీది హౌరా ఎక్స్‌ప్రెస్‌లో సాగనంపి యిలా వొస్తూ గోడమీది సిన్మాబొమ్మలు చూస్తూ యిటు తిరిగేసరికి నువ్వు! నమ్మలేక పరిగెత్తుకొచ్చి చూస్తే; నువ్వే!"

'నువ్విక్కడెలా వున్నావ్!'

"అదేం ప్రశ్న! నువ్వు తెలుగు పత్రికలు చూస్తూవుంటే తెలిసేది నేనిక్కడున్నట్లు. యింతకీ యెక్కడినుంచి?"

"మద్రాసు నుంచి."

"దిగిపో, రేపు నేనూ హైదరాబాద్ వొస్తున్నాను. అక్కడ వో పూట పనివుంది. అది చూసుకుని వో అత్యవసరప్పని మీద ఢిల్లీ వెళ్లాలి. కలిసి వెడదాం దిగేసేయ్."

గార్డు పచ్చజెండా వూపుతున్నాడు. యింజను కూతవేసేందుకు గొంతు సవరించుకుంటోంది.

పెట్టిలోకి యెక్కి బెడ్డింగు చేతపట్టుకున్నాడు శశాంక తడుముకోకుండా.

"కూలీ" అన్నాడు క్రిష్ణచైతన్య.

"కూలీ వొచ్చేసరికి బండి కదిలిపోతుంది తొందరగా దిగు" అంటూ దిగాడు శశాంక.

క్రిష్ణచైతన్య సూట్కేసు పట్టుకుని దిగబోతున్నాడు

అది అందుకుంటూ "యింత కాలానికి నువ్వు ఈరోజున చేశా వన్నమాట నిజమైన రైలు ప్రయాణం. కూపేలో కూచున్నా, యింట్లో మూలగదిలో కూచున్నా వొకటే కదయ్యా"

కూలీ వొచ్చాడు. సామాను వొంక చూపెట్టాడు క్రిష్ణచైతన్య. తీసుకుని గునుకు తీస్తున్నాడు బయటికి.

స్టేషను బయటికి వొచ్చేశారు. టాక్సీకోసం చుట్టూచూశాడు క్రిష్ణ చైతన్య

రిక్షా పిలిచి సామాను పెట్టించి కూర్చోమన్నాడు క్రిష్ణచైతన్యని. కూర్చున్నాడు.

ప్రక్కన కూచుని, ఐదారు ప్రశ్నలు వరసగా అడిగేడు శశాంక.

"అష్టావధానాలూ శతావధానాలూ చేసినవాణ్ని కాదయ్యా విలేకరీ. వొకదాని తరవాత వొకటి అడుగుచెబుతాను."

"ప్రచ్ఛన్న నాగా యోధుడిలా యేమిటీ జీవితం? యెక్కడికెళ్లావు? యేంచేస్తున్నా వింతకాలం?"

"ఆశ్రమానికి వెళ్ళాను."

"యేదో ఆశ్రమంలో వున్నావనీ ఆ తరవాత బెంగుళూరు వెళ్ళావనీ తెలుసుగానీ—"

"నీకెలా తెలుసు బెంగుళూరు వెళ్ళిన విషయం?" ఆశ్చర్యంగా అడిగాడు

"డాడీగారు చెప్పారు. నువ్వు—"

"నాన్నగారు బావున్నారా?"

"వారికేమయ్యా! ఆ మధ్య హైదరాబాద్‌నుంచి యిక్కడికి యేక బిగిని జీపు నడుపుకొచ్చి—విశాఖదాకా అలాగే నడుపుకు వెళ్ళగలట్లు కనిపించారు—అఫ్‌కోర్స్ మధ్యలో గోదారి యెక్స్‌ప్రెస్‌ననుకో."

"నా గురించి యేమైనా అన్నారా?"

"ప్రత్యేకం యేమీ అనలేదనుకో—నిన్ను గురించి లోలోన బాధ పడుతున్నట్లు కనిపించారు. కనిపించారుకంటే అనిపించారు అనటం సబబు"

అని జుబ్బా జేబులోంచి సిగరెట్ పెట్టె, అగ్గిపెట్టె తీసి వెలిగించి దమ్ము లాగి "నువ్వసలు యింతకాలం యెందుకు వుండిపోయినట్టు? యెక్కడెక్కడున్నావో వివరంగా చెప్పు ముందు" అన్నాడు.

"చెప్తానుగా. ఆశ్రమానికి వెళ్ళాను, అక్కడ రెండేళ్లపాటు వున్నాను ఆ తరవాత బెంగుళూరు వెళ్ళాను. మద్రాసు మీదుగా హైదరాబాద్ వొస్తున్నాను యింతకీ నువ్వు యీ వూళ్ళో యేం చేస్తున్నట్టు?"

"నీ డి. లిట్. డిగ్రీ మూడోపేజీ నాల్గో కాలంలో వెయ్యమని చెప్పి స్టేషను కొచ్చి మిత్రుణ్ని సాగనంపి వొస్తున్నాను"

"నా డి. లిట్. ఏవిటోయ్—గందరగోళంగా మాటాడకయ్యా"

"నీ కృషికి ఫలితం—తెలీనట్లు అడుగుతావేం? నీకు బహూకరించిన వార్త."

క్రిష్ణచైతన్యకి అర్థమైంది అదేవిటో యెలా సంభవించి వుంటుందో.

"ఐతే యిక్కడ పని చేస్తున్నానన్న మాట."

"ఆంగ్ల జగత్తు నాగ్గేసివొచ్చి తెలుగుదేశాన్ని వుద్ధరించమని ముక్కోటినన్నర అంధులూ మోకరించి వేడుకుంటే, కీచకుడిలా తెలుగు దేశపు ఈ నడిబొడ్డుమీద ప్రభవించాను." అని పకపకా నవ్వాడు. కదలికకి చేతిలో సిగరెట్ క్రిష్ణచైతన్య చేతికి అనింది.

నుసి దులుపుకున్నాడు క్రిష్ణచైతన్య.

"కాల్లేదుగదా? చూశావ్ ఆంధ్రదేశంలో కాలు పెట్టావోలేదో అప్పుడే నా ప్రతాపం చవి చూశావ్" అని మరో దమ్ము లాగి పీక విసిరాడు

రిక్షా, ఇల్లు చేరింది

"యీ గూటిలో పుట్టె ఆలోచనలతో తెలుగుదేశం భగ్గున మండుతుందేమోనని తెలుగు పత్రికాధిపతులు భయ భ్రాంతు లౌతున్నారు. పద లోనకి" అన్నాడు తాళం తీసి

డాబాలో రెండు గదుల చిన్న భాగం.

సామాను లోన పెట్టించి, డబ్బులిచ్చి లోనకివొస్తూ, "జడుసుకునేవ్, మరీచికాన్వేషణ

ఈ ఫలక్‌నుమా చూసి!" అని యిటప మడత కుర్చీవాల్చి కూర్చోమన్నాడు.

కాలకృత్యాలు ముగించుకున్నారు.

పూర్తిగా వెలుతురు వొచ్చింది.

"రామదాసు కాఫీ సుప్రభాతం కోసం, ఆత్మారాముడు, మగతనిద్ర కళ్ళతో లేచి యెదురు చూస్తున్నాడు, పూజలో వున్న జానకిని విసుక్కుంటూ" అంటూ బయల్దేరదీశాడు శశాంక.

మాట్లాడుకుంటూ నడుస్తున్నారు, కూర్మయ్య వీధిలో.

"నాన్నగారు అప్పుడప్పుడూ వొస్తుంటారా యిక్కడికి?" అడిగాడు క్రిష్ణచైతన్య.

"ఏడాది క్రితం నఫీస్ మంజిల్‌లో కలిశాను. నాలుగు నెలల క్రితం ఆఫీసు పనిమీద విశాఖవెడుతూ కనిపించారు. క్రితంనెలలో యిక్కడికే వొచ్చారు కార్యాలయం పనిమీదే. ఆయన దిగులు నీకక్కరలేదు. ఆయనలా వుండగానే మనం ముసలివాళ్ళం ఐపోతామేమోనని నా భయం" అని నవ్వాడు.

"శశాంకా, అప్పటికి యిప్పటికే నువ్వేమీ మారలేదు!"

"తాటిచెట్టుకి మార్పు యేముంటుందయ్యా! కానీ నువ్వు మాత్రం మారిపోయావ్."

"నేనా!"

"అంటే. నీ వాలకం?"

"యేమైంది నా వాలకానికి?"

"అద్దంలో ముఖం చూసుకోవటం మానేశావా యేమిటి! ఆ దవడలూ కళ్ళూ యెలా పీక్కుపోయాయో-శేషశయ్యమీది విష్ణుమూర్తిలాంటి మనిషివి.

"ఐదారు రోజులనుంచి సరిగా నిద్రలేదు."

"యేం. మరో డి. లిట్. చేసే ప్రయత్నంలో వున్నావా యేమిటి? డాడీగారికి నాయక్‌జీ కనిపించి చెప్పారట— నీ సెలవు గడువు దగ్గిరకొస్తున్నదదీ, నువ్వు తనకి రాసిన వుత్తరాన్నిబట్టి చూస్తే-అది జీవితం

మరీచికాన్వేషణ

మీద అలక్ష్యం యేర్పడిన వాళ్ళు రాసే తీరులో వుందిట డాడీగారు చాల నొచ్చుకున్నారు ఆ కబుర్లు చెప్పి."

"యేమన్నారేవిటి నాన్నగారు?"

"చెప్పానుగా, ప్రత్యేకం యేమీ అనలేదు గానీ—అదే, లోలోన నీగురించి బాధపడుతున్నట్లనిపించింది."

"నా జీవితం వ్యర్థంగా అనిపిస్తోంది, యెవరికీ ఆనందాన్ని కలుగ జెయ్యలేక పోతున్నాను. ఆఖరికి నాకుకూడా."

గవర్నరుపేట సెంటర్ చేరుకున్నారు.

హోటేల్లోకి వెళ్ళి యిడ్లీ, పెసరట్టూ కాఫీ పుచ్చుగుని బయటికి వొచ్చారు.

కిళ్లీ బడ్డీలో సిగరెట్ పెట్టె కొనుక్కుని దినపత్రిక తీసి పేజీలు తిప్పి, "యిదుగోనయ్యా నీ డి. లిట్. వార్త, యిక్కడ వేయించాను. మొదటి పేజీలోనే వేయిద్దుగానీ మా దుర్వాసుడు మండిపడతాడని—"

"వాడెవడోయ్?"

"యింకెవడు- మా పత్రికాధిపతి, ఆ మాటకొస్తే, యెనీ పత్రికాధిపతి." అని పకపకా నవ్వాడు.

వార్తచదివి, "పాపం, రెజిస్ట్రారుకి తనంటే యెంతశ్రద్ధ, టైపు చేయించి వేరే విశ్వవిద్యాలయానికి పంపే శ్రమ తీసుకున్నాడన్నమాట" అనుకున్నాడు క్రిష్ణచైతన్య.

సిగరెట్ ముట్టించి పొగ గట్టిగాలాగి వొదులుతూ, "రాత్రే డాడీ గారికి టెలిగ్రాం యిచ్చాను నీ డి లిట్. వార్త గురించి" అన్నాడు.

నడక సాగించారు

క్రిష్ణచైతన్య మౌనంగా వుండిపోయాడు.

"యేమిటి స్వామీ, ఆలోచనలో పడినట్లున్నావ్?" అన్నట్లుచెప్పటం మరిచాను. మీ పింతండ్రివాళ్ళూ అరండేల్ పేటలోనే వున్నారు—కొత్తగా మేడ కట్టుకున్నాడు. బాగా సంపాదించాడు కంట్రాక్టులు చేసి. కొడుకులు కూడా అలాంటివాళ్ళే—రెండు చేతులా సంపాదిస్తున్నారు. నిన్ను గురించి అడిగాడు వొకటి రెండుసార్లు. నీ విషయం తెలియదన్నాను." అన్నాడు

శశాంక.

"వాళ్ళకేం అవసర మొచ్చిందోయ్ నా గురించి తెలుసుకోను?"

"అదంతా పెద్ద గొడవలే. మన సీతమ్మత్తగారు యేవేవేవో మొత్తుకుండిట వాళ్ళతో. యిప్పుడు నఫీన్‌మంజిల్‌లోనే వుంది" అని, క్రిష్ణచైతన్య వైపు ముఖం తిప్పి, "సీతమ్మత్త కూతురు యిక్కడే కళాశాలలో బియ్యేస్సీ చదువుతోంది. చూస్తావా?" అని నవ్వాడు చిన్నగా.

"వూఁ వూఁ, చూడకుండా యెలానోయ్ బంధువుల్ని?"

"బంధువుల మాటకాదు; నేననేది నిర్మలాదేవి మాట. ఆ మధ్య చూడటం జరిగింది బాగా యెదిగింది. అందంగాకూడా వుంది, హిందీ సినిమా తారలా."

"యేం పిల్లమీద కన్నేసినట్లున్నావ్?"

"నా కన్నుపడని ఆడపిల్లలంటూ మిగిలి వున్నారటయ్యా?"

"చేసుకుంటావేమిటి? చెప్పు? నేను చెప్పి ఖాయపరుస్తాను పోనీ!"

"నేను పెళ్ళిగానీ తలపెడితే పెద్ద చిక్కుల్లో పడిపోతానయ్యా. చాలామంది ఆడపిల్లలకి ఆబ్లిగేషనుల్లో వున్నాను. ఆ వార్త వినగానే వాళ్ళంతా తాళ్లు చేతపట్టుకుని దాడిచెయ్యగలరు స్మా!" అని పకపకా నవ్వాడు—తూలి, కాలు నిలదొక్కుకున్నాడు.

"తాళ్ళతో కట్టెయ్యటమేనా, పిస్తోలుగుళ్లు వొదిలి తూట్లుకూడా పొడుస్తారా!" అని నవ్వాడు క్రిష్ణచైతన్య.

"అదికాదు స్వామీ డాక్టర్ చైతన్యా. తాళ్ళంటే మంగళసూత్రపు తాళ్లు. వాళ్ళ పీకలకి వురిపోసి వుద్ధరించమని" అని ఆఖరి దమ్ములాగి, పీక విసిరి, "సీతమ్మత్త, యిక్కడికే వేళ మించిపోయిందనీ, చెయ్యిజారి పోతున్నావనీ, మేనకోడల్ని కొడుక్కి చేసుకోమనీ డాడీగారితో యేవేవేవో గొడవ పెట్టిందటలే."

"మరి నాన్నగారు యేమన్నారట!"

"రెండు చేతులూ జోడించి నమస్కారంచేసి, ఆ పెళ్లి విషయం నా తలకి చుట్టకు. అబ్బాయినే అడగండి. నాకేం తెలియదు. వూఁ అంటే నేనూ పెళ్లివేళకి వొచ్చి సంతోషంగా దీవించి వెడతాను—అని అన్నారట.

దాంతో ఆవిడగారికి సివాలెత్తుకొచ్చి మీ పెత్తండ్రి దగ్గిర యేవేవో వున్నవీ లేనివీ కల్పించి పెద్ద గొడవ చేసిందట. యేదో చెప్పి శాంతపరిచి మళ్లీ నఫీస్ మంజిల్ సీదికే తగిలారట. తోడబుట్టిన వాడయ్యీ ప్రేమాభిమానాలు లేకండా పోయారట డాడీగారు. ఆడబిడ్డె నయం అని అమ్మగారిని పొగిడేసేందిట."

"నాకు తెలియక అడుగుతానూ, తన కూతుర్ని పెదనాన్న రెండో కొడిక్కిచ్చి చెయొచ్చుగదా! వాళ్ళకి బాగా ఆస్తివుంది కదా?"

"బాగా—యేమిటోయ్; మీకంటే వాళ్ళకిప్పుడు యెక్కువ ఆస్తే వుంది కానీ తన కూతుర్ని చదువులేని వాడికివ్వదట. మీ పెత్తండ్రి కొడుకు లెంత సంపాదించినా వాకలాంటి బైతులేకదయ్యా. కాగా, పోయిన వేసవిలో అతని పెళ్లి చేసేశారు. అసలు నేననుకోవటం—మీ పెత్తండ్రి డబ్బు దగ్గిరకొచ్చేసరికి యెలాంటివాడో సీతమ్మత్తకీ తెలుసుగా—అంత కట్నకానుకలు యివ్వను తన దగ్గరెంతుందని? అంచేత, మహామేధావివే విద్యాధికుడివీ అయిన నీకే యిచ్చి చేసి తీరాలట. ఆవిడ వాలకం చూడగా అనగా వినగా, నువ్వు గానీ తిరస్కరిస్తే, కనకదుర్గమ్మ గుడి ముందు ప్రాణాలు తీసుకునేలా వుంది."

"వూఁ" అని దీర్ఘం తీశాడు క్రిష్ణచైతన్య.

"వాళ్లాయనే బతికుండి రెండు చేతులా గడించి, దోసిళ్ళతో యినప్పెట్టునింపి వుంటే తన కొడుక్కిచ్చి చేసుకుంటే బావుండునా అని ఆశగా చూసేవారట డాడీగారు! యింతకీ మీర్జా ఆనీ యిశ్మాయిల్ జమానా ఐపోయాక డాడీగారు మడి వస్త్రాలు విప్పటం వీళ్ళందరికీ కన్నెర్రగా వుంది."

ఐతే నే వెళ్లిపోయాక చాలా గ్రంథం నడిచిందన్నమాట!"

"యింకా నిమ్మదిగా అంటున్నావా! నువ్వు నఫీస్‌మంజిల్‌లో కాలు పెట్టేసరికి డ్రాయింగ్రూంకి యాభయ్ అడుగుల దూరంలో వంటగది ప్రక్కగది ప్రాంతంలో పెద్ద వాయుగుండం యేర్పడి కాంతి వేగంతో ప్రయాణించి, డ్రాయింగ్రూం పరిసరాలలో పెనుతుఫాను శాలులు వీచ వచ్చు. భారీ వర్షంనుంచి చెదురు మదురుగా ఓనుకుల వరకూ డ్రాయిం

గ్రూంటోనూ ఆ పరిసర ప్రాంతాలలోను పడవొచ్చు రాగల దెబ్బయ్ రెండు గంటలకో కోపతాపాలకి గురి అయి మాటల వలలు వేసి నరవుష్ప అను పట్టటమూ యిత్యాది పనులకు దిగరాదని, నఫీస్ మంజిలేయులకు తెలుగు దేశపు నడిబొడ్డు జిల్లా పాత్రికేయుడు హెచ్చరిస్తున్నాడు...

"నీ వాగ్ధాటికి లొంగ డ్రైవర్లు జడుసుకుని మీదకి తోలే ప్రమాదం వుంది కాబట్టి—"

"నోరు మూయింపించమని—జమీందారీ సంప్రదాయంలో—అంతేనా!" అని పకపకా నవ్వాడు శశాంక.

యిల్లు చేరుకున్నారు,

"నీనికి కిరాయి యెంతోయ్?" అన్నాడు క్రిష్ణచైతన్య యినప చట్రపు పడక కుర్చీలో వొరుగుతూ.

"అరవయ్ రెండు, విద్యుత్కనెక్షన్ అదనం. కనెక్షన్‌కి సరైన తెలుగు పదం వెతికి లేక బనాయించి వుంటే ప్రత్యేక భత్యం యిచ్చి వుండేవారు తెలుగు పత్రికలవారి సంధికాలపు అవస్థమాట యితే. ఆఫ్‌కోర్స్, కొట్టుడు కొళాయి నీళ్ళకి రుసుం లేదనుకో. వేరే యిల్లు దొరక్కకాదు, యిందులో వుంటే గ్రహబలం అనుకూలిస్తుందని నమ్మిక! ఆ మాట కొస్తే మీ పెత్తండ్రికూడా అన్నాడు, తమ మేడలో చాలా గదులు ఖాళీగా పడి వున్నాయి వుండి పొమ్మని. మనలో మాట—మర్యాదకీ, మాట వరసకీ మాత్రమే అన్నాడనుకో."

"వాళ్ల కబుర్ల కేమిటిగానీ, నీ విషయాలు చెప్పు. యింతకాలం యేమేం చేస్తున్నావు?" అన్నాడు క్రిష్ణచైతన్య.

"మద్రాసులో కొంతకాలం మండించి, బొంబాయి నగరాన్ని వెలిగించాను రెండేళ్ళపాటు. అక్కడినుంచి నేరుగా యిక్కడికే. యింతకన్న యేముంటాయయ్యా నా విషయాలు,

"యెలా వుంది జీవితం?"

"అర్థంలేని ప్రశ్న. జీవితం అంటే; ఆడపిల్లో—పిల్లికాదు పిల్ల కనీసం ప్రౌఢ, అధమంలో వృద్ధపడుచు-అటయ్యా, కన్నార్పకండా చూడ టానికి! జీవితం అనే పదార్థం యెప్పుడూ నాకంట పడిందికాదు. మాస్థానిక

మరీచికాన్వేషణ

విలేఖరికి కాఫీ యిప్పించి నాలుగు ఫోటోలు తీయించటానికి. జీవితం అంటే యేమిటో చెప్పనయ్యా ప్రొఫెసర్ ముందు; గుండెకాయ కొట్టుకోవటం జీవితమా? అందమైన ఆడపిల్లని చూసినప్పుడు నరాలు తిమ్మిరెక్కటమా? పత్రికాధిపతిచేత మర్యాదకి భంగం కలగని పట్టుకుచ్చులాంటి చివాట్లు తినటమా? కిష్ణ వొడ్డున పడవపాటలకి పైకి సాగిపోయే కొంగల బారును చూస్తూ ఆకాశపు నీలంలో కలిసిపోవటమా? రాహూటాకీసపతల చురకలు వేయించుకోవటమా? చారిత్రక పుటలలోంచి హంపీ శిథిలాల మధ్య ఆవిరిలా రేగిన గత వైభవ స్మృతులు గురించి తలపోయటమా? యేది జీవితం?" అని శ్వాస పీల్చుకుని, సిగరెట్ తీశాడు.

"యెరక్కపోయి నయాపైసంత ప్రశ్న వేస్తే నెపోలియన్ దాడిలా విజృంభించావు కదోయ్!"

"కిత్తిశేషుడు ఫిరోజ్ గాంధీలాకూడా అను." అని దమ్ములాగి, "క్రిష్ణా, నాకు తెలీదు జీవితం అంటే యేమిటో. జీవితాన్ని గురించి నేనెప్పుడూ వొక వ్యక్తిగత సమస్యగా ఆలోచించలేదు. ఆ శక్తి నాకు లేదు. లేదూ—ఆ అవసరం నాకు కలగలేదు. జీవించటం మాత్రమే తెలిసిన వాణ్ని" అన్నాడు.

"శశాంకా, నువ్వు అదృష్టవంతుడివోయ్" అని-

పైం పత్రిక పేజీలు తిప్పుతూ, సిగరెట్ దమ్ములాగుతూ-మూడు నిమిషాలకి తలయెత్తి క్రిష్ణచైతన్యకేసి చూసి, "యేమిటి స్వామీ మళ్లీ తమరిని ఆలోచన కావిలించుకుందా యేం? నేను మొదట్లోనే చెప్పాను దానిమీద రేప్‌కేసు పెట్టమని నిన్ను చెరిచినదాన్ని క్షమించే వుదారత నాలో లేక, కనికొద్దీ దాన్ని నా చాయలకు రానివ్వలేదు స్మా!" అన్నాడు.

"యేం లేదోయ్ కళ్ళుమంటగా వున్నాయి, రాత్రంతా నిద్ర లేదేమో—"

"కాసేపు కునుకు తియ్యి, పోనీ."

"నిద్రా రావటంలేదు."

"యీ పొరడాక్సులతోటీ ద్వంద్వాలతోటీ నీ జీవితం నలుగురు

కిచి కాన్వేషణ

పడుతోంది. అవి వొంటికీ మనసుకీ కూడా మంచివి కావు"

ముందుకు జరిగి కూచుని, "నా జీవితానికేంగానీ, నువ్వెప్పటికీ యిలాగే వుండిపోతావా?" అన్నాడు కెప్టెన్ చైతన్య.

"యిలాగే వుండిపోతావా అంటే అంత తేలిక పనికాదు అవమం అయిదారు శాఖల నిపుణులను సంప్రతించాల్సి వుంటుంది. ముందు యెనాటమిస్టుని అడగాలి—యీ బొవికెల నిచ్చెనకి పెరుగుదలగానీ విరుగు దలగానీ వున్నదీ లేనిదీ. రెండు— బయోకెమిస్టుని—యీ మెటబాలిజం గొంగళిపురుగులా రూపం మార్చుకునే వింత యేమైనా సంభవమా—అని. మూడు—సైకాలజిస్టుని —యీ మెదడులో మెడుల్లా ఆ బ్లాంగేటా సెరెబ్రం లోకి చురాక్రమణ చేసే ప్రమాదం వుందా—అని. నాలుగు—తత్వవేత్తని— యీ గూట్లో జీవుడికి యెన్ని జన్మల పాపపంకిలం అంటివున్నదీ, అది యీ జన్మలోనే చర్మానికంటా కడుక్కుపోయేదీ లేనిదీ—అఫ్ కోర్స్, యీ పనికి నువ్వున్నావనుకో—"

"ఏకు వాగుడు యెక్కువైందని ముందు ధ్రువమవుతూంది. నేన న్నది, నీ వొంటరి జీవితం గురించి."

"అది సదరు రిపోర్టులు వొచ్చాక, అధిష్టాన నిర్ణయ సంఘాన్నొక దాన్ని యేర్పాటుచేస్తే, వుద్దేశపూర్వంగా కాలయాపన లేకుండా తీర్పు యిచ్చిన తరవాత మాట. అంచేత—"

"నన్ను నిద్రపొమ్మని చెప్పటమా శశాంకా?" అని నవ్వాడు.

"యెంతమాట! అజ్ఞానమయ్యా, షియర్ అజ్ఞానం" అని సిగరెట్ తీస్తూ, "అదిసరేగానీ; నువ్వు ఆశ్రమాలలో పిలకా గిలకా పెట్టుకుని నామాలు—నిలువు లేక అడ్డం—దిద్దుకుని రుద్రాక్షమాల వేళ్ళమధ్య మెదు పుతూ యెన్నతో పండిత పామరులకిజ్ఞానబోధచేసి ముక్తిమార్గాన్ని చూపు తావని ఆశపడుతున్న నాకు గొప్ప ఆశాభంగం కలిగించావయ్యా."

"యీ కోంతపేటి చాంతాడు వాక్యాలు రాస్తే చదువుతున్నారా జనం"

"ఆ సువర్ణావకాశం లేకనే యీ రజతావకాశాన్ని వినియోగించు కుంటున్నాను—వినక తప్పదు ఆ తాడు పొడవునా నువ్వు పాకి రాకనూ

మరీచికాన్వేషణ

తప్పదుగానీ; యింతకీ చెప్పు, నువ్వు ఆశ్రమంలో యేం చేసే వాడివో.'

"ఆశ్రమంలో యేం చేస్తారోయ్, యెవరైనా! ప్రార్థన, పఠనం శ్రవణం, సాధన."

"ధ్యానం మాట చెప్పలేదు దాన్ని తరచూ, స్వాములవారు వాడటమో దాంట్లోకి దూరి చక్కా కూచోవటమో చేస్తారు."

నవ్వి, "ధ్యానం, సాధనా మార్గంలో వొకదశ" అన్నాడు క్రిష్ణచైతన్య.

"వొకమాట చెబుతాను విను. యీసారి స్వామీజీ వేషం వేసుకుని నువ్వు అమెరికా పర్యటించావో—బీట్నిక్సు బీటిల్సూ మొదలుకుని గోల్డు వాటరూ, రాక్ ఫెల్లర్లతో సహా నీకు శిష్యత్వం వహించి, పీపీలలో నిన్ను మెరిపిస్తారనుకో."

"అలాగే పర్యటిస్తాగానీ, నీ ఆర్థికస్థితి యెలా వుందో చెప్పు—నీ సహజ ధోరణిని వొదిలి చెప్పు"

"ఆ అంశ విధిస్తే, ముందుగా నేను పూనాలో నటనాకళాశాలలో తర్ఫీదు పొంది రావాలి అంతవరకూ నువ్వు నా జవాబుకోసం వేచివుండే పక్షంలో నాకేమీ అభ్యంతరంలేదు" అని, సిగరెట్ తీసి, ఖాళీ అయిన పెట్టెను వూగిస్తూ చూపించి, "చూస్తున్నావుగా, నా ఆర్థిక స్థితి దీనిలాగే బరువు భారాలు లేకండావుంది" అన్నాడు శశాంక

"అంటే వెనకటిలాగానేనా ?"

"సంపాదన పెరిగింది. కాబట్టి వెనకటి స్థితికాదు. ఖర్చు పెరిగింది. అంచేత అక్షరాలా వెనకటి స్థితే!" అని నవ్వాడు గట్టిగా.

వొంటిగంటవరకూ కబుర్లు చెప్పుకుంటూ కూచుని హోటేలుకివెళ్ళి భోజనం చేసి వొచ్చారు

శశాంకను చూడటంతో, అతని కబుర్లతో; కాస్త కులాసాగా అనిపించింది క్రిష్ణచైతన్యకి. మనసు తేరుకుంటున్నట్లనిపించింది. బాగా అలిసిపోయి వుండటంతో వెంటనే నిద్రపట్టింది. మెలుకువ వొచ్చేసరికి ఐదుగంటలైంది

శశాంక కనిపించలేదు.

ప్రత్యేకం యే విషయమూ కాకండా ఆలోచిస్తూ పరుపుమీద పడుకుని పోయాడు క్రిష్ణచైతన్య.

"యింకా నిద్ర లేనట్టేటయ్యా—బయట వీధుల్లో ఆంధ్ర నారీమణులు పూలచెండ్లు తురుముకుని సిన్మావేళ అదును తెలిసిన రిక్షావాళ్ళతో కొసరి కొసరి బేరాలాడుతుంటే?" అంటూ గుమ్మం పక్కన చెప్పులు విడిచి—లాల్చీ తీసేసే ప్రయత్నం చేస్తున్నాడు శశాంక.

"ఐతే నువ్వు నిద్రపోలేదూ?"

"పగటివేళ పోయితీరవలసిన వాణ్ణే కానీ పోలేదు. యెడిటరింటికి వెళ్ళి రాత్రి ఫలానా వార్త వేళామే ఆయనొచ్చాడనీ యీ రాత్రికి నా పనిని వేరే వాళ్ళ మొహాన రుద్దమనీ—లేదూ, తన మొహానికే రుద్దుకోమని మనసులో అనుకుని—చెప్పి వొచ్చాను. యింక రేపు పగటివేళ యెలాగూ పని వుండదు—రాత్రికి ప్రయాణమేనాయె. అనగా, నఫీస్‌మంజిల్ చేరేవరకూ

యెవరోకరు...ఆవిడకి అప్పజెప్పి, యెర్రకోట [illegible]దకి [illegible]ంచయాత్ర చేయగలవాణ్ణి."

"హైదరాబాద్‌లో యెన్నిరోజులుండ బోతున్నట్లు?"

"యెన్నిరోజులోనా! వొక్కపూట. అక్కడ చిన్న సమాచారం సేకరించాలి అవటానికి చిన్నదేగానీ సిమ్మిరపకాయ లాంటిదిలే దాన్ని చెవి కొలికిలో దాచుకుని వెళ్ళి, తీన్‌మూర్తి భవనానికి ముందు చెట్టుకింద మకాంపెట్టి లోనకి వొచ్చేపోయే వాళ్ళనుంచి మనకి కావలసిన భోగట్టా రాబట్టాలి."

"అంతేనా! వొక్కపూట మాత్రమేనా?"

"అందుకేగా, యీ రాత్రిని పగలుచేసి వొచ్చాను!"

"ఊఁ. అంటూ మడతమంచం మీదినుంచి లేచాడు క్రిష్ణచైతన్య.

"త్వరగా తెములు, చీకటిపడిందో; యీ మహాపట్టణ శోభ మసకేసి పోతుంది" అన్నాడు శశాంక.

స్నానంచేసి బయలేరారు.

హోటేల్లో కాఫీ తాగి—బయటికి వొస్తూ, "నువ్వు తెలుగు సిన్మా చూసి చాలాకాలమైవుంటాలి. పద, మాంచి సిన్మావొకటి చూపిస్తాను." అన్నాడు శశాంక.

'ఏం సినిమానేమిటి?'

'భలేరాముడు, బంతరాముడు, పిడుగురాముడు, అగ్గిరాముడు, బుగ్గిరాముడు, యేంటీ రాముడు! అఫ్‌కోర్స్ ప్రక్కన సిన్మా మైథిలీ వుంటుందిలే' అని హడావిడిగా రిక్షా పిలిచాడు శశాంక

తొమ్మిదిన్నరకి సినిమా ముగిసింది హాలులోంచి బయటికి వొస్తూం డగా—వరండాలోంచి దిగి, కారు దగ్గరికి నడిచి వెడుతూన్న వొకామెను చూసి కనుబొమలు ముడిచాడు క్రిష్ణచైతన్య.

—అవును అదే గద్వాల జరీచీర! వెంటనే ఒకడుగు వెనక్కి వేసి వరండా స్తంభాన్ని అడ్డం చేసుకుని నిలుచున్నాడు వేగంగా కొట్టుకో సాగిన గుండె స్థిమితపడింది.

అప్పుడే అటువైపు చూసిన శశాంక, క్రిష్ణచైతన్య ప్రక్కకి వొక అడుగు వేసి అతనిని చేత్తో తట్టి, "వొక నిమిషం" అని త్వర త్వరగా ఆ కారు దగ్గిరికి వెళ్లాడు.

రెండు నిమిషాలకి కారు దగ్గిర్నుంచి వెనక్కి తిరిగాడు శశాంక. కారు బయల్దేరి గేటులోంచి దారిచేసుకోవటానికి ప్రయత్నిస్తోంది.

"వొస్తూ "ఆ యెంటోసడర్ కారు దగ్గిర ఆడవాళ్ళని చూశావ్—అందులో ఖరీదైన జరీచీర కట్టుకుని ఖజురహోని స్ఫురింపజేస్తూ నిలబడి వుందే; ఆమెని-చూశావా?" అన్నాడు శశాంక.

లేదన్నట్లూ అవునన్నట్లూ తల వూపాడు క్రిష్ణచైతన్య. యింకా అతని గుండెలో సంచలనం లాంటి స్పందన.

"సారీ, ఫ్రెండ్, రేపు వుదయం తీసికెళ్ళి పరిచయం చేస్తాను. భలే వింత విషయం జరిగింది ఆమె జీవితంలో. తర్వాత చెబుతాను—ముందు నడువ్, ఆలస్యం ఐతే హోటళ్ళు మూసెయ్యగలరు" అంటూ, అతని చెయ్యి పట్టుకుని హడావిడిగా గేటు బయటికి వొచ్చి రిక్షా పిలిచాడు.

"అతిపలందు వైవాహికాలందు అదేదో నన్నట్టు సినిమా వేళలందు రిక్షా బేరమాడెం దు. ఏకక్కరయ్యా క్రిష్ణా, రిక్షా" అన్నాడు శశాంక.

రిక్షాలో శశాంక ఆ ప్రసక్తి పేసుకు రాలేదు అందుకు క్రిష్ణచైతన్య వొకరకంగా సంతోషించాడు.

ఆమె గురించి వినాలనీ వుంది; వినొద్దనీ వుంది. కానీ అతను చెప్పబోయే వింత విషయం తనకి తెలుసు. అదంతా యిప్పుడు ఏకరువు పెడుతోంటే తన మనసు వికలమౌతుంది. ఆ జ్ఞాపకాలు తనకక్కరిలేదు. వినాలనీ వుంది! యేంచేస్తోందో, యెలావుందో—అని, కాని వెంటనే సమాధానమూ దొరికింది. యేంచెయ్యాలని వొచ్చిందో అదే చేస్తుంది; యేం చెయ్యకండా వుండిపోయిందో అది చెయ్యదు ప్రత్యేకం తప్పు పట్టటానికి యేమీ కనిపించదు. ఐనా లోన మనసులో ఏదోకసి, తామసం—

భోజనంచేసి యింటికి చేరుకున్నారు.

బట్టలు మార్చుకుని లుంగీచుట్టూకుంటూ, "అన్నట్టు ఆ ఖజురహో ఆవిడ వింత విషయం చెబుతున్నానుకదూ—ఏం చేస్తున్నావయ్యా, వూఁ అనైనా అనవు?" అని క్రిష్ణచైతన్య వైపు తిరిగి చూసి "యేవిఁటలా చూస్తావ్, ఆ ఖజురహోకీ, యీ ప్రాతికేయుడికీ యేవిఁ సంబంధం అనా? నీ ఆశ్చర్యాన్ని కాదనను. ఎలా తెలుసునంటే: వో ఆంధ్రదేశపు ఆనంద కుమారస్వామి యింట్లో పరిచయంలే" అని సిగరెట్ వెలిగించి, కుర్చీలో కూర్చుంటూ—

"ఆమె పేరు మాధురీదేవి, భర్త పేరు చిదంబరరావు. యింతకీ యేం జరిగిందంటే—" అని ప్రారంభించి ఆమె జీవిత వివరాలు భర్త అనారోగ్యం విషయం చెప్పి— "అసలు యిదంతా నీకెందుకు చెబుతున్నానంటే; ఇందులో నీ బుర్రకి మంచిమేత దొరికే విషయం వుంది కాబట్టి. వూటీలో కొంతకాలం గడపమని వైద్యులు సలహా యిస్తే వెళ్లారు. అక్కడ కొన్ని నెలలు గడిచాక వొక రోజున యెవరో సన్యాసి యేదో మందుగుళిక యిచ్చాడట, నిమిషాలమీద ఆ వ్యాధి తనకి అసలు రానట్లు అయ్యాడట— ప్రొద్దుట చూసినవాళ్ళు యెవరూ నమ్మలేనట్లు ఐపోయాడట. అలాంటి

అసంభవమైన వ్యాధి–చిన్న గుళికతో అలా మెటామార్ఫోసిస్‌లా ఐపోవటం సంభవమా? కాదని వెంటనే అంటాం. సాక్షాత్తు జరిగినప్పుడు నమ్మక తప్పుతుందా? కాగా, ఆయనకి ఆ జబ్బు వున్నట్లు యెందరికో తెలుసు. అలాంటి స్థితిలో మనిషి అమాంతం అలా తిరిగి వొచ్చాడంటే నమ్మక తప్పదుకదా! ఆ గుళిక అలోపథిక్‌కి సాధ్యం కాని మహత్తర ఆయుర్వేద గుళికా లేకదైవ మహిమాన్వితమైన శక్తి స్వరూపమా? నువ్వు చెప్పు జవాబు."

"అలాంటి వింతలు వినటమే కానీ చూడటం..."

మధ్యలోనే అందుకుని, "నాకు తెలుసు; సంప్రదాయ సత్యంకైన నీ మనసు, ఆ మాట అంటుందని. క్రిష్ణా, అలాంటివి సంభవం అని వొప్పుకోక తప్పదేమో" అన్నాడు శశాంక.

"కావచ్చు. యీ విషయాలన్నీ యెవరు చెప్పారు నీకు?"

"యెవరు చెప్పారు! యేంప్రశ్న? పత్రికలలో వార్త అనుకున్నావా నమ్మక పోవటానికి!" అని నవ్వి, "సదరు ఆంధ్రదేశపు ఆనందకుమార స్వామి ద్వారా విన్నాను." ఆ తర్వాత సదరు జూరహో సొంతనోటితో చెప్పగా విన్నాను."

"నీకు చెప్పిందా?"

"నాకు యేకాంతంలో చెప్పేంత గోపీ మానసచోరుణ్ని కాదులే నేను——" అని లేచి, మంచినీళ్ళ కూజా దగ్గిరికి అడుగులు వేశాడు శశాంక.

గతుక్కుమన్నట్లయి అతనికేసి చూసి యేదో అనబోయి, యెలా అనాలో తెలియక——చూస్తూ వుండిపోయాడు క్రిష్ణచైతన్య.

మంచినీళ్లు తాగి, వొచ్చి కూర్చుంటూ, "యీ వూళ్ళో ఆమె బంధువులు వున్నారు అక్కడికి వొచ్చింది. యిక్కడికి వొచ్చాక సదరు యెకే స్వామితో పరిచయం ఐంది. ఆ స్వామి డాన్‌జువాన్ కూడాలే–"

మధ్యలోనే అందుకుని, "అంటే!" అన్నాడు క్రిష్ణచైతన్య.

"ఆ విషయానికి తరవాత వొస్తాను. ముందు అసలు విషయం

చెప్పొచ్చు—"అలా తిరిగి వొచ్చాక, విశాఖకోనో యెక్కడికో కొన్ని నెలలు గడిచాక వొక రోజున కార్యాలయంలో కాగితాలు చూసుకుంటు వాటు చూసుకుంటున్నట్లే కుప్ప కూలిపోయాడట. యింటికి ఫోను చేస్తే అమాంతం వెళ్ళిందట. అందరూ కలిసి ఆయనని ఆస్పత్రికి తీసుకెళ్ళారట వెంటనే; లాభంలేకపోయిందట." అని తల పైకెత్తి క్రిష్ణచైతన్య ముఖంలోకి చూసి, "యెలా వుంది యీ రెండో అంతం? యీ రెండు అంతలకీ సమన్వయం కుదిర్చి, నేను నఫీజ్ మంజిల్ వొచ్చి వెళ్ళిపోయేలోగా చెప్పు నీ సంప్రదాయ సంశయాత్మ చెప్పే తుదిసమాధానం మీద నాకు యమగురి వుందిలే" అన్నాడు.

"మరి యిప్పుడేం చేస్తోంది? ఆ డాన్‌జువాన్ యేమిటి?"

"యేంచేస్తున్న దేమిటయ్యా; అర్థంలేని ప్రశ్న! ఖరపోయాడు. ప్రౌఢ. అయినా ఖజురహో—చూస్తే నీకే తెలుస్తుందిలే సదరు యె. కే. స్వామితో పరిచయం ఐందన్నానుగా—ఐంది ఐనట్లు వూహకోక దినదిన ప్రవర్ధమాన మౌతున్నట్లు జనవాణి. అందుకే చాలారోజులుగా యీ వూళ్ళో బంధువుల యింట్లో వుంటున్నదని కొన్ని విశ్వసనీయ వర్గాలు భావిస్తున్నాయి."

"తనతో తరచూ కలిసి తిరుగుతూ వుంటుందా? డాన్‌జువాన్ అన్నావేమిటి? మరి. ఆమె డాన్‌జువానెస్సా?"

"యెన్నాళ్ళ కెన్నాళ్ళకి – యెన్నాళ్ళకి మంచి విషయంలో నిజమైన కుతూహలం చూపెట్టావోయ్, క్రిష్టా! నిజంగా నేడు సుదినం" అని నవ్వి "పొద్దుట తీసుకెళ్ళి పరిచయం చేస్తానన్నాగదా- పరీక్షగా చూసి ఆ విషయం గ్రహించు. నాకు తెలిసినంత వరకూ, సదరు యెకేస్వామి మీద, ప్రేమో, వ్యామోహమో దాన్నేమన్నా అననీ— అది కలిగిందనీ అందుకే అతనికోసం ప్రయాసలు పడుతున్నదనీ అనిపిస్తుంది. యితరత్రా గ్రంథాలకి శ్రీకారాలు చుడుతున్నదని నే ననుకోను. పాపం, ఆ ప్రేమలో పడి తలమునకలవుతోంది. విషాదస్థితి యేమిటంటే సదరు యెకేస్వామి దేశానికి స్వతంత్రంవొచ్చిన రోజున తను అస్వతంత్రుడయ్యాడు. అనగా అగ్నిసాక్షిగా ధర్మపత్ని చిటికిన వేలు పట్టుకున్నాడని."

"ఆ యెకేస్వామి యెవరసలు?"

"చెప్పానుగా!"

"యింకా తిన్నగా చెప్పలేవూ?"

యెవరో చెప్పి- "మూడో వింత యేవిటంటే, నువ్వు యీ విషయంలో కుతూహలం చూపెట్టటం!" అని ఫకఫకా నవ్వి, "పోనీ, రేపొద్దున యెలాగా వెళ్లబోతున్నాంకదా, నీ అంతటి వాడివి నువ్వు, నీగ్గానీ నచ్చితే చెప్పు—ఆమెని రక్షించిన వాడివవుతావు. పరోక్షంగా సదరు యెకేస్వామినీ, ఆయన పెళ్ళాం పిల్లల్నీ కూడా"

"నీ అసాధ్యం కూలిరి నేనింతవరకూ ఆమెను చూడనేలేదు కదోయ్—నేను చెప్పటమేవిటి?"

"అదే, రేపొద్దున చూస్తావుగా-చూశాకనే."

"చూసేసి-యీ వూళ్ళోనే వుంటున్న వాడివి నువ్వే చెప్పుకో కూడదూ?"

"శశాంకుడు గగనవిహారం చేస్తుంటాడు. ఖజురహోగుహా ముఖం లోకి చొరబడి శాశ్వతంగా చిక్కుపోడయ్యా. వొకతారనుంచి యింకొక తారకి నిరంతర చంచల విహారం చేస్తుంటాడు శశాంకుడు" అని సిగరెట్ వెలిగించి, పొగలోంచి చూపు వొంపులు తిప్పుతున్నాడు

—పాపం, యిలా జరుగుతుందని పాపం అనెందుకనుకోవాలిలే-యిప్పుడు తను కంటపడితే యేం చేస్తుందో యేమేనా చెయ్యగల మనిషి—కాని తను కలవడు-కలవను-కలిపిన దగ్గిరినుంచి...

"ముద్దుక్రిష్ణా, యిది మూడోసారి పిలవటం?"

తుళ్ళిపడినట్లు తేరుకుని శశాంకకేసి చూశాడు క్రిష్ణచైతన్య

"మొదటిసారి గౌరవంగా అయ్యా క్రిష్ణా అన్నాను. రెండోసారి భక్తితో స్వామీ చైతన్యా అన్నాను, మూడోసారి ముచ్చటగా ముద్దుక్రిష్ణా అన్నాను. తకిమని పలికావు. అవును, యే గోపికో, యశోదో పిలిస్తే పలికిపిలిసినవాడివి, యీ కంసుణ్ని లక్ష్యపెడతావుటయ్యా!" అని పకపకా నవ్వి, అంతలోనే గంభీరంగా ముఖంపెట్టి, "క్రిష్ణా వొకమాట చెప్పు. నిజంగా నీకు—కూడనంత పరాకు ఎక్కువైనట్లుందిప్పుడు అదివరలో గీ వికాన్వేషణ

యిలా కాదు నెమ్మదిగా నిలబడి యెదిగెత్తి చూసే చూపింపకుండా,
యేనో జ్ఞాపకాల అలికిడికే యిన్ని సదుపాయంగా కనిపిస్తున్నావు క్రిష్ణా.
క్రిష్ణా యేమైంది నీకు? అసలు నన్ను గుర్తించేందుకు వెళ్ళాల్సిన అవసరం
యెందుకు కలిగింది? తగినంత కారణం చెప్పకుండా నువ్వు యిల్లు కదిలి,
యిలా తయారై కనిపిస్తావంటే నమ్మలేను నేను—నేను, యెంత కాలంగానో
నీ ఛాయల్లో సన్నెరిగి ఆటలాడుతున్న వాణ్ని!" అతని గొంతు వొణికి
నట్లయింది

ఆర్ద్రంగా అతనికేసి చూసి, "శశాంకా, నేను నీ అంత నిష్కల్మ
షమైన వాణ్నికాదు నువ్వు నన్ను చాలా వాటికి క్షమించాల్సి వుంటుంది"
అన్నాడు క్రిష్ణచైతన్య. అతని కళ్ళలో చెమ్మ స్పష్టంగా కనిపిస్తోంది

లేచి అతని దగ్గిరకి వెళ్ళి, భుజంమీద చెయ్యివేసి, "క్రిష్ణా, వూరికే
సరదాకన్నాను అంతగా చలించాల్సిందేమీ లేదిందులో" అన్నాడు శశాంక.

"లేదు శశాంకా, వూరికే కాదు, నిజమే. నేనే అంటున్నాను కదా.
అక్షరాలా నిజం నువ్వన్నమాట సరదాకోసం కాదు తగినంత కారణం
వుండబట్టే. కనీసం- వుందను కోబట్టే— అప్పుడు నా దగ్గిర నువ్వు లేవు.
వుంటే చెప్పి వుందును— నాన్నగారికి చెప్పలేను చెప్పేంత చనువులేదు
నాకు ఆయన దగ్గిర. కానీ తరవాత తెలిసింది— వొక నైరూప్య రూపం
లాంటి చనువు వుందనీ, దాన్ని నేను గ్రహించలేక పోయాననీ" అని ఆగి
తాపీగా లేచి మంచినీళ్ళు పోసుకుని తాగి వొచ్చి, శశాంక ముఖంలోకి
చూసి "వెనక మనం నఫీస్ మంజిల్‌లో కలిసినప్పుడు— మళ్ళీ యిదే
కలవటం కదా—అప్పుడు—నువ్వు చూశావుగా— ఆ విషయమూ పరిస్థితీ
నీకు అర్థమైందని నాకు తెలుసు. అందుకే ప్రత్యేకం నీతో నేనేమీ చెప్ప
లేదు—ఆతరవాత గీత వెళ్ళిపోయింది చెప్పకుండా" అని ఆగిపోయాడు.

"అవును ఆ వేళకి నువ్వు లేవట."

అమాంతం అతని ముందుకు నడిచి అతని భుజాలమీద చేతులు
వేసి వూపుతూ, "యేమిటి, ఆ తరవాత గీత నీకు కనిపించిందా? నాకు
రాయలేదేం?" అని గద్దించినట్లు అడిగాడు.

అని నాకు ఆమె నఫీస్‌మంజిల్ నుంచి వొచ్చేసిన యేన్నర్థం

మరీచికాన్వేషణ

తరవాత-బొంబాయిలో ఆమె నాకు కనిపించినప్పుడు తెలిసింది. నీఅడ్రసు నాకు తెలీదు కాగా ఆ విషయం అంత గాఢమైందని తెలీదు" అన్నాడు శశాంక.

"ఐతే ఆ తరవాత గీత నీకు కనిపించిదన్న మాట! చెప్పు యేమని అంది నీతో?"

"ప్రత్యేకం యేమీ అనలేదు. కానీ ఆమెమీద నీ ఛాయ వున్నట్లని పించింది నాకు."

అతని భుజాలమీదనుంచి చేతులు తీసేస్తూ, "ఐతే నన్ను గురించి యేమీ చెప్పలేదన్నమాట!" అన్నాడు.

"చెప్పానుగా- ప్రత్యేకం యేమీ చెప్పలేదని. కానీ గీతాదేవిగారి మాటలలోని ధ్వనినిబట్టి నీ ప్రభావం ప్రస్ఫుటంగా తనమీద వున్నట్లు గ్రహించాను. నువ్వు వుద్యోగానికి సెలవుపెట్టి వెళ్ళినట్లూ యేదో యేదో రాశావు నాకు అందులో గీతాదేవిగారు నిన్ను చలింపజేసిందని గ్రహించాను కానీ, అంతకంటే నేనింకేమీ వూహించలేకపోయాను."

"బొంబాయిలో యెక్కడుంటోంది? యేంచేస్తోంది? యెలావుంది?"

"నేను బొంబాయి నుంచి తనకంటే ముందే వొచ్చేశాను. ఆ తరవాతమళ్ళీ నేను చూడలేదుగానీ—"

"ఆగిపోయావేం, చెప్పు కానీ యేమిటి?"

"అబ్బే, యేంలేదు—మళ్ళీ నేను చూడలేదు గానీ, చూస్తే బావుం దేది—అని అనబోయి యెందుకో ఆగిపోయాను. అంతే."

"కాదు, నేను నమ్మను. నువ్వేదో దాస్తున్నావు, నా నుంచి."

"లేదు క్రిష్ణా, నేనేమీ దాచటంలేదు. నిజంగానే ఆ తరవాత మళ్ళీ గీతాదేవిగారిని చూడలేదు."

"కావొచ్చు; నువ్వు మళ్ళీ చూడకపోయి వుండొచ్చు. కానీ యిం కేదో దాస్తున్నావు నా నుంచి, నీ మాటలో తీరులో నాకు స్పష్టంగా కని పిస్తోంది—స్పష్టంగా కనిపిస్తోంది శశాంకా."

"అబ్బే అలాంటిదేం లేదు క్రిష్ణా."

"ఎలాంటిదో నాకు తెలియదుగానీ; యేదో విషయం మొత్తానికి నానుంచి దాస్తున్నట్లు నాకు రూఢిగా స్పష్టంగా అనపిస్తోంది. అది యేమైనా కావచ్చు కానీ యీ సందర్భంలో యేదో విషయం యెందుకు వొస్తుందో నేనూహించలేకపోతున్నాను. యేమైనా, శశాంకా నీకిష్టంలేని విషయం చెప్పమని బలవంతం చెయ్యను."

యేం చెప్పాలా, చెప్పకపోతే వింత అపార్థానికి దారితీసేలావుందే—అన్నట్లుగా నేలమీదకి చూస్తూ, కనుబొమలు ముడిచి—

"శశాంకా, చూడూ—శ్రమపడి యేదో విషయం కల్పించి చెప్పాల్సిన అవసరం నీకు అక్కరలేదు. చెప్పమని నిన్ను అడగటం లేదు నేను"

తలయెత్తి, "అవును. నోటిదాకా వొకమాట వొచ్చి—ఆపుకున్నాను ఆ మాట నీ నుంచి దాస్తున్నాను. చెప్పేస్తాను—" మధ్యలోనే అందుకుని, "చెప్పనవసరం లేదన్నానుగా శశాంకా. వొద్దు"

"మనిద్దరం, వొకరి మీద వొకరం పంతాలికి పోవటం యెన్నడూ అలవాటు లేదు క్రిష్ణా. నేను చెబుతాను; నువ్వు వింటావు" అని శ్వాస పీల్చుకున్నాడు

అతనికేసి చూశాడు క్రిష్ణచైతన్య.

"సీతాదేవిగారు ప్రస్తుతం హైదరాబాద్‌లోనే వుంటున్నారు."

"ఈ మాట చెప్పటానికి యెంత రభస చేశావోయ్! హైదరాబాద్‌లో—యేం చేస్తోంది యెక్కడుంది, యెలా వుంది. యెన్నాళ్ళనుంచి వుంది?"

"యెలా వున్నదీ నాకు తెలీదు. యెన్నాళ్ళనుంచి వున్నదీ—తెలీదు. వుస్మానియాలో రిసెర్చి చేస్తున్నారట"

"ట—అంటే, యెవరు చెప్పారు నీకు?"

"యేం ప్రశ్న వేశావోయ్? యెవరు చెప్పారేమిటి! విశ్వసించ తగిన వ్యక్తి యెవరో చెప్పారని."

"నీ పత్రికల వాలకం కట్టిపెట్టి—పేరు చెప్పు"

"నా మిత్రుడు, పేరూ—"

వెంటనే అందుకుని, "అంత విశ్వసనీయుడి పేరెలా మరపుకొచ్చిందోయ్, నీ చోట్లాం కూలిం" అని ఆగి, అతని ముఖంలోకిచూసి, "చూడు శశాంకా, నీకు నాటక మాడటం చాతకాదు. అది చాతై వుంటే యీపాటికి మంత్రిపై వుండేవాడివి నీ సత్తువ కొట్టటం, గుంజాటన, మూఖవాలకం—స్ఫటికంలోలాగా కనిపిస్తున్నాయి. నువ్వన్నట్లు పూనా వెళ్ళి నటనలో తర్ఫీదుపొంది వొచ్చాక ఆ పని ప్రారంభించుదువు. అందాకా వృధాగా వెర్రి ప్రయాసపడకు."

"మిత్రుడుకాదు. ఆ విషయం చెప్పింది డాడీగారన్నారు నాతో."

"నాన్నగారా?" అని నోరు ఆగాగే క్షణకాలం తెరిచి, వెంటనే తుళ్ళిపడినట్లుగా చలించి, "నాన్నగారి కెలా తెలుసు? నువ్వు గడగడా—దాచే ప్రయత్నం చెయ్యకుండా చెప్పకపోతే—" అని ఆగిపోయాడు. అప్రయత్నంగా అతని పిడికిలి బిగిసింది.

"క్రిష్ణా నాకు తెలిసినంతవరకూ చెబుతాను. గీతాదేవిగారు నఫీస్ మంజిల్‌లో వుంటున్నారు. డాడీ—"

మధ్యలోనే అందుకుని, "యెక్కడ? యెక్కడన్నావ్?" అని అతనికి దగ్గిరగా నడిచి, అతని భుజంమీద చెయ్యివేసి, "నిజంగా నఫీస్ మంజిల్‌లో వుందా? నువ్వు అబద్ధమాడుతున్నావు. అవునా?" అన్నాడు క్రిష్ణచైతన్య.

అతని చేతిని తన చేతిలోకి తీసుకుంటూ, నవ్వి, "యిప్పటిదాకా నిజం దాస్తున్నానన్నావు. యిప్పుడు నిజం చెబితే అబద్ధం చెప్పానంటున్నావు నువ్వసలు నన్ను పూర్తిగా చెప్పనివ్వకుండా మధ్యలో ప్రశ్నలు వేస్తే యెలా చచ్చేది నీతో—" అని అతని చెయ్యివొదిలి, "డాడీగారన్నారు ఆవిడ నఫీస్‌మంజిల్‌కి చెందిన మనిషట" అన్నాడు శశాంక.

"నాన్నగారు అన్నారా? అయితే ఆయనకి ఆ విషయం అంతా తెలుసునన్నమాట! యెన్నాళ్ళనుంచి తెలుసోంది?"

"చూడు క్రిష్ణా. నాకు తెలిసిందంతా మళ్ళీ చెబుతాను విను. ఆపైన ప్రశ్నలు అడగవొద్దు. కారణం అంతకంటే నాకేమీ తెలీదు కాబట్టి.

క్రిష్ణచైతన్య బల్ల దగ్గిరికి వెళ్ళి మంచి నీళ్ళు పోసుకుని తాగాడు.
శశాంక, సిగరెట్ వెలిగించుకుని కుర్చీలో కూర్చున్నాడు.

"గీతాదేవి గారిని నేను బొంబాయిలో చూడటమే ఆఖరుసారి. నాకు తెలిసింది యిది-గీతాదేవిగారు నఫీస్‌మంజిల్‌లో వుంటున్నారనీ, ఆమె నఫీస్‌మంజిల్‌కి చెందిన వ్యక్తి అనీ, విశ్వవిద్యాలయంలో రిసెర్చి చేస్తున్నారనీ, డాడీగారు యేదో మాటల సందర్భంలో అన్నారు. యింతకంటే మించి యింక నువ్వు, అడిగిన—అడగబోయే, యే ప్రశ్నలకీ నాదగ్గిర సమాధానాలు చెప్పటానికి తెలిసిందేమీ లేదు" అన్నాడు శశాంక.

"అది సరే—"

శశాంకను యెవరో పిలిచారు బయటి నుంచి.

"మా కార్యాలయం బంట్రోతు గొంతులా వుంది. యేం వారంటు తెచ్చాడో నారద శిష్యుడు!" స్వగతంలా అంటూ బయటికి వెళ్ళాడు శశాంక

క్రిష్ణచైతన్య పడక కుర్చీలో వొరిగి కనురెప్పలు వాల్చాడు

"ప్రెస్సు తగలబడిపోయిందాయేమిటి, అవతరించావు!" అంటూన్న అతని దగ్గిరికి వొచ్చి టెలిగ్రాం అందించాడు. తీసుకుని, "సరే వెళ్ళు" అన్నట్లు తల వూపి – లోనకి వొచ్చి కవరు చించి మడత విప్పాడు శశాంక.

కెవ్వున కేక పెట్టి కుప్పలా కూలిపోయాడు నేలమీదకి.

కుర్చీలోంచి అదిరిపడి లేచాడు క్రిష్ణచైతన్య.

చూసి, "యేమైంది శశాంకా!" అన్నాడు అతని మీదకి వొంగి.

కళ్ళుప్పగించి అలాగే చూసి, భోరున యేడ్చాడు శశాంక.

"యేమైంది శశాంకా, చెప్పు. అని అతని భుజాలు పట్టుకుని కదిపాడు.

చేత్తో తన ప్రక్కకి చూపించాడు శశాంక.

అతను చూపెట్టినవైపు చూశాడు క్రిష్ణచైతన్య. యేమీలేదు. చుట్టూ చూశాడు దూరంగా పాలిపోయిన గులాబీరంగులో టెలిగ్రాం కాగితం కనిపించింది.

గబగబా వెళ్ళి వొంగి అందుకున్నాడు.

"పి డాడీ పోయారు. వెంటనే బయల్దేరాలి—గీతాదేవి."

కళ్ళకు యేదో కమ్మినట్లయి—కళ్ళు తిరిగి — తూలి రెండడుగులు వేశాడు. కళ్ళనుంచి రాలిన నీటిబొట్లు నేలమీద పడ్డాయి. బల్లమీద చేతులు ఆన్చి—కుర్చీలో కూలబడిపోయి—నోరు మెదపలేదు. కళ్ళనుంచి నీళ్ళు ధారలుకట్టి కారుతున్నాయి.

పావుగంటకి శశాంకలేచి క్రిష్ణచైతన్య దగ్గిరికి నడిచివెళ్ళి భుజం మీద చెయ్యివేశాడు. క్రిష్ణచైతన్య తల పైకెత్తాడు. శశాంక అతనిమీద వాలిగి వెక్కి వెక్కి యేడ్చాడు.

క్రిష్ణచైతన్య నోరు మెదపలేదు—అతని కన్నీటి ధారలు ఆగ లేదు!

ఐదు నిమిషాలకి కాస్త దిగమింగుకుని, "యీవేళప్పుడు రైలు లేదు. పొద్దుట బస్సుంటుంది. కానీ—" స్వగతంలా అన్నాడు శశాంక—లోయలో కీచుగొంతు ప్రతిధ్వనించినట్లయింది.

ప్రక్కకి తిరిగి అతనికేసి పిచ్చిగా, వెర్రిగా చూశాడు క్రిష్ణ చైతన్య.

"కానీ అందాకా వీల్లేదు—టాక్సీలో వెళ్ళాలి" అన్నాడు శశాంక.

తలవూపి—లేచాడు క్రిష్ణచైతన్య. అతని మౌనం కరగలేదు; కన్నీరు గడ్డకట్టలేదు.

నఫీస్‌మంజిల్ ఆవరణలో ఆగిన టాక్సీలోంచి దిగాడు క్రిష్ణచైతన్య. జుట్టు చెరిగిపోయివుంది. కళ్ళలో యెర్రగా కందిపలు బుగ్గల మీద కన్నీటి చారికలు.

తెలినలి వెలుగులో మెరుస్తున్న నాలుగైదు కార్లు.

డ్రైవరు సామానుకింద పెడుతున్నాడు.

డబ్బులిచ్చి, శశాంక, క్రిష్ణచైతన్య వెనకగా నడిచి వొస్తున్నాడు.

మెట్లమీద కూర్చున్న పనివాళ్లు లేచి తడికళ్లు తుడుచుకుంటూ నిలుచున్నారు

డ్రాయింగ్రూంలో వూళ్ళో వ్యక్తులు నలుగురైదుగురు కూర్చుని వున్నారు. క్రిష్ణచైతన్య రావటం చూసి, నాయక్ లేచి వొచ్చి అతని భుజంమీద తల ఆన్చి కళ్ళ నీళ్ళు పెట్టుకున్నాడు.

మౌనంగా ముందుకు నడిచాడు క్రిష్ణచైతన్య — ప్రక్కన పని మనిషి. వాళ్ళవెనక నాయక్ శశాంకలు.

మధ్యగదిలో వొంటరిగా కూర్చున్న మేనత్త, క్రిష్ణచైతన్యని చూసి బావురు మంది. గదిలోకి నడిచాడు.

మోకాళ్ళమీద కూచుని మంచం అంచుమీద ముఖం ఆన్చి వున్న గీతాదేవి తల రవ్వంత యెత్తింది. ముఖాన చెదిరిన బొట్టు. సిమ్మెంటు రంగుచీర. విడిన జుట్టు.

క్రిష్ణచైతన్య!

దుఃఖం పొర్లుకొచ్చి, పరుపులో ముఖం గుచ్చి వెక్కి వెక్కి పడుతోంది.

మంచం దగ్గిరికి తాపీగా నడిచి, వొణుకుతున్న కాళ్ళను చప్పున వొంచి, మోకాళ్ళమీద కూలబడి తండ్రి గుండె మీద తల ఆన్చాడు, మౌనంగా. కళ్ళమంచి నీరు ధారలుకట్టి పొర్లుతోంది.

తలవైపున వొరిగి వెక్కి వెక్కి పడుతున్నాడు, శశాంక. వొంగి క్రిష్ణచైతన్య భుజం మీద వోదార్పుగా చేత్తో తడుతున్నాడు నాయక్.

సశేషమ్ జీవితమ్

పదకొండు గంటలకి విజయవాడ నుంచి పదిపది హేనుమంది బంధువులు వొచ్చారు.

ప్రహరీ గోడ బయటా ఆవరణలోనూ కార్లు

డ్రాయింగ్రూంనిండా జనం. మెట్లమీద కొందరు బంధువులు, పని

జనంతో నిండిన నఫీజ్ మంజిల్, తెగిన యేకతార తుది సవ్వడిలా, యేకాంతంగా నిశ్శబ్దంగా గొణుగుతున్నట్లుగా వుంది.

పెద్ద వూరేగింపు జరపాలన్నారు వూళ్ళోంచి వొచ్చిన పలువురు పరిచయస్థులు, వుద్యోగులు. తల అడ్డంగా తిప్పాడు క్రిష్ణచైతన్య, అతని గొంతు యింకా మౌనంతో బిగిసిపోయే వుంది.

దహనక్రియ ముగిసేసరికి మసకచీకట్లు కమ్ముతున్నాయి.

క్లబ్బులో పేకాడుతూ - అంతలోనే కుప్పలా కూలిపోయాడట. గుండె ఆగిపోయిందట.

వూళ్ళనుంచి వొచ్చిన జనం తప్ప అందరూ వెళ్ళిపోయారు.

శ్మశానం నుంచి పిచ్చి చూపులు చూసుకుంటూ వొచ్చి, యింటి ముందు మెట్లమీద కూలబడిపోయాడు, క్రిష్ణచైతన్య. వొంటిమీద — ధోవతీ, వుత్తరీయం. అతని ప్రక్కన, మోకాళ్ళమీద తల ఆన్చి కూర్చున్నాడు శశాంక.

వొక గంట గడిచింది చీకటి వొత్తిడికి ఓగుసుకు పోయినట్లుగా వుంది నఫీస్ మంజిల్.

శశాంకా—అని యెవరో అన్నట్లనిపించి, తల యెత్తి అతని జబ్బ పట్టుకుని లేవదీసి నడిపించుకు వెళ్ళాడు శశాంక.

డ్రాయింగ్రూంలో పెత్తండ్రి, పెత్తండ్రి కొడుకులు. మేనత్త కూతురు; యింకా నలుగురైదుగురు కూర్చుని వున్నారు.

మౌనంగా లోనకి నడిచాడు క్రిష్ణచైతన్య.

"శశాంకకి చెప్పి పోవాలన్నావుగా—అతగాడు బయట కూర్చునున్నాట్ట. ఆ చెప్పేదేదో చెప్పిపో మహాతల్లీ రాక్షసీ — పండంటి నా అన్నను పొట్టన బెట్టుకున్నావు. నిండు ప్రాణాలు తీశావు. భజాభుముంఢవి ... శేషమ్ జీవితమ్

గసిలాగా దాపురించావు మా యిండికి. యికనైనా విరగడవ్వు." మధ్యగది
రొంచి మేనత్త గొంతు.

యిన్నిరోజులూ నన్ను దువ్వుతూ వొచ్చిన నువ్వే! అవును; యింక
నా అవసరం యేముంది నీకు!— అన్నట్లుగా ఆమెకేసి చూసింది గీతాదేవి.

లోన అడుగుపెడుతూ, విని—గీతాదేవినీ మేనత్తనీ చూశాడు క్రిష్ణ
చైతన్య. యేదో అర్థమైనట్లనిపించింది అతనికి.

నిమ్మదిగా గీతాదేవివైపు అడుగులు వేస్తున్నాడు.

"దానికి దగ్గిరికి వెళ్ళకురా, కిష్టుడూ—అది మహమ్మారి. మందులు
పెట్టి మనుషుల్ని మార్చేసే మాయలమారి" బిగ్గిరిగా అని, యేడుస్తోంది
మేనత్త.

అతని గొంతు యింకా మౌనంతో బిగిసిపోయేవుంది సీతమ్మ
వైపు వుగ్రంగా చూసి—గీతాదేవికి యెదురుగా నిలుచున్నాడు.

కనురెప్పలు రవ్వంత యెత్తి, అతనిని గమనించి, మళ్లీ రెప్పలు
వాల్చింది.

మౌనంగా, గీతాదేవి చెయ్యి పట్టుకుని బలంగా కదిపి—తన గది
వైపు నడిచాడు.

వొచ్చాక యిదే మొదలు, అతను తన గదిలో అడుగుపెట్టటం.

వొంకీమీద చీరలు, బ్లౌజులు—తను ఎరిగిన గదిలా అనిపించనట్లుగా
కనుబొమలు ముడిచి చూసి—యెడమ చెయ్యి వెనక్కి వొంచి తలుపు
గడియ తిప్పి, ఆమె చెయ్యి అలాగే పట్టుకుని మంచం దగ్గిరికి నడిపించి
కూర్చోబెట్టి—

నేలమీదకి కూలబడి మోకాళ్ళమీద కూర్చుని ఆమె వొడిలోముఖం
దూర్చి—అతని మౌనం చిట్లింది.

"గీతా, గీతా—" అని వెక్కి-వెక్కి యేడుస్తున్నాడు.

కళ్ళుమూసుగుని శ్వాస బరువుగా విడిచి, అతని తలమీద చెయ్యి
వెస్పటోయి అంతలోనే ఆగిపోయి—చెయ్యి పైకి వొంచి వేళ్ళతో పెదవి
నొక్కుకుంది.

ఆమె కళ్ళనుంచి నీటిబొట్లు రాలి అతని మెడమీద పడ్డాయి.

సశేషమ్ జీవితమ్

ఆమె నడుం చుట్టూ చేతులు తిప్పి, వొడిలో ముఖం వొత్తుకుని, "గీతా గీతా గీతా—" అని ప్రలాపంలా పలుకుతున్నాడు.

చీర పొరలోంచి వింతగా ధ్వనిస్తున్నాయి, అతని మాటలు.

భారంగా శ్వాస వొదిలి, తల విదిలించుకుని, అతని తలమీద ఆరి చెయ్యి ఆన్చింది.

అరగంట గడిచింది.

అలాగే నిశ్చలంగా కూర్చుండి పోయింది గీతాదేవి. జుట్టు భుజాల మీంచి జారి అతని తలమీద కదులుతోంది.

అతను నిద్రనుంచి మేల్కొంచిన వాడిలా కదిలి, తలయెత్తి ఆమె ముఖానికేసి చూసి—పైకి ప్రాకి ఆమెముఖాన్ని తనచేతులలోకి తీసుకుని "గీతా—" అంటూ తన ముఖం ఆమె ముఖంమీద అదిమి, వొణికి పోయాడు.

ఆమె వొంటి పరిమళం అతని ముఖంమీద ఆవిరి పొగలా ఆవరించింది.

అతని కన్నీరు ఆమె కంటి తడిలో కలిసింది.

అతనికేసి మౌనంగా చూసి— కనురెప్పలు వాల్చింది. ఆమె కను రెప్పలమీద పెదవులు అద్దుతున్నాడు.

కొద్దిగా జరిగినట్లు కదిలింది.

శక్తి కూడదీసుకుంటున్నట్లుగా కదిలి—లేచి నిలుచున్నాడు. ఆమె లేచి, వొక అడుగు అవతలికి వేసి నిలబడింది.

తన తండ్రిని దీవించి, తనని రక్షించటానికొచ్చిన మౌన శోక దేవతలా అనిపించింది, అతనికి.

వొక నిమిషం అలాగే నిలబడి, చూపుకిందకి వాల్చి, దీర్ఘంగా శ్వాస వొదిలి అవతలికి అడుగులు వేసింది.

అతను, ఆమెకేసి దీనంగా బలహీనంగా అలసటగా చూస్తున్నాడు. లోన యేదో తపనలాంటి సంచలనం.

తన బట్టలు వొక్కొక్కటే తీసి మడతలువేసి బల్లమీద పెట్టు కుంటోంది

**పశేషమ్ జీవితమ్**

"గీతా నువ్వు–" అని ఆగిపోయాడు.

వినిపించనట్లుగా బట్టలు సర్దుకుంటూ వుండిపోయింది– వొక నిమిషం
డిచింది.

"గీతా, ఆ బట్టలన్నీ–యేమిటి నువ్వు చేస్తున్నపని!" అన్నాడు
ఆమెవైపు అడుగువేస్తూ.

మెడకొద్దిగా తిప్పి, అతనికేసి నిశ్చలంగా సాదాగా చూసి, విషా
దంగా నవ్వింది చప్పుడవకండా. చూపు కిందకివాల్చి–తిరిగి బట్టలు సర్దు
కుంటోంది తాపీగా.

వడివడిగా ఆమె దగ్గిరికి వెళ్ళి వొకచెయ్యి ఆమె భుజంమీదా
యింకో చెయ్యి సూట్కేసుమీదా వేసి. "వెళ్ళిపోవాలనా?" అన్నాడు
ఆమె భుజాన్ని వూపుతూ

అవునన్నట్లు తల వూపింది. వెనక్కి తిరగకండానే.

"వెళ్ళిపోవటానికే వొచ్చావా, గీతా?"

కాదన్నట్లు తల అడ్డంగా కదిపింది.

ఇద్దరికీ మధ్య నల్లతెరలా ఆమె జుట్టు.

"మరి యిప్పుడు దేనికి వెళ్ళిపోవటం? వాళ్ళెవరో యేదో అన్నారనే
దా?"

కాదన్నట్లు తల అడ్డంగా కదిపింది.

"మరి? మరి—దేనికి, వెళ్ళిపోవాలనుకోవటం? చెప్పు గీతా?
నాతో మాట్లాడవేం గీతా?" అన్నాడు ఉద్వేగంగా.

వెనక్కి తిరిగి బాధగా నవ్వి, "వెళ్లాలని రాలేదు" అంది.

"మరిప్పుడేమైంది? నాకేమీ బోధపడటం లేదు. సరిగా చెప్పు గీతా"
ప్రాధేయపడుతున్నట్లుగా అన్నాడు

"మీకు అర్థంకాదని నాకు తెలుసు వొచ్చిన పని ఐపోయింది.
యింకా యిక్కడ వుండాల్సిన అవసరం తీరిపోయింది" అంది.

"యిన్నాళ్ళకి నేను తిరిగి వొస్తే—నువ్వు వెళ్లిపోవటం–" అని
ఆమె భుజాలమీద చేతులువేసి వూపుతూ, "నాకు పిచ్చెక్కేలా వుంది
గీతా" అని వెర్రి చూపులు చూశాడు ఆమె ముఖంలోకి.

"మీరు అనవసరంగా వుద్రేకపడకండి. నేనెవరినో మీకు తెలియదు."

"యేమిటీ, నువ్వెవరినో నాకు తెలీదా గీతా! నిజంగానే నాకు తెలియదనుకుంటున్నావా? యిన్నేళ్ళుగా నీకోసం—" శ్వాసపీల్చుకున్నట్లుగా ఆగి, "అప్పుడు నాదే పొరపాటు. నాకు తెలియని పొరపాటు, తరవాత తెలుసుగుని బాధపడ్డాను. అప్పటి నుంచి వెర్రిగా దేశాలవెంట తిరుగుతున్నాను—బహూశా నీ నుంచి—నాలోని నీ నుంచి పారిపోవాలని. కానీ—" అన్నాడు వుద్వేగంగా.

"యెప్పటిమాటలో యిప్పుడు దేనికి? నేను మీరనుకునే గీతాదేవిని కాదు."

"యేమిటి నీ మాటలు! నాకర్థం కావటం లేదు. స్పష్టంగా చెప్పు, లేకపోతే నా తల పగిలిపోయేలా వుంది. చెప్పు గీతా చెప్పు" అంటూ ఆమెను పెనవేసుకున్నట్లుగా వొరిగి కంపించిపోయాడు.

తూలి—వొరిగినట్లయి—నేలమీదకి కూలబడి పోయారు యిద్దరూ.

"కొన్ని నెలలు వొకచోట వొకవ్యక్తికి భార్యని" అంది.

"ఏమిటి నువ్వనేది! నువ్వు యెవరికీ భార్యవి కాదు. కావటానికి వీల్లేదు" అని వొరిగిపోబోతున్నట్లు ముందుకు వొంగి చూశాడు ఆమె ముఖంలోకి.

"నాకు పెళ్ళయింది."

"మరి యిక్కడ—యిక్కడెలా——"

"కొన్ని నెలలలో అది నేనువుండాల్సిన చోటు కాదని తెలిసొచ్చింది. మనసు యెక్కడెక్కడికో పరుగులిడితే—చివరికి యిక్కడకి రావటం జరిగింది."

"ఆ గతం యిప్పుడనవసరం. నా అజ్ఞానంవల్ల విడిపోయాం. యిన్నాళ్ళూ నరకం అనుభవిస్తూ జీవితం గుడిచింది. నా వొళ్ళు గుల్లఐపోయింది గీతా— నువ్వు నన్ను పూర్తిగా అర్థం చేసుకోక తొందరపడి వెళ్ళిపోయినందుకు మొదట్లో బాధ, తరవాత స్వాభిమానం——కానీ నీ తొందరపాటు సబబైనదే. నన్ను నేను తెలుసుకోలేక అలా జరిగింది. నశేషమ్ జీవితమ్

క్షమించు గీతా—నేను, అప్పటి క్రిష్ణను కాదు."

"నేనూ అప్పటి గీతాదేవిని కాదు."

"అందుకే. అందుకే, గతాన్ని మరిచి యింక—" అని ఆగిపోయి, ఆమె కళ్ళలోకి చూడబోయాడు.

తన చూపు వాళ్ళోకి వాల్చి, "కాని గతాన్ని యెదుర్కోవటం కష్టం" అంది.

"గతం అంటే గడిచిపోయినది. యెదుర్కొనే పనిలేదు. మర్చి పోతే చాలు."

"గతం వర్తమానమై ఘనీభవించింది. యీ వర్తమాన స్థితిని మీరు యెదుర్కోలేరు. యెదుర్కోమని నేను చెప్పటమూలేదు—" అని వొక క్షణం ఆగి, "నేనూ యెదుర్కోలేనేమో—" అంది.

"గీతా నువ్వూ—నీ మాటలు—యేవిటి, శిలలా అనిపిస్తున్నావు నాకు! నా మీద నీకూ—నీ క్రిష్ణుడిని మర్చిపోయావా చెప్పు!"

"యిప్పుడు నేనెవరినో తెలిస్తే—" అంది స్వగతంలో.

"నువ్వు యెవరివో నాకు తెలుసు గీతా—నువ్వు నా గీతవి. నాలో అస్తిత్వం అంతటిలో నిండిపోయిన నా గీతవి" అని ఆమె కళ్ళలోకి వెర్రి చూపులు చూశాడు.

కాదన్నట్లు తల అడ్డంగా కదిపింది.

"యేమిటి గీతా—యేమిటి? చెప్పు; నీ నోటితో. కాదని నువ్వు చెప్పు" అని, ఆమె భుజాలు పట్టుకుని వూపుతూ ఆమె ముఖంలోకి చూశాడు.

అతని చేతులు నిదానంగా తీసేసి, కొంచెం అవతలికి జరిగి నట్లుగా కదిలి, "నేను జయసారథిగారి ప్రేయసిని" అంది.

ఫకాలుమని గట్టిగా నవ్వాడు. కన్నీళ్ళకి తడిబారిన ముఖం ఆ నవ్వులోంచి వింతగా కదిలింది.

కనురెప్పలువాల్చి భారంగా శ్వాస విడిచింది. కళ్ళలోంచి బొట్లు బుగ్గలమీంచి జారాయి.

ఆమెకేసి చూసిన అతను, కనుబొమలు ముడిచి—"గీతా గీతా

యేమైంది నీకు—నన్ను నవ్వించి నువ్వు, యిదేమిటి—నువ్వు నువ్వు—"

"ప్రశ్నమాట చెప్పాను" అంది కనురెప్పలు విప్పి.

యేదో అనబోయి—అలాగే నోరు తెరిచి అచేతనుడైపోయాడు. చూపు ఆమె నుదుటిమీద నిలిచిపోయింది.

"నేను తొలిసారిగా ప్రేమించిన వ్యక్తి సారథి—అందుకే నాలుగు నెలలనుంచి యిక్కడ వున్నాను" అంది.

మూడు నిమిషాలు గడిచాయి. అతనిలో చలనం లేదు.

రెప్పలు పైకెత్తి చూసి, "చెప్పానుగా; గతమే వర్తమానమనీ దాన్ని యెదుర్కోవటం కష్టమనీ" అంది.

అతను అలాగే వుండిపోయాడు.

వొక నిమిషం గడిచింది.

అతని భుజంమీద చెయ్యివేసి, "క్రిష్ణా" అంది, జాలిగాచూస్తూ. తుళ్ళిపడినట్లు తల విదిలించి రెప్పలువాల్చి, "గీతా మళ్ళీ పిలు. నన్ను అలా నీ నోటితో మళ్ళీ మళ్ళీ పిలువు గీతా. యీ పిలుపుకోసమే యిన్నాళ్ళూ మూర్ఖంగా అజ్ఞానంగా తిరుగుతూ అలిసిపోయాను. నా అలసట తీరేది, ఆ వొక్క పిలుపుతోటే—" అన్నాడు.

"నేనెవరినో చెప్పానుగా—"

"కానీ—కానీ—అదెలా—యెలా సంభవం—లేదు. కాదు. వీల్లేదు—"

"నిజాన్ని అంగీకరించకుండా మిమ్మల్ని మీరు మోసగించు కున్నందువల్ల ఫలితం యేమీ వుండదు" అంది.

"కానీ—అసలు—"

"అవును. మీగీత మీ తండ్రిగారి ప్రేయసి క్రిష్ణా—ప్రేయసి. చట్టం దృష్ట్యా చూడనప్పుడు, అర్ధాంగి. అంటే నేను నీకు సవతి తల్లిని. నువ్వు నన్ను, పిన్నీ—అని పిలవాల్సి వుంటుంది."

ఆమె ఒళ్ళోకి వొంగి, ముఖంచీర పొరలలో దూర్చి వెక్కి వెక్కి పడుతున్నాడు.

రెండు నిమిషాలు గడిచాయి.

కన్నీటికి చీర తడిసి; వొంటికి అంటింది, చెమ్మ.

సశేషమ్ జీవితమ్

అతని వీపుమీద చెయ్యివేసి వొకనిమిషం నిమిరి అతన్ని వెల్లకిలా తిప్పుకుని పవిట కొంగుతో అతని కళ్ళు తుడిచి, "తెలిసింది కదా వేరెవరికో యింక లే మరి." అని విషాదంగా నవ్వింది.

నాడు నందివర్ధనం చెట్టు ప్రక్కన నవ్విన అదే విషాదపు నవ్వు—మధ్యలో యింతకాలం జరగనట్లు—అతని మనసు వెనక్కి దొర్లి—కాలం నశించి—ఆనాటి మే నెల రాత్రిలోంచి కళ్ళు తెరిచి యాత్రా—వొక నిమిషం వుండిపోయి ఆమె మెడమీద చేతులువేసి కిందకివొంచి ఆమె ముఖానికి తన ముఖం అద్దుకున్నాడు.

ముఖం ప్రక్కకి తిప్పుకున్నట్లుగా కదిలి, "కృష్ణా, అవివేకంగా ప్రవర్తించకు. నేను నీకు తెలియజెప్పాల్సిన స్థితిలో వున్నదాన్ని. లే, అర్థంలేకండా జీవితాన్ని పాడుచేసుకోకు. పెళ్ళికూతురు యింట్లోనే వుంది సిద్ధంగా" అంది.

"అవును సిద్ధంగావుంది—వొళ్ళోపసుకోబెట్టుకుని సిద్ధంగా వుంది" అన్నాడు.

"నేనెవరినో చెప్పానుగా—నేను పెళ్లి చేసుకోవాల్సిన దాన్నికాదు. చెయ్యాల్సిన దాన్ని."

"యింతకంటే మించి నన్ను బాధపెట్టగల మాటలు యింకేమీ వుండవు" అని రెప్పలు వాల్చాడు.

రెప్పల కింది నుంచి నీరు వుబికింది బయటికి.

వేళ్ళతో తడి తుడిచి—ఛాతీమీది వెంట్రుకలలో వేళ్లు దూర్చి కదిపింది.

ఆమె చేతి వేళ్ళమీద అరిచెయ్యి ఆన్చి గుండెకేసి వొత్తుకున్నాడు.

"కానీ అదంతా యెలా సంభవమోకూడా అనూహ్యంగా వుంది" అన్నాడు స్వప్నంలోంచి పలికినట్లు.

విశాఖలో తన జీవితం, అరకులోయలో తన ప్రక్కన జీపు ఆగటం, ఆ రాత్రి, యీ నాలుగు నెలల గురించి క్లుప్తంగా చెప్పింది హీన స్వరంతో.

అతని కనురెప్పల కిందినుంచి నీరు వుబికి పొర్లిపోయింది.

సశేషమ్ జీవితమ్

"ఐతే–ఐతే, నేను నీకు యేమీ కానన్నమాట!" ఆయాసంగా మాటలు వొణికాయి అతని నోటినుంచి

ఆమె కళ్ళలోంచి నీటిబొట్లు రాలి అతని నుదుటిమీద పడ్డాయి రెప్పలు విప్పాడు.

"నామనసును తొలిసారిగా తొణికించిన వాడివి నువ్వే క్రిష్టానై. నీ ఛాయ నాలో అలాగే నిలిచిపోయినట్లే అనిపిస్తూ వుండేది చాలాసార్లు కానీ–యిప్పుడు నిన్ను యేం చేసుకోవాలో నాకు అర్థం కావటంలేదు. యిప్పుడనిపిస్తోంది, ఆ రోజున నేను తొందరపాటుపని చేసినట్లు. అలా వెళ్ళిపోవాల్సింది కాదేమో–కానీ గతాన్ని యిప్పుడు మనం మార్చలేం." ఆమె పవిటకొంగుతో అతని ముఖం మీది తడి తుడిచింది.

అతను మౌనంగా వుండిపోయాడు.

"హృదయానికి కళ్ళులేవు; స్పర్శ మాత్రమే వుంది మేధకి కళ్లున్నాయి. కానీ స్పర్శలేదు. అనుకుని యెవరూ ప్రేమించరు; ప్రేమించలేరు–అది యిట్టే సంభవిస్తుంది. ఆ అనుభవం అపూర్వమైందీ అమూల్యమైందన్నూ ఆ అదృష్టం నాకు దక్కింది. కానీ అదృష్టం స్వల్పాయువు. ముందు యెంతో భవిష్యత్తును మసకచీకట్లోకి వొదిలేసింది. నా సారథి నుంచి నాకు ప్రముఖంగా కావాల్సింది పొందాను అలాఅని ఆ అనుభవంతో సుదీర్ఘమైన శేషజీవితాన్ని కష్టంగా నిస్సారంగా సాగించాలనే మూర్ఖపుతలంపూ లేదు. కానీ ప్రేమ వొక అనిర్వచనీయ మధుర స్వీయం శిక్ష, ఆ శిక్ష ముగిసినప్పుడు మనిషి నిర్లిప్తతలోకి విముక్తిలాంటిది పొందటంజరుగుతుంది కానీ, నాది నిరంతర ముక్తి– లేమ్మా, క్రిష్టానై, తెల్లవారకముందే యీ గూడు విడిచిపెట్టి పోవాలి" అని కదిలింది లేవబోయినట్లుగా.

ఆమె వొడిలో అలాగే పడుకుని, "ఐతే నేను నీకు–యేమీ యేమీ–కానన్నమాట!"

"అలా అనుకోను. నా హృదయం నా సారథిని తప్ప ఎవరినీ ఎరగదు. నాలో మార్పు రాలేదు. ఆనాడు నిన్ను చూసి యెందుకు వింత ధ్వనులతో ప్రకంపించి పోయానో యీ నాడూ అందుకే వెళ్ళిపోవాలి."

న శేషమ్ జీవితమ్

"లేదు గీతా లేదు. నేను—నుకుంటున్నట్లుకాదు. నాకు తెలీసు కుండానే నాలో యేదో మానసిక సంఘర్షణ యేర్పడి వుండాలి అది నా మధ్యకాలంలో విడిపోయింది ఆ కారణంగానే నీ సృష్టిపటంలోంచి పోతీపో వాలని అర్థంలేకుండా తిరిగి తిరిగి వొళ్లు పాడుచేసుకున్నాను"

"అది కాదు నా వుద్దేశం వర్తమానస్థితి అలాంటిది. నేను వెళ్ళక తప్పదు."

"నువ్వు లేని నా జీవితం-"

"యెవరులేకా యెవరి జీవితమూ ఛిద్రమై పోవాల్సిన అవసరం లేదు యేకాంతంగా సాగిపోయి జీవితాన్ని చక్కబెట్టుకోవాలి?"

"కానీ నువ్వులేని నా జీవితం అర్థరహితమై పోతుంది అందుకు యిన్ని నెలల నా జీవితమే తార్కాణం. గీతా నువ్వులేని నా జీవితాన్ని వూహించుకోలేను గీతా, నీకు నామీద యేమాత్రం ప్రేమ అనురాగం అనుబంధం, ఆత్మీయతా వున్నా" అని ఆగిపోయి కనురెప్పలు వాల్చి శ్వాసకోసం యాతనపడినట్లు ఆయాస పడుతున్నాడు

యెగిరెగిరి పడుతున్న అతని వక్షంమీద అరిచెయ్యి ఆన్చి "సవతి తల్లిని చేసుకున్నాడని నలుగురూ అంటే నువ్వు తట్టుకోగలవని నేననుకోను" అంది.

"నన్ను నా సవతితల్లి అని యెవరూ అనరు"

నవ్వి "అదీ నిజమే నేను నిజానికి నీకు సవతితల్లినే ఐనా ఆ మాట యెవరూ అనరు నిజమే. కాని తండ్రి వుంచుకున్నదాన్ని చేసుకున్నాడని అంటారు" అంది.

"యెవరా అనేది? యెన్ని గుండెలు!"

"లోకానికి గుండెకాయ లేదు. అది వుత్త నీటిబొమ్మ. నీ మొహాన కాసిన్ని నీళ్లు చిమ్ముతూ వుండగలదు. చట్టరీత్యా చూసినప్పుడు నేను మీ తండ్రిగారు వుంచుకున్నదాన్నే. ఆ మాట నలుగురూ అంటూ వుంటే, ఆ పరిస్థితిని నువ్వు యెదుర్కోగలవని నేననుకోను."

"నువ్వు నా ప్రక్కనవుంటే యే పరిస్థితినైనా యెదుర్కో గలను."

సశేషమ్ జీవితమ్

"దాపరికం లేకుండా చెప్పు-మనసా పూర్వంలాగా నువ్వు నన్ను భావించి అంగీకరించగలవా?"

"నిజం చెప్పాలంటే; వొక్క- నఫీస్‌మంజిల్ విషయం వొదిలి మిగతాయేదీ నన్ను తాకలేదు. అలా చూస్తే మరి నా గత జీవితాన్నే మనాలి? కాగా, ఆ విషయం కూడా-నాలో యేదో సంచలనాన్ని కలిగించింది. అనూహ్యమైన విషయం. అసంభవం సంభవమైనట్లు, యిసుకలోంచి నూనె వొచ్చినట్లు. అందుకని తల్లకిందులైనట్లుగా అయ్యాను. అంతకన్న నాలో మరో భావం యేర్పడదు. నాలుగురోజులు పోతే దాని నుంచికూడా తేరుకోగలను"

"క్రిష్ణా నువ్వు నన్ను అసహ్యించుకోకపోవటం నీ బలహీనత అంటాను"

"బలహీనత-అను; అనురాగం. ప్రేమ, అనుబంధం-యేదైనా అను నా కభ్యంతరంలేదు."

అతని ముఖంలోకి జాలిగా, ప్రేమగా, ఆప్యాయంగా చూసింది.

ఆమె కళ్ళలోకి దీనంగా, తపనగా చూశాడు.

యిద్దరి చూపుల కలయికలోంచి సవ్వడికాకండా జారుతోంది కాలం.

నాలుగు మెతుకులు గతికి అందరూ నిద్రపోయారు. మధ్యగదిలో యెవరితోటో గుసగుసలు ఆడుతూ చిదేస్తోంది సీతమ్మ.

చూసి చూసి, యెంతసేపటికీ క్రిష్ణచైతన్య గది తలుపు తెరుచుకోకపోవటంతో-అతిథి గదిలోకి వెళ్ళి దిండులో ముఖం దూర్చి బొక్కబోర్లా పడుకున్నాడు శశాంక. కన్నీళ్ళకి దిండు తడిగా అవుతోంది. అతనిని భోజనం చెయ్యమని యెవరూ అనలేదు యెప్పుడో అలసటకి నిద్రపట్టేసింది.

"నా సారథి బ్రతికి వుండగా నువ్వు వొచ్చివుంటే యేంచేసే దానో తెలుసా క్రిష్ణా?" అంది.

"యేమో. బహుశా అటూ యిటూ యేదీ తేల్చుకోలేక నలుగుడుపడి పోదువేమో-"

పల్చగా నవ్వి, "లేదు క్రిష్ణా ప్రేమ అంటే యేమిటో నువ్వు యెరగవు. మొన్న మొన్నటిసరకూ నేనూ యెరగను. నా కోసం సీతం్రడి ఆనందంకోసం గమ్మున వెళ్ళిపొమ్మని నిన్ను ప్రాధేయపడి అర్థించి వుండే దాన్ని" అంది.

"అని వుండక పోదువేమో. నన్ను నువ్వు—"

"ప్రేమించలేదు. నువ్వుకూడా. మనిద్దరం వొకరి నొకరం ప్రేమించుకోలేదు. ప్రేమించటం మేధతో చేసే పనికాదు. ప్రేమించా ననుకోవటం నిజంగా ప్రేమించటంకాదు ప్రేమకి వివేకావివేకాలు తెలి యవు. అది వుత్త వెర్రిబాగులది. కానీ, మన మధ్య వొక మహత్తర రాగరంజిత రసానుబంధం. ఆ బంధం చాలా బలీయమైనదని కూడా తెలుసుకున్నాను యిప్పుడిప్పుడే."

"మరి వెళ్లిపోతానని అనవుగా?"

"అనాల్సిన అవసరం లేదు. నేను జాప్యం చేసినా పరిస్థితులే అంత పనీ చేస్తాయి. అనుకున్నంత తేలికకాదు క్రిష్ణా" అంది.

"నువ్వు నా ప్రక్కన వుంటే నేను యే పరిస్థితులనైనా యెదు ర్కోగలను. నిజమే; నేను జాప్యం చేసేవాడిలా అకర్మణ్యుడిలా వుండి పోయినట్లు కనిపించవొచ్చు, కానీ—కానీ, చూస్తావుగా—అవసరం వొచ్చి నప్పుడు వాస్తవపు ముళ్ళకంపమీద నిలబడి వూహల పిచ్చుకగూళ్ళు కట్టు కుంటూ కళ్ళుమూసుకుంటా ననుకోకు."

"క్రిష్ణా నీలో వెనకటికీ, యిప్పటికీ మార్పువుంది"

"అవును. నా వొళ్ళు బుగిలిపోయింది. నీ పునీత సాన్నిధ్యంలో మళ్ళీ కోలుకోగలదు."

"ఆ విషయంకాదు. స్వభావం. అప్పుడు తార్కిక శిఖరాలమీద జిజ్ఞాసా మేఘాల నీడలో వునికిని మరిచినవాడిలా వుండేవాడివి-యిప్పు డేమో—" ఆగిపోయి, అతని గుండెమీద అరిచెయ్యి ఆన్చింది.

ఆమె చేతిమీద తన అరిచెయ్యి అదిమి "గీతా, యిన్నాళ్ళకి మళ్ళీ నేను నేనయ్యాను" అని కనురెప్పలు వాల్చాడు.

"క్రిష్ణా" అని, వొంగి, అతని నుదుటిమీద పెదవులు అద్దింది.

సశేషమ్ జీవితమ్

వింత పరిమళం అతని ష్ఠ ఖాన్ని ఆవరించింది.

*　　　*　　　*

ఉదయం యేడు గంటలు దాటింది

క్రిష్ణచైతన్య గది తలుపుమీద చేత్తో కొడుతున్నాడు, శశాంక.

అవతలి గుమ్మంలో నిలబడి, "ఆ సిగ్గులేని వాళ్ళకి యీ సిగ్గులేని కుంక దొరికాడు!" అంది సీతమ్మ.

ఆ మాటలు లక్ష్యపెట్టకండా తలుపుమీద తడుతూనే వున్నాడు శశాంక.

కళ్లు నులుముకుని సోఫామీది నుంచి లేచి జుట్టు సవరించి వొదులుగా ముడి వేసుకుని తలుపు తెరిచింది గీతాదేవి.

లోనకి వొచ్చి తలుపుమూసి, "బొంబాయి తరవాత మిమ్మల్ని నేను చూసినట్లు క్రిష్ణతో చెప్పటంగానీ జరిగిందా?" అని రహస్యంగా అడిగాడు శశాంక. లేదన్నట్లు తల అడ్డంగా కదిపి, యేమిటి-యెందుకు అన్నట్లుగా చూసింది "ప్రస్తుతం చెప్పకండి. యెందుకో తరవాత చెబుతాను" అని ప్రక్కకి అడుగులు వేశాడు.

మంచంమీద అటూ యిటూ కదులుతున్న క్రిష్ణచైతన్య పీపుమీద చెయ్యివేసి "క్రిష్ణా" అన్నాడు శశాంక.

లేచి, మంచం మధ్యలో కూర్చున్నాడు క్రిష్ణచైతన్య.

చిందర వందరగా రేగిన జుట్టు. కాస్త తెరుచుకుంటున్నట్లుగా అనిపిస్తున్న కళ్ళు వొదులుగా వొంటికి చుట్టుకునివున్న ధోవతి.

"త్వరగా మొహాలు కడగండి" అని గది బయటికి వెళ్లి తలుపు మూశాడు శశాంక.

పది నిమిషాలలో కాఫీ, ఫలహారాలతో తిరిగి వొచ్చాడు.

"శశాంకా యేమిటీ పని?" అన్నాడు క్రిష్ణచైతన్య మందలింపుగా.

"ఏం పనో తరవాత సంజాయిషి చెబుతానుగానీ ముందు కానివ్వండి" అన్నాడు.

"ముందు మీరు" అంది గీతాదేవి కిటికీ దగ్గిర నిలుచుని అతనికేసి

చూస్తూ.

"నిన్నంతా తిండిలేదేమో ఆకలి దహించి అమాంతం వంటగది లోకి వెళ్ళి కంటికి కనిపించినవన్నీ గొంతులో కుక్కేసుకున్నానులెండి" అని సోఫామీద కూర్చుని వెనగ్గావెపు అంచుమీద తల ఆన్చి. పైజామా జేబులోంచి సిగరెట్ పెట్టె అగ్గిపెట్టె లాగి వెలిగించాడు

వాళ్ళిద్దరూ తిని, కాఫీ ముగించారు మౌనంగా.

"యింక నేను వెడతాను" అన్నాడు శశాంక.

"అదేవిటీ!" అన్నట్లుగా చూసింది గీతాదేవి.

"కొంపలంటుకుపోయే పనిమీద నేను బయల్దేరబోతూ వుండగా, క్రిష్ణ రావటమూ. ఆ తరవాత–" ఆగిపోయాడు.

అతని కళ్ళలో తడి వుబికింది.

వాళ్ళిద్దరి కళ్ళూకూడా తడితో మసకగా అయిపోయాయి.

రెండు నిమిషాలు గడిచాయి.

తేరుకుంటున్నట్లుగా రెప్పల కదిపి, శ్వాసపీల్చి లేచాడు శశాంక.

"వూళ్లో వొక విషయం ఆచూకీతీసి వెంటనే ఢిల్లీకి యెగిరివాలాలి. అక్కడ ఆ విషయం గురించి కీలక రహస్యాలు కొన్ని తెలుసుకుని వెంటనే తిరిగిరావాలి లేకపోతే మాపత్రిక తగలబడిపోయినట్లే అవుతుంది" అన్నాడు గీతాదేవి నుద్దేశించి.

"కానీ నువ్వు అప్పుడే వెళ్ళిపోతే, యిక్కడ——"

"క్రిష్ణా, తనకి తను భయపడని వ్యక్తి తను మంచి అని విశ్వసించినదాన్ని చెయ్యగలడు. నువ్వు పిరికివాడివి కాదని నాకు తెలుసు. నీకు తోడుగా గీతాదేవిగారుంటారు. మరేం పరవాలేదు. నేను మళ్ళీ తిరిగి వొచ్చేస్తున్నాగా" అని వెళ్ళబోయి, ఆగి, తలవొంచి నిలబడ్డాడు

అతనికి దగ్గిరిగా వొచ్చి భుజంమీద చెయ్యివేసి, "శశాంకా–" అన్నాడు క్రిష్ణచైతన్య.

యిద్దరి కళ్ళలోనూ నీళ్ళు తిరిగాయి.

"క్రిష్ణా. డాడీగారు పుణ్యజీవులు. అందంగా, నొప్పించకుండా మృత్యువు అందరినీ వరించదు. ఆ అదృష్టం అందరికీ కలగదు. డాడీ

ారు గొప్ప వ్యక్తి. అందుకే—" అని యేదో గొణుగుతున్నట్లుగా తల
ొంచుకుని గది బయటికి నడిచాడు శశాంక.
కళ్ళు తుడుచుకుంటూ లేచి కిటికీదగ్గిరికివెళ్ళి; బయటికి చూస్తోంది.
మంచం తలవైపు యెత్తుదిండీమీద గడ్డం ఆన్చి నేలమీదకి చూస్తూ
ఉండిపోయాడు.
అరగంట మౌనంగా గడిచింది.
గది తలుపు బయట అలికిడి అయినట్లయింది. తలయెత్తి చూశాడు
ారగా లాగివున్న తలుపువైపు,
లేచి తలుపు దగ్గిరికి వెళ్ళాడు.
"చినబాబుగారూ రామనాధయ్యగారు పిలుస్తున్నారు తమర్ని."
"సరె, వొస్తున్నానని చెప్పు" అని వెనక్కి తిరిగి ఆమె దగ్గిరికి
వొచ్చి, "మా పెదనాన్నగారి పిలుపు వొచ్చింది" అన్నాడు.
విషాదంగా నవ్వింది చప్పుడవకండా.
దిగులుగా నవ్వినట్లుగా ముఖంపెట్టి—ప్రక్కకి తిరిగి—వడివడిగా
బయటికి అడుగులు వేశాడు క్రిష్ణచైతన్య.
డ్రాయింగ్రూంలో నలుగురైదుగురు కూర్చుని వున్నారు. క్రిష్ణ
చైతన్య రావటం గమనించి లేచి అతనికి దగ్గిరిగా వొచ్చి చెయ్యి పట్టు
కుని వరండాలోంచి తీసుకు వెళ్ళి పచ్చికమీద కూర్చోబెట్టాడు. అతని
పెత్తండ్రి, రామనాథం.
పొందూరు ఖద్దరు బట్టలు బట్టతల.
వొక నిమిషం మౌనం.
"యిక మేమెళ్తాం" అన్నాడు.
"అప్పుడే!"
"వెళ్ళక యిక్కడ యే ముఖం పెట్టుకుని వుండగలం?"
క్రిష్ణచైతన్యకి విషయం అర్థమైంది. మౌనంగా వుండిపో
యాడు.
"వెయ్యో రెండువేలో మొఖాన పారేసి; బయటికి నడవమను."
క్రిష్ణచైతన్య మాట్లాడలేదు.

"చూడగా, రాత్రి నిన్ను వలలో వేసుకోటానికి ప్రయత్నించి నట్టుందే—సీతి చెప్పనే చెప్పింది; తెల్లవార్లూ గదిలో నుంచి యేవో మాటలు వినిపించినట్లనిపించిందని. మాయలాడిలాగా వుంది. వాడు బుద్ధిలేని పని చేశాడు ఐందేదో అయిపోయింది; చచ్చి స్వర్గాన వున్న మనిషిని అనటం భావ్యంకాదు. నువ్వైనా పరువుగా ప్రవర్తించు."

తల పంకించాడు క్రిష్ణచైతన్య.

"కాగితాలూ ఖరామతులూ యేవీ వున్నట్టులేదు. కోర్టుకెళ్లినా చెల్లదు జక్కిస్తూ యిచ్చింది తీసుకుని అదేపోతుంది" అన్నాడు.

"యెమ్మల్ని డబ్బు అడిగిందా?"

"అడగాలా నోటితో; డబ్బుకోసం కాకపోతే ముసలాడిని వలలో వేసుకుని హొయలు పోవాల్సిన అవసరం?"

"ఆ వుద్దేశంతో ఐవుంటే యింతకు ముందే, యెప్పుడో యింతో అంతో రాయించుకునే వుండాలే?" అన్నాడు క్రిష్ణచైతన్య.

"అట్లాటిదేమీ జరిగినట్టనిపించలేదని పించిందన్నది సీతి."

"అలా యేదైనా జరిగితే ఆ లిఖితాధారం రీత్యా యివ్వాల్సింది యిచ్చి పంపమంటారు-అంతేగా?"

"కాగితం వున్నంత మాత్రాన అయిపోయిందేంటి? బాగా తాగించి యే మైకంలోనో రాయించుకుందని కేసు బనాయించి, దాన్ని ముప్పతిప్పలు పెట్టి మూడు చెరువులు నీళ్లు తాగించమూ?"

సన్నగా నవ్వి, "కానీ ఆమె యెవరి డబ్బూ ఆశించలేదు. యిప్పుడు ఆశించటమూ లేదు."

"యేదీ; ఆశించనిదైతే యింకా యీ కొంప పట్టుకుని యెందుకు పాకులాడుతోంది? ముసిలాడినే వలలో వేసుకోగలిగింది—నువ్వొకలెక్కా దానికి? పరిస్థితి చెయ్యి జారిపోకముందే జాగ్రత్తపడటం మంచిదీ. లక్షణంగా పెళ్ళి చేసుకుని గౌరవంగా బతకాల్సిన వాడివి నువ్వు."

"యీ విషయం పూర్తిగా నాకొదిలెయ్యగూడదూ పెదనాన్నా?"

"అంటే నీ వుద్దేశం?" అన్నాడు తీక్ష్ణంగా కాఠిన్యాన్ని గొంతులో ధ్వనింపజేస్తూ.

"నిమ్మదిమీద ఆలోచించి వొక నిర్ణయానికి వొచ్చి—"

మధ్యలోనే అందుకుని, "చూడగా తెల్లార్లూ బట్టలూడదీసుకునే నిన్ను చిత్తుచేసినట్లనిపిస్తోంది. అది పెద్ద కుండకే యెసరు పెట్టాలను కున్నట్లున్నది నమ్మకంగా చేరి వుంటాంది. కుర్రాడిలాగా వుషారుగా యెగు రుతూ తిరుగుతాంటే పదికాలాలపాటు బతుకుతాడు లెమ్మనుకుని వుంటుంది. ! తీరా, ముసిలాయన అనుకోకుండా పుటుక్కున హరీమన్నాడు. యిక నీ చుట్టూ వలలు పన్నుతుంది; దాన్ని యింకా యిక్కడే వుండ నిస్తే."

"డబ్బు కావాలని అంటుందేమో అడిగిచూడండి – ఆస్తి మొత్తం రాసిస్తాను."

"అంటుందేం? అంటే చెప్పుచ్చుకుని బొచ్చురాలగొట్టమూ! అసలు, అది అట్లా అనే రకంకాదు. అది మంచి నెరజాణలాగా వుంది. అబ్బే; నేను దమ్మిడీకూడా ఆశించటంలేదు-అని చిలక పలుకులు పలుకుతుంది, నీలాంటి తెలివిహీనుడు యెవడన్నా వుంటే అమాంతం ఆస్తంతా రాసిస్తా డేమోనని."

"అసలు విషయం మీకు తెలియదు. ఆమె నాకేమౌతుందో మీకెవ రికీ తెలియదు. ప్రస్తుతానికి యీ విషయం యింతతో ఆపి కర్మ అవ సిండి చూద్దాం."

"కర్మ అయ్యేదాకా ఆగితే మన ఖర్మకాలుతుంది. మీ నాన్న పరువు మర్యాదలు వొదలేసుకున్నాడని అందరూ వొదిలేసుకోరు లోకం మొఖాన వూస్తుంది కాండ్రించి."

"అయితే నాన్నగారి ముఖాన బాగా వూసేందన్న మాట లోకం. యెక్కడా వుమ్మిపడి కనిపించలేదే నాకు!" అని సన్నగా నవ్వాడు.

"ఛీ నోర్మూయ్. ఆ తండ్రి కొడుకు వనిపించుకున్నావ్!" అన్నాడు చీదరంగా కోపంగా.

క్రిష్ణచైతన్య మౌనంగా వుండిపోయాడు.

"నిర్మల పుట్టినప్పటినుంచీ అనుకుంటాంది సీత – నీకిచ్చి చెయ్యా లని. లక్షణమైన పిల్ల. నీ కళ్ళకి ఆనలేదా?"

"నిర్మల అందమైన పిల్ల. నే నెప్పుడూ కాదనలేదే!"

"నీ వొంకర మాటలు తెలుసుకోలేకుండానే లక్షలు గడించా ననుకుంటూన్నావా! యెదురు డబ్బిచ్చినా అట్టాంటి పిల్ల దొరకదు."

"కావొచ్చు."

"నీకు ముప్ఫయ్యేళ్ళు దాటుతున్నా మొఖాన పెళ్ళి గాత లేదింకా. మీ నాన్న చేసిన యీ అప్రదిష్ట పని తెలిసినవాడెవడూ నీకు పిల్ల నివ్వడు."

"కావొచ్చు."

"నువ్వు వూఁ అంటే ముహూర్తం పెట్టిస్తాను"

"అంత యెవరికీ తగని, అప్రదిష్టపాలైన నేనే కావాల్సి వొచ్చానా?"

"నీ మీద చిన్నప్పటినుంచీ వున్న మమకారాన్ని చంపుకోలేక."

"మరి, అందరికీ కావాల్సిన పరువు మర్యాదలు అత్తయ్యకి అక్కర్లేదా?"

"నీ మాటలు వింటోంటే అరికాలి మంట నెత్తికెక్కుకొస్తోంది. గతిలేక నీ కిచ్చి చెయ్యాలని ఆరాటపడిపోతున్నదనుకుంటున్నావేమో— కావాలంటే మూడురోజుల్లో లక్షణమైన పిల్లణ్ని చూసి నిర్మలకి పెళ్ళి చెయ్యగలను"

"పోనీ అలాగే చెయ్యండి."

"పెద్దవాళ్ళతో మాట్లాడాల్సిన తీరుకూడా మర్చిపోయినట్టున్నావు, రెండేళ్ళు దేశాలెంట తిరిగొచ్చేసరికి." అని ఛీత్కరించుకున్నాడు.

"నేను దేశదిమ్మరినని తెలుసుగదా మీకు!"

"యీ కర్ర విరగని పాము చావని మాటలు కట్టిపెట్టి నా ప్రశ్న లకి జవాబు చెప్పు. దాన్ని తక్షణం పంపిస్తావా లేదా?"

"యింకా యెటూ తేల్చుకోలేదు. ఆమె యెవరో తెలిసిన వాణ్ని— పంపించటమంటే—"

మధ్యలోనే అందుకుని, "నువ్వు నాన్చుతూ కూర్చుంటే మేం చూస్తూ వూరుకోమనా! బజారులంజని జుట్టుపట్టి బయటికీడ్చి—"

మధ్యలోనే అందుకుని, "ఆమె నాకు చాలా దగ్గిరి వ్యక్తి. నాన్న గారికి తోడుగా వుంటుందని నేనే పంపించాను." అన్నాడు కొద్దిగా బిగ్గరగా వేగంగా.

"తోడుగా వుండటం అంటే ముసిలాడితో సరసాలాడి వలలో వేసుకోవటమా! ఛీ ఆ తండ్రికి కొడుకివి కాదూ నువ్వు – ఛీ —" అని గడ్డిమీద వుమ్మి ధుమ ధుమ లాడుతూ, తువ్వాలు దులుపుకుంటూ చర చరా నడిచి వెళ్లిపోయాడు.

పచ్చిగడ్డి పరకతుంచి వేళ్ళమధ్య నొక్కి — కనురెప్పలు మూశాడు. తడి వుబికింది.

ధోవతి అంచుతో తుడుచుకుని అలాగే వుండిపోయాడు.

* * *

గది గుమ్మంలోకి వొచ్చి, "అట్లా పెళ్ళికూతురులాగా తల వొంచు కూర్చున్నావేం; బయటికి నడవక?" అంది సీతమ్మ

గుమ్మంలోకి వొకసారి చూసి రెప్పలు కిందకి వాల్చింది గీతాదేవి.

"నిబ్బరంగా ఆ చూడటం — దీనికి ఎన్ని గుండెలు లేకపోతే నాకేసి అట్లా చూడగలదు! నంగనాచి లాగా యెట్లా కూర్చుందో! యేం — అబ్బాయిని వలలో వేసుకోవాలని యెత్తు వేస్తున్నావా? అవున్లే, తండ్రి కాకపోతే కొడుకు. కొడుకు కాకపోతే మనవడు. తెగించిన ముండకి పరువా మర్యాదా! యింతటితో అయిందటలే — యీ భూమ్మీద యింకా యెన్ని కొంపలార్పాలో నువ్వు! యింతకీ, అసలు, వాడి ననాలి తెచ్చి యింట్లో పెట్టుకున్నందుకు. వుంచుకు నఘోరించినా యే కొంపో అద్దెకి తీసుకుని పెట్టక — కళకళ్ళాడుతున్న యింట్లో గృహలక్ష్మి వుండాల్సిన యింట్లో తెచ్చి పెట్టుకుంటారా! అవ్వ."

"సీతా—" అంటూ వొచ్చాడు రామనాథం.

కళ్లు వొత్తుకుంటూ "నా ఖర్మమిట్లా కాలింది. అడ్డమైన వాళ్ళ చేతా మాటలు పడాల్సి——"

"రంకు ముండతో నీకెందుకు? బజారు లంజలతో మాట్లాడితే మన పరువే పోతుంది పద అవతలికి." అన్నాడు.

"అవ్వ! యెంతటిడి కాకపోతే; అభిమానం చంపుకుని పెద్దింటి దాన్ని గుమ్మంలోకొచ్చి నిలబడ్డాననే విచక్షణకూడా లేకుండా అట్లా మంచంమీద నంగనాచిలాగా కూచుంటుందా! అవ్వ! అవున్లే, డబ్బుకోసం అడ్డమైన పనులుచేసే ముండలకి పెద్దేఁటి చిన్నేంటి! అసలుకి..."

చెల్లెలి రెక్కపట్టుకుని అవతలికి లాగాడు, రామనాథం.

విడిపించుకున్నట్లుగా ముందుకు వొంగి, "త్పూ." అని వుమ్మి తలుపు దభీమని లాగింది.

శ్వాస బరువుగా విడిచి బాధగా నవ్వుకుంది గీతాదేవి. కళ్ళనుంచి నీటిబొట్లు రాలాయి వొళ్ళోకి.

యింకా అలాగే పచ్చికమీద కూర్చుని వున్నాడు క్రిష్ణచైతన్య.

అరగంట గడిచింది.

"శినబాబుగారూ, వాఁరెల్లిపోతన్నట్టు రావఁనాదంగారు మీతో సెప్పవఁన్నారు."

తల పైకెత్తి చూశాడు క్రిష్ణచైతన్య

భయభక్తులతో, అభిమానంగా బాధగా చూస్తూ నిలబడిన పనిమనిషి కేసి వింతగా చూసి — యింకా వీళ్ళకి నా మీద గౌరవాభిమానాలా! యెంత విశ్వాసం — అనుకుని తృప్తిగా, ఆదరంగా అతనికేసి చూసి "వొస్తున్నానని చెప్పు" అన్నాడు

నిదానంగా లేచి తాపీగా అడుగులు వేశాడు.

డ్రాయింగ్రూంలో పెత్తండ్రి కొడుకులు, మేనత్త కూతురు, మ కొందరు కూర్చుని వున్నారు.

మేనత్తకూతురు, క్రిష్ణచైతన్యకేసి అమాయకంగా వింత చూసింది.

మధ్య గదిలోకి అడుగులు వేశాడు. అతనికేసి కోరచూపు చూస్తూ, అసహ్యించుకుంటున్నట్టుగా ముఖంపెట్టి చరచరా అడుగులువేసి అవతలికి వెళ్ళిపోయాడు రామనాథం.

క్రిష్ణచైతన్యకేసి చూసి "నాయనా కిష్టడూ—" అని ఆగిపో యేడ్పు ప్రారంభించింది, సీతమ్మ.

యేమనటానికి తోచక మౌనంగా ఉండిపోయాడు క్రిష్ణచైతన్య. రెండు నిమిషాలు గడిచాయి.

పవిట కొంగుతో కళ్ళు వొత్తుకుంటూ "యెవరేమన్నా అనకున్నామా - చేశామా ఎన్నడూ బ్రరున చీది యెరగడు అంత వయసులోనూ, ఆ వుషారు. ఆ చురుకుదనం - యేంటో విధి రాతకాకపోతే యేమనుకోవాలి! పాపిష్టిదాన్ని నన్నైనా తీసుకుపోయాడు కాదు దేవుఁడు" అని పవిటకొంగు ముక్కుకి అడ్డం పెట్టుకుని చీదుకుంది.

మరో నిమిషం గడిచింది

"ఏవోలే, అదీ అదృష్టమే. హాయిగా, మహారాజులాగి వెళ్ళిపోయాడు. వొకళ్ళచేత చేయించుకోకుండా అందరి బాగోగులూ చూసి తన దారిన తను హాయిగా వెళ్ళిపోయాడు." అంది.

గుమ్మంలోకి వొక అడుగువేసి నిలబడి, "సీతీ యిక బయల్దేరదాం!" అన్నాడు రామనాథం.

"యెక్కడికి బయల్దేరేది! యీ యిల్లు యిట్లా వొదిలేసి పోతే; యెవరు చూసే దిక్కు? తోడబుట్టినవాడి కొడుకుని వొక్కడినీ బితుకు బితుకుమంటూ యింట్లో వొదిలేసి వెళ్ళిపోతే నలుగులూ ముఖాన వుయ్యరూ! వాడికి మాత్రం యెవరున్నారని మనంకాక! ఆవిడన్నా బతికివుండి వుంటే అదో దారి — పాపం; కిష్టణ్ని చూస్తోంటే నా ప్రాణం తరుక్కుపోతాంది."

"యెప్పుడూ యిక్కడే పడివున్నావేమో నీకు అంత యిదిగా వుంటే నువ్వుండిపో మరి మేం వెళ్తాం" అన్నాడు రామనాథం.

"అయ్యో, అయ్యో — నువ్వెళ్ళిపోవటమా! తమ్ముడి కొడుకుని ఈ స్థితిలో కళ్ళారాచూసి కూడా వెళ్ళిపోతావా!"

"వుండి చేసేదిమాత్రం యేముంది? కిష్టుడు ప్రయోజకుడే. వాడే చూసుకోగలడు అన్నీ. కాగా నాకు అవతల అర్జంటు పనులున్నయ్ నెత్తిమీదకొచ్చి."

"యింకా కర్మఐనా కాకుండానే—"

"ఆ వేళకి వొస్తే వొస్తాలే."

"యెంత మాట! వొస్తే వొస్తావా, నలుగురూనవ్విపోరూ నిన్ను!"

"ఇక్కడ ఉండి నవ్వులపాలు అవటంకంటే, వెళ్ళి నవ్వులపాలవటమే మంచిది. కాగా, పరువు మర్యాదలు తెలిసిన వాడెవ్వడూ నన్ను చూసి నవ్వడులే."

"అయ్యో అదేం మనిషీ—ఆ మూర్ఖం పట్టూ అదీ!" అని క్రిష్ణచైతన్య కేసి చూసి, "నాయనా కిష్టుడూ, నువ్వైనా చెప్పరా" అంది.

పెత్తండ్రివైపు తిరిగినట్లుగా కదిలి, "పెద్దవాడివి యీ నాలుగు రోజులూ వుండి అది కాస్తా ముగిసేవరకూ—" అని ఆగిపోయాడు క్రిష్ణచైతన్య.

"నా పెద్దరికం కూడా వుందన్నమాట యీ యింట్లో!" వెటకారంగా అన్నాడు.

"అయ్యో అదేం మాట! యీ యింటికి పెద్దదిక్కు— నువ్వుకాక యింకెవరున్నారు? పాపం, కిష్టుడు—వాణ్ని చూడు, బేజారెత్తిపోతున్నాడు, నువ్వెళ్ళిపోతానంటే."

"వాడికేం బేజారూ గీజారూ లేదులే, పెద్దవాళ్ళకే చెప్పగలవాడు వాడు."

"తోడబుట్టినవాడి కొడుకు—అవేం మాటలు అన్నయ్యా నువ్వు—"

"నేనేమి కానిమాట అనలేదు గానీ యింతకీ నువ్వు వొస్తున్నట్లా, రానట్లా?"

"నా మాట అటుంచి— నువ్వెట్లా వెళ్తావూ—అని?"

"నువ్వు పరువూ మర్యాదలు వొదులుకుని వుంటే వుండు. నేను మాత్రం వెళ్తున్నాను."

"అయ్యో విడ్డూరం, నీ యిల్లు బంగారంకానూ. యిప్పుడేమైందని పరువ మర్యాదలకి? లోకంలో జరగరాని దేమన్నా జరిగిందనా యేఁటి? యెందరి యిళ్ళలో చూడటంలేదు? వాడైనా యేం చేశాడని- ఖూనీలు చేశాడా. కుమ్మలాడాడా? యేదో పెద్దతనంలో మతి చాంచల్యం. కాకపోతే వూళ్లోనే యెక్కడన్నా కొంప తీసుకొని పెడితే బాగుండేది.

యిట్లా యింట్లో తెచ్చిపెట్టుకోవటం—అదొక్కటి తప్పించి—"

"వాడిమాట కాదు నీ మేనల్లుడిమాట. యింకా నాలుగు క్షణాలు యిక్కడే వుంటే మన పరువు మంటగలిసిపోతుంది."

"అన్నయ్యా. చిన్నవాడని కూడా లేకుండా యేంటా మాటలు! యిప్పుడు నీ పరువు మర్యాదలు పోయే పని వాడే. చేశాడని! నా తండ్రి. మొదటినుంచీ వాడి కుదురూ లక్షణమూ—ఆ తీరే వేరు."

"రాత్రే కనిపించినయ్‌గదా వాడి లక్షణాలు. వాడి గుణగణాలు నువ్వే మెచ్చుకోవాలి! యిదుగో చూడు సీతీ—నీ వెర్రిభ్రమలో నువ్వుంటే ఆ తరవాత దిక్కులేనిదానివై పోతావు. నీతోపాటు నీ కూతురుకూడా. యింకా నీకు ఆశ చావనట్లుంది. అసలు నేను మొదటినుంచీ చెబుతూనే వున్నాను. సారథి వొట్టి అప్రయోజకుడూ, కొడుకు మెడలోంచి పెళ్లి చేయలేనివాడూ—అని అంటే విన్నావా? యిప్పుడు యీ దేశదిమ్మరి నీ కూతుర్ని చేసుకుంటాడనా?"

"ఆ మాట లిప్పుడెందుకులే, యింకా కర్మ అయినా అవలేదు."

"నువ్వు వుండాలనుకుంటున్నది—కర్మ జరిపించటానికి కాదు. నీ పిచ్చి కొద్దీ."

"అయ్యో అయ్యో యెంతమాట! అయితే నేను—"

"చూడు సీతీ, పిచ్చిలో పడకు పద."

"అయితే నువ్వెందుకొచ్చినట్లు అంత దూరంనుంచి?"

నవ్వి "మంచిమాట అడిగావు! అయిందేదో అయిపోయింది; యికనైనా యీ యిల్లు చక్కబెడదామని వొచ్చాను. కానీ వీడు ఆ తండ్రి కొడుకుననే అనిపించుకున్నాడు. ముందే తెలిస్తే అసలు రాకనేపోదును."

రామనాథంకేసి అయోమయంగా చూసింది, సీతమ్మ.

"నీ యేడుపు నాకు తెలుసులే. నీ కూతురి పెళ్లి గురించేనా—అదే అవుతుంది."

"యిన్నాళ్ళూ అవుతానే వుందిగా—" అంది వెటకారంగా.

"నీకు బుద్ధిలేకపోతేసరి! నువ్వు చెయ్యదలుచుకుంటే యెప్పుడో అయ్యేది."

"అమ్మో నీ విడ్డూరం మాటలు మంచిపోనూ—యేం పెట్టి చెయ్యలేవని?"

"వున్న దాంతోనే."

"యేవుందని నాకు?"

"వున్నదే."

"అవును; ఆయన పోబట్టేకదా మీకందరికీ లోకువయ్యాను. ఆయనే బతికివుంటే, మీలాగే లక్షలు గడించి వుంటే నాకిట్లా మాటలు పడాల్సిన ఖర్మ. వొచ్చేదా! ఇంతకీ నొసటిరాత అట్లా వుంది. మిమ్మల్నని మిటిలే."

"యిప్పుడు కొత్తగా వొచ్చిపడిన రాత యేవీలేదు కానీ—నా మాట విని యిప్పటికైనా నిర్మల పెళ్లి వెంటనే చేసెయ్యి"

"అవ్వ! ఐతే నేను కన్నకూతురి పెళ్లి చెయ్యాలనుకోటం లేదనా! డబ్బు లేనిపోయినంత మాత్రాన మానాభిమానాలు చంపుకుని బతుకుతున్నాననేగా నువ్వనేది! చివరికి తోడబుట్టిన వాడిచేత యింతమాట అనిపించుకోవాల్సి వొచ్చిందన్న మాట! నన్నింకా ఆ దేవుడు భూమ్మీద యెందుకు బతికించి వుంచాడో—" అని కళ్ళు వొత్తుకుంది.

"సరే—నీ ఖర్మ నీది, యెవరేం చేయగలరు" అని—హూంకరించినట్లుగా క్రిష్ణచైతన్యవైపు నేలమీదకి చూసి, గిరుక్కున తిరిగి వెళ్లిపోయాడు.

నేలమీదకి కూలబడి సన్నగా యేడుపు ప్రారంభించింది సీతమ్మ.

మూడు నిమిషాలు గడిచాయి.

గుమ్మంలోకి భయం భయంగా వొచ్చి నిలబడి, "అమ్మా. పెద మావయ్య వెళ్లిపోతున్నాడు. అందరూ బయల్దేరుతున్నారు." అంది హీనస్వరంలో.

సీతమ్మ, వినిపించుకోలేదు యేదో గొణిగినట్లుగా మాటలు అనుకుంటూ రాగాలు తీస్తోంది.

"నిర్మలా, యిది పరువు మర్యాదలు లేని కొంపట. ఆ పరువు మర్యాదలేనో కావలిసిన వాళ్ళందరూ వెళ్లిపోవటమే మంచిదేమో—"

సశేషమ్ జీవితమ్

అన్నాడు క్రిష్ణచైతన్య ఆమెకేసి చూసి.

అమాయకంగా, భయంగా చూసింది.

"నిన్నుకూడా రమ్మన్నాడా?" అని యేడుపులోంచి అడిగింది, సీతమ్మ.

"వుఁహూఁ."

"వాడు రమ్మనడు. నాకు తెలుసు. అంటే; తీరా నువ్వొక్కదానివీ వెళ్తే వాడిమెడకి చుట్టుకున్నట్లౌతుందని. మొదటినుంచీ వాడికి డబ్బుకి లంకె. నీ చినమావయ్య గుణమే వేరు. ఆ యిది ఎవరికుంటుందని— యెందుకున్నానో వున్నాను. నా ప్రాణాలు యీ గడపలోనే హరీమనాలి."

వారిద్దరూ మౌనంగా నిలుచున్నారు.

"నిన్ను రమ్మనిగానీ అంటే వెళ్లు" అంది, కూతురివైపు చూసి.

"మరి, దినానికి?"

"వాళ్ళతోపాటు నువ్వూ వొద్దువుగాని."

"వాళ్ళు, మళ్ళీ వొచ్చేలా అనుకోవటంలేదు."

"అవన్నీ నీ కెందుకులే; రమ్మంటే మాత్రం వెళ్లు. వాడు ఆ మాట అనడని నాకు తెలుసు." అంది, సీతమ్మ.

నిర్మల, అవతలికి వెళ్లిపోయింది.

"చూశావురా కిష్టడూ కాలేజీలో చదువుకుంటాందనే గానీ వుత్త అమాయకురాలు" అంది

అతను మౌనంగా వుండిపోయాడు

మళ్ళీ శోకాలూ, కళ్లు వొత్తుకోవటం, చీదటం ప్రారంభించింది సీతమ్మ.

భోజనాలుకూడా చెయ్యకుండా, పన్నెండుగంటల బండిలో అందరూ వెళ్లిపోయారు–సీతమ్మ, నిర్మల మినహా,

* * *

వొంటిగంట దాటింది

వొక్కడూ డ్రాయింగ్రూంలో సోఫామీద ముడుచుకూర్చుని తివాసీకేసి నిశ్చలంగా చూస్తున్నాడు క్రిష్ణచైతన్య.

నూనెకూడా సరిగాలేక, జుట్టు చిందరవందరగా రేగి, వుంగరాల జుట్టు గజిబిజిగా అనిపిస్తోంది. మొలనుట్టూ నలిగి ముడతలుపడిన ధోవతి. యెడమ భుజంమీంచి వొళ్ళోకి జారివున్న వుత్తరీయం. కళ్ళు పీక్కు-పోయినట్లుగా వున్నా తేటగా కనిపిస్తున్నాయి. ముఖం బిగదీసుకుపోయి ముడతలు పడినట్లుగా అనిపిస్తోంది నుదుటిమీది రెండుపెద్ద ముడతలూ మరీ లోతుగా అనిపిస్తున్నాయి.

చలికి వొణికి బిగుసుకు పోయినట్లుగా శరీరం, కుంచించుకు పోయి నట్లు వూదారంగు సోఫామీద కుప్పలా వుంది.

"శినబాబుగారూ రొండవుతాంది సానంశేసి కాత్తంత యెంగిలి పడితే—"

తల పైకెత్తి చూశాడు.

పనిమనిషి ముఖంలో భయభక్తులు, విశ్వాసం, దిగులు-

కృతజ్ఞతగా ఆదరంగా చూసి తల వూపాడు క్రిష్ణచైతన్య.

పది నిమిషాలు గడిచాయి.

మళ్ళీ పనిమనిషి. వొచ్చి గుమ్మంలో నిలబడి ఏమనటానికీ తోచ నట్లుగా వొక నిమిషం వుండి, కాలితో నేలమీద రాశాడు చప్పుడు అవ్వా లన్నట్లు.

సప్పుడికి సముద్రమత్తులోంచి తేరుకుంటున్నట్లుగా భారంగా నిట్టూర్చి లేచి నిలబడి, వుత్తరీయం భుజాలమీంచి కిందకి ఒగలాగి పట్టుగుని— క్షణకాలం అలాగే నిలబడి—నిదానంగా అడుగులు వేశాడు తన గదివైపు.

కిటికీకి ఆనుకుని, నేలమీదకి చూస్తూ నిలుచుని వుంది, గీతాదేవి.

అతని అడుగుల సప్పుడి వినిపించినా అలాగే నిశ్చలంగా చూస్తూ వుండిపోయింది.

వుత్తరీయం సోఫామీద పడేసి కీళ్ళు పట్టేసినట్లుగా నిదానంగా వొంగి సోఫామీద కూర్చున్నాడు.

"గీతా, స్నానం చెయ్యకుండా నువ్వు యింకా ఆ నలిగి మాసి పోయిన బట్టలలో నిలబడి వున్నావా!" అన్నాడు పాలరాతిమీద వొలికిన అమృతం ప్రాకినట్లు.

స శేషమ్ జీవితమ్



అతని కళ్ళల్లోని చూపు—అలసటలోంచి జనించే బలహీనమైన చూపు—ఆమె ముఖంమీద నిలిపి—

విషాదంగా నవ్వింది చప్పుడవకుండా. నిద్రితోద్దీప్తిని స్ఫురింపజేసే ఆ నవ్వును వీణానిస్వనం మాత్రమే వ్యక్తం చెయ్యగలదు. ఆమె కంఠ స్వరానికీ, నిశ్శబ్ద విషాద దరహాసానికి సరిపోయేది, వీణానాదం మాత్రమే ననిపిస్తుంది.

అతని అంతర్యం, కొలనులోని అలలలాగా చలించింది.

యెటో, గమ్యం తెలియకుండా ప్రాకిపోతున్నట్లుగా; రేగిన వెం కలు, మెడకిందుగా వీపుమీద ముడిలో చిక్కుకుని పోయాయి. మ తెర అడ్డంపడి మసకేసిన సాయం సూర్యబింబంలా; నుదుటిమీద చెరి కుంకుమబొట్టు ఆనవాలు. సున్నాలా తిరగటానికి వోపిక చాలక వో గానే నిలిచిపోయినట్లుగా సన్నటి నల్లని కనుబొమలు. నోరుతెరిస్తే, గా విషాదాన్ని కక్కుతుందన్నట్లుగా వొంపు చుట్టుకుపోయిన పెదవు నీళ్ళల్లో మూడురోజులు నానిన గులాబి రేకుల్లా పేలవంగా నిస్త్రాణం చలిస్తున్నాయి—పూర్తిగా కంపించితే నోరు తెరుచుకుంటుందేమో భయపడుతున్నట్లుగా, చర్మపు తెల్లదనం కన్నీళ్ళకి కరిగి వుప్పగా నా దుప్పటి నూలుపోగుల పీచుకు అతుక్కుపోయి—ప్రహరీగోడ ప్రక్క దుమ్ము కొట్టుకుపోయిన పచ్చగన్నేరు పువ్వులా ముఖం. సప్తవర్ణాలనూ తనలో నింపేసుకుని వాటి వొత్తిడికి తట్టుకోలేక కాంతిపుంజమై తెల్ల చిమ్మిన అనుభవంలోంచి యింకా తేరుకోలేక స్వప్నంలో చెమ్మగిల్లిన కళ్ళలా; యింకా తడి ఆరని నేత్రాలక్షిలిను—

కన్నీరు వింత వొంపుల రూపమై ఘనీభవించినట్లుగా; కిటికీ గోడ అంచుకి ఆనుకుని నిలుచుని వున్న ఆమె— శతాబ్దులుగా వానలో తడిసినా ముద్ద అయిపోలేక దేవాలయం ముందు దీనంగా చూస్తూ నిలిచిన శిల్పంలా అనిపించింది అతనికి.

"గీతా, వెళ్ళి స్నానం చెయ్యి." అన్నాడు. ఆ మాటలలో చిందిన ప్రేమ, మమత, అనురాగం, ఆత్మీయత—ఆమె కళ్ళ నీలిమలో కలిశాయి

ఆమెకళ్ళు చెమ్మగిలి నట్లయ్యాయి.

సశేషమ్ జీవితమ్

లేచి ఆమె దగ్గిరిగా వెళ్ళి, ఆమె గడ్డంకొంప చూపుడు వేలితో పైకి వొత్తి, "గీతా—" అన్నాడు.

ఆ ఆదరానికీ, ఆత్మీయతకు తట్టుకోలేక పోయినట్లుగా కనురెప్పలు, కాకిపిల్ల రెక్కల్లా కొట్టుగుని—ఆమెచూపు సిడిపొరతో మసకేసి పోయింది.

తల, విదిలించినట్లుగా కదిపి బాధగా, బలహీనంగా పెదవులతో నిశ్శబ్దంగా నవ్వి, "మీరు చెయ్యండి ముందు" అని అవతలికి వేసింది రెండడుగులు.

చెమ్మగిలిన కన్నులతో తలవొంచి, వెనక్కి తిరిగి స్నానాలగది వైపు అడుగులు వేశాడు నిదానంగా.

స్నానాలు ముగిశాక, పనిమనిషి వొచ్చి గుర్తుచేస్తే భోజనాల గదిలోకి వెళ్ళి కంచాలలో వేళ్ళుపెట్టి కెలుకుతూ కూర్చుని పోయారు. తినబుద్ధి కావటంలేదు

వంటమనిషి గది గుమ్మంలోకి వొచ్చి తలుపును ఆనుకుని నిలబడి, "చినబాబుగారూ—" అంటూ బావురుమంది.

అంతలోనే, వంటగది తన నొసటిరేఖ, దానిని దాటరాదన్నట్లుగా వెనక్కి తిరిగి వెళ్ళిపోయింది.

నాలుగు మెతుకులు కొరికి, చేతులు కడిగేసుకుని గదిలోకి వొచ్చే శారు.

గీతాదేవిని మంచంమీద పడుకోమని తాను సోఫాకి అడ్డంగా వొరిగి, దిండు జరిపి ప్రక్క అంచుమీద తల ఆన్చి నుదుటిమీదుగా కుడి చెయ్యి తిప్పి కళ్ళు మూసుకున్నాడు.

తలుపు వారగా లాగి వుంది.

యెవరో పిలిచినట్లుగా వినిపించి కలత నిద్రలోంచి లేచాడు క్రిష్ణచైతన్య.

నాలుగున్నర ఐంది.

మంచంవైపు చూశాడు. మంచం అంచుమీద చెక్కిలి ఆన్చి నేల మీదకి చూస్తూ నిశ్చలంగా పడుకుని వుంది గీతాదేవి.

సశేషమ్ జీవితమ్

గుమ్మంలో అడుగుల సవ్వడి—

వారగా లాగివున్న తలుపు సందులోంచి పని మనిషి కదలటం కనిపించింది

లేచి, ధోవతి సరిచేసుకుని, జుబ్బా కిందకి నొక్కి— గుంజుకుని వెళ్లారు

నాయక్ వొచ్చాడట తనకోసం.

వొస్తున్నట్లు చెప్పమని—స్నానాల గది తలుపు తీసి కొళాయి తిప్పి అరిచేతిలో నీళ్లు పట్టుకుని మెడ వొంచి ముఖం తుడుచుకున్నాడు. తువ్వాలుతో అద్దుకుని బయటికి వొచ్చి ఆమెకేసి కంటికొసలోంచి క్షణకాలం చూసి గది బయటికి అడుగులు వేశాడు.

డ్రాయింగ్రూంలోకి వెళ్ళి, "నమస్తే"— అని చేతులు జోడించాడు క్రిష్ణచైతన్య.

లేచి కరస్పర్శచేసి, క్రిష్ణచైతన్య ముఖంలోకి చూపు వొంచి— అంతలోనే తలవాల్చి, మౌనంగా సోఫాలో కూర్చున్నాడు నాయక్.

మూడు నిమిషాల నిశ్శబ్దం.

నాయక్ ముఖం, దిగులుగా బాధపడుతున్నట్లుగా వుంది.

అది లాంఛనికం కాదనిపించింది క్రిష్ణచైతన్యకి.

"మృత్యువనేది సహజమే ఐనా, ముత్యం చిప్పలాంటివాళ్ళకి వొచ్చినప్పుడు యెలాగో అనిపిస్తుంది, మనసు. అంతటి స్నేహశీలుణ్ని నేనెరగను. మైత్రిముందు సమస్తాన్నీ తృణంగా చూసేవారు. స్నేహానికి ప్రాణాలిచ్చేవారు. కోపమొచ్చినా సంతోషమొచ్చినా పే్రేగిపోయేవారు. పాలపొంగులాంటి మనిషి. ఆయన హృదయంలో పాలపొంగులోని నిర్మలత్వం వుంది. ఆయనతో గడిపిన క్షణాలు—" అతని గొంతుతడిబారింది.

బాధగా, అనుకంపనగా అతనికేసి చూశాడు క్రిష్ణచైతన్య.

మరో మూడు నిమిషాల నిశ్శబ్దం.

నిశ్శబ్దం విషాదంలా కమ్ముతున్నట్లనిపించి, యేమనాలో యేం మాట్లాడాలో తోచక— "నాకు వృద్యాసన పత్రం తెచ్చారా?" అని అప్రయత్నంగా అనేశాడు.

"అదేమిటి!" అన్నట్లుగా చూసి, అంతలోనే అర్థమైనట్లు కళ్ళు కదిపి, "యింకా రెండు నెలలుంది మీ సెలవు గడువు" అన్నాడు నాయక్.

'రిసెర్చికి అనుమతించిన పత్రం చూపెడదామని—"

'యేమి రిసెర్చి?"

'అదే, గీతాదేవిగారిని రిసెర్చి దరఖాస్తుమీద—"

"వో అదా—"

"త్వరలోనే స్కాలర్‌షిప్ రావొచ్చు."

"చెయ్యగలదు వొకటికాదు; మూడు రిసెర్చిలు చెయ్యగల! మనిషి, యిదో, యీ క్రతువు ఐపోయాక వొచ్చి, మిమ్మల్ని; దత్తాగారిని కలుసుకుంటుంది లెండి."

"దత్తాగారు-వో, మీకు తెలీదుకదూ ఆయన నిరుడు రిటైరయ్యారు. లినోవాలా, ప్రొఫెసరయ్యారు."

"అలాగా—చూశారూ, వూళ్ళవెంట తిరుగుతూ, నేను యేమీ తెలుసుకోకుండా వుండిపోయానన్నమాట!"

"అదేమన్నమాట, మీ పర్యటనని, తిరగటం – అనగలమా గొప్ప విషయాన్ని సాధించారు. మీ థీసిస్ యెందుకు అచ్చు వెయ్య కూడదు? అన్నట్లు హార్వర్డునుంచి వొకాయన రాశాడు — బహుశా మీకు తెలిసిన వ్యక్తే ఐవుండొచ్చు. పేరు-యిప్పుడు జ్ఞప్తికి రావటంలేదు."

—తను యింటినుంచి యెందుకు పారిపోయిందీ; యెలా, అడ్డ గాడిదలా తిరిగి వొచ్చిందీ; చెబితే యేమంటాడు, యీాయన! ఆయన అభిప్రాయం కాగితం వుండలా ముడుచుకుని చుట్టుకుపోయి—ఆ నిజాన్ని వొప్పుకోవటం యిష్టంలేనట్లుగా ముఖం పెడతాడు. ఆయనకి ఆ తృప్తి వుంచటమే భావ్యం—

"అలాగే ఫేబరువాళ్ళకిరాసి చూస్తాను" అన్నాడు క్రిష్ణచైతన్య.

"ప్రొఫెసర్ లినోవాలాకి గీతాదేవిగారిపైన చాలా సదభిప్రాయం వున్నట్లుగా ఆమె మాటల ధ్వనినిబట్టి అనిపించింది. మరీ దూకుడుగా అభి ప్రాయాలు వెలిబుచ్చకండా రచన సాగిస్తే మంచిదన్నట్లుకూడా తేల్చింది."

"అలాగా! చెప్పండి, గీతకే-వొచ్చి మిమ్మల్ని కలుస్తుందిలెండి."

అతని మాటలు వింటూ అలాగే నిశ్శబ్దంగా అతని ముఖంకేసి చూస్తూ వుండిపోయి—మళ్ళీ అంతలోనే తేరుకున్నట్లుగా అయి, "యింతకీ ఆమె—యీ యింటికి సంబంధం—బంధువో, నేస్తమో—" అని ఆగిపోయాడు నాయక్.

"ఆమె యెవరు? అని, అంతేకదా!" అని పల్చగా నవ్వాడు.

"మరోలాగా భావించకండి నా ఉద్దేశం—"

మధ్యలోనే అందుకుని, "మీరు పెద్దవారు. నాపట్ల ఆదరాభిమానాలున్న వారు. మిమ్మల్ని తప్పుగా భావిస్తానని అనుకోకండి—" అని యింకా యేదో చెప్పబోయి—ఆగిపోయాడు.

"బయట పి. డబ్లియు కార్యాలయంలోనూ, క్లబ్బులోనూ, నలుగురూ నాలుగురకాలుగా అనుకోవటం, యి. యి. లూ వాళ్లూ తలొక రీతిగా చెప్పటమూ కద్దు. కానీ నిజానికి ఆమె యెవరో యేమిటో నాకు సరిగా తెలీదు" అన్నాడు నాయక్.

"నిజంగా మీకు తెలియదా యింతకాలం!" నవ్వి, "అబద్ధ మాడాల్సిన పనిలేదు. రూఢిగా యేమీ తెలీదు. మీ నాన్నగారిని అడిగేసి తెలుసుకోవాలని వొకటి రెండుసార్లు అనిపించినా అడగలేకపోయాను, ఆయన తేలికగా నవ్వేసి, యెంతటి భారమైన మాటయినా అనగలరు! ఆ భయం చేతనే అడగలేకపోయా ననుకుంటాను."

—మనని కసిగా చూడనివాళ్ళకి. నిజాన్ని పచ్చినిజంలా చూపెట్టి బాధకలిగించటం కన్న, నిజానికి పట్టు బట్టలు చుట్టి బుగ్గలకి చక్కెర అద్ది అందించటమే వివేకం—ముఖ్యంగా, తను తద్వారా యెవరికి అపకారం తలపెట్టనప్పుడు, తనకి అనుకూలంగా వున్నప్పుడు.

"గీతాదేవి మాకు బంధువుకాదు యీ వూళ్ళోనే బియ్యే చదివింది. నాకు ఆమెతో పరిచయం. ఆత్మీయానుబంధం. నేను పరిశోధనా పర్యటనకి వెళ్ళబోతూ, బొంబాయి విశ్వవిద్యాలయంలో యెమ్మే చదివి రమ్మని సలహా యిచ్చాను. అప్పుడు—అనగా నాన్నగారు పశ్చిమ జర్మనీ వెళ్ళిన ఆ వేసవి యీ యింట్లోనే నాతోపాటు వుండిపోయింది. యెమ్మే అయ్యాక

విశాఖలో తాత్కాలికపు ఉద్యోగం చేసింది. నిర్వ్యాపకంగా అక్కడ దేనికీ, యింటికి వొచ్చి నాన్నగారి తోడుగా వుండమనీ, మిమ్మల్ని కలుసుకుని రిసెర్చి విషయం తలపెట్టమనీ రాశాను తల పంకిస ఆయనకీ పాతి కేళ్లు నిండీ నిండని ఆమెనీ కలిపి యేమేమి అనుకున్నారేమిటి!" అని నవ్వటానికి ప్రయత్నించాడు.

బట్ట తలకీ మోకాలికీ ముడిపెట్టి జూస్తుంది లోకం. యేదైన అనుకోగలదు." అని పల్చగా నవ్వాడు నాయక్.

క్రిష్ణచైతన్యకూడా నవ్వినట్లుగా ధ్వనిచేశాడు గొంతులో.

"నేనప్పుడే అనుకున్నాను—"

మధ్యలోనే అందుకుని "పండి రాలిపోబోయే వృద్ధుడిమీద జాలిపడి కావలసిన ఆనందాన్ని పవిత్రంగా యివ్వగలిగినా తప్పుపట్ట నక్కర లేదేమో!" అన్నాడు క్రిష్ణచైతన్య.

అతనికేసి వింతగా చూసి, "ఆ మానసిక స్థాయి, పరిణతి అందరికీ వుండవొద్దూ!" అన్నాడు నాయక్.

నవ్వు ముఖంతో అతనికేసి చూశాడు క్రిష్ణచైతన్య.

"ఆమెకి తన వాళ్ళంటూ"—ఆగిపోయాడు నాయక్.

"లేరు తండ్రిగారు మూడేళ్ళనాడు యీ వూళ్ళోనే కారు ప్రమాదంలో పోయారు. బంధువులను అలక్ష్యంచేస్తూ దూర దూరంగా దేశం వెంబటా తిరిగిన వ్యక్తి ఆమె తండ్రి.

"వో, అలాగా—" అని విషయం అర్థమైనట్లుగా తల పంకించాడు నాయక్.

ఆ తరవాత విశ్వవిద్యాలయం కబుర్లు, నాయక్ బంధువు చేస్తున్న కొత్త కంట్రాక్టుల గురించీ మాట్లాడుతూ కూర్చున్నారు.

బద్ధకంగా మంచంమీద అటూ యిటూ కదిలి—మంచం దిగి చీర కుచ్చిళ్ళు సరిచేసుకుని, పవిట బిర్రుగాలాగి—అద్దంలో చూసుకుంది గీతాదేవి.

ఆమె ముఖం ఆమెకే దిగులుగా అనిపించింది.

యేం చెప్పటానికీ తోచక కిటికీవైపు తిరిగి వెళ్ళబోతూండగా, గుమ్మంలో అడుగుల చప్పుడు వినిపించి—వెనక్కి తిరిగి చూసింది.

సశేషమ్ జీవితమ్

గుమ్మంలో నిలబడి వుంది సీతమ్మ.

ఆమెకేసి నవ్వు ముఖంతో చూడబోయి విఫలమై, కనురెప్పల్ని వాల్చి, ఆమెవైపుకి రెండడుగులు వేసింది గీతాదేవి—లోనకి ఆహ్వానిస్తున్నట్లుగా కదలికలో స్ఫురింపజేస్తూ.

లోనకి వొస్తూ, "అమ్మా, యిక నాపనె పోయిందమ్మా—వెళ్తున్నా యింక ఆ కనకదుర్గమ్మతల్లే నాకు దిక్కు—" అంది సీతమ్మ.

ముఖంలో యీసడింపు, రోషం, కసిలాంటివేమీలేవు. దిగులుగా అలిసిపోయి యింకనిద్రకోసం నిరీక్షిస్తున్నట్లుగా కనిపించింది ఆమెముఖం

జాలిగా అనిపించి, "కనకదుర్గమ్మ గుడికి కాశీకి పోవాల్సిన అవసరం యేవిఁటీ? యీ యిల్లూ యీ సంపదా మీవి కావని యెవరన్నారు?" ఆదరంగా అంది, గీతాదేవి.

"బతికి చెడ్డావా చెడి బతికావా అని, సిరిసంపదల కేమొచ్చిందిలే—చిన్నప్పట్నించీ అల్లారుముద్దుగా పెరిగిన దాన్నే. వొక్క—గానొక్క కూతురినని మా నాన్న యెట్లా పెంచారో యేమిటో, యిప్పటి వాళ్ళకేం తెలుసు! ఆ రోజుల్లోనే తాసీల్దారీ చేశారులే—మ్మా ఆ రోజులూ పోయాయి—ఆయన పోవటంతో ఆ కాస్త బతుకూ బజారుపాలైంది. యింక వీడు పోవటంతో దిక్కు—లేని పక్షిలాగా అయిపోయాను" అని పవిటకొంగుతో కళ్లు వొత్తుకుంది సీతమ్మ.

గీతాదేవికి; ఆమని చూస్తే జాలేసి— అంతలోనే వుదయం తనని అన్నమాటలు గుర్తుకొచ్చి—అల్పంగా నవ్వుకుని, "అవేం మాటలండీ, మీరు దిక్కు—లేని వాళ్ళైపోవటం యేవిఁటీ! రండి, యిలా సోఫామీద కూర్చోండి" అని అవతలికి అడుగులు వేసింది గీతాదేవి.

"చిన్నప్పటినుంచీ వాటిల్లో కూచ్చుని కూచ్చుని పెరిగిన దాన్నే గానీ—యిప్పుడీ ముసలిముండ యెక్క—డ కూచుంటే యేంలే—" అని నేల మీద చతికిలబడింది, సీతమ్మ.

"నేనప్పుడే అనుకున్నానసలు—వయసు మళ్లినాయన అట్లా నీకోసం యెర పెరలాడి పోతాంటేకూడా చిల్లిగవ్వ ఆస్తి రాయించుకోలేదంటే—నీతీరూ, నీ లక్షణమే వేరు—అని పాపం యేదో పెద్దాయనమీద జాలిపడి

పోవటం కాకపోతే—అందానికి అందమూ, చదువుకి చదువూవున్న నీకేం గరుజు పట్టిందని! ఆమాటే అన్నాను పొద్దున మా పెద్దన్నయ్య సామనా ధంతో—ఆ మాటకి యింతెత్తున లేచి నా మీా చివాట్లూ వేశాడు నన్ను. నీకు పరువు మర్యాదల్లేకపోతే నువ్వుండు,నేను యీా క్షణమే వెళ్ళిపోతున్నాను. మళ్ళీ యీా గడపతొక్కనూ—అని మండిపడ్డాడు. అయిపోయిందేదో అయి పోయింది. దానికిప్పుడు యేమెరగని చిన్నవాడు కిష్టుణ్ని కాదనుకోటం న్యాయంకాదూ, వాడేమన్నా కానిపని చేస్తే గదా; మనం, యేమోలే అని మమకారం చంపుకోవాలనుకోవటం అని అన్నాను, అక్కడికీ. నామొఖాన వూచినంత పనిచేసి, అందర్నీ కదలదీసి కట్టడిగా వెళ్ళిపోయాడు. యెంతైనా స్వయానా పెత్తండ్రి—యేదో పరువు ప్రతిష్ఠలకోసం తామస పడ్డాడే గానీ కొడుకు తరవాత కొడుకంతటి వాణ్ని కాదనుకోగలడటలే— పెత్తండ్రి ఆ తీరుగా వెళ్ళిపోయేసరికి; పొద్దుటినుంచీ పాపం, వొంటూ పిరివాడు కిష్టుడు బితుకు బితుకు మంటూ యింటిసిబడి తిరుగుతాంటే నా ప్రాణం తరుక్కుపోతాందనుకో. ఐన వాళ్ళందరూ కాదనిపోతే వొంటరిగా యేమైపోను! చూస్తూ చూస్తూ పోలేక వుండిపోయానేగానీ నాకూ భయంగానే వుంది; ఐనవాళ్ళంతా నన్నూ వేలేస్తారు కదా అని. పిల్ల పెళ్ళి చెయ్యాల్సికూడా వున్నదాన్నయ్యే! వాళ్ళు మాత్రం యేమన్నా రనిలే అయిందేదో ఐపోయింది— ఆ అమ్మాయికి మాత్రం యింక యీా యింటితో బంధం యేముంటుందీ—నమ్ముకుని వున్నందుకు అన్యాయం చెయ్యకుండా తృణమో పణమో యిచ్చి పంపేసెయ్యి - అన్నారు. జ్ఞానమున్న వాళ్ళెవళ్ళైనా అనేమాటే. మా కిష్టుడు మహా మొహమాటపు మనిషి - యెదురుపడి యెవరినీ యేమీ అనలేడు. చిన్నప్పటినుంచీ అంటూ వుండేదాన్ని—నోట్లో నాలిక లేనివాడివి యీా ప్రపంచంలో యెట్లా బతుకుతావురా—అని వాడి తండ్రేవుంటే; వాడికీ గొడవలన్నీ, రాకనూ పోను మేమంతాయిట్లా యిదవ్వాల్సిన పనీ లేకపోను—" అని కళ్ళు వొత్తుకుంది సీతమ్మ.

పాత సంగతులు జ్ఞాపకం తెచ్చుకుంటున్నట్లుగా తల వూపి. నిర్మల పుట్టినప్పటినుంచీ అందరం అనుకున్నాం — అది యీా యింటి

క్షేమమ్ జీవితమ్

కోడలని వెనక యెప్పుడో నైజాం నవాబు కావాలని యిక్కడికి మా సారథన్నయ్యని పిలిపించుకున్నా మా కుటుంబాల మధ్య రాకపోకలు ఆగిపోలేదు. ఆయనగారు పోయినప్పటి నుంచీ తనే దిక్కయ్యాడు నాకు. అసలు మా చిన్నన్నయ్యకి నేనంటే యెక్కడలేని ప్రేమ. నిర్మల పుట్టినాక దాన్ని చూసి, యీ బంగారు బొమ్మ నా కోడలు—అని మురిసిపోయాడు యే మాట కామాటే చెప్పుకోవాలి — మా వదిన కూడా యెంతో యిదిగా వుండేది నువ్వు చూడలేదు గానీ ఆ నిండుతనం యెవరికుంటుందని. అట్లాంటిది యిప్పుడు ఆ పెళ్ళి అవుతుందో కాదో ననుపించటంతో మా పెద్దన్నయ్యకి బాదేసి కిష్టుడిమీద కోపగించుకుని యిక వాడి మొఖం చూడనని వెళ్ళిపోయాడు. యేవిటో మొన్న మొన్నటి దాకా నిర్మలంటే యెంతో యిష్టం కిష్టుడికి. యిప్పుడేవిటో మనసు బాగోక యెట్లాగో వుంటున్నాడు కాస్త నువ్వన్నా నచ్చజెప్పమ్మా వాడికి—నా బరువు దిగి పోతుంది. నీ మేలు మరవను" అని అమాంతం ముందుకు వొంగి, గీతా దేవి పాదాలమీద చేతులు వేసింది. సీతమ్మ

అనూహ్య సంఘటనకి యేమీ తోచనట్లుగా కదిలి, "పెద్దవారు మీరు నా పాదాలు తాకకూడదు" అని అవతలికి జరిగింది, గీతాదేవి.

కళ్ళతడి తుడుచుకుని, పవిట ముక్కుకి అడ్డు పెట్టుకుని చీదుకుంది. తల వొంచి యేవిటో గొణుక్కుంటున్నట్టుగా వుండిపోయింది.

కడుపుతీపి అలాంటిది. లేకపోతే యీవిడకి నాకాళ్లు పట్టుకోవాల్సిన అవసరం యేవిటి! యేవిటో యెటు చెయ్యటానికీ వీలుకాని జీవితపు చిక్కుముళ్ళు—అనుకుని ఆమెకేసి జాలిగా చూసింది గీతాదేవి.

"వొస్తానమ్మా. దాని రాత యెట్లావుందో, వాడి బతుకు యేం కానుందో పైన ఆ పరమాత్ముడికే తెలవాలి" అని సన్నగా కూని రాగం తీసి గొణుక్కుంటున్నట్లుగా తనతో తను మాటాడుకుంటూ, లేచి గుమ్మం బయటికి వెళ్ళిపోయింది సీతమ్మ.

సోఫామీద కూచుని వొళ్ళో మోచెయ్యి ఆన్చి, చూపుడువేలు మడిచి ప్రక్కపళ్ళ నొక్కుకుంటూ వుండిపోయింది గీతాదేవి.

తన గదిలోకి వొస్తూ, "గీతా, నీ రిసెర్చి దరఖాస్తుకి అనుమతి

తాఖీదు పంపించారు. యిప్పుడే నాయక్‌గారు వొచ్చి చెప్పారు" అన్నాడు క్రిష్ణచైతన్య.

తల పైకెత్తి వింతగా పల్చగా నిశ్శబ్దంగా నవ్వి, "యీ జీవితం నా మీద రిసెర్చి చేస్తోంది; ముందు అది ముగిస్తే కదా నా రిసెర్చి !" అంది.

"అన్ని పరిస్థితులూ అవే చక్కబడతాయి. నీకు ఆ దిగులు అక్కరలేదు" అన్నాడు.

"నాకు యే దిగులూ లేదు. మొన్నటి దిగులు చాలకనా!" అంది.

ఆమె మాటల అర్థం గ్రహించి, బాధగా జాలిగా ఆమెకేసి చూసి—మౌనంగా వుండిపోయాడు.

"పాతికో పరకో చేతులో పెట్టి నన్ను పంపించివెయ్యటానికీ, మీ మేనత్త కూతుర్ని పెళ్ళి చేసుకోటానికీ మీరు యిష్టత చూపెట్టలేదని మీ పెదనాన్నగారు మండిపడి, యింక యీ గడప తొక్కనని పరివార సమేతంగా వెళ్ళిపోయారటగా!" అంది.

"అవును; వెళ్ళిపోయాడు కానీ అందుకు అంత కంటే ముఖ్య కారణం వుంది. యీ ఆస్తి సమస్తం తన అధీనంలోకి వొస్తే; వొక వూపు వూపాలని. అది సాధ్యపడదని తేలేసరికి ధుమధుమ లాడుతూ, పరువు మర్యాదల దుప్పటి కప్పుగుని వెళ్ళిపోయాడులే!" అని సన్నగా నవ్వాడు.

"మీకు మొన్న మొన్నటిదాకా మీ మేనత్త కూతురంటే యిష్టమేనటగా" అని నవ్వు పెదాలతో చూసింది.

చిన్నగా నవ్వి, "మొన్న మొన్నటిదాకా యేంఖర్మ! యిప్పుడున్నూ. యింతకీ యీ సమాచారమంతా నీ చెవిదాకా చేరవేసిన పుణ్యమూర్తి యెవరేమిటి?" అన్నాడు.

"యెవరనేంవుంది ? కడుపు తీపికొద్దీ యెవరైనా చేరవేస్తారు" అంది.

"నేను అటు వెళ్ళాక సీతమ్మత్త వొచ్చిందా నీ దగ్గిరకి?"

"అవును. పాపం, హృదయవిదారకంగా అగుపించింది."

"ఆవిడ యెన్నిటికైనా తగును" అన్నాడు.

సశేషమ్ జీవితమ్

"ఐనవాళ్ళందరూ వెలివేస్తే వొంటరి ఐపోయి యీ ప్రపంచంలో యేం బతకగలరు! నేనొక్కదాన్నీ వెళ్ళిపోతే—అందరూ, అంతా—అన్నీ గొడవలూ సమసి పోతాయనిపిస్తోంది!" అని భారంగా నిట్టూర్చింది.

"యేమో, అలా బ్రతకగలిగేది మీ నాన్నగారొక్కరే అనా చూస్తూ వుండు; యీ గొడవలు యెంతోకాలం వుండవు. నేను వాటన్నీ నీటి చక్కబెట్టగలనన్న విశ్వాసం నాకుంది" అని ఆగి, ఆమెకేసి చూసి "గీతా, డబ్బు మహాపాపిష్టిది. నిన్నూ రాగరంజిత రసానుబంధాన్ని సాధించలేకపోవొచ్చుగానీ—దానికి సాధ్యం కానిదంటూ లేదు. కరెన్సీ నోట్లు విసిరి; పరువు మర్యాదల్ని కిలోగ్రాములకొద్దీ తూయించి తెచ్చుకో వొచ్చు. డబ్బంటే పరమ రొచ్చుబురద. ఆ బురద వేళ్ళతో తీసి, లోకపు నుదుట కుంకుమ రేఖలాగా పూస్తే; నీ వెంట పెళ్ళికూతురిలా నడిచి వొస్తుంది కోపం వొచ్చినప్పుడు నడ్డి విరిగేలా తన్నినా; ముక్కుతూ మూలుగుతూ పడివుంటుంది. అప్పుడు నీవు వినా తాను లేనట్టు మసల కుంటుంది, లోకం. యిప్పుడు అలకబూని వెళ్ళిన వాళ్లూ, యింకా యితర బంధుకోటి యేడాది తిరక్కుండా నఫీస్‌మంజిల్ ఆవరణలో నీకు గొడుగ పట్టి నిలుచుంటారు నువ్వే చూస్తావుగా! ముందు జరగాల్సింది; యీ వున్న యిద్దరూ కూడా వెళ్ళిపోవాలి. కానీ, సీతమ్మత్త వొక పట్టాన వొదలదు. వొస్తూ, శపథంచేసి వొచ్చిందటలే—తన కూతుర్ని నాకిచ్చి పెళ్ళి జరి పించలేకపోతే; కనకదుర్గమ్మకి తన ప్రాణాలు అర్పించుకుంటానని. యీ ఆముదం జిగురు, సీకాయ వేసి రుద్దినా వొదిలేలా లేదు. యాసిడ్ వేస్తే వొళ్లు కాలుతుందే—అని చూస్తున్నాను" అని నవ్వాడు.

"చావుతో సంధి ప్రేలాపనలా, సాయం సూర్యోదిలా; మీ తెలివి యినుమడిస్తున్నట్లుంది!" అని నవ్వి అతని ముఖంకేసి చూసి, "అను కునేంత తేలికకాదు, యీ పీటముళ్లు విప్పటం. యీ విషాదపు పొంగు తగ్గకముందే, నేను నిష్క్రమిస్తే, యే నిండుప్రాణాలూ తియ్యకుండా వున్నానన్న తృప్తి అయినా మిగులుతుందేమో—" అని నిట్టూర్చినట్లుగా శ్వాసవిడిచింది.

"వెళ్ళిపోయి!" ఆమె ముఖంకేసి చూసి, చేత్తో తనకేసి చూపు

కుంటూ, "వెళ్ళిపోయి; యీ సింధుప్రాణం తీసినదానవవుతావనే విషయం మర్చిపోతున్నావు, గీతా—" అన్నాడు. అతని గొంతు తడబాటింది

కనురెప్పలు వల్చి, భారంగా శ్వాస వొదిలింది. రెప్పల సల్లటి వలలోంచి నీటిపొర మెరిసింది, వింతగా.

* * *

భోజనాల గదినుంచి వొస్తూ ముందువైపు మెట్ల ప్రక్కన కుర్చీలు వెయ్యమని పనిమనిషికి చెప్పి—"కాసేపు బయట కూర్చుందామా—"అన్నాడు గీతాదేవితో. అయిష్టాన్ని తెలియజేసి పడుకుంటానని చెప్పి గదిలోకి వెళ్ళిపోయింది.

ముందు వరండాలోకి వొచ్చి రెంతు నిమిషాలు నిలుచున్నాడు.

గులాబీ తోట, చీకట్లో కందిచేనులా అనిపిస్తోంది. యింటి ఆవరణకి ఆవలగా తమలో తాము యేవో గుసగుసలు పెట్టుకుంటున్నట్లుగా చెట్లు గగనపు ముఖాన బూడిద మరకలలా, అక్కడక్కడా మబ్బులు. భాధాస్మృతులలోంచి కలుక్కుమంటునట్లుగా నక్షత్రాలు—

చూపు కళ్ళలోకి లాక్కుని, తాపీగా మెట్లుదిగాడు చీకట్లో అతని ధోవతీ జుబ్బా తెల్ల ముద్దలా కదిలాయి,

మెట్ల ప్రక్కగా భోగపూల కుదురు దగ్గిర నాలుగు కుర్చీలు వేసి వున్నాయి.

యెవరో; వరండాలో దీపం వేశారు.

మసక వెలుతురు ఆవరణ అంతటా వ్యాపించింది.

వో కుర్చీలో కూచుని, ఆలోచిస్తున్నట్లుగా నేలమీదకి చూస్తూ వుండిపోయాడు. అరగంట గడిచింది.

వరండాలో అలికిడి వినట్లనిపించి ప్రక్కకి వొంగి చూశాడు.

నిర్మల.

కాసేపు నిలబడి గులాబీతోటవైపు చూసి—అటూ యిటూ పచారు చేస్తోంది, వరండాలో.

మూడు నిమిషాలు గడిచాయి.

"నిర్మలా—" అన్నాడు క్రిష్ణచైతన్య.

"యెవరు? యేమిటి?" అన్నట్లుగా అటూ యిటూ చూసింది.

మళ్ళీ పిలిచాడు.

యెడమ వైపు రాతి స్తంభం వైపు అడుగులు వేసి కిందకి చూసింది.

రమ్మన్నట్లు చూపుడు వేలితో సూచించాడు.

మెట్లు దిగి నిమ్మదిగా నడిచి వొచ్చి నిలబడింది.

సన్నగా పొడవుగా లతలా వుంది. అంచులేని గులాబీరంగు జార్జెట్ చీర, యెడమ పాపిటతీసి వొదులుగా అల్లుకున్న పొడవాటి జడ, కనకాంబరాల పూదండ, కాటుక దిద్దుకున్న సోగ కళ్లు. సన్నగా పొడవుగా వొంపు తిరిగిన పెదవులు. ఎర్రటి కోలముఖం—వయసు పద్దెనిమిది పంధొమ్మిదికి దాటనట్లుగా అనిపిస్తుంది చూడగానే.

"కూర్చో నిర్మలా—" అన్నాడు ప్రేమగా.

అతనికి యెదురుగా వున్న కుర్చీలో కూచుంది.

వొక నిమిషం నిశ్శబ్దం.

తల వొంచి పేము బద్దీల వెంట చూపుడు వేలితో గీస్తూ వుండిపోయింది.

"యీ యేడు బియ్యేస్సీ ఆఖరి సంవత్సరమా?" అన్నాడు.

అవునన్నట్లుగా తల వూపింది.

"మరి, వొచ్చేయేడు యెమ్మెస్సీలో చేరతావా?"

"యేమో. అమ్మేమో, యిక్కడికే నా చదువుకి బోలెడు ఖర్చైందనీ యీ బియ్యేస్సీతో ఆపేసెయ్యమనీ అంది."

"మరి. నీకు చదవాలని లేదా?"

ఆమె మాట్లాడలేదు.

"యీ మూడేళ్ళనుంచీ నీ చదువు ఖర్చు పెద్దనాన్న చూడటం లేదా?"

పెదమావయ్య సంగతి నీకు తెలవందేముంది బావా—కిందటేడు చినమావయ్య వొకసారి బెజవాడొచ్చినప్పుడు రెండువేలు యిచ్చాడు అమ్మకి. దాంతోటే చదివిస్తున్నట్లు చెబుతుంది అమ్మ."

"మరి అత్తయ్యపేర కొద్దిగా భూమి వుండికదా-దానిమీద ఆదా

యం రావటం లేదా?"

ఆమె మాట్లాడ లేదు.

"వేలకి వేలు తమ సంపాదన చాలక అదికూడా తినేస్తున్నాడా యేమిటి మీ పెద్దమావయ్య!" అని సన్నగా నవ్వాడు.

"ఆ విషయాలేమీ నాతో చెప్పదు. అమ్మ యెప్పుడూ, తండ్రిలేని పిల్లని కదా అని నాలుగు రాళ్ళు వెనకేస్తే అక్కర కొస్తుంది కదా అని నేను తాపత్రయపడి పోతూంటే నువ్వేమో యెంత సేపూ పుస్తకాలూ జీతాలూ బట్టలూ స్నో పౌడర్లూ అని ప్రాణం తీస్తావు-అని నన్ను అంటూ వుంటుంది."

"ఐతే అత్తయ్య, కట్నం జమ చేస్తోందన్న మాట! అవునా?"

"యేమో నాకు తెలీదు" అని సిగ్గు పడింది.

"కళాశాలలో చదువుకుంటున్న పిల్లవి, కట్నంమాట యెత్తగానే సిగ్గుపడి పోతారా? వరకట్నాల గురించి అరగంట సేపు మగవాళ్ళమీద వుపన్యాసపు దుమ్మెత్తిపొయ్యక?"

"ఫో. బావా—నువ్వెప్పుడూ నన్ను ఆట పట్టిస్తావు"

"నిర్మలా, నీకు వయసు వొచ్చింది కళాశాలలో చదువుకుంటున్నావు కానీ ప్రపంచం తెలియదు యింకా తల్లి పవిటకొంగు పట్టుగుని వంటింట్లో తిరిగే పిల్లలాగా అనిపిస్తావు."

"మొన్న దసరాకి నాకు, పద్దెనిమిదెళ్ళి పందొమ్మిదేళ్ళు వొచ్చాయి."

"అందరికంటే వొక వేలు తక్కువన్నమాట! ఆ వొకటీ కూడా మొలిపించుకు రా, నీమెడలో మూడు ముళ్లూ పడతాయి."

సిగ్గుపడి తలవొంచుకుంది నిర్మల.

"నేనెలాంటి వాడినంటావు?"

మాట్లాడలేదు.

"పోనీ-నేనెలావుంటానోకూడా తెలియదా? పరవాలేదులే చెప్పు. కవిత్వంలో అక్కరలేదులే మామూలు మాటలలో చెప్పు"

మరింత సిగ్గుపడి తల వొంచుకుంది.

"చిన్నప్పటినుంచీ యెరుగున్నావు నన్ను — నా దగ్గిరే సిగ్గుపడితే

యింక లోకం నిన్ను ఖాతరుచెయ్యదు.

నీకు పద్దెనిమిదేళ్ళు దాటకముందే—నాకు ముప్పయ్ యేళ్ళు దాటి పోయాయి. మానసికంగా అంతకంటే కూడా పెద్దవాడినేమో. రెండేళ్ళ నుంచి దేశదిమ్మరిలా తిరిగి వొచ్చాను. ఈ ఉద్యోగం కూడా, యెన్నాళ్ల చేస్తానో యేమో నాకే తెలియదు. నా జీవితం, నలుగురూ నడిచే బాట వెంట నడవటం లేదనిపిస్తోంది. యెప్పుడో యే అడవిలో చిక్కుకు పోయినా పోతుంది.

యిన్నేళ్ళనుంచి నన్ను చూస్తున్నా, నువ్వు నన్నెరగవు నిర్మలా—నా జీవితం తుఫానులో చెలరేగిన సముద్రంలాంటిది. అలాంటి జీవితం లోకి ప్రవేశిస్తే, ఛీతిలిపోవటం మాత్రమే అవుతుంది.

మొదటి నుంచీ నువ్వంటే నాకు యెంతో అభిమానం, మమత, ప్రేమ. అంతే కానీ, నిన్నెప్పుడూ నా జీవితానికి ముడి పెట్టి వూహించు కోలేదు నాకు తెలుసు—నువ్వు అణుమాత్రం కూడా లోపం లేని దానివి. చదువుంది. అంతకు మించిన అందంవుంది. కానీ నువ్వు నా అంతర్యా న్నెప్పుడూ కదిలించలేక పోయావు అది నీలోపం కాదు. నా స్వభావపు తీరు కావొచ్చు. వుదారితకి పోయో, నలుగురి పెద్దల మెప్పు పొందటానికో, నిన్ను చేసుకుంటే—అది నీకు ద్రోహం తలపెట్టినట్లే అవుతుంది-" అని శ్వాస పీల్చుకోవటం కోసం ఆగినట్లుగా కదిలాడు!

యింతలేసి కళ్ళతో అతని ముఖంలోకి వింతగా చూసింది.

"నువ్వంటే నాకెంతో అభిమానం గుండెలో నిండిన అమాయకత మొహానికి చిందితే, అరవిచ్చిన మొగ్గలా చూసే నువ్వు యేకోదరివైతే యెంతబావుండేది — అని యెన్నిసార్లో అనుకున్నాను. నిజంగా యెన్నిసార్లో! నిన్ను నా వొళ్లో పడుకో పెట్టుకుని ఆటపట్టించి, నువ్వు అలిగితే బుజ్జగించాలని అనిపించేది. కానీ నేనలా చేస్తే; నేనెందుకు చేసిందీ నీకు అర్థంకాదు—లోకం, ఆ పనికి అర్థం నిర్ణయించి, అందుకు నన్ను బద్ధుణ్ని కమ్మంటుంది. నా జీవితపు నడిసముద్రపు హోరులోకి నిన్ను యీడ్చి నీ జీవితాన్ని దుర్భరం చెయ్యలేను.

రెండేళ్ళ క్రితం మీ చిన్నమావయ్య జర్మనీ వెళ్ళాడు చూడు,

అప్పుడు యేం జరిగిందంటే—" అని ప్రారంభించి గీతాదేవిని గురించి నాయక్‌కి చెప్పిన విషయం వివరించాడు.

యింతలేసి కళ్ళను అంతలేసి చేసి, మరింత వింతగా అతని ముఖం లోకి చూసింది, అనిమేషిలా.

"యీ విషయం యెవరితోనూ అనకు. నిజానిజాల నిరూపణకు చెయ్యాలని లేదు నాకు. నన్ను గురించి యెవరేమనుకున్నా పరవాలేదు. యిదంతా నీకు యెందుకు చెప్పానంటే, నువ్వు నాకు నచ్చక చేసుకోలేదని బాధపడతావని—నువ్వు నాకు నచ్చావు. మా అమ్మ నాకో చెల్లాయిని కని వుంటే; తనుకూడా అచ్చూ నీలాగే నచ్చి వుండేది."

"మరి, నేను నీకు మేనత్త కూతుర్నిగా బావా!"

"అదే గమ్మత్తు అదే విదారకంకూడా. నిన్ను నేను అలా వూహించుకో లేకపోవటం నా లోపం అనుకోవొచ్చు, వొకరకంగా. నువ్వంటే ఆ రకంగా యిష్టత కలగనివాణ్ని చేసుకుని నువ్వు యేం సుఖం పొందగలవు?"

తల అడ్డంగా కదిపింది.

"నాలాగా అందమైన వాళ్ళు యింకా లోకంలో వున్నారా లేదా?"

"వున్నారు."

"మరి వాళ్ళలో యెవరైనా వొకటేగా?"

"మరి నన్ను నీకిచ్చి చెయ్యాలను కున్నారుగా!"

"పెద్దవాళ్ళు పెద్దవాళ్ళైపోయారుగా—వాళ్ళకి మన సమస్య యేమర్థమౌతుంది? వాళ్ళ కర్థం కాలేదని మనం పొరపాటుచేస్తే అనుభవించేది మనమేగా? అన్నట్లు నీకు యింకా పై చదువు చదవాలని వుందా?"

మాట్లాడలేదు.

"చెప్పవేం నిర్మలా, చెప్పు."

అవునన్నట్లు తలూపింది.

"నువ్వు యెంతవరకూ చదువుకుంటే అంతవరకూ ఆ ఖర్చు పూచీ నాది లేదూ, వెంటనే పెళ్ళి చేసుకోవాలని వుంటే చెప్పు—అత్తయ్య పేరవున్న ఆస్తి తనకే వుండిపోనివ్వు అడిగిన కట్నం నేనిచ్చి చేస్తాను."

సశేషమ్ శీవిశన్

"అంత డబ్బు యివ్వటం నీకేం పని? బావా?"

"నాకు చెల్లెలు వుంటే యిచ్చేవాణ్ని కాదూ? నీ జీవితం బాగు కోసం యేం చెయ్యటానికీ నా కభ్యంతరం లేదు. అన్నట్లు మీ కళాశాలలో అందమైన అబ్బాయిలు లేరూ—నాలాగా కాకుండా—బుద్ధిమంతులు?"

సిగ్గుపడినట్లుగా తల వొంచుకుంది

"ఐతే మీ కళాశాలలో అబ్బాయి లందరూ వీరహనుమాన్లే నన్న మాట!"

ఫక్కున నవ్వింది.

"అంటే వున్నట్లేకదా!"

అవునన్నట్లు తలవూపింది

"నీకు నచ్చిన వో అరడజనుమంది కుర్రాళ్ళను యేరుకో. బియ్యేస్సీ అయిపోయేలోగా యెన్నికచేసి వుంచుకో. వొచ్చే వేసవిలో నిర్మలా నైర్మల్య కళ్యాణ ప్రాప్తిరస్తు."

సిగ్గుపడి తల వొళ్లోకి వొంచుకుంది.

"అదో, మళ్ళీ—చెప్పానుగా, అలా సిగ్గుని ఆభరణంగా వేసుకుంటే నిన్ను లోకం ఖాతరుచెయ్యదని. సిగ్గుని ఆయుధంగా వాడుకోవాలి, చదువుకునే నీలాంటి తెలివైన ఆడపిల్లలు." అని లేవబోయినట్లుగా కదిలి, "యింక లే, చాలా పొద్దుపోయినట్లుంది" అని లేచాడు.

లేచి నిలుచుంది

"అన్నట్లు, యీ విషయాలన్నీ అత్తయ్యకి చెప్పకేం? నేనేం మాట్లాడానని అడిగితే, నీ చదువు విషయాలని మాత్రమే చెప్పు" అని, ఆమె భుజం ప్రక్కగా వీపుమీద చేతివేళ్ళతో తట్టి—మెట్లు యెక్కుతున్నాడు.

* * *

మూడు రోజులు గడిచాయి.

సాయంత్రం యెవరో పిడబ్లియుడీ కార్యాలయంనుంచి నీళ్లు వొస్తే మాట్లాడి—తన గదిలోకి అడుగుపెట్టాడు క్రిష్ణచైతన్య.

"అన్నట్లు యిందాక మీ మరదల్ని చూశానండోయ్ స్వామీజీ—

రింది గీతాదేవి.

"అప్పుడే నిర్మలని నీకు చెల్లెల్ని చేసుకున్నావేమిటి!" అని సన్నగా నవ్వాడు.

ఆ మాట లక్ష్యపెట్టక; అసలు విననట్లుగా, "యిందాక, యేమీ తోచక కాస్సేపు యేదన్నా చూద్దామని మీ అధ్యయనం గదిలోకి వెడితే; అక్కడ కూచునివుంది. చిత్రం, నాలుగు రోజులనుంచి ఆమెని చూడనే లేదు. యీ యింట్లో కావాలని చూస్తే తప్ప నౌకరికొకరు కనిపించకుండా వుండొచ్చేమో అనిపిస్తుంది. నవాబులు తీరుబాటుగా పరచుకున్న యిల్లు కదూ మరి!" అంది.

"యేదీ, నువ్వు గదిలోంచి కాలు బయట పెడితేగా – రెండుసార్లు భోజనాల గదిలోకి తప్ప."

"మీ నిర్మల చూడముచ్చటగా వుంది" అంది.

యీ యింటి పిల్ల ఆ మాత్రం వుండదనుకున్నావా?"

పలకరించాను. బిడియం బిడియంగా చూసింది నా వంక. ఆ కళ్ళని చూసి నైనితాల్ సరస్సులోని చేపపిల్లలు రూపు దిద్దుకొచ్చాయని పించింది. నాలాంటి అలిసిపోయిన గుండ్రటి ముఖం, బాదంకాయ కళ్ళూ కాక; యెంచక్కానో వుంది!"

"అలాగా—నేను చూడలేదే అంచక్కటి పిల్లని! కాస్తాగి, ఆ పిల్ల మసక చీకటిని వెలిగించేవేళ నాకు చూపెడతావేమిటి!" అని గలగలా నవ్వాడు.

"యింటనే అరవిచ్చిన గులాబీని పెట్టుకుని నిండార్లుగా పిచ్చిపోయిన పొట్లపువ్వుకోసమని దేశాల వెంటపడి పారిపోవటం అవివేకం."

"పొట్ల పువ్వుకాదు. పచ్చగన్నేరు పువ్వు."

"అదేలే, పిచ్చి గన్నేరు పువ్వేలెండి. రెండు నిమిషాలు తన చదువు గురించి ఆదరంగా అడిగేసరికి యెంచక్కానో మాట్లాడింది! మాటలో సౌమ్యత; ముఖంలో, చూడగానే జాలి కలిగే అమాయకత. ఆ అమ్మాయితో పది నిమిషాలు మాట్లాడితే, నా మాటలోని దురుసు, ముఖంలోని సంచలనం తెలిసి వొచ్చినట్లయింది. నన్ను చూస్తే యెవరికీ

జాలి కలగితు. బళ్ళో చదువుకునే రోజుల్లోకూడా అలాంటి అమాయకత నాలో లేదు. అసలు పుట్టుకతోటే లేదేమో. నా కేసి వింతగా చూసి, బావ చెప్పాడు మీ గురించి—అందరూ అనుకుంటూ వుంటే నేను మిమ్మల్ని గురించి యేమిటో అనుకున్నాను—అని అంది. నాకు ఆ మాటల అర్థం సరిగా బోధపడక కుతూహలం కొద్దీ అడిగాను. పాలూ నీళ్ళూ తేడా తెలియని పిల్ల. యేవడిగినా సమాధానాలు చెప్పింది" అని అతనికేసి చూసి, "అయితే అబద్ధాలు కూడా నేర్చుకుంటున్నారన్నమాట !" అంది తీక్ష్ణంగా.

నవ్వేసి వూరుకున్నాడు.

నిట్టూర్చినట్లుగా శ్వాసవిడిచి, "అలాంటి పిల్లని అన్యాయం చెయ్యటం భావ్యంకాదేమో. ఆ అన్యాయదోష కారకం నేనని తెలుసుకున్నప్పుడు నాకు తృప్తిగా వుండదు" అంది.

"గీతా, కర్మ ముగిసేవరకూ నువ్వు దేన్నిగురించి ఆలోచించకు. అసలే విషాద మానసంలోవున్న నువ్వు యివన్నీ ఆలోచించటం ప్రారంభిస్తే నాకు అన్యాయం తలపెడతావేమోనని నా భయం" అని ఆమె ముఖంలోకి చూసి, నిర్మలంటే నాకెంతో ప్రేమ. తనని చూసినప్పుడు నాకు చెల్లెలులేని లోటు తీరినట్లనిపిస్తుంది నిర్మల చదువు, పెళ్ళి బాధ్యత నాపైన వేసుకున్నాను మొన్ననే. చెప్పానుగా—యీ అయిదారురోజులూ గడిస్తే అన్ని పరిస్థితులూ చక్కబడతాయని."

గుమ్మంలో అడుగుల చప్పుడు.

వెనక్కి తిరిగిచూశాడు. అతనికోసం యెవరో వొచ్చారట.

తను వొచ్చినట్లు తెలిసి విశ్వవిద్యాలయంనుంచి నలుగురైదుగురు సహోద్యోగులు వొచ్చి డ్రాయింగ్రూంలో కూర్చునివున్నారు.

వొక గంటసేపు కబుర్లు, కాఫీలు.

తిరిగివొస్తూ మధ్యగదిలో చాపమీద కూచునివున్న మేనత్తని చూసి—ఆగిపోయాడు.

"యింకా భోంచెయ్యకుండా – యేమిటో యెన్నాళ్ళుంటుంది, ఆరోగ్యం; యిట్లా అయితే వెనకటి రూపే పోయింది. దవళ్ళూ అవీ

పీక్కుపోయి మా కిష్టుడేనా వీడు—అన్నట్లుగా అయిపోయా అంటూ వాపోయింది కూచునే.

ఆమెకేసి జాలిగా చూశాడు.

—యేమిటో అర్థంలేని మమకారాలు యీ ముసలివాళ్ళకి! యేం వాగినా నన్ను కావాలనుకునేగా! మనుషులందరూ యెన్నెన్నో కోర్కెలతో తమని తాము రెట్టించుకుంటూ వుంటే; వొక్కతీ వొంటిగా, తన బిడ్డని తలుచుకుని నామీద ఆశ నిలుపుకుని దిగులు పడిపోతోంది పాపం—

గోడ ప్రక్కగావేసి వున్న కొయ్య బెంచీమీద కూర్చున్నాడు.

“నీ భోజనం అయిందా అత్తయ్యా?” అని ఆదరంగా పరామర్శించాడు.

తలయెత్తికొంత ఆశ్చర్యంగానూ కొంత దిగులగానూ అతని వంక చూసి, “నా భోజనందేముందిలే—మనసు మనసులో లేకపోయినాక, తిన్నా వొకటే తినకపోయినా వొకటే—” అని నిట్టూర్చి, “అయినా తినక తప్పుతుందటలే దేవుడు తన దగ్గిరికి పిలిపించుకోనంతవరకూ” అంది.

“యిప్పుడు నీకేం లోటు అని బాధపడటం అత్తయ్యా?”

“నాకు బాధ లేమున్నయ్యనే అనుకుంటారు అందరూ. అవును, వాళ్ళకేం తెలుస్తయ్ నా బాధలు! ఆ పిచ్చి సన్యాసిని తలుచుకుని నేను యేడవని రోజు లేదు వొక్కగా నొక్క పండు— తండ్రిలేనిది. ఆ లోటు కలిగిందనిపించుకోకుండా దాని నొక దరికి చేర్చాలని నే పడుతున్న బాధ యెవరికీ అర్థం కాదురా, కిష్టుడూ. నువ్వుమాత్రం నువ్వు—” అని ఆగిపోయి కళ్ళు వొత్తుకుంది

“యిప్పుడు యీ యింట్లో నీకేం లోటు జరిగిందని?”

“లోటు కూడా దేనికిలే యీ బాధకి తోడు! యిన్నేళ్ళనుంచీ డబ్బు మొఖం చూసుకోకుండా చూస్తున్నారులే, కాదనను. ముసలిముండని నా బతుకు యెట్లాగో అట్లా తెల్లవారుతుంది. నిర్మలను తలుచుకున్నప్పుడు—”

కొద్దిగా నవ్వి, “యిప్పుడు నిర్మలకీ, నీకూ యేం ఆపదొచ్చిందని?”

“ఆపదలు కూడా దేనికిలే యీ రాతకి తోడు!” అని, వొకక్షణం

ఆగి, తలపంకించినట్టుగా వూపి, "ఆ అమ్మాయికి మాత్రం యింకా యింట్లో యేమి బంధం వుండదిలే. ఆ మొన్నానిన్నా నాలుగమాటలు మాట్లాడించి చూశాను—యింకా యిక్కడే తిష్టవేసి తీరాలన్నట్టుగా కనిపించలేదు. ఆ అమ్మాయి కూడా, యేదో పరువుతక్కువగా ప్రవర్తించినా, దుష్టురాలు కానట్లే అనిపించింది. యెంతోకొంత చేతులో పెట్టి తనదారి తనని చూసుకోమంటే వెళ్ళిపోతుంది. రచ్చచేసే మనిషికాదులే. డబ్బు కోసం కాదు నా తపన. ఆ అమ్మాయికి అయిదుకాదు పదివేలిచ్చినా నేను బాధపడను. అసలు మన బంగారం మంచిదైతే వొకరిననే పనేమిటి? తీరా పోబోయేమందు అప్రదిష్టపని చేశాడు. యేమోలే వాడు మాత్రం కావాలని చేసుంటాడటలే—యేదో ఖర్మ తోసుకొచ్చిగాని. యింతకీ వంశగౌరవం మంటగలవటాని కొచ్చినట్లిదంతా. నువ్వన్నా వుండి వుంటే ఆదిలోనే గుట్టు చప్పుడుకాకుండా చేసేవాడివేమో. అయిందేదో అయిపోయింది. యింతటితోనన్నా కొంప వొక దారికొస్తే..." అని నిటూర్చినట్లుగా తల వూపి, "ఆ ఓయస్సీ కూడా అయిపోయింది. మాన్పించేస్తాను. అదేమన్నా వుద్యోగాలు చేసేనా వూళ్ళేలేనా? వొచ్చే జేష్టమాసంలో మంచి ముహూర్తం చూసి పెట్టించి—ఆ మూడుముళ్ళూ పడిపోతే నా భారం దిగిపోతుంది. యేదో క్రిష్ణా రామా అనుకుంటూ వొక మూలనపడి వుండొచ్చు" అంది.

భారం దిగిపోయినట్లుగానే నిట్టూర్చింది.

"అత్తయ్యా, నే నొకమాట చెబుతాను వింటావా?"

"వొకటికాదు పది చెప్పు నాయనా, నీ మాటకాక యింకెవరిమాట వింటాను!" అంది.

"ఆ అమ్మాయి యెవరనుకుంటున్నావు?" అని ప్రారంభించి, నాయక్‌కి గీతాదేవిని గురించి చెప్పినదంతా వివరించాడు.

విస్తుపోయి చూసి, నోరు తెరిచి కట్టెలా అలాగే బిగిసిపోయి, వొక్క నిమిషానికి స్పృహ వొచ్చిన దానిలా కదిలి, "నమ్మమనేనా!" అంది.

"అత్తయ్యా, నేను నీకుగానీ మరెవరికిగాని యెన్నడైనా అబద్ధాలు చెప్పానేమో గుర్తుతెచ్చుకో."

సశేషమ్ జీవితమ్

"ఆ శేఖరం మాకు యెరుకనాలే. మీ పెద్దనాన్న చిన్నతనం నుంచీ- వాడు కిష్టుడు, సత్యహరిశ్చంద్రుడు. వాడేం బాగుపడగలడు యీ ప్రపంచంలో—అని యెద్దేవగా అంటూ వుండేవాడు కూడానూ."

"అంతమాత్రం తెలుసుకదా నీకు!"

"ఐతే—"

"ఆ అమ్మాయి మీరంతా అనుకున్న మనిషి కాదు."

"మరి, ఆ పకపకలు వికవికలు. కేరింతలు. పూసుకు పూసుకు తిరగటాలూ, గదిలో గుసగుసలూ—"

"చెప్పానుగా—నాన్నగారికి తోడుగా వున్నట్లూ వుంటుంది. రిసెర్చి ప్రారంభించవొచ్చును- అని పంపించారు తండ్రితో సమానమైనవాడు, ఆయనకి తొలిగి దూరం దూరంగా తిరగాల్సిన అవసరం యేవుంది? కార్యాలయం కాగితాలూ అవీ చూసిపెడుతూ వుండేది. ఆ విషయాలు మాట్లాడుకుంటూ వుంటే మీరలా పొరపడి వుంటారు, బంధువు కాకపోయేసరికి యిన్నేళ్ళనుంచి యెన్నడూ లేనిది యిప్పుడెలా జరుగుతుందనుకున్నారు? నాన్నగారు అంత వయసులోనూ చలాకీగా వుషారుగా వుండటం చూసి ముచ్చటగా అనిపించి చనువుగా వుండి వుంటుంది ఆ మాట కొస్తే నాన్నగారు నిర్మలతో చమత్కారం మాటలని సరసాలాడి ఆట పట్టించేవారు కామా! అన్నీ తెలిసి ఆయనేమిటో తెలిసి కూడా నువ్వు అలా అనుకున్నావంటే బాధగా వుంది నాకు", అన్నాడు.

"మరి, నేను మందలించబోతే కళ్ళెర్ర జెయ్యాల్సిన పనేమొచ్చింది?"

నవ్వి, "బావుంది. అన్నేళ్లొచ్చిన మనిషిని పట్టుకుని ఆ రకంగా అనుమానిస్తే; ఆయన స్వభావాన్నిబట్టి, కళ్లెర్ర జెయ్యటమే కాదు—అదే నువ్వుకాక యింకెవరైనా ఐవుంటే; చావతన్ని—అవును, నేనంతే. నా యిష్టమొచ్చినట్లు చేస్తాను. నీకు దిక్కున్నచోట చెప్పుకో—పొమ్మనేవారు."

"హరి దేవుడా. యెంతపని జరిగిపోయింది! చిన్నప్పటి నుంచీ నన్నెంతో యిదిగా చూసుకునేవాడు. నేనట్లా అనుమానిస్తే యెంత బాధ

పడిపోయాడో! తండ్రి తరవాత తండ్రంటివాడు నాకు! అని, మధన పడసాగింది.

ఒక నిమిషం గడిచింది

"పెదనాన్న నీ పొలంమీది ఆదాయం సిన్నగా ఇస్తున్నాడా?"

"అవన్నీ యిప్పుడు దేనికిలే-"

"దేనికొక దానికి, చెప్పరాదూ-"

"ఒకప్పుడు మాత్రం వాడు తిన్నగా అఘోరించాడుటలే! యెంత సేపూ డబ్బుకీ వాడికీ లంకె."

"నిర్మల పెళ్ళికి వో పదివేలు యిస్తాడేమో అడిగి చూడు."

"హయ్యో అన్నారు! పదివేలా! పదివందలు కూడా యివ్వడు. ఆ ముష్టి పదివేల రూపాయల కోసం కాదూ, నిరుడు నలుగురిలో పరువు పోయే పని చేశాడు పది కాదు యిరవై యెక్కువిస్తామని వొస్తే మాత్రం తాంబూలాలు పుచ్చుకున్నాక సంబంధం రద్దు చేసుకుంటారా!"

"నిర్మలకి మంచి సంబంధం చూడు వాళ్ళడిగినంత కట్నం నేనిస్తాను."

"యేమిటేమిటీ! యేమన్నావ్! నన్నొక వెర్రిబాగుల ముండకింద జమ కట్టావన్న మాట." అని అతని ముఖంలోకి చూసింది.

ఆమె ముఖంలో విచారం, కోపం!

"అన్ని మాటలూ నిన్ను నువ్వే అనుకుంటే నేనేం చేసేది. చెప్పు! మొదటి నుంచీ నాకు యిష్టం లేదనే చెబుతున్నాను. నీ పిచ్చి కొద్దీ నువ్వు నా మీద ఆశ పెట్టుకున్నావు. యిప్పుడు యీ విషయం విన్నాక ఐనా గ్రహించగలవను కున్నాను" అన్నాడు.

"ఐతే, నువ్వు ససేమిరా చేసుకోనన్న మాట!"

"అది అప్పుడూ యిప్పుడూ యెప్పుడూ జరగని పని" అన్నాడు."

"అంత జరిగినాక యింక నేను బతికెందుకు! కనకదుర్గమ్మ కాళ్ళ మీద పడి తల పగలగొట్టుకు చస్తాను" అని బొటబొటా కన్నీరు కార్చింది.

"తల పగలగొట్టుకుని కాకపోతే వురిపోసుకుని చావు! ఆ తరవాత;

నీ కూతుర్ని, ఫలానా దాని కూతుర్ని— అని నలుగురూ నవ్వుకుంటారు నీ పెద్దన్నయ్యా వాళ్ళూ యెవ్వరూ నయాపైసా కూడా ఖర్చు పెట్టే మను మలు కారు. నీ పేర వున్న ఆ ఆస్తి కూడా మాయం చేస్తారు. బతక నేర్చని నీ కూతురు అప్పుడు దిక్కు— లేనిదై బజారులో అడుక్కు—తింటుంది" అని శ్వాస వొదిలాడు.

భయంతో వొణికినట్టుగా ఆమె కంఠం కంపించింది.

"అత్తయ్యా, అర్థంలేకుండా పిచ్చిలో పడిపోకు. నేను చేశడిమ్మి రిని. ఆ అమ్మాయీ నాలాంటిదే యిద్దరం యేదో కిందా మీదా పడుతూ అవస్థ పడతాం. నావల్ల నిర్మల సుఖపడదని నాకు తెలుసు ఆలోచించుకుని యే మాట చెప్పు మీరంతా వెలివేసినా నాకు చింతలేదు మొన్న పెదనాన్న ఆ రకంగా కట్టుగట్టి వెళ్ళిపోతున్నా లక్ష్యపెట్టకుండా వుండలేదూ నేను? నాకా భయంలేదు. యీ నాలుగైదు రోజుల్లో తాపీగా ఆలోచించుకుని చెప్పు. నువ్వు నీ కూతురి క్షేమం సుఖం కోరుకునేది లేనిదీ చెప్పు నువ్వు వూ(అంటే; నాకంటే చదువుకున్నవాణ్ని, చక్క—నివాణ్ని అన్నిరకాలా సరితూగే వ్యక్తిని చూసి, వాళ్ళడిగినంత కట్నంయిచ్చి పెళ్ళి—నేను స్వయంగా జరిపించి సంతోషపడతాను. యేమాటా ఆలోచించి తేల్చుకుని చెప్పు" అని చివాలున లేచి డ్రాయింగ్రూంలోకి వెళ్ళిపోయాడు.

తల నేలకివొంచి భోరుభోరున యేడుస్తూ కూర్చుండిపోయింది, తమ్మ.

—

నిన్నటిరోజున కర్మ ముగిసింది

మధ్యాహ్నం భోజనాలయ్యాక తన పంచెలూ అవీ తీసి మడతలు ట్టుకుంటూ వెండి మరచెంబుతెచ్చి మధ్యగదిలో వొకమూల పెడుతోంది, తమ్మ.

దినానికి క్రిష్ణచైతన్య పెత్తండ్రి రాలేదు. యేదో అర్జంటుపని వుండనే రాలేక పోతున్నట్లు అడిగిన వాళ్ళకిచెప్పి మరీ దగ్గిరి బంధువు లతో యింక ఆ పరువుతక్కు—వ గడప తొక్క—నని అన్నాడట. వీడు త అప్రాచ్యపు ట్ప్రయోజకుడై నంతమాత్రాన నా తమ్ముణ్ని కాదను

కుంటానటలే మీరు వెళ్ళండి—అని—కొడుకులిద్దరినీ కోడళ్ళనీ పంపించాడు. దగ్గిరి బంధువులలో యింటికొకరిద్దరి చొప్పున వొచ్చారు.

వొచ్చినపూట అదోలా వున్నా రెండో పూటకి వొక్కొక్కరే గీతాదేవి గదిలోకి రావటమూ, పలకరింపుగా చూడటమూ, రెండు మూడు మాటలు మాట్లాడటమూ జరిగింది.

రోజంతా, ఆడవాళ్ళని వొక్కొక్కరినే చాటుకిపిలిచి గుసగుసలాడటంతోటే సరిపోయింది, సీతమ్మకి.

ఆ రోజు సాయంత్రానికి యింటి పనుల విషయాల్లో గీతాదేవిని సంప్రతించే వరకూ వొచ్చారు. అందరితో కలివిడిగా మాట కలిపింది గీతాదేవి.

కావాలని యేర్పాట్లు అన్నీ భారీఎత్తున చేయించాడు క్రిష్ణచైతన్య. దగ్గిరి బంధువు లందరికీ కొత్త బట్టలు, తలకొక స్టీలుగ్లాసు యిప్పించాడు

వూళ్ళో తన తండ్రి స్నేహితులు, తెలిసినవాళ్ళు చాలామందీ, తనకు వున్న కొద్ది మంది మిత్రులు వొచ్చారు. ప్రత్యేకంగా వాళ్లకోసం గొప్పగా విందులాంటిది యేర్పాటు చేయించాడు.

తద్దినంలో పెళ్లి, పెళ్లిలో తద్దినం అన్నట్లు కొందరు క్రిష్ణచైతన్యకి శుభాకాంక్షలు తెలియజేశారు. మొదట అర్థంకాక తికమకపడినా, తరవాత తెలుసుకున్నాడు. అతని సన్నిహిత మిత్రుడు వొకతను "యింకా దాపరిక మేమిటోయ్—నాయక్‌గారు అంతా చెప్పారులే— అంటే; "అంతేనా నేనింకా నాయక్‌గారు పత్రికలో ప్రకటన యిస్తారని ఆశించానే!" అని నవ్వాడు.

కొత్త అధ్యాయం ప్రారంభించటానికి క్రిష్ణచైతన్యకి ఐన ఖర్చు, ఐదు వేలరూపాయలు.

మసక చీకటి పడుతూ వుండగా డ్రాయింగ్రూం గుమ్మంలోకి వొచ్చి—సోఫాలో కూచుని తివాసి కేసి చూస్తున్న క్రిష్ణచైతన్య కేసి చూసి, యేదో చెప్పాలని చెప్పలేకపోయినట్లుగా నోరు కదిపింది సీతమ్మ.

తల యెత్తి ఆమెకేసి చూశాడు.

"నాయనా కిష్టుడూ, యీ రోజుతో యీ యింటికీ నాకూ రుణం

తీరిపోయింది గావును." అని బావురుమంది,

ఒహాలున లేచి ఆమె దగ్గిరికి వెళ్లి, రెండు చేతులూ తన చేతుల లోకి తీసుకుని, "అత్తయ్యా, యేం మాటలవి! యిప్పుడేమైందని? యీ యిల్లు నీదికాదూ! వేసవిలో నిర్మల పరీక్షలైపోగానే యిక్కడికే వొచ్చే సెయ్యాలి మీ రిద్దరూ" అన్నాడు అతని గొంతు తడిబారింది.

ఒక నిమిషం నిశ్శబ్దం.

"నువ్వు చెప్పినట్లే వొప్పుకని నీ మాట నమ్ముకుని వెళ్తున్నాను. అన్యాయం చెయ్యవుకదూ?" అని మళ్ళీ బావురుమంది

"నన్ను నమ్మటంలేదా?"

"నమ్మకకాదు గానీ, విధియెలా వుందోనని భయం."

"పోనీ వొట్టు వెయ్యమంటావా?"

మౌనంగా వుండిపోయింది.

"నా తల్లిదండ్రులమీద ప్రమాణంచేసి చెబుతున్నాను—నేను నీకిచ్చినమాట చెల్లించుకుంటాను" అన్నాడు.

యింకా కొంత సంశయంగా అతని ముఖంలోకి చూసింది.

"యింకా నమ్మిక కలగలేదా?" అని సన్నగా నవ్వాడు.

"కలిగిందనుకో గానీ— ఆ అమ్మాయి మీదకూడా—"

నవ్వుకుని "గీతాదేవి సాక్షిగా—" అని ఆమె చేతులు వూపాడు.

"చూడమ్మా అక్కని యిందాకటినుంచి స్టేషనుకి రమ్మంటూంటే రావటం లేదు" అంటూ వొచ్చింది, నిర్మల.

"యెందుకు రాదే పిచ్చి సన్యాసీ— నీకు పిలవటం కూడా చాత కాదు మరి!" అని లోనకి నడిచింది సీతమ్మ. కూడా నిర్మల అడుగులు వేసింది.

గది గుమ్మంలోకి వెళ్లింది సీతమ్మని చూసి, లేచి— గుమ్మం లోకి వొచ్చింది గీతాదేవి.

"చూడమ్మా గీతా. నువ్వు స్టేషనుదాకా రానన్నావని యిది యేడ్చు కుంటోంది; పిచ్చి సన్యాసి" అంది సీతమ్మ.

నిర్మల యేమంటుందోనని హాస్యాన కన్నాను. స్టేషనువరకూ

సాగనంపటానికైనా రాకుండా వుంటానాండీ?" అంది నవ్వుముఖంతో.

"యేమిటి అంపకాల చర్చ నడుస్తున్నట్లుంది!" అంటూ వొచ్చాడు చైతన్య.

కనురెప్పలు పైకెత్తి వారించినట్లుగా అతని ముఖంలోకి చూసింది గీతాదేవి.

"నిర్మలా, నువ్వు బాగా చదివి మంచి మార్కులతో నెగ్గితే వొచ్చే యేడు నీకు యిక్కడ యెమ్మెస్సికి సీటు చూస్తాను, పెళ్లి కొడుకుతోపాటు" అన్నాడు.

లోని గదిలోకి పరుగు తీసింది నిర్మల. ముగ్గురూ నవ్వుకున్నారు.

గీతాదేవి, నిర్మల, సీతమ్మ వెనక సీట్లో కూర్చున్నారు. నాంపల్లి స్టేషను ముందర కారు ఆపి, "యింక ఐదు నిమిషాలే వుంది బండి బయల్దేరటానికి" అన్నాడు క్రిష్ణచైతన్య.

మొదటి తరగతి టిక్కెట్లు ముందుగానే తెప్పించి వుంచాడు

త్వర త్వరగా నడిచారు.

మొదటి తరగతి పెట్టెలు యింజను వైపుకు వున్నాయి

పెట్టె చూసి, "ముసలి ముండని నాకు యీ పరువుల పెట్టె కావాల్సొచ్చిందిరా నాయనా!" అంది సీతమ్మ.

"నీకొక్కదానికే అత్తయ్యా, నిర్మలకోసం" అన్నాడు.

"ఎన్ని సన్యాసి, దానికిమాత్రం!" అని లోనకి యెక్కేసింది——

సామాన్లు లోన పెట్టించి, "అమ్మయ్య" అనుకున్నట్లుగా శ్వాస విడిచాడు, క్రిష్ణచైతన్య.

కిటికీ దగ్గిర నిలుచుని నిర్మలతో మాట్లాడుతోంది గీతాదేవి.

మిరపపండు రంగు నూలు చీర అదేరంగుబ్లౌజు, రింగులు, కళ్ళలో విషాదం ఆనందం కలిసిన వింత సంచలనం.

గార్డు పచ్చ జెండా విదిలించి, "యిక నడువ్." అని బూరలొంచి అరిచాడు.

యిష్టంలేనట్లు గీపెట్టి, శ్వాసవొదిలి, తప్పిచావదు లెమ్మనుకున్నట్లుగా ముందుకి వెనక్కీ కుదులుకుని, అయిష్టంగా ముందుకు సాగింది.

సశేషమ్ జీవితమ్

యింజను.

కిటికీలోంచి చెయ్యి బయటికి పెట్టి చేతివేళ్ళతో కళ్ళతో వీడ్కోలు చెప్పింది నిర్మల.

చేరుమాళ్ళు వూపుతున్నారు, క్రిష్ణచైతన్య, గీతాదేవి.

యింజను ప్లాట్‌ఫారం కొస దాటింది.

వెనక్కి తిరిగారు.

"అందరూ వొచ్చారు; వెళ్ళిపోయారు" అన్నాడు.

"వొక వ్యక్తి తప్ప" అంది.

నవ్వి "యెవరు?" అన్నట్లు ఆమె ముఖంకేసి చూశాడు మెడ తిప్పి.

కళ్ళతో ఆకాశం వంక చూపించింది.

"అవును శశాంక వుద్యోగమే అంత. యెప్పుడూ వుంటాడే" అన్నాడు.

రయిలు గబుకు సాగించింది.

ఆఖరి పెట్టె కూడా దాటింది.

"గీతా" అన్న కేక వినిపించి, యిద్దరూ వొక్కేసారి వెనక్కి తిరిగి చూశారు.

తెలిసినవాళ్ళు యెవరూ లేరు.

అంతలోనే ఆఖరి పెట్టెలోంచి యెవరో కిందకి దూకిన విరుపు.

రయిలు గమనానికి యెదురుగా దూకినట్లున్నాడు; బొక్కబోర్లా పడి పోయాడు జనం మూగుతున్నారు చుట్టూ.

ఆమె చెయ్యి నొక్కి, ముందుకు తిరిగి అడుగులు వేస్తూ, "యీ ప్లాట్‌ఫారంమీద యెన్నో జరుగుతూ వుంటాయి. రయిలు పట్టాల కిందకి పడిపోయేవాళ్ళూ, కదిలిన రయిలు యెక్కబోయి బెసికి చక్రాల కిందకి జారిపోయేవాళ్ళూ, నిండు మనసుతో యీ యినప బద్దీలమీద సాష్టాంగపడి చక్రాల కింద తమని తాము ఆహుతి చేసుకునేవాళ్లూ — యెన్నిటికో స్మృతిలానిలిచిన సిమ్మెంటుదిమ్మయిది. పాపం, ఆ వ్యక్తియెవరో యింకా స్త ఐతే చక్రాల క్రిందకి పడిపోను! దిగినవాడు రయిలు గమనాన్ననుసరించి

సశేషమ్ జీవితమ్

దిగాల్సింది. యేమిటో. తొందరపాటులో మనిషి, క్షుణ్ణంగా తెలిసిన ప్రాథమిక సూత్రాలనే మర్చిపోతాడు. అందుకే జీవితం చిత్రమైంది. సాఫీగా రాజబాట వెంట సుదీర్ఘ యానం చేస్తుందనుకున్న జీవితం. చివాలున ప్రక్క సందులోకి మళ్ళేసి కుంటినడక సాగిస్తుంది. కుడిచేతివైపు ఆ మొదటి సందులోకి మళ్లి, యెడమచేతివైపుకి తిరిగి మూడో మలుపులో కుడిచేతి వైపుకి తిరుగుతుందనుకున్న జీవితం తమాషాగా రాజబాట వెంట పరుగిడుతుంది" అన్నాడు.

"అందుకని, మనిషి, యేమీ అనుకోకండావుంటే; జీవితం దానంతట అది యెటోకటు సాగిపోతుంది" అంది.

కారులో కూర్చున్నారు. యింజను గురుగురు మంది.

"గీతా గీతా——"

ప్రక్కకి తిరిగి చూశారు.

స్టేషను మెట్లమీదినుంచి పరుగిడు కొస్తున్నాడు, వొక వ్యక్తి——

నూనెలేక దుమ్ముకొట్టుగుని బీరపీచులా చుట్టుకుపోయిన జుట్టు. అరంగుళం యెత్తున పెరిగిన గడ్డం. బాగా మాసిపోయిన తెల్లలాగూ చొక్కా. నల్ల బెల్టు. మోకాళ్ళ దగ్గిర యెర్రగా నల్లగా దుమ్మురంగులో మరకలు భుజానికి వేళ్లాడుతున్న ప్రయాణపు రెక్సిన్ సంచి.

రొప్పుకుంటూ కారు దగ్గిరికి తూలుతున్నట్లుగా పరిగెత్తుకుంటూ వొచ్చి, "గీతా-" అంటూ కారు కప్పుమీద చెయ్యి ఆన్చి వొరిగిపోయాడు.

మోచేతి దగ్గిరి రక్తపు తడి మరకలోంచి వొకబొట్టు జారి, ప్రక్క గాజుపలక మీదుగా పడింది.

కనుబొమలు ముడిచి, "యెవరు నువ్వు?" అంది చిరాకుగా.

"నేనెవరో గుర్తుపట్టనే లేదా గీతా!" అతని కళ్ళలో తడి.

పరిశీలనగా చూసింది——

కత్తి లాగెయ్యగానే గాయం నుంచి రక్తం చిమ్మినట్లు, ఆమె ముఖం, భయంతో పొంగినట్లుగా వుబ్బింది. పెదవులు కంపించాయి.

అవతలివైపు స్టీరింగ్ చక్రం ముందు కూచునివున్న కృష్ణచైతన్య పరకాయించి చూసి "యెవరివయ్యా నువ్వు?" అన్నాడు చిరాకుగా.

"గీతా-గీతా-" అని జాలిగా వుద్రేకంగా భీతిగా అంటూ క్రిష్ణచైతన్య వేసిన ప్రశ్న వినిపించుకున్నాడు కాదు.

మళ్ళీ ప్రశ్నించాడు క్రిష్ణచైతన్య.

"నేనెవరినో గీతకి తెలుసు" అని, యింకేమీ చెప్పలేకపోతున్నట్లుగా ఆయాస పడుతున్నాడు. అతని కంటినుంచి నీటిబొట్టు జారి కింద పడింది.

పగిలి పోతుందేమో ననిపించేలా కొట్టుకుంటున్న గుండెమీద అరిచెయ్యి అదుముకుని, కనురెప్పలు మూసి, దీర్ఘంగా శ్వాస విడిచి — వొక నిమిషం వుండిపోయి, "అవును, నువ్వెవరివో నాకు తెలుసు. నువ్వు నాతో మాట్లాడరాదని కూడా తెలుసు" అంది కళ్ళు తెరవకుండానే.

"నేను నీతో మాట్లాడరాదా! నీతో మాట్లాడరాదా నేను! కళ్ళు తెరిచి నావంక చూసి చెప్పు ఆ మాట" ఆవేదనగా, బాధగా అన్నాడు.

ఆమె అలాగే వుండిపోయింది మౌనంగా మూసిన కనురెప్పలతో.

"విన్నావుగా— నువ్వెవరివైనా అప్రస్తుతం. అవతలికి నిలబడు—కారు కదులుతోంది" అన్నాడు క్రిష్ణచైతన్య.

"యేంటీ, అప్రస్తుతమా? నా భార్యతో నేను మాట్లాడటం అప్రస్తుతమా!" అని రెట్టించాడు క్రిష్ణచైతన్యని.

అప్రయత్నంగా తన యెడమచెయ్యి ఆమె భుజంమీద వేశాడు క్రిష్ణచైతన్య.

రెప్పలు విప్పింది.

ముఖం పైకెత్తి శివరాం వొంక చూసి, "భార్య!" అంది గీతాదేవి. ఆ రెండక్షరాల ధ్వనిలో అసహ్యం, రోషం, బాధ, కోపం, అపహాస్యం స్పష్టంగా స్ఫురించాయి.

"ఆ మాట, నా పేరు వుచ్చరించటానికి కూడా తగని పశువ్వి — మూర్ఖంగా ప్రవర్తించకు మర్యాదగా తొలిగిపో" అంది గొంతు బిగించి తీక్ష్ణంగా,

"యేంటీ తొలిగిపోవాలా? యిన్నాళ్ళూ నేను నిద్రాహారాలు మాని నీ కోసం వెతుకుతున్న నేను, తొలిగిపోవాలా! అసంభవం" అని ఆమె

సశేషమ్ జీవితమ్

చెయ్యి మణికట్టుపైన పట్టుకున్నాడు.

"చూడు మిస్టర్-సభ్యతగా ప్రవర్తించటం నేర్చుకో. మర్యాదగా ఆ చెయ్యి విడిచిపెట్టు" కోపంగా అన్నాడు క్రిష్ణచైతన్య.

"యేంటీ, నా భార్య చెయ్యి నేను పట్టుకోటం సభ్యతకాదా ? పరాయివాడి భార్యని కారులో సరసన కూర్చోబెట్టుకుని తిరగటం సభ్యతా! సభ్యతా సభ్యతల గురించి యెవడిచేతా చెప్పించుకోవాల్సినంత అనాగరికుణ్ని కాదు"

"మర్యాదగా చెయ్యి విడిచిపెట్టు" గొంతు బిగించి తీక్ష్ణంగా కాఠిన్యంగా అంది గీతాదేవి.

"అది అసంభవం"

"ఆగు- ఫోను చేసి వీడి బనిపట్టిస్తాను—"అంటూ లేవబోయాడు క్రిష్ణచైతన్య.

"అంతదాకాదేనికి – లాగి రెండు వూచి పుచ్చుకోండి. సరిపోతుంది" అంది; క్రిష్ణచైతన్య వైపుగా చూసి.

"నడిబజార్లో కొట్లాట దేనికిలే. అగౌరవంగా–"

"అవసరం అయినప్పుడు నడిబజార్లో కలబడకపోవటం గౌరవం కాదు; అగౌరవం."

"గీతా. యేమిటి నువ్వనేది." అన్నాడు క్రిష్ణచైతన్య.

తత్వాలకి చింత చిగురించదు" అంది.

శ్వాస గట్టిగా పీల్చి – కారు తలుపు తీసి జుబ్బా చేతులు పైకి తోసుకుంటూ కారుముందు నుంచి తిరిగి వొస్తున్నాడు క్రిష్ణచైతన్య.

"దొంగలాగా పారిపోతావనీ, నాతో మాట్లాడే ధైర్యం కూడా నీకు లేదని నేను అనుకోలేదు." అన్నాడు శివరాం అపహాస్యంగా, ఆధిక్యంగా,

ఆమె దెబ్బతిన్న పులిలా చూసి—

శివరాం దగ్గిరివొచ్చి, మెడమీద చెయ్యి వెయ్యంబోతున్నాడు క్రిష్ణచైతన్య

"మీ రాగండి." అరిచినట్లుగా అంది.

తప్పుపడినట్లుగా ఆగిపోయి, ఆమెకేసి చూశాడు క్రిష్ణచైతన్య. పైకెత్తిన చెయ్యి యింకా గాలిలో అలాగే నిలిచిపోయివుంది.

తలయెత్తి శివరాం ముఖంలోకిచూసి, "యేమన్నావ్, దొంగలా పారిపోతున్నాననా! నీతో మాట్లాడే ధైర్యం నాకు లేదనా?" ఆశ్చర్యంగా పలికి, అపహాస్యంగా నవ్వి, "దొంగలా పారిపోవాల్సిన పని నే నెన్నడూ చెయ్యలేదు; చెయ్యను. ఠీవిగా సగర్వంగా రాజబాటని నలుగుర్నీ పలకరిస్తూ నడిచి వెళ్ళగల దాన్ని. నీతో మాట్లాడటానికి నేను భయపడటమా!" అని జాలిపడుతున్నట్లుగా ముఖం పెట్టి, "పాపం పొరబడ్డావు!" అని అంతలోనే పళ్ళు బిగించి తీక్ష్ణంగా శివరాం ముఖంలోకి చూసి, "రోడ్డు ప్రక్కన కుంటుకుంటూపోయే ఆ గజ్జికుక్కకి యెంత భయపడతానో, నీతో మాట్లాడటానికి అంతే భయపడతాను" అని శ్వాస కిందకి వొదులుతూ నవ్వింది.

హూంకరించినట్లుగా చూసి "మరి మాట్లాడు" అన్నాడు కటువుగా కసిగా.

"నీతో మాట్లాడాలంటే గజ్జికుక్కను చూసినట్లుంది నాకు. నీతో నాకేం మాటలు!"

"నీకక్కరలేకపోతే నాకు. నీతో మాట్లాడాలి"

"ఐతే ఆ మాట్లాడాల్సిందేదో మాట్లాడిపో."

అప్పటికి ప్రక్కన టాంగా రిక్షాలవాళ్ళు, వీళ్ళకేసి చూసి యేదో తగాదా జరుగుతున్నదని గ్రహించి, మాటలు సరిగా వినిపించకపోయినప్పటికీ మూగాలపిపించినా యింకా తటపటాయిస్తున్నారు.

"యిక్కడ కాదు నాతో రా యెక్కడికి కన్నావెళ్ళి మాట్లాడుకుందాం."

"నీతో వొచ్చి మాట్లాడాల్సిన అవసరం నాకు లేదు. నీకంత అవసరం వుంటే నాతోనేవొచ్చి మాట్లాడుకోవచ్చు" అంది.

"సరే పద."

వెనక్కి చూపుడు వేలితో చూపెట్టి "కూర్చో" అంది ఆజ్ఞాపిస్తున్నట్లుగా.

హుంకరించి, కారు తలుపు తీసి కూర్చుని, ధబీమని తలుపు లాగాడు శివరాం.

తల వొంచి, కుడిచేతి చూపుడు వేలితో పై పెదవి రుద్దుకుంటూ తిరిగి వొచ్చి కూర్చున్నాడు, క్రిష్ణచైతన్య

కారు కదిలింది.

బజారు మోత మధ్యలో, కారు లోపల నిశ్శబ్దపు ముద్దలా వుంది వాతావరణం.

కారు వేగం హెచ్చింది. పది నిమిషాలలో నవీన్ మంజిల్ ఆవరణలో ఆగింది

వీగి, వడివడిగా నడిచి—డ్రాయింగ్రూంలో కూర్చున్నారు.

శివరాం, నిలబడే వున్నాడు

"యింక మాట్లాడుకో" అంది

"కూర్చో" అన్నాడు క్రిష్ణచైతన్య.

"యిక్కడ కాదు. నీతో యేకాంతంగా మాట్లాడాలి" అన్నాడు శివరాం, నిలుచునే.

"నీతో యేకాంతంగా మాట్లాడాల్సినంత రహస్యాలేవీలేవు నాకు" అంది.

"నీకు లేకపోవొచ్చు. నాకున్నయ్. యితరులముందు మాట్లాడకూడని విషయాలున్నయ్ నాకు."

"ఐతే పద" అని లేచింది.

"గీతా—" అన్నాడు క్రిష్ణచైతన్య ఆమెకేసి చూసి. ఆ ధ్వనిలో ఆతురత, భయం

"యేం పరవాలేదులెండి. రూపం చూసి అనుకున్నారేవో" అని, శివరాం కేసి "పద" అని కనుబొమలు యెగరేసి, లోనకి నడిచింది.

మొదటి అతిథిగది తలుపుతీసి దీపం మీటనొక్కి లోనకి అడుగులు వేసింది.

లోనకివొచ్చి, ఆమెకేసి తేరిపారచూసి తల వొంచుకుని మౌనంగా వుండిపోయాడు.

పశేషన్ తీవిషన్

రెండు క్షణాలపాటు అతనికేసి పరిశీలనగా చూసి, చూపు మరల్చి గోడమూల బల్లమీదకి చూస్తోంది.

రెండు నిమిషాల నిశ్శబ్దం.

"యేవిఁటో మాట్లాడాలి మాట్లాడాలి అని వొచ్చి నోరు మూసుకుని తలకాయ వొంచుకుని నిలుచున్నావేం?" అంది.

అతను అలాగే మౌనంగా తలవొంచుకునే వుండిపోయాడు.

మరో నిమిషం.

పల్లేరులమీద వుత్త పాదాలతో నిలబడినట్లుగా చూసింది అతనికేసి.

మోచేతుల ప్రక్కగా నెత్తుటిగాయాలు. మోచిప్పలమీద లాగూ కొద్దిగా చిరిగిన చోట్ల నెత్తుటి మరకలు. చిక్కిపోయి దృఢమైన బొవికలు వికారంగా కనిపిస్తున్నాయి. కళ్ళు బాగా పీక్కుపోయి భీతిగా దైన్యంగా వున్నాయి. వొళ్ళంతా దుమ్ము బూడిద, మసి. ముందుకొసలు చిట్లిన బూట్లు. యెడమ చేతికి గడియారం.

అలాగే మౌనంగా తల వొంచుకుని ప్రక్కగా వున్న రేకు కుర్చీ మీద కూర్చున్నాడు.

"ఆవాళ కోపంతో పోవటం పోవటం ; క్వార్టర్సు దాకా వెళ్లాను. యే ముఖం పెట్టుకుని యింట్లోకి వెళ్ళగలను! గడపలో యెదురై, నువ్వు రాలేదేం – అని అమ్మ అడిగితే యేం చెప్పగలను ! నీ మీద యేవో అబద్ధాలు కల్పించి చెప్పాలి. నాకు యిష్టమూ లేదు: అమ్మ నమ్మనూ నమ్మదు. పైగా నన్ను నాలుగు చివాట్లేస్తుంది. తిన్నగా వెళ్ళి బీచిలో కూర్చున్నాను. గత అనుభవాలన్నీ గుర్తుకొచ్చినయ్. నువ్వు ప్రక్కన లేని నన్ను చూసుకుని బేజారెత్తిపోయాను. నేను పొరపాటు చేశాననీ నిన్ను బాధ పెట్టాననీ గ్రహించాను. వెంటనే బయల్దేరాను. దారిలో స్కూటర్ చెడిపోయింది. జోరున వర్షం. యింక చేసేదిలేక లారీ వొకటి యెదురైతే అందులో స్కూటర్ యెక్కించుకుని గారేజీకి చేరుకున్నాను. తెల్లవార్లూ కూచుని బాగుచేయించి పొద్దుట యెనిమిది గంటలకి బయల్దేరి వెళ్ళాను. అక్కడ బంగళాముందు ఆగగానే గుర్తుకొచ్చింది తాళంచెవి నా

జేబులోనే వుండిపోయిందని. గుండె దడదడ లాడింది. కాళ్ళు వొణికినయ్! స్కూటర్ని నిలబెట్టటం కూడా మర్చి గబగబా బంగళాలో కనిపించినవాళ్ళ నందరిని అడిగాను. గది తాళంతీసి చూశాను. యెక్కడి వస్తువులు అక్కడే చెక్కు చెదరకుండా వున్నయ్. తలుపు మూయ్యటం కూడా మర్చిపోయి, పిచ్చివాడిలాగా బజారెంట పరిగెత్తి, అన్ని చోట్లా లోయలలోనూ కొండలమీద "సీతా-గీతా" అని అరుస్తూ పరిగెత్తాను. మధ్యాన్నం రెండింటికో యేమో అలిసి సొలిపోయి పడిపోయాను. వొక గంట తరవాత తెలివొచ్చి లేచి కాళ్ళీడ్చుకుంటూ యేడుస్తూ అంతటా తిరిగాను. స్కూటర్ కూడా నడపలేని స్థితిలో దానిని అక్కడే అప్పజెప్పి సాయంత్రం బస్సులో బయల్దేరి తిరిగివొచ్చాను. యింటికి వెళ్ళలేదు. వొక కుర్రాణ్ణి మరసటి రోజున బ్యాంకుకివెళ్ళి డబ్బు తీసుకునిరమ్మని యింటికి పంపించి, కాలేజ్నుంచి కబురు పెట్టారని తనకై తను అడిగినట్లుగా అడగమన్నాను. పిక్నిక్కి వెళ్ళి యింకా రాలేదన్నారట. తిన్నగా బొంబాయి వెళ్ళిపోయాను. మనిద్దరం యేదో ముఖ్యమైన పనిమీద బొంబాయి చేరినట్లూ గాబరా పడొద్దనీ యింటికి వుత్తరం రాశాను. బొంబాయి అంతా, రాత్రి పగలూ అనకుండా తిరిగాను. విశ్వవిద్యాలయంలో నేను నిన్ను గురించి అడగనివాళ్ళు లేరు. గేటు దగ్గిర గంటల తరబడి వొచ్చేపోయే ఆడవాళ్ళని చూస్తూ కూర్చునేవాడిని నువ్వు కనబడతావేమోనని. అందరూ నన్ను పిచ్చివాడి క్రింద జమకట్టినా బాధపడలేదు. వాచ్మన్ ఆఖరికి, నన్ను పిచ్చాసుపత్రికి పంపిస్తానని బెదిరించాడు కూడా. మూడు నెలలు గడిచిపోయినయ్. నీ జాడ తెలియలేదు. కానీ నువ్వు బొంబాయివెళ్ళి అక్కడే వుండివుంటావని నా నమ్మకం. ఆఖరికి హాస్టలు బంట్రోతు వొకతను చెప్పాడు. ఆ సెలవుల్లో నువ్వెక్కడో పని చేశావనీ రాత్రిపూట యెవరో బంట్రోతు తీసుకొచ్చి దిగబెట్టి వెళ్ళేవాడనీ. ఆ బంట్రోతుకి రోజూ పదిరూపాయలు ఖర్చుపెట్టి వెంట వుంచుకుని వూరంతా తిరిగాను. సముద్రం లాంటి వూరు. యెంతకాలం తిరిగితే మాత్రం తరుగుతుంది! ఆ మొహం గుర్తుపట్టగలనని ఆ హాస్టలు బంట్రోతు ...క నెలరోజులు తిరిగాను. చివరికి వొరి అట.

అక్కడ కనిపించాడు, ఆ బంట్రోతు, నువ్వు అక్కడ కొద్దిరోజులు పని చేశావని చెప్పాడు. నీ గురించి వివరాలేవీ చెప్పలేకపోయాడు. పత్రిక ఎడిటర్ని కలుసుకుని అడిగాను. మొదట్లో యేదో అనుమానించి నట్లుగా నీ వివరాలేవీ చెప్పలేదు— నా స్థితి గురించి వివరంగా చెప్పిన తరవాత జాలిపడి, నీకు సంబంధించిన వ్యక్తులు యెవరూ తనకి తెలియని, తెలిసిన వొక్క—వ్యక్తి బెజవాడలో వొక పత్రికలో పని చేస్తున్నాడని "పేరు శశాంక" అనీ చెప్పాడు. ఆ అంధకారంలో నాకు ఆ పేరు

...గలా అనిపించింది. వెంటనే రయిలెక్కి—యివాళ మధ్యాహ్నం నాంపల్లి స్టేషనులో దిగి హౌరా ఎక్స్ప్రెస్ యెక్కాను యిందాక. వెనక పెట్టెలో వున్నాను నేను. ప్లాట్ఫారంమీద నువ్వెళ్లే కనిపించి నమ్మలేక మళ్ళీ చూశాను, నువ్వే. నా వునికే నాకు తెలవనట్లనిపించింది. పిచ్చిగా అరిచి కిందకి దూకేశాను, నువ్వు కనిపించిన వైపుకి. నలుగురూ మూగి లేవదీసి తీసుకెళ్లేశారు. పట్టించుకోకుండా ముందు పరుగు తీసుకొచ్చాను. గీతా, నేను చచ్చిపోతానని పిస్తోంది నా వొళ్ళు నాకు." అని పిడికిలితో నుదుటి మీద నొక్కుకుని, కనురెప్పలు మూశాడు. కళ్ళ వుబికి, మూడు బొట్లు రాలి కింద పడ్డాయి.

ఆ జీవి పడుతున్న ఆవేదనకి దైన్య స్థితికి ఆమె మనసు అర్ద్రమైంది. పవిట కొంగుతో కళ్ళలోకి వుబికిన తడి అద్దుకుంది.

వొక నిమిషం గడిచింది.

అతను, నిమ్మదిగా తలయెత్తి నిలుచునేవున్న ఆమెకేసి చూశాడు. అతని దైన్యపు దృక్కులకి తట్టుకోలేనట్లుగా చూపు నేలమీదకి వాల్చి— రెండడుగులు వేసి—కిటికీ దగ్గిరికి నడిచి—చువ్వలమీద చేతులువేసి నుదురు ఆన్చింది.

రెండు నిమిషాల నిశ్శబ్దం.

"గీతా—" అన్నాడు హీనస్వరంలో, దైన్యంగా.

పాషాణాలు కూడా అర్ద్రమయ్యేంత దైన్యాతి దైన్యత ఆస్వనిలో

ఆ హృది తనపైన కరుణిస్తుందో లేదో, అన్నట్లుగాచూశాడు ఆమె కేసి.

వెనక్కి తిరిగి అతనిని చూడగల స్థితిలోలేదు. భయంచేత కాదు. హృదయం ద్రవించి—యేమనటానికీ తోచక.

"గీతా, నన్ను క్షమించమని న్నా అడగలేనంత ఘోరంగా క్రూరంగా ప్రవర్తించాను ఆనాడు." అన్నాడు హీనస్వరంతో.

నిశ్శబ్దం.

"నన్ను క్షమించలేవు కదూ!"

కనురెప్పలు వాల్చి, భారంగా శ్వాస వొదిలి, గొంతు పెకలించుకుని, "ఇందులో క్షమించటానికి, క్షమించకపోవటానికి యేముందిలే" అంది. ఆమె గొంతు చమ్మగా వొణికింది.

"లేదు. గీతా-నిన్ను నేను క్షమాభిక్ష వేడుకోవాల్సిన విషయం."

రెండు నిమిషాల నిశ్శబ్దం.

డ్రాయింగ్రూంలో సోఫామీద కూర్చుని, ప్రత్యేకం యెటూ చూడకండా చూస్తున్నాడు క్రిష్ణచైతన్య. గదినిండా చెదిరిన చూపులు. అతని మేదో గడియారంలో నిమిషానికి కొన్నివేల సెకనులు చిటుకు చిటుకంటున్నాయి.

వొక్క యుగం ఆందోళితా నిరీక్షణలో గడిచింది.

గుండెమీద చెయ్యి వేసుకుని, లేచి—వేగంగా తూగుతున్న కాళ్ళతో చప్పుడవకండా అడుగులో అడుగు వేసుకుంటూ లోనకి నడుస్తూ చుట్టూ చూస్తూ—వాళ్లు వున్న గది గమనించి—దూరంనుంచే ఆ గుమ్మం కేసి చూస్తూ అటూయిటూ నడిచాడు. యిద్దరూ కనిపించారు. కిటికీ చువ్వ మీదకి వొంగివున్న ఆమె; కుర్చీలో తల వొంచుకుని కూర్చున్న అతన రెప్పలు వాల్చి క్షణకాలం నిలబడి—చప్పుడు కాకండా అడుగు యెత్తి యెత్తి వేస్తూ, డ్రాయింగ్రూంలోకి వడివడిగా నడిచి వొచ్చాడ క్రిష్ణచైతన్య.

బయట వరండాకి యెదురుగా కారుదగ్గిర నేల మీద కూర్చునివున్న పని వాళ్ళలో వొకతను వొచ్చాడు, యేమైనా అవసరమేమో నన్నట్లుగా. గమనించి, వెళ్ళమన్నట్లు తలతో సూచించాడు. సోఫామీదకి కూలపడ్డాడు.

"గీతా నన్ను క్ష
"రాజేష్" అంది

"నువ్వు లేని నా జీవితం— నా బ్రతుకు నీతో ముడిపడి వుంది. నీకు యే లోటూ కలగనివ్వను. నా పైన దయతలించి, క్షమించి ఈ వొక్క—సారికి రావూ! యింకెన్నడూ అట్లా ప్రవర్తించను ఆ రోజున అట్లా ప్రవర్తించినందుకు పశ్చాత్తాపంతో కుంగిపోతున్నాను. నీ కాలి చెప్పుతో నా చెంపలు వాయించు అప్పుడు నా తాపం చల్లారుతుంది. అదే నాకు శిక్ష. కానీ, గీతా—నీకు యే లోటూ రానివ్వను, నిన్ను పల్లెత్తుమాట అనను. గీతా, గీతా—యీ వొక్క—సారికి నన్ను —"

"శివరాంగారూ, ఆ రోజున మీరు చాలా మంచిపని చేశారు. నా కెంతో మేలు చేసిన వారయ్యారు. అందుకు నా కృతజ్ఞతలు యెన్నాళ్ళ నుంచో చెయ్యలేని పని చెయ్యగలిగేందుకు అవకాశ మిచ్చారు. యిన్ని రోజులలో వొకసారి కూడా మిమ్మల్ని గురించి నేను చింతపడలేదు. అసలు మీరు గుర్తే రాలేదు నాకు. యింట్లోవున్న ఆ యిద్దరినీ తలచు గుని వొకటి రెండుసార్లు కొంచెం యిదయ్యాను—అంతే, వొచ్చి నా జీవి తాన్ని దుర్భరం చేసుకోలేను మీ మేలూ నా మేలూకోరే చెబుతున్నాను. నేను రావటం యెవరికీ క్షేమంకాదు. తెలియక జరిగింది. తెలిశాక చక్క—దిద్దుకోవాలి. తెలిసికూడా తెలియనట్లుగా వుండటం అవివేకం. యీ భూగో ళానికి మనిద్దరం చెరొక ధృవం. అవి రెండూ కలుసుకోలేవు. కలుసు కున్నట్లు అనిపించితే అది వుత్తభ్రమ. మీరు మనిద్దరి మీదా దయతలిచి వెళ్ళిపోండి. మీరు యింకా మనసు కరిగే మాటలు ప్రారంభిస్తే తదను గుణంగా చేస్తే నా జీవితం యెలా తయారౌతుందో తలుచుకుని, యేం వాగుతూనే నాకే తెలియకుండాపోతుంది. మనిద్దరి మేలూకోరి మౌనంగా వెళ్ళి పొమ్మని వేడుకుంటున్నాను" అని భారంగా శ్వాస విడిచింది.

వొక క్షణం నిశ్శబ్దం.

"కానీ, గీతా—నిన్ను నేను మనసారా ప్రేమిస్తున్నాను. నువ్వులేని నా జీవితాన్ని వూహించుకోలేను ప్రపంచంలో నీకంటేమించింది నాకుయేదీ లేదు. నువ్వు యేదికోరితే అది యిస్తాను. నువ్వు యెట్లా చెపితే అట్లా

సశేషమ్ జీవితమ్

నడుచుకుంటాను."

"మీరు నన్ను ప్రేమించలేదని నేనను. మిమ్మల్ని నేను ప్రేమించలేదు. యీ విషయం మీకు అప్పుడే చెప్పాను నేను. అప్పట్లో నాకు ప్రేమ అంటే యేమిటో తెలియదసలు. యీ మధ్యనే తెలిసింది. అలాంటి బాధలోంచే తేరుకుంటూ వున్న నేను, మీ బాధ అర్థం చేసుకోగలను. కానీ, మీ ప్రేమకోసం నా జీవితాన్ని త్యాగం చెయ్యలేను. నాలో ఆత్మత్యాగం లేదు. ఆ వుదారత లేదు. నాలో సహత్యాగం మాత్రమే వుంది. ఆ రకంగా చూస్తే నేను మంచిదాన్ని కాదనీ చెప్పవొచ్చు."

"నువ్వు సుగుణాల రాశివి, అందాల భరిణవి. నీకు వొంక పెట్ట గలిగే దెవ్వరు! గీతా గీతా నువ్వు నన్ను దయదలిచి వొక్కసారి యీ వొక్కసారికి నన్ను క్షమించు. నీకు కావలసిన సమస్తమూ-యేదంటే అది-నీ యిష్టమొచ్చినట్లుగా-వెనకటిలాగా విసుక్కోను కూడా-"

అకస్మాత్తుగా ప్రస్తుత స్థితిని మర్చిపోయి, నవ్వు ఆగక-ఫక్కున నవ్వేసి వెనక్కి తిరిగింది అనుకోకుండానే.

"నేను నపుంసకుణ్ని కాదు" జాలిగా, దీనంగా అన్నాడు. తనని చంపుకుని అన్నట్లుగా ధ్వనించింది.

"కాదని నాకు తెలుసు. కానీ అదేమేలేమో-లైంగిక చేష్ట అంటే బురద గుంటలో పందులు పొర్లాడినట్లు రొప్పటంకాదు రసభావం తాదాత్మ్యత, చిన్న అస్పష్ట స్పర్శలో లోలోతుల నిగూఢతని చూడగలగటం, చూపగలగటం-అలాంటిది కావాలి. మిమ్మల్ని కించపరచటం కాదు గానీ, మీలో ఆలక్షణం లేదు. అందుకు, మిమ్మల్ని తప్పు పట్టటం లేదు నేను, మీ తీరు వేరు, నా తీరు వేరు-అనుకుంటాను. అంతే, కానీ నా జీవితాన్ని మీ జీవితానికి లంకె వెయ్యాల్సినప్పుడు మాత్రం ఆ లక్షణాన్ని భరించ లేను. క్షమించలేను. మీరు మంచివాళ్లు. యెన్నిటికో అర్హులు కానీ నా లాంటి దానికి భర్తగా మాత్రం అనర్హులు, అది మీ లోపం-అని అనను చెప్పానుగా-మనిద్దరి తీరూ వేర్వేరని. మీరు దయతో-"

"గీతా గీతా యింక ఆ మాట అనకు; నేను వినలేను." అంటూ

చివాలున లేచి ఆమె ముందుకు వొరిగి ఆమె పాదాలమీద చేతులువేసి, "నన్ను క్షమించు గీతా. క్షమించానని అను గీతా. లేకపోతే నీ పాదాల మీద నా తల పగలగొట్టుకుంటాను" అన్నాడు. అతని గొంతు తడితో పూడింది.

ఆమె భారంగా, మౌనంగా వుండిపోయింది

"నీ పాదాల ముందర యీ గచ్చుకేసి తల పగల గొట్టుకుంటాను. నువ్వు కాదంటే—" అని వొక క్షణం ఆగి, "పోనీ అతనితోనూ—అతనితో కూడా వొచ్చేసెయ్యి—నీ యిష్టం" అని గొణిగాడు.

అతని కంటినీరు రాలి ఆమె పాదాల మీద పడింది

ఆమె మనసు ఆర్ద్రమౌతోంది.

వొంగి అతని భుజాలు పట్టుగుని పైకి లేవనెత్తి కన్నీళ్ళు తుడవాలనిపించింది ఆమెకి. కానీ, ఆ పని చేస్తే, తరవాత స్థితి యెలా వుండేదీ తను యేం చెయ్యాల్సి వొచ్చేదీ, ఆపైన తన జీవితమూ తలుచుకుని, గుండె దిటవుచేసుకుని—తటాలున రెండో కిటికీవైపు నడిచింది.

అరిచేతులు గచ్చుమీద ఆన్చి, తలపైకియెత్తి, ఆమెకేసి చూచాడు. వొక్క—క్షణంలో నల్లరాతి పలక వెన్నముద్ద అయిపోయేలా వుంది ఆ చూపు.

ఆమె కిటికీవైపు తిరిగి వుంది.

కూర్చునే ప్రాకినట్లుగా ప్రక్కకి జరిగి ఆమెకేసి చూస్తూ వుండిపోయాడు.

గదినిండా నిశ్శబ్దం.

డ్రాయింగ్రూంలో మరో యుగం గడిచింది. గుండెకి దగ్గిరిగా చేతులు కట్టుకుని కూచుని వున్న క్రిష్ణచైతన్య చేతులు అలాగే వుంచి లేచి, కొద్దిగా వొంగి అడుగులు వేశాడు లోనకి. అటూ యిటూ రెండు సార్లు తిరిగాడు ఆ గదికేసి చూస్తూ. ఆమె కనిపించలేదు అతనూ కనిపించలేదు పడిపడిగా డ్రాయింగ్రూంలోకి నడిచి వరండాలోకి వొచ్చి దూకినట్లుగా మెట్లు దిగి యెడమవైపు సందులోకి పచ్చగడ్డిమీద అడుగులు వేస్తూ—ఆ గది దరిదాపుకి వెళ్ళాడు

సౌ శేషమ్ జీవితమ్

రెండో కిటికీ దగ్గిర ఆమె కనిపించింది.

ఆతురతగా ఆమె ముఖంలోకి చూశాడు

నాకేం పరవాలేదు—నిశ్చింతగా వుండొచ్చు—అస్పష్టంగా తన కళ్ళ లోకి పొడిపెదవులమీదకి సన్నటి నవ్వుపొర లాంటిదాన్ని తెచ్చుకుని— తలతో కళ్ళతో సూచించింది.

అరనిమిషం అలాగే నిలబడిపోయాడు. ఆమె చూపు కిందకి వాల్చింది.

వెనక్కి తిరిగి తాపీగా నడిచి—కాసేపు అటూ యిటూ అర్థరహితంగా చూసి—నిదానంగా అడుగులువేస్తూ వొచ్చి ముందు ఆవరణలో పచ్చికమీద కూర్చున్నాడు.

కారు దగ్గిర కూచుని చిన్నగా మాట్లాడుకుంటున్న పనివాళ్ళు, అతనిని చూసి నిలబడి పిలుస్తాడేమోనన్నట్లు వొక నిమిషం చూసి—అవతలికి నడిచి కారును మరుగుచేసుకుని గులాబీతోట ప్రక్కగా కూర్చున్నారు.

కారువున్న వైపుకీ, గేటువైపుకీ అర్థరహితంగా చూసి, గడ్డిపరక తుంచి వేళ్ళమధ్య కదుపుతున్నాడు రోజాటీ అపరాహ్ణంవేళ రోడ్డు మీద కరుగుతున్న తారుముద్దలా వున్న అతని మనసుమీద చల్లగా కురవాలని విఫలయత్నం చేస్తోంది, వెన్నెల.

అలా చూస్తూ వుండిపోయిన శివరాం ముఖంలో వొక కాంతిపుంజం లోకి మరో రంగు కాంతి పుంజం చొరబడి వింతగా మారినట్లు వర్ణ సంకరమై—చివరికి అన్ని రంగులకీ అతీతంగా స్థిరపడింది. –

చిదానందంగా నిశ్శబ్దపు నవ్వునవ్వుకుని, తలవూపి లేచాడు, శివరాం.

శ్వాస బలంగా పీల్చి, "ఐతే, గీతా—నువ్వు నాతో రావటల్లేనా?" అన్నాడు. అతని స్వరం గంభీరంగానూ నిశ్చలంగానూ ధ్వనించింది.

ఆ వాతావరణంలో ఆ ధ్వని వింతగా వినిపించి, వెనక్కి తిరిగి చూసింది

అంతలోనే కనుబొమలు ముడిచి, "రాను" అంది.

"కానీ నువ్వువొచ్చి తీరాలి. నువ్వు నా భార్యవి."

"మనసుల బంధం తెగిననాడు మనుషుల బంధం నిలవదు. ఆ స్థితిలో యింకే బంధవూ నిలవదని అడ్డుకోదనీ నేనప్పుడే చెప్పాను. యిప్పుడు ఆ పదం వుత్త అర్థరహితమైన మాట" అంది.

"వివాహబంధం తెగిపోనది."

"మనోబంధం తెగాక అన్ని బంధాలూ, పుటుక్కున తెగి వూరు కుంటాయి. కాగా నువ్వు పసుపుతాడు కూడా తెంచగలిగిన సాహసికుడివి!"

"మనం భార్యాభర్తలమని అందరికీ తెలుసు. హిందూ చట్టప్రకారం భార్య, భర్త అభిప్రాయానికి భిన్నంగా బజారు తిరుగుళ్ళు తిరిగితే తన్ని తీసుకొస్తారు. నువ్వు నా భార్యవని అందరిచేత అనిపించి నిరూపించగలను. అప్పుడు తెలుస్తుందిలే నా సాహసం!"

పకపకా నవ్వి, "నీకు వాళ్ళ సినిమాలు మాత్రమే తెలుసుననుకున్నాను—చట్టంకూడా తెలుసునన్న మాట! యింకేం, కోర్టుకి వెళ్ళి—నా పెళ్లాం నన్ను కాదని లేచిపోయి వేరొకడితో తిరుగుతోంది. ఆ చెడిపోయిన దాన్ని తెచ్చి నా గుండెమీద వుమ్మెత్త పూలకుండీలా కూర్చోబెట్టండి—మీ కాళ్ళు పట్టుకుంటానూ అని జడ్జి ముందర కడివెడు నీళ్ళైతే కార్చేస్తావనూ" అని మళ్ళీ పకపకా నవ్వింది.

"ఆఁ, కోర్టులో కూడా నిరూపించగలను."

"కోర్టుకి కళ్లు లేవంటారు కానీ, దానికి చెవులూ, కళ్ళూ కూడా వున్నాయి ఐతే, అది కళ్ళతో వింటుంది; చెవులతో చూస్తుంది. పెళ్ళి కతువు యెవరి ముందరా జరగలేదనేది విదితం. లిఖితాధారాలేవీ లేవనేది అంతకన్నా విదితం. నన్ను కోర్టుకి పిలిపిస్తే యేమని వాఙ్మూలమిస్తానో తెలుసా? నీకు తెలియదని నాకు తెలుసులే—విను. విశాఖ వుద్యోగానికొచ్చి తూర్పు సముద్రపు గాలికి వొళ్ళు తిమ్మిరెక్కి; యితగాణ్ని వుంచుకున్న మాట అయితే నిజమేగాని—తరవాత అతగాడొక నిఖార్సయిన దున్నపోతు అని తెలుసుకుని వొదిలిపెట్టేశానూ అని చెబుతాను. అప్పుడు కోర్టులో మోగే కరతాళ ధ్వనికి నీ చెవులు దిమ్మెత్తిపోయి పిచ్చిగావుకేక పెడతావు."

"నోర్మూయ్, వొళ్ళూపై తెలవకండా వాగబాక. నిన్ను నిజంగానే

"అథవా కోర్టులో నువ్వనే లాగానే నిరూపణ అయినా నీకు శాంతి వుండదు. అశాంతితో క్రుగ్గే నేను, నీకు శాంతి లేకండా చేస్తాను. నీ గుండెలో నిప్పుకణికనై చితిరగిల్చి నిను బుగ్గిచేస్తాను.

"వాగబాక. నా గుండెలో నీకు స్థానమే లేదసలు."

"సరోవరంలాంటి హృదిలో వుండాల్సిన నేను, నీ గాజుగుండెలో వుండాలని కోరుకోనని తెలియదేమో నీకు! నువ్వొక కాగితం పువ్వువి! నాక్కావల్సిన పరిమళం లభ్యంకాదు. నువ్వొక రంగు పువ్వులు చెక్కిన గాజు హృదయానివి, కానీ నాక్కావలిసింది పచ్చని పచ్చిక పచ్చిక హృదయం ప్రపంచంలో యే వొక్కరి కోసమూ నన్ను నేను వంచించుకోలేను. కానీ, వొక్క రసస్పందనంకోసం, వెన్నెల స్పర్శకోసం, రసహృదయపు లోలోతుల పలవరింత కోసం నా సర్వస్వాన్నీ అర్పించుకోగలను. అది లభ్యం కానప్పుడు, నాకు యేదీ లక్ష్యం వుండదు. నువ్వేకాదు. యెవరితోటీ నా జీవితాన్ని బండరాయిలా చేసి పడేసుకుని నన్ను నేను క్షమించుకోలేను. ప్రపంచం హృదయమంత సువిశాలమైంది. అన్వేషిస్తూ సెగలాంటి బాధతో సాగిపోతాను. నా జీవితం అంతా అడవికాచిన వెన్నెలే అయిపోతుందీ—అవనీ, అనుభవంతో పుష్పించకుండా, పండిన అనుభూతిలా రాలిపోతాను కానీ ముందు గాజు గుండెకి—"

ఆమె మాట పూర్తి అవకండానే, "యింతా వాగావంటే పక్కెలిరగడంతాను" అన్నాడు.

"సరిగా పశువు అనాల్సిన మాటే అన్నావులే. వింత యేమీలేదు అందులో" అని నవ్వింది.

"రండ లంజా నిన్ను యేం చేస్తానో తెలుసా" క్రౌర్యంగా అన్నాడు.

ఆమె ముఖం, ఆ మిరపపండు రంగు చీరకంటే యెర్రగా జ్వలించింది, కళ్ళలోని నీలిమ జ్వాలలా యెగిసింది.

"నీ బెదిరింపులకి జడిసేదాన్ని కాదు. యెవరికీ భయపడాల్సిన పని లేదు నాకు. ఆత్మకి భయపడనక్కరలేని మనిషి దేనికీ భయపడటం జర

గదు. స్వచ్ఛస్ఫటికం లాంటిదాన్ని. నేనెవ్వరి భయపడనక్కరలేదు. యింకా నీ గాజు గుండెకి భయపడతానా!"

తళతళా మెరిసే అతని చిన్నచిన్న కళ్లు నిప్పురవ్వలా మెరుసు న్నాయి,

"గాజుగుండె! గాజుగుండె! యిది గాజు గుండెలో, వజ్రపు గుండెనో యిప్పుడే చూపెడతాను, ఆగు—" అని గిరుక్కున వెనక్కి తిరిగి వెళ్ళి గది తలుపుమూసి గడియతిప్పి, ఆమె దగ్గరికి తూలిపోతున్నట్లుగా నడిచి, ఆమె భుజాలమీద చేతులువేసి వూపి క్షణకాలం ఆగి, చూపువిరిచి, "చెప్పు, యిప్పటికైనా నాతో వస్తావా రావా చెప్పు" అన్నాడు.

ఆమె పవిటజారి నేలమీదకి వాలింది.

"రాను. రాను. రాను" అని అతని ఛాతీమీద చెయ్యివేసి నెట్టబో యింది

ఆమె మెడకి రెండుప్రక్కలా అరిచేతులుచుట్టి, "నువ్వు రావు. అసలు నువ్వు రావొద్దు; రావొద్దు. నీ గర్వం నీ ఆధిక్యపు చూపు; పరి హాసం, పొగరు-అన్నిటికంటే మించి నీ సౌందర్యం— మాడి మసై పోవాలి నా చేతుల్లో. నా జీవితాన్ని నాశనం చేసిన నిన్ను బతకనిస్తే—నిన్ను బతకనిస్తే—" అని వేళ్ళు బిగిస్తున్నాడు, ఆమె కంఠం చుట్టూ.

అతని ముఖంలోకి చూసి భీతి చెందినట్లు అయి, వెంటనే చూపు వాల్చి, "భలే, నువ్వు అలా అన్నావని కోపంతో అలిగి వొచ్చేశాను. నాకు తెలిసిన నేస్తం యింటికి నిన్ను చూశాక, ఆ రోజున అన్ని మాటలు అన్నావే, కాసేపు ఆట పట్టించుదాం అని అన్నానేగానీ—రామ్, నీకంటే నాకింకెవరు కావలసినవాళ్లు! రామ్, పోదాం పద" విదురకంటే మధు రంగా అని, చిరునవ్వు వెదజల్లింది.

వికటంగా నవ్వి, "నువ్వు తెలివిగలదానివని నాకు తెలుసు. కానీ నాకు నీ అంత తెలివి లేదు. అందుకే నేను నీ తెలివిలో బోర్లాపడటం లేదు" అని రౌద్రంగాచూసి, వేళ్ళు మరికొంచెం బిగించి, "అరవటానికి ప్రయత్నించకు. నీ అందమైన కంఠం నా చేతుల మధ్య యిరుక్కుని వుందని గుర్తుంచుకో—నువ్వూ, నీ రసమూ, చారూ, పులుసూ, లోతూ

గీతూ, తన్నూ మన్నూ, సిద్దీ బుద్దీ—అన్నిటినీ, నా జీవితాన్ని నాశనం చేసిన నీ సౌందర్యంతో చుట్టి చుట్టి నరకానికి విసురుతాను" అని వుద్వేగపు టయాసం లోంచి శ్వాస పీల్చుగుని, భీకర క్రౌర్యపు ముద్దలా ఐన తన ముఖాన్ని ఆమె చూపుల మీదకి విసిరి, "విసురుతాను; నరకానికి విసురుతాను" అని అంతలోనే చల్లబడినట్లుగా తగ్గి, "నువ్వులేకుండా నేను బతికినా చచ్చినదాంట్లో జమ. చచ్చినబతుకు బతకలేను. నిన్నొకక్కదాన్నీ స్వేచ్ఛగా వొదిలెయ్యను. నువ్వు నరకంలో కూడా తలవొంచవు. నీతల వొంచగలవాణ్ని నేనొక్కణ్నే—నీతోపాటు నేనూ వొస్తాను. శాశ్వతంగా నిన్ను చిత్రహింస పెడుతూ నీలోనే నీలోనే వుండిపోతాను. పద పద—నరకానికి. అది నీ పుట్టిల్లూ అత్తిల్లూ కూడా-శాశ్వతంగా నిన్ను నాలో నన్ను నీలో—"

పళ్ళు పటపటలాడి మాటలు ఆగిపోయాయి.

అలాగే గొంతు పట్టుకుని ఠకీమని తన నుదురు ఆమె నుదుటికేసి కొట్టుకున్నాడు.

జుట్టుముడి వూడింది. నుదిటి కుంకుమ అతని నొసట అంటింది.

రౌద్రపు ముద్దలావున్న అతని ముఖం కుంకుమ బొట్టుతో మరింత రౌద్రంగా అయింది.

అతని ముఖంలోకి చూసి— గావుకేక పెట్టబోయింది.

వెంటనే, గొంతునాళం నొక్కి, "నువ్వు అరవలేవు. యీ గొంతు మళ్ళీ పలకగలిగేది నరకంలోనే" అని మళ్ళీ తన నుదురు ఆమె నుదుటి కేసి కొట్టాడు.

ఆమె ముఖం భీతితో ఉబ్బరించి వంకర్లు తిరిగిపోతోంది. ఆమె చూపులు—అతని హృదయం పగిలి గాజుముక్కలై పడినట్లుగా చెదురుతున్నాయి.

ఆమె ముఖంలో—సమస్త విశ్వం యేదో తెలియని అఖాతంలోకి ధభీమని పడిపోతున్నదనే భయం. అది మృత్యుభయాన్ని పోలి వున్నట్లుగా అనిపించదు. యీ గాలీ, యీ వెన్నెలా. యీ చీకటి పొరలూ యీ మంచుతెరలూ, యీ పచ్చికలూ, రసహృదయాలూ. తన అసిత్వం సశేషమ్ జీవితమ్

లోంచి తన్మయకతో అద్వైతసిద్ధి పొందకుండానే మిగిలిపోయాయే-అని; ఆ లాలస ఆ తపన రససిద్ధిలోంచి కన్ను మూయలేకపోతున్నది కదా-అని దిగులులాంటి భయం. రససిద్ధిలో తానే మృత్యువై ఘనీభవించాల్సింది పోయి; మృత్యుచేతనని నెత్తుటి రసికింద చీమికింద కార్చుకోతోందే-అని; విషాదంలోంచి జనించిన భయం. ఆ భయం, విషాదకారకం కాజాలదు.

అలాంటి భయంతో వాణికిపోతోంది

తన నుదురు ఆమె నుదుటిమీద కొట్టి కొట్టి—కసితీరక, వున్మాద శక్తితో ఆమె తలచేసి తన తల బాదుకున్నాడు.

ఆమె కళ్ళు, దృష్టికోల్పోయాయి చెవులు, శ్రవణ శక్తి కోల్పోయాయి.

అతని చేతుల మధ్య ఆమె గొంతు చితుకుతున్నట్లుగా కదులుతోంది

కొన వూపిరిలోంచి అన్నట్లుగా, "డాడీ" అని పలికింది. సన్నటి సవ్వడి.

యిద్దరి ముఖాలమీదా నెత్తురు చింది నేలమీద పడుతోంది.

ఆమె—షడింద్రియాలూ గ్రహణంకోల్పోయాయి. రసేంద్రియం వొక్కటీ మాత్రం, యింకా కొనవూపిరితో మిణుకు మిణుకుమంటోంది.

మళ్ళీ—ఠకీఠకీమని ఆమె తలకేసి తల బాదుకున్నాడు.

కపాలాలు చిట్లి—రక్తం చిమ్మి—

మృత్యువు ఆమె హృదిలో అమృతంబొట్లు పిల్చి చచ్చిపోతూ అతని గొంతులోంచి, "గీతా" అని గీపెట్టింది. నేల కొరిగిపోయాడు. ఆమె శరీరం అవతలికి విరుచుకుపడింది

పచ్చికమీదకూచుని, ఆమె కనుల నీలిమ అద్దిన అభయముద్రతో తనకితాను గీతోపదేశం చేసుకుంటున్న క్రిష్ణచైతన్యకి, ఆ ధ్వని వినిపించి, వొక్క వుదుటున లేచి యింట్లోకి పరుగుతీశాడు.

అతని పరుగుచూసి పనివాళ్ళుకూడా పరుగుతీశారు.

గది తలుపుమీద నాలుగుసార్లు ధభీధభీమని చేతులతో బాడి-బయ

టికి పరిగెత్తి కిటికీలోంచి చూశాడు. యేమీ కనిపించలేదు.

కిటికీ చువ్వ పట్టుకుని, గోడ కింది భాగంలోని మట్టుమీద కాలు వేసి, పైకిలేచి చూశాడు.

గదిలో యెవరూ లేరు; నెత్తుటిమడుగు తప్ప.

ఢభీమని వెనక్కి విరుచుకుపడిపోయాడు.

పని వాళ్ళు పరిగెత్తుకొచ్చి చూసి-చేతులమీద పట్టి. లోనకి తీసుకు వెళ్ళి మంచంమీద పడుకోబెట్టి ముఖంమీద నీళ్ళు చల్లారు.

పావునంటకి స్పృహ వొచ్చింది, క్రిష్ణచైతన్యకి. అలాగే గంట సేపు పడుకుని పోయాడు.

యింట్లో——టెలిఫోను మోతలు; బూట్ల టక టకలు, తలుపు-బలంగా తెరిచిన చప్పుడు——

అవేవీ అతనికి వినిపించటంలేదు.

అక్షరాలా చిదానందంగా నవ్వుకుని, తలవూపి, బయటికి వొచ్చి పచ్చికమీద కూచున్నాడు.

——జీవితం సమాప్తమవలేదు. యింకా జరగాల్సింది వుంది—— అంత్యక్రియలు. పీళ్ళవికాదు. నిరంతరం జరిగే తన అంత్యక్రియలు.

# అర్ధానః(స్వా)సారం

అర్ధానుస్వారంలో అర్ధమూ, నేతిబీరకాయలో నెయ్యీ యెంత వున్నాయో—యీ అనుస్వారానికీ అంతేనేమో. యీ వాక్యం చదువుతూనే—ఐతే నిరర్ధకం అని తెలిసికూడా యీ అనుస్వారింపు దేనికి? అని మీకు అనిపించవొచ్చు. కానీ నా మతం వేరు — నేతి బీరకాయలో నెయ్యీ, అరసున్నలో అర్ధమూ వున్నాయని.

నేతి బీరకాయలోని నెయ్యి వున్నపళంగా పిండుకోటానికి రాదు దానిని వొండినప్పుడు దాంట్లో నేతిజీర యేదో వుండివుండాలని వొప్పుకోక తప్పదు. అది అవిభాజ్యాంతర్లీనం అనుకుంటాను. అరసున్నలో అర్ధం నిర్దుష్టంగా యెత్తి చూపేందుకు వీలుకాదు కానీ ప్రయోగంలో [వాడకంలో] పూర్తిగా అర్ధరహితం కాదని అవగతమవుతుంది. "వు", "వుఁ" —యీరెంటి అర్ధాలూ వొకటికాదు.

అవి పరాశ్రితాలు అలాగే యిదికూడా.

అంచేత, యీ అర్ధానుస్వారం వ్యర్ధానుసారమూ, నిరర్ధకానుసారమూ కాదని నా నమ్మిక

"యీ పుస్తకం చదవటం పూర్తిచేశారు. చదివిన పాపానికి మీపైన నాకేదో చొరవ—వున్నట్లు ఫీలవుతాను. అలా అనుకోవటం న్యాయం కాకపోవొచ్చు. యిలా రాయటం సభ్యత కాకపోవొచ్చు. కానీ—(పరస్పరాధార్యంగా, నాపైన మీకూ వో రకమైన చొరవ.)

అన్ని పేజీల గజిబిజీ విసుగును భరిస్తూ చదువుతున్న పాఠకులను—ఆ గజిబిజి విసుగుమీద మరికొన్ని పేజీల వీరామరకలు పులిమి పూర్తిగా

విసిగించవొచ్చనీ; అన్ని పేజీల మనసు పొరలతో, అస్తిత్వపు రసాభాసతో, మెత్తని మెరుపుతీగల సంఘటితంతో వుద్వేగపడుతూ చదివిన పాఠకులను —ఆ వుద్వేగజ్యోత్స్నమీద చీకటి గీతల్ని గీచి మరింత వుద్వేగించవొచ్చనీ; అనిపించి, యీ నాలుగుముక్కలూ రాస్తున్నాను.

యిప్పటికే మనసులోని విసుగు పెదవి విరుపులలో బిగుసుకోవటమో; కళ్ళలోని వుద్వేగం పెదవులమీద వల్చాగా ప్లావితమవటమో జరిగిపోయి వుంటుంది. అంచేత, నేనిప్పుడేం చెప్పినా; మీ పూచీ నాకు వుండదు.

ప్రపంచంలో రాయటానికి కథావస్తువు యెప్పుడూ వుంటూనే వుంటుంది — అజ్ఞానికీ, జ్ఞానికీ తప్ప. రాసేవాళ్ళూ, రాయగలిగినవాళ్ళూ రాస్తారు, రాయనివాళ్ళూ రాయలేనివాళ్ళూ రాయరు. నేను; జ్ఞానినీ కాదు, అజ్ఞానినీ కాదు కథావస్తువులెన్నో కనిపిస్తాయి. ఐనా — నేను, యిట్టే వాటిని సాహిత్యరూపంలో మలచటం జరగదు.

రాయటానికి వొక్కో రచయితకి వొక్కోరకం అవసరాలు వుండొచ్చు. తీరుబడి, యేకాంతం, జనసమ్మర్దం, ప్రశాంతి, చికాకు, రమణీ ప్రియదూతిక తెచ్చి యిచ్చే కప్పురపు విడమూ, అప్పులవాడి కబురు, కాఫీ, సిగరెట్, మద్యం, పాలు, రాత్రి, పగలు— యిలాంటివాటిలో కొన్ని అవసరం కావొచ్చు; కాగితం, కలం, కథావస్తువుతోపాటు. ఆ కావలసిన పరిస్థితి, వాతావరణం వుంటే రచయిత రాయగలడు(దు). కానీ, నేను యేవి వున్నా లేకపోయినా — రాయలేను; రాయగలను. రాసేందుకు, బాహ్యజగత్తులో వాతావరణంలా ఏర్పడాల్సింది, యేమీ లేదు. నాలోని యేదో వొత్తిడికి లొంగిపోక తప్పనప్పుడు మాత్రమే రాయగలను. కాబట్టి, వొక దృష్ట్యా, నేను "రచయిత" ను కాదేమో.

యీ యితివృత్తం నా మనసులో చాలాకాలంగా వుంటున్నా, తొలిరూపు దిద్దుకున్నది. 1960లో, 1961 ఆరంభంలో. మొదటిఅధ్యాయం

అక్షరరూపం తాల్చింది. మళ్ళీ 1968 లో ప్రారంభించి, ఐదు మాసాలలో పూర్తిచేశాడు. మధ్యలో, యేడు సంవత్సరాలు, వొక్క అక్షరంకూడా రాయలేదు. నేను యేదో రాయగలనని అనుకోవటం, చాలా అరుదు. అను కోవటం జరిగినా; రాయటం పడదు. యేడేళ్ళపాటు నాలో నలుగుడు పడుతూ, గుప్తంగా సెగ రగుల్చుతూ, వుండపోయింది హిమజ్వాల.

రాయాలని మొదలుపెట్టబోతే-నాలో, లోలోన యేదో అడ్డుతగుల తుంది. వొకపట్టాన రాయనివ్వదు. రాసేముందు యెంతో శక్తిని కూడదీసు కోవాలి. అనుభూతితో తన్మయించటం యిష్టం. ఆ అనుభూతిని బయట పెట్టేస్తే; యేదో కోల్పోయినట్లు, బంగబడినట్లు, అనిపిస్తుంది. బహిర్గత మవని అనుభూతి, అమూల్యాపూర్వనిధి. రాసేస్తే; దాన్ని పోగొట్టుకున్న దౌర్భాగ్యుడవటమే. కాని మరోప్రక్కన, దానిని బయటికి కక్కేసెయ్యా లన్న ఫీలింగూ. సాంద్రత, వొత్తిడి, వుక్కిరిబిక్కిరి చేస్తే తప్పనిసరి ఐ - యింక రాయటానికి వుపక్రమించానన్నమాట.

పోనీ, యీ యేడేళ్ళకాలంలో యేవైనా సన్నివేశాలూ, కథా సంవిధానం, సంఘటన మలుపులు — వో కొలిక్కి వొచ్చి మనసులో స్థిర రూపం పొందాయా అంటే; అదీలేదు. అంతకాలంలోనూ యితివృత్తం వినా? మరేమ్లేదు.

కాధానికీ నలకి వున్న తేడా - జలపాతానికీ, నడికి వున్న తేడా లాంటిదని నా అభిప్రాయం. పీలగా, అస్పష్టంగా ప్రారంభమైన వుప నదులతో మొదలై వొడ్డులొరసి పొంగిపొరలే ప్రవాహం ఐ, చివరికి సుడులు తిరుగతూ సముద్రంలో అదృశ్యమయ్యే నదిలాంటిది నవల. కథానిక; అలాకాక. మహత్‌శక్తినీ, సాంద్రతనీ, అనుభూతినీ త్రుటికాలం లోకి కేంద్రించి దూకే జలపాతం లాంటిది.

నవలకి శుద్ధ కథాకథనం ముఖ్యలక్షణంగా అనుకునే పక్షంలో యిది నవల అనిపించుకోదేమోనని. కానీ, నవలీకుడు విధిగా క్రమంగా 'కథకుడై' తీరాలని నేననుకోను.

నాటకీయత, శుద్ధకథాకథనం, చేతనాస్రవంతి — యీ మూడిటినీ సంలీనం చెయ్యాలనే అస్పష్టభావం యేదో నాలో వుందేమోననిపిస్తుంది. రచన, నిర్దుష్ట స్థిరత్వాన్ని గురించి అతిస్పష్ట వివరణకాక - గమనాన్నీ, యానాన్నీ, ప్రవాహాన్నీ అక్షరాలలో చిత్రించాలని — అంతర్ బహిర్ వర్తనాల మధ్యన వుండే గొలుసుపొరలు విరగకుండా వొక్కొక్కటే విప్పి; యేదో శూన్య రహస్యాన్ని తెలుసుకోవాలన్న కోర్కె.

అర్ధగీతతో [—] ప్రారంభమైన పేరాలన్నీ పరమానసప్రవేశం తాలూకూ భోగట్టా.

పాత్రలను మీరు, 'యిడి' 'యిది' అని నిర్ణయించి, 'యిలా' 'యిలా' నడుచుకోవాలి, నడుచుకుంటారు—అని శాసించలేను. అందులో నాకు నమ్మికలేదు. నేను కేవలం 'సృష్టికర్తని మాత్రమే.

నా అనుభూతికి చేరువలో కనిపించిన విజ్ఞానపుటంశాలు : యెం.యన్. వైట్‌హెడ్, జె.పి. సార్త్రి, సి.జి. యూంగ్, శాక్తేయం. యివి యితివృత్తంలో కొంత చోటు చేసుగుని వుండొచ్చు. కానీ, పాత్రలు, విధిగా వాటిననుసరించి ప్రవర్తించాయనిగానీ, ప్రవర్తించాలని ప్రయత్నించాననిగానీ అనుకోను. పరిపూర్ణ పరస్పర నిస్సంఘటితాంతర్యపు జీవి—వొక పుళక్కి.

వివిధపాత్రలు వివిధ సిద్ధాంతాల బావాలు కాదు. రక్తమాంసాల జీవిని యే సిద్ధాంతినికిగానీ పరిమితం చెయ్యటం సాహితీ హత్య. (వాళ్ళు బుద్ధిజీవులైతే యేమో చెప్పలేను.)

పాత్రలను నా యితివృత్తానికి అనుగుణంగా సృష్టించటం వరకే గానీ, వాళ్ళను దానికి కట్టి పడెయ్యలేను. పాత్రలు వొకపట్టాన విని నడుచుకోరు. కాదుకూడదని నిలవెయ్యటం నా తత్వం కాదు. యితివృత్తం మేధాజనితం. పాత్రలు వాస్తవ జగజ్జనితం. యితివృత్తంలోకి చక్కా యిమిడిపోయేలా పిండిబొమల్ని చెయ్యగలవాణ్ని కాదు.

ప్రముఖ పాత్ర లిద్దరినీ తప్పించి యింకెవరి అంతరంగ చిత్రణ జరగలేదు. వాళ్ళ ఆంతర్యాలను నేనెరగను. బాహ్యచేష్టా పరిమితుణ్ని.

ప్రజాసాహిత్యం అంటే అందరికీ అర్థమయ్యేదని నేననుకోను. అందరికీ యేదీ అర్థంకాదు. అలా అని ఆముక్తమాల్యద, మహాప్రస్థానం— రెండూ వొకటేననికాదు. ప్రజా సాహిత్యం అంటే ప్రజాబాహుళ్యానికి సంబంధించినదని చెప్పుకోవొచ్చునేమో. నిశిత పరిశీలనలో, మానవ మూల స్వభావ సమస్యలన్నీ నిగూఢంగా, ప్రజాబాహుళ్యానికి సంబంధించినవేనని స్పష్టమవుతుంది.

సాహిత్యం. సమకాలిక జీవన దర్పణం—అన్నారు. కానీ, కేవలం అద్దపెట్టింకు మాత్రమే ఐతే అక్షర ఛాయాగ్రహణ ఐ వూరుకుంటుంది. రవ్వంతకూడా ఆలోచనని రేకెత్తించని రచన, శుద్ధదండుగ అని నా అభిప్రాయం.

యదార్థాన్ని స్వప్నంలోంచి, స్వప్నాన్ని యదార్థాంలోంచి వడపోస్తుంది, సాహిత్యం. యేదో మెలిక మలుపు, మెరుపు విరుపు అవసరం అంటాను. పోలీసురిపోర్టు, సాహిత్యం అవుతుందనుకోను.

కళ కళకోసం—అనీ నేనన్ను. కళకి ప్రయోజనం వుంది. కానీ, కళ, ప్రయోజనం మాత్రమేకాదు. ‘కళాఖండాలను, తోమిన చెంబులతో’ పోల్చి తీసిపారెయ్యలేను.

మంచి వచనంలోని కవిత్వం, మంచి కవిత్వంలోని వచనం నాకిష్టం. చలనాన్నీ సాంద్రతనీ సంస్పందననీ చిత్రిస్తాయి.

నా దృష్టిలో—రసానుభూతి, సాహిత్యపు పరమావధి. యింతో అంతో జిజ్ఞాస, యెంతో కొంత ప్రయోజనం దాని అనుగుణ్యలక్షణాలు. రసానుభూతి, లైంగిక పరిమితం అనేఅపోహ వుంది. కానీ తృషా సంస్పందన స్వాభావికంగా విశ్వాంతర్వ్యాపితం. తృష్ణ పలువిధాల ఆకలిగా అభివ్యక్తమౌతుంది)

ఆంగ్ల పదాలను విధిగా వాడాల్సిన అవసరం లేదనిపించి, వాడక పోతే (ముఖ్యంగా, సంభాషణలలో) అసహజంగా అనిపించవొచ్చు. ఆంగ్లభాషవల్ల కలిగిన మేలు, కీడుగా మారేంతదాకా పోకండా—ఈ సంధి కాలంలో కొంత (అ) సహజత నుపేక్షించటం సాహితీ దౌష్ట్యం కాదేమోనవి.

తెలుగులిపి సంస్కర్తను కానుగానీ, అవసరం కనిపించక యీ కింది అక్షరాలు వాడే అలవాటు లేదునాకు.

ఇ, ఈ, ఉ, ఊ, ఋ, ౠ, ఌ, ౡ, ఎ, ఏ, ఐ, ఒ, ఓ, ఔ, చ, జ, ఱ (16).

స్ఫోటశాస్త్ర దృష్ట్యా, సూక్ష్మతని విభేదవ్యంజనకోసం 57 అక్షరాల కంటే యింకా యెక్కువే అవసరం కావొచ్చు. అది వేరేమాట.

' '—యీ గుర్తుమధ్యలోవున్న పదాలు యెరువుపుచ్చుగున్నవి.

యీ పుస్తకంలో అక్కడక్కడా కంటపడే 'జీవగర్రలు' ముందు తరం వైయ్యాకరణుల కొత్త సూత్రాలలో యిమిడిపోతాయని నమ్మిక.

రానున్న రెండు మూడు దశాబ్దులలో భాషలో (గ్రాంధికభాషమాట కాదు! తెలుగుభాషగురించి) చాలా మార్పులు కూర్పులు జరుగుతాయని, సంస్కృతాంగ్లాల్లో లాగా క్లుప్తవ్యక్తతకీ, పొందికకీ, వివిధశాస్త్ర విషయాలను వివరించేందు కనుగుణంగా మనభాష మార్పులకు లోనవ్వతుందని, భావించి, ఆశించి—అనే మనం కేంద్రించి, ధృవించి, సాన్నించి లాంటివి కూడా వాడొచ్చునని.

వ్యక్తి వినా సంఘంలేదు. సంఘ జీవనం అవసరార్థం మాత్రమే. సంఘజీవనం అనేది యెవరి జీవనమూ కాదు. అది "సామాన్య" లక్షణం కావొచ్చు. ప్రతి దానికీ సంఘాన్ని తిట్టటం; వ్యక్తి, తన విలువనీ విశిష్టతనీ కోల్పోయి బాధ్యతా రాహిత్యంలోకి దిగజారటమే.

సాంఘిక సమస్య, అసలుకి, వ్యక్తిసమస్య. దానికి ప్రాతిపదిక వ్యక్తి. అది వ్యక్తిపరం. సాంఘిక దురాచారాలు-అంటే నీలోని నాలోని దురాచారాలు. అలా అని; సంఘం అనే భావం, అప్రాముఖ్యం అనికాదు. నా వుద్దేశం.

మానవుడు సంఘజీవి—అన్నారు. అంటే, మనిషి, సంఘంలోకి "చొరబడి" జీవిస్తాడని కాదు. సంఘం అనేది వ్యక్త్యంతర్గత జనితం. బాహ్య వాతావరణం మాత్రమే సంఘంకాదు.

సమాజం కుళ్ళిపోయిందని అంటే మనం కుళ్ళి గవులు కొడుతున్నామన్నమాట. బటాచోరు ప్రభుత్వం, బాడకోవ్, మంత్రులు, చెదపురుగు అధికారులు-అంటే, నువ్వూ నేనూ చెవల వాజమ్మలవీ, నిజాయితీ లోపించిన వేరు పురుగులమన్నమాట— వ్యక్తి వేరుపురుగు ఐనప్పుడు, సమాజానికి తెగులుపుడుతుంది. శారీరక మానసిక ప్రాథమికావసరాలను అరిక్షేపించే ప్రజా ప్రతినిధిని మళ్ళీ మళ్ళీ ఎన్నుకునే వ్యక్తి— ముందు, తననిచూపె తను అవమానంతో కుంగి కంపించి, తలవొంపులుగా భావించుకోటానికి బదులు, తన బలహీనతలకి ప్రతిరూపం తాల్చిన సమాజం (లేక ప్రభుత్వం మరేదెనా కానీ) మీద తన మాలిన్యాన్ని రుద్దినందువల్ల, మరింత నైచ్యమూ పతనమూ అవటం మాత్రమే. నిర్మాణ కృషి, మలిస్థాయిలో సమిష్టిగానే వుంటుంది. ఐనా ఆ యత్నం తొలిస్థాయిలో వ్యష్టిపరం, యేదెలావున్నా—ప్రభుత్వం, అజ్ఞానా మాయకతల చేత యెన్నికైనంతవరకూ చెప్పుకోదగిన ఫలితాలుండవు.

స్థూలదృష్టిలో, సంఘం అంటే ప్రజాబాహుళ్యామోద్యత అని నా అభిప్రాయం. సంఘానికీ, వ్యక్తికి మధ్య సారూప్యతా వైవిధ్యమూ వున్నాయి. సంఘం, సిరామరకలాంటి నీడ. ఆ నీడలో అందరి నీడల్లూ

వుంటాయి కాని, అవి కలగాపులగంగా అలువులని, పులుపులని, మర కలా అనిపిస్తాయి. ఆ మరకలో యే వొక్క-వ్యక్తి, తన నీడ ఫలానా అని [illegible]

సాంఘిక కట్టుబాట్లు అంటే ప్రజా బాహుళ్యామోదం పొందిన విధానాలు—అని. అలాంటి విధానాలతో విభిన్నించేరీతులు; వొక, లేక కొందరు వ్యక్తుల చేతనావర్తంలో వుత్పన్నించినప్పుడు రగడ ఆరంభ మవుతుంది. యీ రగడ దేశకాల పరిమితంకాదు. సాంఘిక కట్టుబాట్లు అంటూ లేకండా పూర్తిగా అంతరించటం అనూహ్యం. కారణం, ఆ కట్టుబాట్లకి ప్రాతిపదిక, వ్యక్తి అవటమే. తారతమ్యాలకి మధ్య రగడ. యీ తారతమ్యాలు రకరకాలు—మానసిక, శారీరక, ఆర్థిక, సంస్కారిక వ్యత్యాసాలు. యింకా యెన్నెన్నో.

ప్రగతి అంటే భవిష్యత్తు్ని వర్తమానంలోకి రాబట్టాలనే తపన. ఆ తపనవున్న వ్యక్తులు సమకాలిక సాంఘిక వ్యవస్థతో కుస్తీ పడుతూ వుండక తప్పదు. వర్తమానం ప్రయాణించి ప్రయాణించి భవిష్యత్తై పోదు. నిరంతరం భవిష్యత్తు్ని రాబట్టుకుంటూ తనని తను పొడి గించుకుంటూ వుంటుంది వర్తమానం—యీ యానానికి ముగింపంటూ లేదు. యీ వ్యాక్యానికి ఫుల్‌స్టాపు పెట్టేందుకు వీల్లేదు. అథవా పెట్టినా, వెనువెంటనే ఆ ఫుల్‌స్టాపు కుత్తుకలోంచి మరో వాక్యం ఆరంభమ య్యేస్తుంది.

అంచేత, వాస్తవంకంటే వాస్తవం ఐన యీ మరీచికా జీవితానికి అంతమంటూ లేదేమో! జీవితం, యెంతకీ తరగని స్వయంజ్వలిత హారతి కర్పూరం.

యీ (మృగ) తృష్ణ-తనకు చిక్కని తనకోసం, యింత రొట్టె ముక్క-కోసం, రోల్స్ కారుకోసం, దేశాలకోసం, గ్రహగోళాలకోసం శుష్క-జ్ఞానంకోసం, తోటకూరకాడ కోసం—దేనికోసం కాదని!

అలాంటివాటిలో కొన్నిటికోసం,

యీ పుస్తకంలోని పాత్రలు పడిన తపన, తెలుగు అక్షరాలను (యాభైయ్యేడూ కాదనుకోండి) తొడుక్కొని దర్శన మివ్వటానికి ప్రయత్నించింది.

యీ పాత్రలు తమగురించి చెప్పుకోవాల్సిన దంతా తామే చెప్పేసుకుని, చివరికి నాకేమీ మిగల్చలేదు, చెప్పేందుకు అంచేత, పునర్వ్యక్త వ్యక్తాల భయంకొద్దీ ఆపనీ విరమించుకుంటున్నాను

యిది ముగించటానికి ముందు యీ రచనకు కారకాలైన శక్తులు ప్రేరణలు, వొత్తిడులలో కొన్నిటిని పేర్కొంటాను.

యే సృజనేయ రచనకైనా వ్యక్తిగత విముక్తి మూలప్రేరణ అనుకుంటాను

మనసు, చేతనా పరిమితం కాదు. మనోవికల్పత విధిగా చేతనీయమై తీరాలని లేదు. చేతన లోచేతన, విచేతన— అనే స్థూల విభాగాలకంటే కూడా విస్తృతనీయం మనసు. ప్లావిత మానసం 'చరాచర' జగద్వ్యాపితం విశ్వం, స్వాభావికంగా సంస్పందన. సంస్పందన, మానసీయం.

వైయ్యక్తికొద్దీప్తిలోంచి అభివ్యక్తమయ్యే సృజనీయలాలస, ఆకృతి మలుచుకునేది పరాశ్రితంగానే.

లోచేతన వుదృతమైనప్పుడు యేర్పడే చేతనా వికల్పాలు జీవితంపైన తత్ప్రభావ ఫలితాలు.

అకర్మణ్యలో పలాయనతలోకి దిగజారకండా యెంతవరకూ రాజీ పడటం సాధ్యమౌతుంది—తనతో తాను— యితరులతోనూ.

అనాత్మలోంచి శరీరం. ఆత్మ జపోవాలనే ప్రగాఢ పరితపన.

మేధాజనిత రసానుబంధం మేధకిలొంగని యేదో బలీయబంధం కట్టివేస్తే కలిగే నిరంతరాన్వేషణ.

చిచ్చుబుడ్డిలా యెగసే ప్రేమ, యెలా జీవితాన్ని సుడిగుండం చేసేది.

యాదృచ్ఛికంగా సంభవించినట్లనిపించే సంఘటనలు జీవితాన్ని యెలా మలుపులు తిప్పేది.

అందమైన పశువుకీ రసజీవికీ మధ్య వుత్పన్నించే విషాద రగడ

వైరుధ్యాల మధ్య ప్రేమ వెల్లివిరిస్తే యెదురయ్యే సమస్యలు.

పాఠకులలో ప్రత్యనుభూతిని కలిగించగలిగిన రచన నిరర్ధకం కాదు. పాఠకులలో ప్రతిస్పందించని రచన వ్యర్ధం. యీ నవలే యెంత వరకూ వ్యర్ధమూ నిరర్ధకమూ కాదో నిర్ణయించేది మీరే. ఐతే, 'పాఠకులు' దేశ కాల పరిమితం కాదు. రచనకూడా దేశకాల పరిమితం కాకూడదు.

అంచేత, రచయితలనూ, పాఠకులనూ కాలమే పరిష్కరించాలి కాటోలు ననుకుని, నిర్లిప్తనిరీక్షణతో యింక ముగించేస్తే సరి!

ఫిబ్రవరి, 1969 —రచయిత

... ౦